వ్యాస మనే సాహిత్యప్రక్రియ కన్నడసాహిత్యానికి క్రొత్తది. ఆంగ్లసాహిత్యసంబంధంతో ఇది కన్నడసాహిత్యంలో ప్రవేశించి వేళ్లూని మానయి ఉత్తమఫలాలను పండించసాగింది. ఆ ఫలాలలో కొన్ని ఇక్కడ సుందరంగా సంకలితా లయినాయి.

ఈ సంకలనంలో మొత్తం ముప్పయి వ్యాసాలున్నాయి. చిన్నవ్యాసం, ఉబుసుపోక మొదలు హాస్యం, విడంబనం, చింతనం, భావమథనం వరకు ఈ వ్యాసాలు వ్యాపించాయి. కన్నడసాహిత్యంలో పేరుమోసిన సాహిత్యవేత్తలు ఈ సాహిత్య ప్రక్రియకు తమ కానుకలు చెల్లించారు. ఈ వ్యాసాలలో కనిపించే వర్ణనలు, కల్పనావిలాసం, విషయవైవిధ్యం మొదలయినవి అందరి మనస్సును తనియించేట్టు ఉన్నాయి.

సంకలనకర్త : శ్రీ గొరూరు రామస్వామి అయ్యంగారు. అనువాదకుడు : శ్రీ తిరుమల రామచంద్ర.

# కన్నడ
# వ్యాస సంకలనం



సాహిత్య అకాడెమీ
న్యూఢిల్లీ

# కన్నడ వ్యాస సంకలనం

సంపాదకులు :

గొరూరు రామస్వామి అయ్యంగార్

అనువాదకులు :

తిరుమల రామచంద్ర



సాహిత్య అకాదెమీ

న్యూఢిల్లీ

**KANNADA VYASA SANKALANAM:** Telugu translation by Tirumala Ramachandra of *HOSAGANNADA PRABANDHA SANKALANA* (Anthology of Modern Kannada Essays) Compiled by Gorur Ramaswami Iyengar. Sahitya Akademi, New Delhi-1. **Price: Rs. 7/-**



First Edition: 1971

*Available at :—*

**SAHITYA AKADEMI**

Rabindra Bhavan, New Delhi-1

*Regional Office :*
CALCUTTA-29

*Regional Office :*
MADRAS-6





ముద్రణ :
ఫ్రీడమ్ ప్రెస్,
మద్రాసు - 21.



వెల : రూ. 7/-

# విషయానుక్రమణిక

# అనువాదకుని మనవి

కన్నడంలో నేడు ప్రధానంగా ఐదు మాండలికాలున్నాయి; మైసూరు, పూర్వపు బొంబాయి, పూర్వపు హైదరాబాద్, మంగళూరు, తూర్పు కన్నడం అని. ఈ వ్యాసాలలో బేంద్రే, కారంత్, శ్రీరంగ మొదలయినవారు తమ ప్రాంతీయ మాండలికాలను స్వేచ్ఛగా వాడారు. ఆ అందచందాలు తెలుగువారికి తెలియడంకోసం, అక్కడక్కడ ఆ పదాలు వాడి, వివరణ లిచ్చాను. ప్రాంతీయాల నుడికారం తెలుగులో తేవడానికి ఎంతో శ్రమపడినాను. సహృదయ పాఠకులు గుర్తిస్తారు.

మద్రాసు - 5,
సాధారణ - పుష్య పౌర్ణమి.

భాషాసేవకుడు
తిరుమల రామచంద్ర.

# ప్రస్తావన

ఈ సంకలనంలో ముప్పయి వ్యాసాలు గ్రథితమయాయి. వ్యాసాలను ఏరుకోడంలో
నా లక్ష్యం హెచ్చుగా లఘుప్రబంధాలు-లఘువ్యాసాలు-అథవా స్కెచ్‌లువంటి వాటి
పైనే వుంది కాని, మనపెద్దలు పరంపరగా రూఢిలో దేనినైతే వ్యాసమనో, నిబంధమనో
అన్నారో అప్రౌఢ పాండిత్యపు వ్రాతలవైపు మాత్రమేకాదు. ఇక్కడ ఏరిన వ్యాసాలు,
హెచ్చుగా, ఇంగ్లీషులో దేనినయితే ఎస్సే అంటారో ఆ జాతికి చేరినట్టివి. ఈ ఎస్సే
అనేది ఇంగ్లీషులోను ఇటీవలి అభివృద్ధి. దీని వయస్సు సుమారు ఇన్నూరు, ఇన్నూట
యాభై సంవత్సరాలు. ఇంగ్లీషులోని ఈ ఎస్సే అనే సాహిత్యప్రక్రియకు చేరిన వ్రాతలు
భారతీయసాహిత్యంలో లేవని కాదు. ఏ విధంగా వేదంలోను, ఉపనిషత్తులలోను, పంచ
తంత్రంలోను, హితోపదేశంలోను భావగీతాలు, చిన్నకథలు పొదిగినట్టు వున్నాయో ఆ విధం
గానే ప్రాచీన భారతీయసాహిత్యంలో వ్యాసం, లేక ఎస్సే అనే అర్థవివరణకు సరిపడే
కృతులు ఏదో ఒక రూపంలో వున్నవి. అయితే, అవి కథాసరిత్సాగరం మొదలయిన
గ్రంథాలలో మధ్యమధ్య ప్రవేశం పొందాయేకాని, ఎస్సేకోసమే ఎస్సే అని రచించినట్టివి
కావు. ఇప్పుడు మనం వ్యాసం అని వ్యవహరించేది ఇంగ్లీషుఎస్సే అనే సాహిత్య
ప్రక్రియను. ఈ ఎస్సే అనే మాటకు, దాని సంపూర్ణార్థసంపదను తెలిపే సమానశబ్దం మనలో
ఇంకా సృష్టికాలేదు. ఇంగ్లీషు సాహిత్యంలోని అత్యుత్తమమైన ఎస్సేలకు సమానమైన
ఎస్సేలు భారతదేశంలోని వివిధభాషలలో వచ్చాయి. కన్నడంలోను వచ్చాయి. అయితే
దానివ్యాప్తిగల సమానార్థకపదం మనలో ఇంకా సృష్టి కానందున, నేను దీనిలోని ఎస్సే
లన్నింటిని ప్రబంధాలు అనే వ్యవహరించాను.

ఎస్సే అంటే ఏమిటి అనేదాని లక్షణం వివరించవచ్చు. కాని, దానినుంచే దాని
స్వరూపం పూర్ణంగా తెలిపినట్టుకాదు; పూవురంగు, స్వరూపం, వాసన, ఆకారం - వీటి
వల్ల మాత్రమే పూవును వర్ణించడం ఎలా సాధ్యంకాదో అలాగు. అయితే, కొన్ని సర్వ
సమ్మతమైన సామాన్య నియమాలున్నాయి. ఆ నియమాలు చిరకాలానుభవంతోను, ప్రతి
నిత్యమూ మారుతున్న ప్రయోగాల నవీనతతోను రూఢమైనట్టివి. ఆ ప్రయోగాల కొసను
మనమింకా చేరలేదు. ఔను; ఎస్సేలో శైలి వుండాలి; విషయనిరూపణంలో స్పష్టత, మర్యాద
మీరని హాస్యం, కృతకంకాని చమత్కారం, సహానుభూతి, సరసత, సజ్జనత, ఆకర్షక
దృష్టి, లోతైనజ్ఞానం, - ఇవన్నీ ఉత్తమమైన ఎస్సే నిజమైన లక్షణాలు. కాని, వీటివల్ల
మాత్రమే మంచి ఎస్సే పుట్టదు. ఉత్తమమైన ఎస్సేలో రచయిత (స్వంత) వ్యక్తిత్వం అనే
మెరుగు విరజిమ్మివుండాలి. ఎస్సే అనేది వైయక్తికభావనల ఒక పదవిన్యాసం; ఒక
విషయంమీద రచయితకు ఏమేమి తోస్తాయో, ఆ భావనలను గుర్తించే ఒకానొక ఆత్మీయ
నిరూపణం; భావగద్యం.

కట్టుదిట్టంగా, ఆబోతు అడుగులువేసినట్లు గంభీరంగా కొనసాగే శాస్త్రీయ చారిత్రక విమర్శాత్మక తర్కవిజ్ఞాన నిబంధాలకు (పెద్దవ్యాసాలకు), ఎస్సేలకు ఒక వ్యత్యాసం వుంది. ఎస్సే ఎక్కువగా వ్యక్తిగతం, ఆత్మానుభవం, ఆత్మచరిత్ర. దీనిలో రచయిత పాఠకుణ్ణి చిరపరిచితుడుగా భావించి, వానిఎదుట తన స్నేహప్రకారాన్ని తెలియజేస్తాడు. దీనిలో పాఠకునికీ రచయితకూ ఆత్మీయత పెరుగుతుంది. వ్యాసరచయితకు తనమాటే సరి అనే హఠంలేదు. తను చెప్పిందే నెగ్గాలనే ఆశాలేదు; అతని మాటలతో ఆత్మప్రత్యయంవున్నా కపిముష్టి (పట్టుదల) లేదు. వ్యాసకర్తకూ, పాఠకునికీ వున్న ఈరీతి ఆత్మీయతవల్ల నిజమైన, నిర్దుష్టమైన పూర్ణత్వం పొందిన ఎస్సే పుడుతుంది. అది ఆత్మవినోదం కావడంవల్ల భావగీతంవలె, మనస్సుయొక్క స్వచ్ఛందలహరికి ప్రతీకం అవుతుంది. వ్యాసకర్తలో అతీ రసోద్రోకం లేదు. భావనాలహరులు, ఆలోచనాతరంగాలు హృదయమనే చెలమనుంచి శబ్దవిహారవిలాసంగా వెలుపలికి పొంగివస్తాయి.

నిజానికి, ఉత్తమమూ, సర్వాంగపూర్ణమూ అయిన ఎస్సే ఏ భాషలోను విరళమే. ఇంగ్లీషుసాహిత్యంలోకూడ పెక్కు అత్యుత్తమమైన ఎస్సేలు వున్నప్పటికీ, అక్కడగూడ ఎస్సే తన పరిపూర్ణతకు ఇంకా చేరలేదని భావించేవారున్నారు. ఎస్సేలో పరిపూర్ణతను సంపాదించడం చాలకష్టం. రచయిత పుణ్యవశానమాత్రమే అది సంభవిస్తుంది. కొసకూ అదీ అదృష్టమనే చెప్పాలి. శైలి, వస్తువు, రచనాక్రమం అన్నీ అదృష్టానికి లోబడినవే. కళ్లుమూసుకొని అదృష్టపేటికలో చేతులు పెడతాము. మనం పుణ్యశాలుల మయితే అశ్వమేధాశ్వం, ఉచ్చైశ్రవస్సు; లేకపోతే, కంచరగాడిద. పుణ్యశాలికి శైలి, వస్తువు రచనాక్రమం, హాస్యపరిపూర్ణత అంతా దొరుకుతాయి. అప్పుడు వ్యాసకర్త మాటలలో, చిత్రణలలో విచిత్రకల్పనలలో తేజస్సును, ఋజుత్వాన్ని, అమృతత్వాన్ని నింపుతాడు. వసంతకాలపు చల్లగాలిలో పూవు మధురంగా విచ్చేట్టు ఎస్సే సృష్టిఅవుతుంది. ఈ అమృతత్వపు స్పర్శం లేకపోతే, ఎస్సే వట్టి 'పత్రికానిబంధం' అవుతుంది. వ్యాసం సచేతనం కావడం రచయిత ప్రతిభతో మాత్రమే.

వ్యాసానికి విషయం ఇలాటిదే కావాలనే నియమంలేదు. చిన్నవిషయం, దొడ్డ విషయం - ఏదైనా సరే. గంభీరతత్త్వవిచారం, కల్పనావైచిత్రి, హాస్యం, వ్యంగ్యం, భావావేశం, దూషణభూషణాలు; దాని ఆకారం ఎలానైనా వుండనీ; చిన్నకథలాగవుండనీ; శబ్దచిత్రంవలె వుండనీ; స్థూలమైన రేఖాచిత్రంవలె వుండనీ; ఆత్మకథభాగంకానీ, కొసకు వట్టి కబుర్లు, ఉబుసుపోక కబుర్లు గప్పాలుకానీ; ఎలావున్నా మనం అడిగేది ఇంతే - నిరూపణక్రమం ఆకర్షకంగా వుండాలి. అది మన జీవితంమీద, మనుగడమీద కొత్త వెలుగును కొంచెమైనా వెదజల్లాలి. ఒక విచిత్రమైన వెలుగునన్నా వెదజల్లాలి. పదాలు మితంగాను, అర్థపూర్ణంగాను, మధురంగాను వుండాలి. వ్యాసం ఆకృతి చిన్నదైనా - సముద్రపునీటి ఒక్కచుక్కలోను సముద్రపు పూర్ణలక్షణం వున్నట్లు - అది అపారంగాను, అనంతంగాను వున్నట్టు తోచాలి; ఉత్తమ చిత్రకారుడు మామూలు చిన్నరాస్తాను



పరదాపై గీచినా, ఆ రాస్తా వేలకొలది మైళ్లు ముందు పోతున్నట్లు కనిపించేరీతిగా వుండాలి. దానిలో నీతిబోధ ఏదైనావుంటే, అది పశ్చాద్భూమికలో వుండాలి. జీవితం ఎలా ఒక లీలవంటిదో, ఎస్సేలో శైలి ఆవిధంగానే వట్టి లీల. రచయిత సంస్కారానికి అనుగుణంగా దానిలో నవీనత, శబ్దకళల సంగమం జరుగుతుంది. మొత్తంమీద వ్యాసం తేలికయినది; లడ్డు, చిరోటి, మైసూరుపాకులను గొంతువరకు కొట్టివేసే పుష్కలమైన భోజనం కాదది: కుంకుమపూవు, బాదాము పప్పు, పచ్చకర్పూరం వేసి కాచిన సుఖోష్ణమైన పాలు అది, దానిని ఆస్వాదించిన తర్వాతగూడ ఆకలి అలాగే వుంటుందే కాని, ఎక్కువ ఆహారం సేవించిన మందకొడితనం కలుగదు.

వ్యాసం చదివినవెంటనే, ఒకసంతృప్త మనోభావం కలుగాలి. చెప్పవలసినదంతా చెప్పడమయింది అన్నట్టు వుండగూడదు. చెప్పవలసినవి ఏవో వదలిపెట్టినట్టూ ఉండరాదు. ఒకదృష్టితో పూర్ణంగాతోచినా, మరొకదృష్టితో ఎక్కువ జ్ఞానానికి అది సోపానం కావాలి. ఉత్తమమైన ఎస్సే మనను వినోదపరచాలి; తిద్దనూ తిద్దాలి; హృదయాన్ని వికసింపజేయాలి; బుద్ధిని ప్రేరేపింపజేయాలి; భావనలను పెంచాలి; సజీవమైన భావనలు అనుభవాలు, హాస్యం, నవ్వు - ఇవి అంతటా మెరుస్తూవుండాలి. అయితే, అంతా సహజంగా వుండాలి; నానావిధపుష్పాల సుగంధంవున్న ఉద్యానంలో నడుస్తున్నట్టు. లక్ష్యం చేరడం ఒక్కటే ముఖ్యంకాదు; మార్గప్రయాణమూ ఆకర్షణీయంగా వుండాలి.

కన్నడసాహిత్యంలో ఎస్సేరూపంలో వ్యాసాలను రచింపకపోయినా, కీర్తిశేషులు ఎం. ఎస్. పుట్టణ్ణ, పంజె మంగేశరావు, కౌజలగి హనుమంతరావు మొదలయినవారు తమ గ్రంథాలలో వ్యాసాలను పోహణించారు. హుబ్బళ్లినుండి వెలువడే సంయుక్త కర్నాటక, కర్మవీర పత్రికలలో "లాంగూలాచార్యులు" వారంవారం ఉత్తమమైన సామయిక లఘు రచనలను కొనసాగిస్తున్నారు. ఈ వ్యాససాహిత్యం కన్నడంలోను ఇటీవల చాల పెరుగుతున్నది.

ఈ సంకలనం వ్యాససాహిత్యానికి ప్రతినిధీకాదు, పూర్ణమూకాదు. పుటసంఖ్య పరిమితికి నా ఎన్నిక లోబడినందున కొన్ని నియమాలను అనుసరించి నేను ఈవ్యాసాలను ఏరుకొన్నాను. కన్నడంలోని ఉత్తమవ్యాసాలన్నిటినీ ఇక్కడ చేర్చడానికి అవకాశం లేదు. ఈ వ్యాసాలను చదివే పాఠకులు ఈ రచయితల ఇతర కృతులనుగూడ చదువుతారని నా ఆశ.

ఈ సంకలనంలో జీవితనానాముఖాలను, రచయితల వివిధ మనస్తత్త్వ బుద్ధితీక్ష్ణతలను సూచించే ప్రబంధాలను ఏరాను. చాలవరకు లఘువ్యాసాలను, కొన్ని తత్త్వవివేచనాత్మకమైన విమర్శనాత్మకమైన వ్యాసాలను ఏరుకున్నాను. "ఈ యాభై ఏళ్ల సంస్కృతిరంగం" అనేవ్యాసం చాల వివేచనాత్మకము, అనుభవపూర్ణము, ప్రజాతంత్ర ప్రాబల్యపు గురి దాటిపోతున్న మనరాష్ట్రానికి మార్గదర్శకము, భారతీయుల బుద్ధిభావనలను తిద్దేదీని. "శాంతి"

అనే వ్యాసం చింతనప్రధానమయింది. లోతైనజ్ఞానం, సుసంస్కృతమైన వివేకం అనుభవంగల వివేకి, ఈ నాగరికయుగం గోలలో శాంతిని వెదికి వేసారి భగవంతుడు మనలోనే వున్నట్టు, శాంతిగూడ మనలోనే ఉంది అనే నిర్ణయానికి వస్తాడు. "రచయిత నుదుటి వ్రాత" లఘు కథాత్మకమైన వ్యాసం. దీనిలో నిజంగా ప్రకాశకులను, పత్రికాసంపాదకులను గురించిన విడంబనం - అపహాస్యం వుంది. అయితే ఈ విడంబనలోను ఎంతటి సరసత! రచయిత మాటలు చకుముకిరాయినుంచి వెలువడే నిప్పుమిణుగురులవంటివి; వినోదలహరి, మాటలలోనే మాధుర్యమొలికే హాస్యప్రధానవిషయాలు, సామెతలు, సంస్కృతశ్లోకాలు, కన్నడంమీదుకట్టిన నానుడులు, - ఈ రచనలో ప్రతిఒక్కవాక్యమూ నవ్వులలహరి. ఇదొక షడ్రసభోజనం; చదువగానే మళ్లీ చదువుదా మనిపించే మాటలమోడీ. రాత్రి వీధి భాగవతపు రామాయణం చూచి, తెల్లవారి యింటిముందున్న జువ్విచెట్టునీడలో పల్లెటూరి బాలబాలికలు రామాయణం ఆడే విషయం "రామరావణయుద్ధం"లో చిత్రితమైంది. దీనిలో వర్ణన కనులకు కట్టినట్టు ఉంటూ, మధ్యమధ్య వినోదసంగతులతో రంజితమై, కొత్త రామాయణమై 'రాముడు పడ్డాడు, రావణుడు గెలిచాడు.' అని సకారణంగానే ముక్తాయింపు జరిగింది! "కోకిల" ఒక గంభీరమైన వ్యాసం. సంప్రదాయానికీ, క్రాంతికీ ఇదొక సామరస్యం. "మనలో క్రాంతియుగం మొదటిదశ గడచిపోయి, క్రాంతికికూడా సంప్రదాయపు క్రీనీడలను ఇప్పుడు మనం కల్పిస్తున్నామనడానికి ఈ వ్యాసమే సాక్షి," "హంతకుని వేట"లో అధికారులు హంతకుడని ఒక బీదరైతువైపు తుపాకిప్రేల్చిన సంగతి చిత్రితమైంది. "మరొక పురాణం" జడభరతుల విచిత్రకల్పన. "బహిరంగలేఖ" సర్వకుతూహలి అయిన వెనుక కూర్చున్న అంటురోగం గలవాడికి ముందుకూర్చున్నవాని ఉపచారపుమాట. దీనిలో అడుగడుగున మెరపులు మెరుస్తాయి. "చిలుక" అనేది మనోహరమైన వర్ణన వ్యాసం. "ఇది సాహిత్యపు ధోరణిలో మెరసి నెమలినిగూడ వెనక్కుతోస్తుంది." "వ్యాసంగపుహవ్యాసం" వివేచనాత్మకమైన వ్యాసం. పుస్తకవ్యాసంగపు హవ్యాసాన్ని - అలవాటును జనానికి కలిగించడంలో రచయితలు ఈ వ్యాసంలో సంపూర్ణంగా విజయవంతులయారని చెప్పవచ్చు. "పుస్తకశాలవిక్రేత" ఒక విడంబనాత్మకమైన రచన. దీనిలో అక్కడక్కడ కొంచెం చేదు కనిపిస్తున్నా, వ్యాసంయొక్క పూర్ణపరిణామం పాఠకునిపై పడకుండా వుండదు. "ప్రాణిశాలమూలంగా పాఠశాలలకు" అనే వ్యాసం ప్రాణిశాలనుచూచి కవి మనస్సులో ఉదయించిన గంభీరధార. దీనిలో రచయిత ప్రాణులను, వాటికీ మనకూ వుండే సంబంధాన్ని గురించి లోతైన ఆలోచనాధారను తెలిపారు. ఈ వ్యాసంలో పెక్కు గహన సత్యాలు తొంగిచూస్తాయి. "మన భవిష్యత్తు గొప్పది, మనమిప్పుడు స్వతంత్రులం. మన మునుపటి సౌభాగ్యాలకంటే ముందువి గొప్పవి" అనే నిర్ణయానికి రచయిత వస్తారు. "మోడ్కా బాజార్" అనేవ్యాసం పాతపుస్తకాల మాయాబజార్ అనడానికి అడ్డులేదు.

ఇక "చావుతో సరసం" మనుష్యుని స్వభావాన్ని వివేచించడానికి యత్నించే మధురమైన వ్యాసం. దీనిని చదివిన తర్వాత నిజంగా ఎవరికీ మృత్యుభయమే కలుగదు.



ఈ వ్యాసం నిండ శ్రీబేంద్రేగారి తేటహాస్యాన్ని రుచిచూడవచ్చు. "కటువైన సత్యం" ఆలోచనాత్మకమైన గంభీరమైన వ్యాసం. ఇది పాఠకుని బుద్ధిని ప్రచోదించి ఏమిటి, ఎందుకు, ఏది, ఎక్కడ అనే ప్రశ్నల తరంగాలనే రేపుతుంది. "దీవాన్‌ఖానా అందచందాలు" చల్లగాలివలె తేలికైన సరళమైన హితమైనరచన; చదివినకొద్దీ కొత్తరుచి దీనిలో అనుభవమౌతుంది. "స్వతంత్రభారతంలో వినాయకుడు"లో వ్యాసకర్త వినాయకుడు కారణంగా తమమనస్సులో ఉదయించిన భావనలను పాఠకునిముందుపెట్టి వినాయకుని - గాంధీమహాత్ముని మనం ఎలా అనుసరిస్తే దేశానికి హితం చేకూరుతుందో చూపారు. "పాదరక్షలు" లలితమైన వినోదవ్యాసమే అయినా, దానిలో అనేక గహనవిషయాల ప్రచోదనమూ వుంది. "మనగేదెకు మాటలు వచ్చా?" అనేది ఒక విచిత్రమైన కల్పనావిన్యాసం. "టైగర్ వరదాచార్యులు" ఆ మహావాగ్గేయకారుని గురించి మరొక అంతటి విద్వాంసులైన సహృదయ కలావేత్త వ్రాసిన సన్నిహిత పరిచయ జీవనచరిత్రలో ఒకరేకు. "ఈవ్యక్తిచిత్రణం విశదమైన అంగాంగభంగితో హృదయంగమంగా వుంది. అంత స్ఫూర్తి జీవులైన కలాజీవుల మనస్సు ఎలా పరుగులాడుతుంది; లోకపు చేష్టలకు వారిస్వభావం ఎలా ప్రతిచేష్ట చేస్తుంది అనే విషయం ఇక్కడ చక్కగా చూడవచ్చు." "వీధికొళాయి" ఆధునికజీవితావశ్యకమైన కొళాయినిచూచి రచయిత మనస్సులో కలిగిన ఒక సుందర భావలహరి. "ఖెడ్డా" మైసూరురాష్ట్రపు ప్రసిద్ధమైన మృగయావిహారకార్యక్రమం; నాల్వాడి శ్రీకృష్ణరాజు వడెయులకాలం. వర్ణన కళ్లకు కట్టినట్టుంది. "నా వీపు" ఒక మర్మగర్భమైన వ్యాసం. దీనిలోని వినోదం చాల చురుక్కుమనేది. చాల చిన్నదని తోచే విషయంనుంచి రచయిత, ఒక గంభీరమైన, అయినా సరసమైన వ్యాసం రచించారు. ఒకనికి వ్యక్తిత్వం ఏమీ లేకపోయినా, వీపు తానే నాయకుడై, అవ్యక్తి సాధించిన దానినంతా సాధిస్తుంది. ఆ మనుష్యునికి వీపులేకపోయివుంటే, వాడి గతి ఏమైవుండేదని మనం భావించే స్థితికి వస్తాము! "స్వంతశ్రాద్ధం" ఒక వినోదచిత్రణం. దీనిలో రచయిత విడంబనం, వ్యంగ్యం, హాస్యం, ఛలోక్తులు అనుభవించదగినవి. "పడిశం" వంటి వ్యాసాన్ని వ్రాయడానికి అవకాశం కలిగించేటట్టయితే, పడిశం వచ్చినా పరవాలేదు. "సీతైతాళలు" ప్రతిగ్రామంలోను మన కళ్లపడే వ్యక్తి ప్రతీకం. దీనిలో వ్యక్తిస్వభావచిత్రణం హృదయంగమంగా వుంది. అయితే చూచేకళ్లుమాత్రం మనకు కావాలి. "నిజారు" నిశ్వవ్యాపిత్వం ఆ వ్యాసంలో మనోహరంగా వర్ణితమైంది. "వాన" మంచి లఘువ్యాసం. ముద్దైన సరళమైన రచన. "మొయిళ్లు" అనే వ్యాసం మొయిళ్లను చూచిన రసికమైన వివేచనపరమైన మనస్సు ప్రతిక్రియ. ప్రకృతివర్ణనం దీనిలో ఆకర్షణీయం, బహుముఖం.

"పాత సబ్అసిస్టెంటు కల్లడైరీనుంచి" ఒక విద్యాశాఖాధికారి అనుభవ రసాయనం. ఇదొక జీవనచరిత్ర లఘుతరంగమూ కూడ. పైకి కేవలం హాస్యంగా కనిపించే కొన్ని సంగతుల పూర్వరంగంలో "ప్రైమరీ" పాఠశాల ఉపాధ్యాయుల జీవితపు కష్టనిష్ఠురాలు, అయినా యోగ్యమైన మనుగడ సాగించాలనే ధ్యేయం ఈవ్యాసంలో చిత్రించబడ్డాయి.

ఎన్నికష్టాలున్నా, ఊరివారికి ఉపయోగపడుతూ, బదికివచ్చిన గ్రాంటును చెరువుకట్ట కట్టించడానికి ఇచ్చిన తిమ్మప్పమాస్టరుగారివంటి వారిసంగతి మనస్సులో చాలకాలం వుంటుంది. వ్యాసం మాటల మధురమైన నడక. ఇంకా కొన్ని అనుభవాలను వీరు ఎందుకు చెప్పలేదని మనం విషాదపడి, మరీమరీ దీనినే చదివి తృప్తిపొందుతాము.

తమ వ్యాసాలను ఈ సంకలనంలో చేర్చడానికి అనుమతించిన లేఖకబంధువులకు నా కృతజ్ఞత చెల్లింపదగింది.[1]

గొరూరు రామస్వామి అయ్యంగార్

1. వ్యాస లక్షణాలను గురించి విద్వాంసులు వ్యక్తపరచిన అనేకాభిప్రాయాలను ఈ ప్రస్తావనలో చేర్చాను.

# 1. ఈ యాభైఏళ్లలో సంస్కృతిరంగం

డి. వి. గుండప్ప

సంస్కృతి అంటే, మానవుల పరస్పర సంబంధాలలో నయవినయాల సొబగు - స్వగుణ పరగుణాల సమ్మిశ్రితకాంతి. ఈ సంస్కృతి మూలంలో మన అంతరంగజీవితానికి సంబంధించినది. అది మన అంతరంగసంపద. దానిస్థానం మనస్సు, హృదయమూను. దానికి భిన్నమైనది మన బహిరంగజీవితం. దీనిలో ఇల్లు వాకిలి, గొడ్డు గోద, నగ నాణెం మొదలయిన మూర్తద్రవ్యాలు చేరిఉన్నాయి. కడచిన యాభై సంవత్సరాలలోను ఈ వెలుపలి సౌకర్యాల విషయంలో మనదేశం చాలవరకు ముందుకు సాగింది. పూర్వం మోటార్లు, విమానాలు ఇప్పటిలాగ లేవు. ఇప్పటిలాగ విద్యాలయాలు, వైద్యాలయాలు, రైళ్లు, బ్యాంకులు, కార్ఖానాలు, వ్యాపారవిస్తృతీ అప్పుడు లేవు. ఈ బాహ్యసంపదలో మనం అభివృద్ధి పొందినాము. అయితే అంతరంగసంపదలో ఆవిధంగా పెరగలేదు; ఇంకా పేదలుగా ఉన్నామనే నా అభిప్రాయం. ఈ పేదరికాన్ని ఐదారు అంశాలు ప్రస్తావించి నిదర్శనపరచాలనేది నా ఇప్పటి ఉద్దేశం. మొదట మనుష్యుడున్న స్థానంలో ఇప్పుడు యంత్రం ఉంటున్నది. హృదయం చేయవలసిన పనులను యంత్రాలమూలంగా నిర్వహించుకొనే అభ్యాసం పెంపొందించుకొంటున్నాము. యాభై సంవత్సరాలక్రితం పెండ్లికి ఆహ్వానపత్రిక చేతివ్రాతలో ఉండేది; ఇప్పుడు అచ్చులో ఉంది. చేతితోవ్రాసేటప్పుడు మనమనస్సు మనం ఉద్దేశించినవారి యోగ్యతను, వారికి చెందవలసిన ప్రీతి గౌరవాలను స్మరించేది. అది హృదయస్పర్శ, ఇంగ్లీషులో చెప్పే 'పర్సనల్ టచ్' పాఠ్ తక్కల్పన. ఇప్పుడు అదీ అంతగా ఉండదు. ఇప్పటిది అచ్చుకొట్టిన ఆహ్వానపత్రిక, వార్తాపత్రికలాగ వేయిమందికి వెళ్లుతుంది. దానికి తారతమ్యవిచారం అవసరంలేదు. పూర్వం ఇంటికి ఇష్టులు, ఆప్తులు వస్తే, ఫలాహారంకోసం ఇంట్లోచేసిన తినుబండారాలను ముందుపెట్టేవారు. ఇప్పుడు హోటలు వస్తువులు తెప్పిస్తున్నాము. లేకపోతే, వారిని హోటలుకే సాగించుకొనిపోతున్నాము. హోటలుతిండి ఎక్కువరుచి కావచ్చు; కాని, ఇంట్లోవారి ప్రీతివిశ్వాసాలు దానిలో ఉంటాయా ? పూర్వం ఇంట్లో గర్భిణీస్త్రీ ఉందంటే, ఆమెకోసం చేత్తో చక్కిలాలుచుట్టి వేయించేవారు. ఇప్పుడు అలాటి చేతి చక్కిలాలు కళ్లకు కనిపించడమే అపురూపమయింది. అప్పుడు వ్రేలు చేసేపనిని ఇప్పుడు రోలుచేస్తున్నది. వ్రేలి వెనుక ప్రేమ ఉండేది. ప్రేమకూ రోటికీ అంత సన్నిహితసంబంధం లేదు. అప్పుడు పెళ్లికొడుకులు పీటలమీద కూర్చుంటే ఆడపిల్లలు తమగొంతులు కలిపి, ముసలమ్మలు మమతపొంగే ఉత్సాహంనింపి పాటలుపాడేవారు. ఇప్పుడు గ్రామఫోనుసంగీతం. అప్పుడు

గంధంనూరి కేసరి పచ్చకర్పూరం కలిపిన పరిమళం; ఇప్పుడు సెంట్ - విదేశాలవి. స్వాభావికంస్థానంలో కృతకం.

ఇంకొక విషయం చూద్దాము. కడచిన యాభై ఏళ్ళలో మనప్రజలలో పనితనంలో ధైర్యవిశ్వాసాలే తొలగిపోయాయి. పూర్వం, ప్రతివారికీ తమతమ దినసరి పనుల విషయంలో గౌరవం ఉండేది - మగవానికి తన పాట్లవిషయంలో, ఆడదానికి తన వంటవార్పు విషయంలో. రైతు తన నాగలి, గొడ్డుగోద, దుక్కి అంటే ఎంతో గర్వపడేవాడు. వడ్రంగి, తాపీవాడు తమ కైవాడానికి ఎంతో మురిసిపోయేవారు. కరణం అక్షరాలు సొగసుకు, పురోహితుడు మంత్రోచ్చార సౌందర్యానికి, ఉపాధ్యాయుడు తన పాఠప్రవచనశీలతకు, కుమ్మరి తనచేతి నవురుకు ఆనందించేవారు. పని కూలికోసం అనే భావం అప్పుడు అతిగా ఉండలేదు. వారికి సంపాదన అవసరం లేదనికాదు. వారూ పేదవారే. అయితే వారు అందిఅందుకులపనిని అభ్యసించలేదు. అడ్డాదిడ్డి పనుల బతుకుకు వారిమనస్సు ఒప్పేదికాదు. ఒళ్లువంచి పనిచెయని అన్నం ఒంటపట్టదని అప్పటివారి నమ్మిక. ప్రకృతి ఎలా పనిచేస్తున్నదో అలాగే తామూ చేతికివచ్చిన పనిని సాధ్యమైనంత సొగసుగా చేయవలె ననేది వారి నియమం. తొందర తొందరగా ఎటుబడితే అటు, పనిచేసినట్లునటించి, చాలినంత తక్కువకష్టానికి సాధ్యమైనంత ఎక్కువకూలి గిట్టించుకొనే యోచన అప్పుడు రాలేదు. ఇటీవల కొత్తకొత్త వ్యాపారాలూ, కొత్తకొత్త వృత్తులూ వచ్చి ఉపాయంగా జీవించాలనే ఆశ వ్యాపిస్తున్నది. పట్టణాలరీతులూ, దాంభికత, ప్రకటనసౌలభ్యమూ ప్రామాణికతకు బలం పోగొట్టి చమత్కార చతురోపాయలకు ప్రోత్సాహమిస్తున్నవి. సమాజానికి పనితనంలో భరవసా, గర్వం నష్టంకావడంకన్నా పెద్దనష్టం మరొకటి ఉండదు.

ఇప్పుడు మరొక విషయానికి వద్దాము. ఇది గృహచ్ఛిద్రానికి సంబంధించింది. యాభై సంవత్సరాలక్రితం ముగ్గురు నలుగురు అన్నదమ్ములూ, వారిపిల్లలూ, మనుమలూ, వారి అక్కచెల్లెండ్లలోను వదినెమరదండ్లలోను ఇల్లుపట్టినవారు, వారిపిల్లలూ మొత్తం ఇరవై యిరవయ్యయిదుమంది కలిసిఉన్న కుటుంబాలు అపురూపంకాదు. నూటికన్నా హెచ్చుమంది ఉన్న కుటుంబాలను నేను చూచాను. ఆ సమష్టి సంసారాలు ఒక్క యజమాని పెత్తనంలో బదికేవి. అప్పుడు కష్టాలులేవనికాదు. ఇప్పుడుకష్టాలు తప్పనూలేదు. అయితే, ఇప్పటి కష్టాల తీరువేరు, అప్పటి కష్టాల తీరువేరు. తంటా తకరార్లు కూకటివేళ్లు మనుష్యస్వభావంలో ఎప్పుడూ ఉండనే ఉంటాయి. సమష్టికుటుంబాలలో వాటిని సరిదిద్దే క్రమమూ ఉండేది. మొత్తంమీద అది ఐకమత్య సాధనక్రమం. అది ఒకరీతి డెమాక్రసీ, ప్రజారాజ్యం, ఒట్టుబ్రతుకు - సమష్టిజీవితం. ఇప్పుడా సమష్టిభావన కరిగిపోయి ప్రత్యేకతాభావన - వ్యష్టిభావన బలపడుతున్నది. ఎవరిపాట్లు వారివి. గట్టివాడు గట్టుకు, వెనుకబడినవాడు నష్టేట. ఈవిధంగా ఒక్కటిగా ఉన్న ఇల్లు రెండుగా, నాల్గుగా ముక్కలవుతున్నది. ఒక కుటుంబంలో ద్విముఖప్రభుత్వం, ద్వంద్వప్రభుత్వం.



ఇట్టిటీవల వస్తున్న శుభలేఖలలో ఇది చక్కగా కనిపిస్తున్నది. ఇరవైయైదు సంవత్సరాల క్రితం మాయింట్లో జరిగిన ఒక శుభకార్యానికి ఆహ్వానపత్రికను మా తండ్రిగారిపేరిట పంపడమైంది. ఆహ్వానపత్రికలో నాపేరూ ఉండవలసి ఉన్నందున మాతండ్రిగారికి పరిచయంలేని నామిత్రులూ వచ్చారు. వారిలో ఒకరు నిజంగానే పెద్దవారు, వయస్సులోను పెద్దవారు మోటారులోవచ్చి దిగారు. నేను వారికి స్వాగతంచెప్పాను. వారు "కారులో చూడండి. అక్కడ ఒకరున్నారు." అన్నారు. కారులో ఉన్నవారు వారి సతీమణి. ఆమెకూ నా పరిచయం ఉంది. నేను ఆమెను "దయచేయండి" అని పిలిచాను. ఆమె నవ్వి "ఆడవారు పిలువలేదే?" అన్నారు. నేను అన్నాను: "మాతండ్రిగారున్నచోట మాతల్లి, వారున్నచోట మేమంతాను ఉండవలసినవారం. మాతండ్రిగారు మామొత్తంకుటుంబం పరంగా మీమొత్తం కుటుంబాన్ని పిలిచారు." నేను ఇలా చెప్పడం విని ఆమె "మీరు పూర్వకాలంవారు" అంటూ, నవ్వుతూ దిగివచ్చి, ఆశీర్వదించి వెళ్లారు. ఇప్పుడు భర్త ఆహ్వానమే విడిగా, భార్య ఆహ్వానమే విడిగా. ఈకొత్తమర్యాద యూరోపియనుల అనుకరణం, దానిలో ఆలుమగల ఏకీభావసూచన లేదు; భిన్నభిన్న వ్యక్తిత్వపు సూచన ఉంది. అది స్త్రీపురుషుల సమానత్వ మట. అట్లయితే భార్య భర్తకులగోత్రాలను ఎందుకు స్వీకరించాలి? అతని పేరులో ఆమె ఎందుకు లీనమైపోవాలి? "శ్రీమతి, శ్రీ రామన్న" (మిసెస్ అండ్ మిస్టర్ రామన్న) అనడానికి మారుగా "శ్రీమతి, శ్రీ సీతమ్మ (మిసెస్ అండ్ మిస్టర్ సీతమ్మ) అనే ఇద్దరూ పిలుచుకోవచ్చుగదా! దంపతి అనేది ఒక్కటి— భర్తలో భార్య ఒక్కటయింది—అన్నది మునుపటి భావన.

ఇప్పుడు మరొకసంగతి చూద్దాము. ఉత్తమ సమాజవ్యవస్థలో వ్యక్తి సంయమం, వ్యక్తివికాసం - ఈరెండు తెరగుల సంస్కారాలకూ అవకాశం ఉంటున్నది. దంపతుల జీవితంలో భర్త ద్రవ్యార్జన వ్యవహారంలో తనవ్యక్తిత్వం పెంపొందించుకుంటాడు. భార్య పంటవార్పులలో, ఇంటినితీర్చి దిద్దడాలలో వ్యక్తిత్వం పెంపొందించుకుంటుంది. పిల్లల లాలనపాలనలోను, బంధువుల ఉపచార సత్కారాలలోను ఇద్దరు తమతమ ప్రత్యేక వ్యక్తిత్వం విలీనం చేసుకుని ఏకీభవిస్తారు. ఈవిధంగా సమష్టి శిక్షణంతో వ్యష్టిశిక్షణం చేరిపోవాలి. భక్తులందరికీ దేవాలయం ఒక్కటే. నమస్కారాలుమాత్రం వేరేవేరే. ఈ ప్రత్యేక ధర్మాభ్యాసానికి పూర్వం ఉన్నంత అవకాశం ఇప్పుడులేదు. ఇప్పటిసందర్భం సర్వసాంకర్యం. "సబ్ ఏక్ లుండ!" సముదాయమనే సముద్రజలంలో ఈకాలంలో అన్ని వ్యక్తిరసాలూ కరిగిపోయి నీరపాలయి పోతున్నాయి. పదిమంది మాట - అది అవసరం లేని చోట్లలోను చెల్లిపోతున్నది. ఏమి పిండవంటలు చేయిద్దాము? వోటుకు పెట్టండి. ఏవిషయంపై ఉపన్యాసం ఇప్పిద్దాము? వోటుకు పెట్టండి - ఇది ఇప్పటి తీరు. పూర్వం సంఖ్యాబలాతిరేకం లేదు. ఇట్టిటీవల రాజకీయాలనుంచి వచ్చిన దొమ్మి దర్బారు జతకు యంత్రాల దొమ్మిసేవ కూడ చేరింది. పూర్వం భోజనంచేసేవారి రుచినిబట్టి వంట; నేడు హోటలువంట. పూర్వం నాలుక కోరినట్లెల్లా పిండివంటలు; నేడు వ్యాపారదృష్టితో తయారయిన కార్ఖానా వేపుడుగింజలు, బిస్కత్తుముక్కలు. పూర్వం పురోహితులు

సొంత కదురుతో వడికిచేసిన జన్నిదాలు; ఇప్పుడు మిల్లుదారాల తాలు. పూర్వం గృహస్థు తోటనుంచి విడిపించి తెచ్చిన పూవులతో ఇల్లాలుకట్టిన మాల; ఇప్పుడు అంగడినుంచి వచ్చిన పూలుపత్రుల గోల. పూర్వం ఇంటిల్లిపాదీ కూర్చొని కుట్టిన విస్తరులు; నేడు యంత్రంలో తయారయిన ఇనుపకంచాల బరబరలు. పూర్వులలో తమబట్టలను తామే తమ చేతులతో ఉదుక్కోవాలి; తమవంట తామే చేసుకోవాలి - అనే నియమం సర్వసామాన్యం. ఇప్పుడు గాంధీగారి శిష్యులు తమ ఉడుపులకు అవసరమైన నూలును తామే స్వహస్తంతో వడుక్కోవాలనే వ్రతంపెట్టుకున్నారు. అంతే. ఈ స్వయంపాకంవంటి నియమంలో ఒక ఆత్మసంస్కారతత్త్వం అంతర్గతమై ఉన్నది. స్వయం పరిశ్రమ, స్వయంసేవ అహంకార వర్జనకు ప్రయత్నాలు - వినయవిధేయతలకు సూచనలు. కూలి యిచ్చి దేవుని పూజచేయించి, తాము కూర్చున్నచోటికి తీర్థప్రసాదాలు తెప్పించుకొనడం కన్నా, తామే మేనువంచి చేసిన నమస్కారంలో నమ్రత ఎక్కువన్నది మునుపటి భావన. తండ్రి జబ్బుపడితే, తానే దగ్గరఉండి ఉపచరించడం మునుపటి సంప్రదాయం; కూలీ నర్సులను నియమించడం ఇప్పటి పితృభక్తి. పసిపాప పొట్టకు ఏదోరీతిగా పాలుచేరడం ముఖ్యం ఇప్పటివారికి. ఆపాలు తల్లిపాలిండ్లనుంచి వచ్చిందేనా అన్నదే ముఖ్యం మునుపటివారికి. తమ పరిశ్రమఫలం, తమ శ్రద్ధకు కానుక - అనే సంతోష కల్పన ఇప్పటివారికి లేకపోతున్నది. ఈ ఆత్మగుణ సంకోచనానికి సమష్టిపద్ధతికాదు కారణం; ఇప్పటి ఉద్దేశ సాంకర్యం, సహవాససాంకర్యం కారణం.

కడసారిగా వేరొక విషయానికి వెళ్లుదాము. అది జీవిత ముఖ్యలక్ష్యం. పూర్వులు భగవత్ప్రీత్యర్థమని - జన్మసార్థకం కానీ అని-ఏదో ఒక పెద్దసంకల్పం మనస్సులో పెట్టుకొని, అది కలిసివచ్చేకాలం నిరీక్షిస్తూ జీవితం గడిపేవారు. ఒక్క తీర్థయాత్ర, ఒక దేవతాసేవ, ఒకవ్రతం, ఒక సత్రంస్థాపన, ఒక రామోత్సవం, ఒకదానం, ఒక అన్న సంతర్పణం, ఒక పురాణశ్రవణం - ఇలాటి ఏదో ఒక మహోద్దేశంకోసం, తత్కాలపు భోగలాభాలకు సంబంధంలేని సంకల్పంకోసం వారు యావజ్జీవం అంగలార్చి, డబ్బుమిగిల్చి, అది నెరవేరినప్పుడు తాము జీవించడం సార్థకమయినదని సంతోషించేవారు; సంతృప్తిపడేవారు. అలాటి పారమార్థికత ఇప్పుడు విరళమవుతున్నవి. గాంధీగారు జీవించినప్పుడు పలువురు ఒకటిరెండుసార్లు అలాటి పారమార్థికతను చూపినమాట నిజమే. అయితే మన అనుదిన సామాన్యజీవితంలో ఆగుణం కనిపించడం ఇప్పుడు బొత్తిగా తక్కువయింది. పాతభక్తిశ్రద్ధలు పోయాయి; కొత్త ఆత్మోద్ధారభావన ఏదీ రాలేదు. ఈగడియ తిన్నతిండి, ఈగడియ చూచినచూపు - ఇంతే నేటివారి బ్రతుకు. మరుగడియ ఒకటున్నదనే సంగతికూడ వారికి అక్కరలేదు. ఈనాటి జీవనంలో శ్రమా అలాటిదే. తెల్లవారి నుంచి సందెవరకు పాటు, అలసట, చింత, పరుగులాట. ఎక్కువమందికి జీవితంలో వేసట - దానిలో వారికి ప్రయోజనమే కనిపించదు. ఇది మన నూతనార్థికయుగం ప్రభావం. కార్ఖానాకు బలి మనుష్యుని నెమ్మది; గానుగెద్దులాగ తిరుగు; చిక్కింది



బాముకో; అలసి నేలను కరుచుకో. జీవితం ఇంతమాత్రమే అయినప్పుడు ఆనాటిపాటు ఆనాటిది. అది వట్టి తిండిబట్టల పరుగులాట. అంతకు మించినది మనస్సుకు అందదు.

ఇప్పటిజనం సుఖపడడంలేదని నేను అనడంలేదు. సుఖసంతోషాలఛాయా, ఆశా అంతింతైనా లేక జీవితం ఒక్కనాడైనా సాధ్యంకాదు. అయితే, ఆ సుఖానుభవంలో విచక్షణ ఉందా ? నిజమైన రసికత ఉందా ? ఉన్నతదృష్టి ఉందా ? ఇది సంస్కృతికి సంబంధించిన సమస్య. రసికత అనేది ప్రతివారిలోను అంతరంగంనుంచి ఉబికిరావలసిన గుణం. అది ఇతరుల అనుకరణకాదు. అది 'ఫ్యాషన్' కాదు. రేడియో ఉన్నంత మాత్రాన రసికత ఉన్నదని అనలేము. రేడియో ఒక యంత్రం; రసికత హృదయపరిపాకం. రేడియోకు డబ్బు అవసరం. రసికతకు అంతరంగశిక్షణ అవసరం. యంత్రమే దొడ్డదన్నభావన దేశనాయకులలో ప్రబలినప్పుడు, మన విహారవ్యవహారక్రమంలో - హ్యూమన్ టచ్ - మనుష్యహృదయస్పర్శ లేకపోయి ఆ విహారవ్యవహారాలు కూలిపాటూ, యంత్రవర్తనమూ అయినప్పుడు ప్రజల అంతరంగసంస్కృతిమట్టం దిగజారిపోవడం స్వతస్సిద్ధ పరిణామం.

నేను ఈమాటలు చెబుతుండడం హెచ్చరికకోసం. సంస్కృతివిషయం నేను వర్ణించినంతగా చెడిపోలేదని తెలిసినవారెవరైనా నాకు ధైర్యంచెబితే, నేను సంతోషంతో విని, వారిని కృతజ్ఞతతో నమస్కరించేను.

# 2. శాంతి

శ్రీనివాస

ఇప్పుడు శ్రావణపూర్ణిమ దగ్గరపడుతున్నది. సర్వదా మనను తన అధికారంలో పెట్టుకొన్న ఈ ప్రపంచం పనినుంచి నాకు కొంచెం తీరిక చిక్కింది. కార్యప్రపంచపు కళవళపాటుతో అలసిపోయిన ఈ మనస్సుకు కొంచెం శాంతి కలిగించే పద్ధతి ఎలా?

శాంతి కలిగించే పద్ధతి! శాంతి యెక్కడ? మన మెక్కడ? శాంతి మనను వదలిపెట్టి చాలకాలమైంది. అది ఎప్పుడైనా మనవద్ద ఉందా లేదా అని సందేహంకలిగేటంతటి కాలం మనకు దూరమైపోయింది. ఒకకాలంలో అది మనవద్దే ఉండేది. అటుతర్వాత కొంతకాలం మనం దాన్ని కావలసినప్పుడు పోయి వెదికేవాళ్లం. వెదికితే అది దొరికేది. జీవనసంగ్రామంలో అనేకబాణాలతో ఆహతమైన మన తనువుకు, మనసుకు ఆ సంజీవనిని సోకించేవాళ్లం. అది సోకగానే తనువూ మనస్సూ తమ స్వాభావికమైన ఆనందం స్వల్పకాలమైనా పొందేవి. ఇప్పుడు మనం ఆసంజీవనిని వెదకడమే వదలుకున్నాము. దాని దారినే మరచిపోయాము. అది మనకు దొరకదు. మనపెద్దలు దానిని ఎక్కడెక్కడో వెదికి బయటికిలాగేవారు. మనం వారి కౌశలాన్ని నిలుపుకోలేదు. సంజీవనియేమో మనకు కావాలి; అయితే దాని నెలవును మనం మరచిపోయాము.

'ఓం శాంతిః శాంతిః శాంతిః' అని వారు చెప్పినట్లే మనమూ చెబుతున్నాము. వారు చెప్పినప్పుడు వారికీ, వారి పరిసర ప్రపంచానికీ శాంతి కలిగేది. ఆకలితో నకనకలాడుతూ తల్లికోసం ఎదురుచూస్తూ కుంగిపోయి కూర్చున్న పిల్లపావురాళ్లగూటికి తల్లి ఆతురతతో, మృదుస్పర్శతో వచ్చేలాగు శాంతి వచ్చి, ఓం శాంతిః శాంతిః శాంతిః అంటూ సంఘాన్ని తనరెక్కలతో కప్పివేసేది. ఇప్పుడు మనం ఆమంత్రమే చెబుతున్నాము. మనపెద్దలు ఏ హ్రస్వదీర్ఘ స్వరాలతో ఆమంత్రం ఉచ్చరించేవారో అలాగే ఉచ్చరిస్తాము. అయితే, మన సంఘానికి మన మాతృశాంతి రావడంలేదు. దానిని ఏదేగ తన్నుకొనిపోయింది?

నేను నేడు శాంతిని వెదుక్కుంటూ బయలుదేరాను. శాంతుడుగా ఉండడానికి ప్రయత్నపడుతున్నాను. శాంతిని పొందానని భావించడానికి యత్నిస్తున్నాను. నిద్రపోతున్నానని భావించేవాడు నిజంగా నిద్రపోవడంలేదు. ఊరికే ఉందామని చేతులు కాళ్లు తల కదలించకుండా కూర్చున్నవాడు ఊరికే ఉన్నట్టు కాలేదు. శాంతిని వెదుకుతూ, అది దొరకలేదుకదా అని కలవరపడే నాకు శాంతి ఇప్పుడు సాధ్యంకాదు.



శాంతిసుఖాన్ని అనుభవించే పుణ్యమే మనకు లేదేమో! ఆపుణ్యమే ఉండేట్టయితే శాంతికి అవసరమైన సామగ్రి మునుపటిలాగ ఉన్నప్పటికీ మనకు శాంతి సాధ్యంకాకపోవడం ఎందుకు? ఇదిగో ఈదినం చాలసుందరమైంది. సౌందర్యానికి ఆవాసమైన మన ఈ ఆర్యావర్తంలో, ఈ ఆర్యదేశంలోకూడ ఇటువంటి సుందరమైన దినాలు సంవత్సరంలో ఎక్కువ ఉండవు. ఒక నెలగా వానలుపడి చెరువులు, నదులు నీటితోనిండి తొణికిసలాడుతున్నాయి. దినదినమూ మేఘాలలో మరుగవుతున్న సూర్యుడు నేడు వెలుపలికివచ్చి ప్రపంచాన్ని తన లేతయెండతో నింపి, వెలుతురుతో నెమ్మదిగా త్రుళ్లింతలాడేట్టుచేశాడు. లేతచెట్లు తీగలు ఈ లేతవెలుగులో తడిసి, మితంగా పసుపాడివచ్చిన యువతులవలె కానవస్తున్నాయి. గాలి కొంచెంసేపు నెమ్మదిగా, కొంచెంసేపు విసురుగా వీస్తూ, మనుష్యుని ఆత్మవలె ఎక్కడినుంచో వచ్చి ఎక్కడికో పోతున్నది. అలా పోతూ, తనరాకను నిరీక్షిస్తూ వస్తాడో రాడో అని బొటనవ్రేళ్ళపై నిలబడి చూస్తున్నట్టున్న వృక్షరాజి తలమీద ఉండే ఆకులసందులోదూరి అవి పాడేట్టు చేస్తున్నది. కుశలుడైన వైణికుని చేతివ్రేళ్లు తాకిన వీణ తంతులలాగ వృక్షరాజి ఒకమారు మృదువైన, స్పష్టమైన, మరొకమారు చెవులు నిండిపోయేలాగ గురుతరమైన ఇంపైన స్వరాన్ని గంభీరనినాదాన్ని పలికిస్తున్నది. ఈగంభీర నాదం సాగరాన్ని చేరడానికి దేవలోకంనుంచి దిగివస్తున్న దేవనిర్ఝరిణి ప్రవాహఘోషమో అన్నట్టు ఉంది. ఎక్కడచూచినా పక్షుల కలకలధ్వని. కోయిల దూరంలో ఆకులమాటున మణిగి వర్ణించే కవులకు పిలుపు పంపేటట్టు కుహూరావం చేస్తున్నది. చుట్టుపట్టుల పక్షుల సంభ్రమం. ఇక్కడ ఒక్కపక్షి, కారణమేమిటో, బహుసంబరంతో విధవిధాలుగా కూస్తున్నది. కోయిల ధ్వనిని పంచమస్వరం అంటారు. దీనిని ఏమంటారో! నాకు దానిపేరు తెలియదు. పేరు తెలియకపోతే ఏం? వినడానికి చాల ఇంపైనధ్వని. అదే ముఖ్యం ఇక్కడ. మరి రెండుపక్షులు కొమ్మమీద వాలి ఏమేమో చెప్పుకుంటున్నాయి. అంతా చాల ఆనందంతో నిండింది. దిక్కుదిక్కునుంచి నూరారువిధాలుగా వచ్చే ఈ కోకిలధ్వనిలో కాకికూతలూ చేరాయి. ఇప్పుడు కోకిలధ్వనిమాత్రం విన సొంపుగా వుంది; కాకికూత విన సొంపుగా లేదు అని చెప్పడానికి లేదు. కేవలం దీనిని దానిని విడిగా వింటే, ఆభావం రావచ్చు. ఇక్కడ ఇప్పుడు ఈ తీరుతీరుల స్వరసముచ్చయంలో మిశ్రితమైన కాకికూతా ఒక రీతిగా విన సొంపుగానే ఉంది. దేవదేవుని విశ్వసంసారగీతంలో, మనుష్యుడు నిందించినప్పటికీ, కాకికూత విన సొంపైనదే.

ఇలాటి దినం. ఈస్థలం, ఈకొండ మూడువైపులా ఆక్రమించి నిలబడి ఉంది. అడివారంలో పురాతనదేవాలయం. పక్కలోనే కొలను, నిర్మలమైన నీరు. కొలనుగట్టుమీది బసవన్ననోటినుంచి కొండలోని స్వచ్ఛమైన చల్లనినీరు ఒకేధారగా నిరర్గళంగా పడుతున్నది. కొలనుకు ఎక్కువయిననీరు ఒక కాలువనుంచి విసురుగా దూకుతూ గులకరాళ్ళ మధ్యనుంచి పారి, స్నానపూజలు ముగిసినతర్వాత దేవాలయంనుంచి దిగిపోతున్న స్త్రీల అందెలరవళి అని తోచే మృదురవంతో కిందికి పారుతున్నది. పృథివి ఎటుచూచినా

పచ్చనిరంగుతో శోభిస్తున్నది. కొండశిఖరంనుంచి కొండఅడివారంవరకు చెట్ల పచ్చని రంగు; మధ్యన గైరికాది ధాతువులరంగు. పచ్చనిరంగు ఈసన్నని కాలువగట్లవరకు వ్యాపించింది. ఈస్థలం అతిశయ సౌందర్యాన్ని చూడడానికో, ఈ కాలువ మధురరవాన్ని వినడానికో లేక ఈపవిత్రప్రాంతంలో నెలకొనివున్న మహాదేవుని సేవచేయడానికో దేవ లోకంనుంచి వరుసగా దిగివస్తున్న దేవతల గుంపో అన్నట్లు ఉన్నతవృక్షాలు పర్వతశిఖరం నుంచి పాదప్రాంతంవరకు బారులుతీరి నిలబడి కనులపండువు చేస్తున్నాయి.

ఈ పవిత్రస్థానం గురించి ఒక ఇతిహాసం ఉంది. పూర్వం ఒక తపస్వి మహాదేవుని పాదారవిందధ్యానానికి ఇది యోగ్యమైనస్థలమని భావించి ఇక్కడ తపశ్చర్యకు పూను కొన్నారు. నిత్యకృత్యాలకు ముందు గంగాస్నానం ఆవశ్యకమని దినమూ యత్నపూర్వ కంగా కాశిచేరి భాగీరథిలో స్నానమాచరించి ఇక్కడికి తపస్సుకోసం తిరిగి వచ్చేవారు. ప్రతిదినమూ విడవకుండా తనవద్దకు వస్తున్న వీరి నిశ్చలభక్తికి భాగీరథి మెచ్చి ప్రత్యక్షమై "నేనే నీవు ఉన్నచోటికి వస్తాను. నీవు ఇకమీద ఇక్కడికి రావలపిన పనిలేదు" అని అభయమిచ్చింది. తపస్వి తన నమ్మకంకోసం ఆమెకు తన చేతిదండం ఇచ్చి, "దీనిని నీవెంటతెస్తే నీవే వచ్చినట్టు నా మనస్సుకు దృఢమవుతుంది" అన్నారు. మరుసటిదినం స్నానంవేళకు గంగామాత భూగర్భంలోనే ప్రవహించి ఋషిదండంతో ఆ స్థలానికి దయచేసి తానుఇచ్చిన అభయాన్ని నెరవేర్చింది. ఆనాటినుండి, గంగామాతవల్ల, ఆమె మెచ్చిన తపస్వివల్ల ఈ స్థలం పవిత్రమైనది. ఇక్కడ మహాదేవుడు కృపతో భక్తులకు సర్వదా ప్రత్యక్షమవుతాడు.

శాంతి వచ్చేటట్టయితే ఇక్కడ ఇప్పుడు రావాలి. ఇటువంటి దినం; ఇటువంటి స్థలం. నీలిమామయమైన ఈనేల నడుమ, నీలిమామయమైన ఆకాశంకింద, భాగీరథి పవిత్ర సలిలాల సామీప్యంలో మహాదేవుని సన్నిధియందు, ఆనందమయమైన ఈ విశ్వప్రపంచపు ఆనందాన్ని కలకలధ్వనితో తెలిపే ఈ పక్షిసమూహాల సుఖసాగరం మధ్యన నిలబడితే, శాంతినిపొందడం సాధ్యంకావాలి. అయితే, శాంతి ఎక్కడ ? తపస్వి శాంతిసంపాదనకు అత్యుత్తమమని భావించిన ఈ పవిత్రస్థానంలోను నాకు శాంతిలేదు. ఆనందంతో కూడిన ఈ ప్రాణిసమూహంతో నేను చేరినాను అని ఒకక్షణం భావించాను. తర్వాత, అవి ఆనం దంతో పాడుతాయి. నేను పాడలేను అని తెలిసివచ్చింది. నాకు ఆనందమెక్కడ ? నాకు శాంతి యెక్కడ ?

నేను శాంతిని పొందలేకపోయినా, ఈ ఋషిని "మీరు దానిని ఎట్లా పొందారు ?" అని అడుగుదామంటే, ఆయన కనుమరుగయారు. నాకూ కొంచెం వయస్సయింది. చాల ఏళ్లుగా ఈ ప్రపంచాన్ని కళ్ళతో చూచాను. ఎప్పుడూ సుందరమైన ప్రపంచం ఇప్పుడూ సుందరంగానే ఉంది. నాటినుంచి నేటివరకు నేను ప్రపంచంలో సుఖాన్ని వెదికాను. సుఖం ఇస్తుందేమోనని శాంతిని వెదికాను. రెండూ నాచేతికి చిక్కలేదు. ఎట్లా చిక్కు



తుందని చెప్పేవారూ లేకపోయారు. అప్పుడు తన సుఖంకోసం భాగీరథిని పిలిపించు కొన్న తపస్వి ఇప్పుడు నాకోసం ఒక్కనిముసం కనిపించి ఆ శాంతికి సాధనమైన బీజ మంత్రాన్ని ఉపదేశించకూడదూ ! తపస్వీ, మీ రెక్కడ ?

ఎక్కడో ? తెలిసినవా రెవరు ? ఋషిమాత్రమే ఏమిటి ? అందరూ అంతే. ఎప్పుడో ఉన్నారట; ఇప్పుడు లేరు. ఇప్పుడు లేనందువల్ల వారు ఉండినారో, లేరో అని సంశయపడుతూ, మనకు లేనందువల్ల ఏనాడూ లేరనే భావించి, వారు లేరనే నమ్మకంతో మనం సంతృప్తిపడ్డాము. వశిష్ఠా, వామదేవా, మార్కండేయా, కౌండిన్యా, రండి. మీరందరూ ఇప్పుడు ఒకమారు రండి. ఒకేఒకమారు వచ్చి, "మేము నిజం; అబద్ధం కాదు. నీవూ ఉన్నావు; అబద్ధం కాదు. ఇది తెలుసుకొని శాంతిపొందు" అని ఆనతి యివ్వండి. నేను చేతులు కట్టుకొని ఈవిధంగా ప్రార్థించి, నమ్మి శాంతుడిని అవుతాను.

వారూ రాలేదు. శాంతీ రాలేదు. తెమ్మెరలు మృదువుగా నెమ్మదిగా ఆకులమధ్యన ప్రవహిస్తున్నవి.

# 3. రచయిత నుదుటివ్రాత

## గోవిందపై - మంజేశ్వర

ఇది ఒకవ్యాసం, అథవా ఇదీ ఒకవ్యాసం. సంపాదకులు "ముత్తుహవళ" (ముత్యాలు, పగడాలు) అనే గ్రంథంకోసం ఒక వ్యాసం వ్రాసి పంపమన్నారు. కానీండని ఒప్పుకున్నాను. అప్పుడు మరొకపని ప్రారంభించినందువల్ల దీనిని అప్పుడే ఆరంభించడం కాలేదు. ఇంతలో కాసరగోడు సాహిత్యసమ్మేళనం (1947 డిసెంబరు) వచ్చింది. అది ముగియగానే, దానికోసం వచ్చిన కొందరు సాహిత్యబాంధవులు మాయింటికి వచ్చారు. వారు తిరిగి వెళ్ళిపోగానే, వయోనుగుణంగా కొంచెం విశ్రమించేటంతలో బరోడాపయనం (1948 ఫిబ్రవరి) వచ్చిపడింది. దినదినానికి ఆవైపు వెళ్ళనున్న ధూమశకటం ఈలపిలుపూ ఈవైపు వ్యాసాన్ని చేర్చవలసిన గడువూ దగ్గిరపడ్డాయి. ఈ చిక్కులో ఇదొకటి తప్ప మరేవిషయమూ మనస్సుకు తోచక, ఒకమారు ఆశపుట్టించి నీళ్లుచల్లడం ఇష్టపడక దీనిని గురించే వ్రాశాను. సంపాదకమహాశయులూ, పాఠకమహాశయులూ దీనిని వ్యాస మని ఒప్పే ట్లయితే, వారు ప్రకటించనీ; వీరు చదవనీ. ఒప్పకపోతే, వారూ, వీరూ వదలిపెట్టనీ. ఎలాచేసినా నాకు ఒక్కటే.

ఈ వ్యాసంలో చెప్పిన అనుభవమంతా సొంతం రచయితదే కాని, మరొక క్ష - వ్యక్తిదో, లేక వ్యక్తులదో కాదు. తక్కినవారి యిళ్ళలో దోసెకు చిల్లులైతే, రచయిత ఇంట్లో పెనముకే చిల్లులు. ఏమి చేద్దాం? అది అతని భాగ్యస్థానంలోని శని ఆట; లేక చెర్లాట. అయితే, నమ్మకండి; ఈ మాటలన్నీ సేరుకు 24 తులాలు నిజం. పొద్దుపోయి నట్లెల్లా వాటి గొంతుక కుంగిందేకాని పొంగలేదు; అద్దంలో కుంగి గుజ్జయిన ఏనుగు లాగ. వాటిరంగు తగ్గిపోయిందేకాని, నిగ్గుకాలేదు; ఎన్నోనాళ్ళ చేమంతిపూవులాగ. ఈ 'ప్రబంధం' లో సూత్రధారుడూ, నాయకుడూ ఒక్కడే కనుక ప్రస్తావనకూ, నాటకానికి నడుమ వేరుగా తెరయెత్తవలసినది లేదు.

చాలకాలపుకిందటి కథ. నేనొకమారు తగినంతదూరంలోఉన్న ఒక ఉత్తమ కన్నడ పత్రికకు వ్యాసం పంపాను. పంపిన కొన్నినాళ్లకే నేను ఉత్తరాపథానికి వెళ్ళవలసి వచ్చి నందున ఆపత్రికఉన్న ఊరిదారిగుండా వెళ్ళవలసివచ్చింది. అక్కడ ఆగి, ఆగిననాడే సంపాదకులవద్దకు పోయి, పరస్పరం పరిచయం చేసుకుని వారితో సంలాపిస్తున్నంతలో, యువకుడొకడు అక్కడికివచ్చి వారికి నమస్కరించాడు. కూర్చో అన్నారు. కూర్చున్నాడు. పేరు అడిగారు. చెప్పాడు. "స్వామీ నా కవితసంగతి యేమిటి?" అన్నాడు.



"అదిగో మీ కవిత మా పత్రికస్థాయికి రాదు. అందువల్ల దానిని ప్రకటించలేను. నేను మీకు ఈ సంగతి వ్రాశానే?"

"దోష మేమిటి స్వామీ, నా కవితలో?"

"అలా అడగకూడదు. చెప్పినమాటకు ఊగొట్టాలి. మీరింకా యువకులు. వ్రాసి వ్రాసి అలవాటయిన పిదపనే చక్కగా రచన సాగించగలరు. అప్పుడు ప్రకటించవచ్చు. ఇదిగో మీ కవిత."

"అలా కాదు స్వామీ, మీ పత్రికలో నా కవిత రావాలని నాకు చాల ఉత్కంఠ. ఒక్కసారి నా కా అవకాశం ఇస్తే చాలు. ఇక ఇప్పట్లో మిమ్మల్ని పీడించను. తమ పత్రికలో నా ఒక కవిత వెలువడితే, నా తక్కిన కవితలను తక్కిన పత్రికలన్నీ రప్పించు కొంటాయి. అందువల్లనే మిమ్మల్ని యాచిస్తున్నాను. దయచేసి ఒప్పుకోండి. క్షమించండి."

సంపాదకులు మరి పెదవి కదల్పలేదు. అతని కవితను అతనికి అప్పగించి, తమకు వేరేపని ఉన్నదని ముఖం తిప్పి నాతో మాటలు కొనసాగించారు. రెండవవానిముందు జరిగిన అవమానానికి ఆయువకునికి కిందపడిన బాధకంటే పదిమంది చూచిన బాధ ఎక్కు వయినట్లు అయింది. అతడు వెళ్లిపోయాడు. అట్లయితే, నావ్యాసం గతియేమిటని అక్కడ కూర్చున్న నాతలకు ఎక్కగానే, చిలుకుకు మోచేయి తగిలినట్లయింది. దెబ్బలు అతని కయినా, నొప్పేమో నాకు అన్నట్టయింది. దానితోపాటు ఈశ్లోకమూ జ్ఞాపకంవచ్చింది;

తృణా దపి లఘు స్తూలః తూలా దపి చ యాచకః
వాయునా కిం న నీతో సౌ మా మేవం ప్రార్థయే దితి.

గడ్డికంటె తేలిక పత్తి. పత్తికన్నా యాచకుడు తేలిక. అయితే గాలి ఎందుకు అతనిని పైకి తీసుకొనిపోదు? తనను ఏమైనా యాచిస్తాడేమోనని గాలికూడా దూరంగా వుంటుంది. ఈ శ్లోకంలో 'యాచకః' అనే పదాన్ని తుడిచివేసి, 'లేఖకః' అని వ్రాసిపెడితే, ప్రస్తా రానికి సరిగా ఉంటుంది. అర్థానికి సరితరం - మరింతసరి.

మా మాటలు ముగిశాయి. సంపాదకులను వదలిపెట్టి కొన్ని అడుగులు వేశానో లేదో, దారిలో ఆ యువకుడు నిలుచుని ఉన్నాడు. చూచాను. రేకులన్నీ రాలిపోయి నల్లని దిమ్మమాత్రమే కనిపించే నిన్నటి గులాబిపూవులాగ ఉన్న అతని వాడినమొగంచూడగానే నాకు ఒంటిపై పాము పారాడినట్టయింది; ఒళ్లు పులకించింది. "ఎందుకు నిలబడినారండీ ఇక్కడ?" అన్నాను.

"మీకోసం కాచుకొని, స్వామీ. మిరూ ఏదైనా రచన ఇచ్చారా?"

"ఔను. నా రచన అచ్చుకుపోయిందట."

"మీరు అదృష్టవంతులు స్వామీ?"

"నాయనా, అట్లాగేమీ కాదు. అదృష్టమనేది ఈనాడే కాదు, ముందుకూడా ఒకే రీతిగా ఉంటేమాత్రం అదృష్టం. ముందుసంగతి ఎవరికి తెలుసు? ఏదీ, మీ కవిత? చూద్దాం."

యువకుడు నాకు కవిత అందించాడు. చదివాను. అది తగినంత సొగసైన కవితే. పిండికొంచెం దళంగా ఉండవలసిందే. కాని, పిండి పిండేకాని, ఇసుక కాదు. బూడిదకాదు. ఎ-1 వ తరగతిది కాదనడం నిజమే అయినా, అతడేమి? అతని వయస్సేమి? పెరిగేగుణం మొలకలోనే కనిపిస్తుంది. అయితే, దానికన్నా ఎంతో న్యూనమైన కవితలు ఆపత్రికలోనే, దానిఇటీవలి సంచికలోకూడ ప్రకటితమయాయి. అవి ఎవరివి? సంపాదకుల ప్రాంతంవారివి. తనవారు వస్తే అడుగంట ఆడు గరిటా, పెరవారు వస్తే పైపైన ఆడు గరిటా; ఇలా జ్ఞాపకం రాగానే "తమ్ముడూ, మీరు ఏవైపువారు?" అన్నాను. అతడు తన ఊరు పేరు చెప్పాడు. "అలా అయితే, మీరు సంపాదకుల ప్రాంతంవారు కారు." అన్నాను. అతనికి నా వ్యంగ్యోక్తి అర్థమయింది. అంతవరకు నవ్వులేని అతని మొగం అప్పు దొకసారి నవ్వింది. "కాదు" అన్నాడు. నా అనుమానం మరింత వేళ్లూనింది. ఇతడు అన్యప్రాంతం వాడు అనే నిమిత్తంతోనే అచ్చువేసిన ఆబోతులాగ ఇతనిని "తృణం భక్ష, జలంపిబ" అని వదలివేయడమా సంపాదకులు?

"తమ్ముడూ, ఈ కవితను గురించి మాట్లాడడం కోసమే ఇంతదూరం వచ్చారా?

"అవునండీ. ప్రకటించడానికి కాదని వారినుంచి ప్రత్యుత్తరం రాగానే, సమక్షంలో దర్శనం చేసుకుంటే, ఏమైనా అనుగ్రహిస్తారేమోనని వచ్చాను."

ఏమి వినయం: ఏమి సౌశీల్యం! ఏమి ఔత్సుక్యం!

"తమ్ముడూ, కష్టపడవద్దు. ఇప్పటి రచయితలు రోగులు. సంపాదకులు వైద్యులు. వైద్యుడు రోగిని బాగుచేయగలడేకాని, ఆయుస్సు ఈలేడు (న వైద్యః ప్రభు రాయుషః). అలాగే శ్రేష్ఠపత్రికా సంపాదకులు అడ్డగోడమీది దీపంలాగ లోపలికి, బయటికి సమానంగా వెలుతురును ఇవ్వాలనే మూలతత్త్వాన్ని వారు మరచిపోయారు. ఏవిషగడియల్లోనో ఈ కవిత రచించి ఒక్కమారు హతాశులయారంటే, ఆ ఆశాభంగం ఎల్లకాలమూ ఉండరాదు. కొక్కిరాయికి ఒక్కే చెరువా? భగవంతుని స్మరించి, దీనిని మరొకచోటికి పంపండి. లేతమొగలిరేకులవంటి మీ లేలేతకవితలు త్వరగా వాడిపోయీని."

ఇలా చెప్పి అతనిని పంపివేశాను. దీపం సంగతి ఎత్తగానే, చీకటి పటాపంచలు కానట్టు - న నశ్యతి తమో నామకృతయా దీపవార్తయా - నా ఉపదేశం మనస్సు నొప్పిపడిన అతని చెవులకు ఇంపుకాకపోవచ్చు. అతడు కనుమరుగయ్యేదనకా పదేపదే ముఖంతిప్పి అతనిని చూస్తున్న నాకు "విసిరివేయగా నిటారుగాపడిన పాము తన వంపులను సవరించుకొనడానికి పడేపాట్లు దానికే తెలుసు, లేక దేవునికే తెలుసు", అనిపించింది.



తర్వాత రెండుసంవత్సరాలకు ఏదో ఒక విశ్వవిద్యాలయంనుంచి, అక్కడికి వచ్చి ఏదో ఒకవిషయంపై పరిశోధనాత్మకంగా మూడునాళ్లు ప్రసంగించవలసిందని నాకు ఆహ్వానం వచ్చింది. ఒప్పుకున్నాను. శ్రోతలకు రుచించే విషయంపైనే రచించిన వ్యాసాలను తీసుకుని అక్కడికి వెళ్లాను. ఫలానా కళాశాలలో ఫలానాదినం సాయంకాలం 6-00 గంటలనుంచి ప్రసంగం ఉపక్రమించాలని నాకు ముందు తెలిపినప్రకారం, నేను అక్కడ బసచేసిన ఇంటిలోఉన్న ఇద్దరు ముగ్గురు విద్యార్థులతోపాటు ఆ కళాశాలకు బయలుదేరాను. ఆవిద్యార్థులు మావారే అయినప్పటికీ, వారు చాల చిన్నవయస్సులో ఉన్నప్పుడే వారి తలిదండ్రులు పరాయిభాషల జిల్లాలలో ఉన్నందున, ఆనాటి వినోదం చూడాలనే కుతూహలంతో నాజతకు వచ్చారేకాని, కన్నడమంటే వారికి చీనాభాష. నిర్ణయమైనసమయానికి ముందే ఆ కళాశాలకు పోయి, ఉపన్యాసంగదిని పరిచయంచేసుకుని, సరైనవేళ కాగానే ప్రవేశించాము. వేదికమీద అధ్యక్షులు లేరు. శ్రోత్రనేత్రాలకు గ్యాలరీలో దుమ్ముకూడ లేదు. నాజతలో వచ్చినవారు, తలుపు వెలుపల శ్యాముడో, శబలుడో[1] ఒక ద్వారపాలకుడు, అతడూ కన్నడానికి సంబంధించినంతవరకు ఏడమూకుడు - చెవుడూ, మూగతనం రెండూ ఉన్నవాడు - అతడు కంబడికి కాచుకున్నాడేకాని, హరికథకోసం వచ్చినవాడుకాడు, అంటే, తాళానికీ, మేళానికీ నేనే అయ్యాను. నీళ్లైనా మజ్జిగ, మూడైనా సభ అనుకొని, వేళకు వేదికనెక్కి నా వ్యాసం చదువడం ప్రారంభించాను.

ఆవ్యాసంలో ఆరింట ఒకపాలు, అంటే ఆనాడు చదువవలసిన దానిలో సగం, మధ్యమధ్య మెచ్చుకోలు కరతాళధ్వనిలాగ ఆ 'అకన్నడిగు' డైన ద్వారపాలకుడు తల ఊపుతూ కొడుతున్న గొరకలను లాలిస్తూ, చదివే వేళకు ఆరున్నర కొట్టింది. "ఆయెనంతట నస్తమయ సమయము" అనేంతలో ఇటు చీకటి ముసురుకొనివచ్చింది; అటు "నళినమిత్రుని వేగులవారి పొలుపమో చీకటిపాళెమున" అన్నట్టు వీధులలోని నాల్గి దీపాలు వెలిగాయి. మా ఉపన్యాసం గదిలోమాత్రం మించుదీపాల తళుకూ లేదు, కెమ్మెదీపాల బెళకూ లేదు. పక్కింటివారి శోభానేపాటలో కొడుకు వడుగుచేద్దామనుకుంటే, రెండో అంతస్తులోఉన్న మాగదిలోకి ఏపక్కింటినుంచి వెలుగు ప్రసరించీని! పక్కన ఉన్న ఒక కిటికీలో ఒక ఓరగా వెలుగు పారడం చూచి, అక్కడ నిలబడి ముందుకు చదవడం సాగించాను. ఆ వెలుగుకూడ క్షణక్షణానికి మసకమసక అయినకొద్దీ, ఆకిటికీకి ఆనుకుని ఆనుకుని చదివాను. చదువుతూ చదువుతూ "పశ్చార్ధేన ప్రవిష్ట' మైన నా పూర్వకాయం కిటికీ వెలుపలికి వచ్చివేసింది. ఇక ఒక వరి ఊబముల్లంత వెలుపలికిపోయి ఉంటే, గడమీదనుంచి కుప్పించి దూకే దొమ్మరవానిగతి వేరే కాదు; నాగతి వేరే కాదు; చాలకాలం కిందట స్వర్గం సంపాదించడానికి భృగుపతనం చేసేవారట; నేనూ అనాయాసంగా వారి లోకాన్ని పొందగలిగేవాణ్ని. ఆః ఊః అనేంతలో గది చిమ్మచీకటి

---

1. శ్యామ శబలులు అనేవి నరకద్వారం కావలికాచే రెండుకుక్కలు.

అయింది. ఇక ఒకరిమొగం మరొకరికి కనిపించదు. చీకటిలోను చూడగలిగిన, కళ్ళకు గంతలు కట్టినా చదవగలిగిన [1]ఖుదాబక్ష్ కళ్లకావు నావి.

అక్కడినుంచి తిరిగి వద్దామన్నా సులభమా [2]గోముఖంలోపడి వెలుపలికి వచ్చినట్టు? దిగిరావడానికి రెండు మెట్లవరుసలు దాటాలి. అక్కడైనా వెలుగు ఉందా? చిమ్మచీకటి. పొగచుట్ట కాల్చే నా అలవాటుకు ధన్యవాదాలు. అగ్గిపెట్టె జేబులోనే ఉంది. పెట్టెతీసి, మెట్టుకు ఒక్క పుల్లవంతున పుల్లలు గీస్తూ, ఎలాగో కొసకు వీధిలోపడి ఇల్లు చేరాము.

మరుసటిదినమూ వేళకుముందే ఆ కళాశాలకు బయలుదేరాను. ఆనాడు నిన్నటి జతగాళ్లు లేరు. వారు నిన్నటి చీకటికి ఏవగించుకొనో, నిన్నటి జనసముదాయానికి భయపడో, లేక చదువు చూచుకోకుండా వృథాగా కూర్చొని ఆవలించడం ఎందుకనో ఆనాడు నావెంట రాలేదు. నేడూ మావారే, మా తుళునాడువారే, నలుగురైదుగురు, విద్యార్థులు, నిన్నటి కథ విని కుతూహలపడి, తామూ ఒక్కమారు ఆ ఆట చూద్దామనో ఏమో నా జతలో వచ్చారు. అక్కడికి చేరగానే నేను నిన్నటి [3]"అంధం తమః" కథానికను పై పరిశీలకులకు నివేదించాను. ఆనాడు మించుదీపాలున్న గదిని అనుగ్రహించవచ్చునను ఊరట కలిగింది. వేళకు సరిగా మరొకవ్యక్తి మమ్మల్ని తూగు దీపాలున్న మరొకగదికి పిలుచుకొని వెళ్లాడు. అక్కడ ఆ అంతస్థులో కూర్చుని, నా ప్రసంగంలోని ఒక్కమాటనన్నా తెలుసుకోలేని, బహుశః దానిలోని కన్నడపదాలను మాత్రం గ్రహించగల ఆ జతగాళ్లు మాత్రమే ఉన్న సభలో ఆనాటివ్యాసభాగం చదివి వారితోపాటు ఇల్లు చేరాను.

కడపటి మూడవనాడు ఆ ఊరిలో ఉద్యోగాలలోఉన్న మా జిల్లావారు కొందరూ, మాతృభాషమాత్రం కన్నడమైన ఇతరరాష్ట్రంవారొకరూ, ఎనిమిది పదిమంది శ్రోతృమహాశయులు నా ఉపన్యాసంవేళకు తండోపతండాలుగా ఆ కళాశాలకు తోసుకొని వచ్చారు. ఆ మూడునాళ్ళలోను కడపటిదే బ్రహ్మాండమైన సభ, ఆనాటిదే శ్రోతల మహాస్తోమం.

1. ఖుదాబక్ష్ కాశ్మీర్ రాష్ట్రవాసి. ఆమధ్య గొప్ప ఖ్యాతిసంపాదించాడు. అతడు కళ్ళకు బలంగా గంతలుకట్టినా, అన్నివస్తువులూ చూచేవాడు; సరిగ్గా చూచేవాడు; చదివేవాడు.

2. మైసూరురాష్ట్రంలో శివమొగ్గజిల్లాలోని తీర్థహళ్లి అనే గ్రామంవద్ద తుంగానదిలో గోవు ఆకారంలోవున్న ఒక బండ వుంది. దానిని గోముఖం అంటారు. దానిలో ఒక వైపునుంచి లోపలికిపోయి, అక్కడి నీటి సుడిగుండంలో తిరిగి వెలుపలికి రావడం మహాపుణ్యమని భావిస్తారు. అలా లోపలికి పోయినవారందరూ వెలుపలికి వచ్చారేగాని ఒక్కరైనా దానిలో చిక్కుకొని మడిసినట్లు తెలియదు. అదొక కష్టమైనపని అని భావిస్తారు.

3. చిమ్మచీకటిగా ఉండే ఒక నరకం



ఆనాడు కడపటిభాగం చదివాను. ఏతావతా, వినేవారు ఉండనీ, ఉండకపోనీ, మజ్జిగకు తగిన రామాయణం కాకుండా, క్లుప్తమైన ఆ మూడునాళ్ళలోను నా వ్యాసాన్ని ఆద్యంతం చదివి ముగించి నేను మోసుకొన్న బరువుమేర చేతులను చొక్కటాగా కడుగుకొని, నా విధిని, నా వ్యాసంవిధిని మనసార అభినందించి, అదిగో అబ్బాయి వెళ్లాడు, అదిగో అబ్బాయి వచ్చాడు అంటూ ఇల్లుచేరాను. మరుసటిదినం నెమ్మదిగా మాఊరికి బయలుదేరాను.

ఆ మరుసటి సంవత్సరం నేను మరొక కన్నడ వ్యాసాన్ని మరొక పత్రికకు పంపాను. ఒకటి రెండు నెలలవరకు అది ప్రకటన కాకపోవడం చూచి సంపాదకులకు జ్ఞాపకం చేశాను. వారు దానిని ఒక విద్వాంసునికి చూపారట. ఆ విద్వాంసుడు నా వ్యాసంలోని సిద్ధాంతంతో ఏకీభవించేవారు కారు. నేను జ్ఞాపకం చేసినందుకు సమాధానంగా సంపాదకుల జాబుకుమారు, ఆ విద్వాంసుని జాబుతోపాటు నా వ్యాసం లిఖితప్రతి నాకు తిరిగి వచ్చింది. ఆ జాబులో ఇంచుమించు ఈ విధంగా ఎర్రజెండా (అపాయసూచకంగా) ఎత్తి ఉంది:- "నేను ఈ విషయాన్ని గురించి వ్రాసిన వ్యాసాన్ని విమర్శిస్తూ తాము వ్రాసిన ఈ వ్యాసాన్ని ప్రకటించవద్దని సంపాదకులను హెచ్చరించాను. ఇతరత్రకూడ ఈ వ్యాసం ప్రకటించడానికి తొందరపడకండి. ప్రకటించేటట్టయితే, గొడవలో పడుతారు." అయితే, ఆ విధంగా 'మా!' అని నిషేధాజ్ఞ విధించినందుకు ఈషత్తయినా కారణం సూచించలేదు. (అంతేకాదు నా సిద్ధాంతాన్ని ఖండించి ఇంతవరకు వారు ప్రతివ్యాసమైనా వ్రాయలేదు.)

అలా అయితే, నా వ్యాసం వట్టి సిరాచేటేనా? చూద్దాం, కళ్లిచ్చినదేవుడు కళ్ళ చూపు ఇవ్వడా?- అనుకుని, ఆ విద్వాంసుని పటాటోపం లెక్కపెట్టక, దానిని మరొక పత్రికకు పంపాను. వెంటనే అది ఆపత్రికలో ప్రకటించడమైతే ప్రకటించారు. కాని ఏ రాహుకాలంలో ఆ వ్యాసం వ్రాశానో ఏమో, రామేశ్వరానికి వెళ్ళినా శనేశ్వరం వదలదు అన్నట్టు, అక్కడ పీటకిందకు తోస్తే ఇక్కడ (పీటకింది) ముగ్గు కిందికే తోశారు. ఆ పత్రికలో ఆ వ్యాసం కన్నడభాషకు ఈ కొసనుంచి ఆ కొసవరకు ఒకే తిద్దుబాట్లు! మేక్ బెత్ నిద్రను చంపాడు; ఇక్కడ నా కన్నడభాషను చంపారు. ఆ పత్రికను ఈపత్రికను పోల్చినప్పుడు, ఒకమణుగు పత్తి బరువా, ఒకమణుగు ఇనుము బరువా అనిపించింది. ఆ వ్యాసం చదివినప్పుడు నా వ్యాసమే కాదు, మరొకరిదే అన్నంతగా కన్నులకు కట్టింది. ఆ 'తిద్దుపాట్ల' లోను అనివార్యంగా నా కనుమరుగైన కొన్ని పొరపాట్లు మినహాయిస్తే, తక్కిన వాటిలో ఒకటైనా తిద్దుబాటుకాదు; వట్టి తప్పులు.

వెంటనే ఆ పత్రికా సంపాదకులముందు నా హస్తకవచం విసిరివేశాను. (threw down the gauntlet); దానికి సమాధానంగా వారు తాముచేసిన ఆ 174 (!) సవరణల పట్టీని నాకు పంపి (ఆ పట్టీ ఇప్పుడుకూడా నావద్ద ఉంది), ఆ విషయమై ఇరుపక్షాలవారూ ఉత్తర

ప్రత్యుత్తరాలు పెంచుదాము అన్నారు. దానికి అంగీకరించి నేను వ్రాసిన జాబుకు వారి సమాధానమే లేదు. ఆ అధ్యాయం అంతటితో ముగిసింది.

అ సంపాదకులు విశ్రాంతిపుచ్చుకొన్న తర్వాత మరొకరు ఆ పత్రికకు సంపాదకు లయ్యారు. వీరు వ్యాసం ఏదైనా పంపండని నన్ను అడిగినప్పుడు, పెట్టెలో అస్థిపంజరం ఉంది (skeleton in the cupboard), దానిని ఒకమారు తెరచిచూడండి అన్నాను. వారు పాతకథను తెలుసుకొని ఇకమీద ఏ వ్యాసంలోని పదోచ్చారణను సవరించబోమని నాకు వ్రాయడమేకాక, ఆ పత్రిక ప్రత్యేకసంచికలోనూ ప్రకటించారు.

తర్వాత, మరొకఊరి పత్రిక ప్రత్యేకసంచికకు దాని సంపాదకుల అభ్యర్థన మేరకు ఒక ఆంగ్లభాషావ్యాసం పంపాను. ఆ సంచిక అచ్చయి వచ్చింది. నా వ్యాసంలో ఉదాహరించిన శాసనకాలం నిర్ధరించడంలో, మూలశాసనంలో ఉత్తరాయణ సంక్రాంతి అని ఉన్నప్పటికీ, ఆ తేది ఉత్తరాయణ సంక్రాంతి అనే మకరసంక్రాంతికి సరిపోక, ఉత్త రాయణంలోనే వచ్చే కుంభసంక్రమణానికి సరిగ్గా సరిపోతుందని సకారణంగా, నిష్పష్టంగా నేను అధస్సూచికలో వ్రాశాను. దానితోపాటే "అనిర్ధారం సరైనదికాదు" అని సంపాద కులు ఒక్కమాటను నాగదంతంలో (బ్రాకెట్లలో) దూర్చారు. ఎందుకు సరియైనది కాదన దానికి కారణంకాని, ఆ సంక్రాంతికి సరైన తేదీకాని వారు చూపలేదు. వారిమాట గోరు లేని వ్రేలిలాగ ఉన్నప్పటికీ, జ్ఞానార్జనకు అప్రాయం ఈప్రాయం అనేదేమీ లేదు, చచ్చే వరకు నేర్చుకుంటూనే ఉండాలి; తన్నుతాను తిద్దుకుంటూ ఉండాలి అనుకొని తమ అమాటకు కారణం, ఆ శాసనంలో తెలిపిన తేదీని తెలుపండి అని వారికి వ్రాశాను. శంఖంలో పోసిందే తీర్థం అన్నట్టు తాను వ్రాసింది ఒప్పుకోవాలే కాని, దానిని గురించి చర్చకూడదు అని వారినుంచి శ్రీముఖం వచ్చింది. [1]"కవికి కవిశత్రువు!" ఆ ఒక్క మెతుకుపట్టి చూడగానే లోపల ఎంత ఉడికిందీ మనస్సుకు తెలిసింది. "I am: Sir Oracle" అనే ఆ అధివాదం చూడగానే, చిన్నతనంలో చదివిన ఒక ఆంగ్లకవిత రెండు పంక్తులు జ్ఞాపకం వచ్చాయి :-

"I am monarch of all I survey,
My right there is none to dispute."

[2] గడియారపుగిన్నె నీళ్లతాగితే, జేగంటకు కొడితిదెబ్బలు! ఆమధ్య ఏదో ఒక సన్మానసంచికకు (కన్నడం) వ్యాసం కావాలని మరొకవైపునుంచి నాకు అభ్యర్థనవచ్చింది. దానికథ మరీ వినోదకరం. వారు అడిగినమేరకు వ్యాసం పంపాను. ఒక్కసంవత్సరమైనా

1. కవిగె కవి మునివం.

2. పూర్వకాలంలో గంటలు తెలుసుకొనడానికి ఒకగిన్నెకు అడుగున చిన్నబెజ్జం చేసి, గిన్నెకు గంటల గుర్తులుపెట్టి నీళ్ళలో వదిలేవారు. ఆ బెజ్జంగుండా నీరునిండి గిన్నె లోపలికిపోతూ, ఆఖరుకు మునిగిపోతుంది. గిన్నెమీద గీతలనుబట్టి జేగంటను కొడితితో కొట్టేవారు. (జేగంట పళ్లెంలాగవుండే వాద్యవిశేషం.)



అది ప్రకటించడం జరుగలేదు. వారికి ఈసంగతి జ్ఞాపకంచేశాను. సమాధానంలేదు. నా వ్యాసం ఎక్కడైనా పోగొట్టుకొనిపోయిందా? దాని మరొక ప్రతికూడా నాదగ్గర లేదే! అని గాభరావడి నేను సంవత్సరానికి రెండుమూడుసార్లయినా, జ్ఞాపకంచేయడమే పని; వారికి సమాధానం వ్రాయకపోవడమే పని. నా సంచారిభావాలకు వారి స్థాయిభావం. ఇలాగే కొన్నిసంవత్సరాలు గడిచాయి. చివరికి ఒకమారు ఆషాఢమాసంలో నక్షత్రాలు కనిపించి నట్టు నా వ్యాసం ఉందని, అచ్చవుతున్నదని అభయదక్షిణ అందింది. కరువుకాలంలో అర చేతిమందం మేఘాలు కనిపించాయి. ఇకమీద సిరావ్రాతకు ఉపయోగపడే కార్బన్ కాయితం సంపాదించాలి. లేకపోతే, వ్రాసిన ఒకేప్రతి సంపాదకుల పాలయి, అక్కడ కళ్ళకు కనిపించక మరుగైపోతే, దానిని మళ్ళీ వ్రానే గజవైద్యం చేసేవారెవరు! కార్లైలు మహాశయుడు తను మిత్రుడు మిల్లుమహాశయునికి చూడడానికియిచ్చిన ఫ్రెంచ్ రెవల్యూషన్ వ్రాతప్రతిని మిల్లు మహాశయుని దాసిన పొయ్యి ముట్టించడానికి వాడితే, దానిని (ఫ్రెంచి రెవల్యూషన్‌ను) ఆద్యంతం తిరుగ వ్రాశాడట. అది నాకు సాధ్యంకాదు. అలా అనుకుని, సిరాకార్బన్‌కాయితం సంపాదించాను. ఆ సన్మానసంచికమూలంగా ఆ ఒక్క అత్యావశ్యక మైన, అవిస్మరణీయమైన పాఠం నేర్చుకున్నాను. కొడుకు ఓడిపోయినా, జూదంలో గుట్టు గ్రహించాడు. అటుతర్వాత ఏ వ్యాసమైనాసరే కార్బన్ ప్రతి తీయకుండా వ్రాయడమేలేదు; బయటికి పంపడమూలేదు. చివరకు గుట్ట ఈనింది; పదిసంవత్సరాలతర్వాత ఆ సన్మాన సంచిక వెలుగుచూసింది. పన్నెండేళ్ళకు బారకూరు జాతర అయింది. అయితే, ఆ సన్మాన సంచికకు కారణభూతులయిన ఇద్దరు ఉత్తమసాహిత్యవేత్తలు ఆమధ్యనే కన్నుమూశారు.

మరి ఒకటిరెండు సన్మానసంచికలకూ వ్యాసాలు పంపి ఏడెనిమిది సంవత్సరా లవుతూ వచ్చింది. వారికి జ్ఞాపకం చేసిచేసి అలసిపోయాను, గజగర్భంలాగ పెరుగుతూ ఉన్నాయి. ప్రసవం ఎన్నటికో చూడాలి. మెలకువతో ఉన్నవారిని మేల్కొల్పడం ఎందుకని గ్రహించాను. పగ్గాలు విప్పివేశాను. ఎప్పుడు కావలిస్తే అప్పుడు దొడ్డిలోకిరానీ. భీష్మాచార్యులకు జన్మపడిసెంలాగ సన్మానసంచికల అదృష్టమే ఇంతేనేమో!

కొన్నిసంవత్సరాలక్రితం ఒక సంపాదకులు తామొక జయంతిసంచిక ప్రకటి స్తున్నామని, దానికొక వ్యాసం పంపండని నన్ను కోరారు. వారు గీచిన గడువులోనే నేను వ్యాసం అందజేసినప్పటికీ, అది ఆ విశేషసంచికలో ప్రకటితంకాలేదని తెలియగానే, అలాఅయితే, హంపికి పోవడంకంటే నా కొంపలోనే ఉండడం మేలని దానిని వెనక్కు పంపండి అన్నాను. తిప్పి పంపితే మేము దుఃఖపడతాము, మీరూ దుఃఖపడుతారు అని దానిని వారు పంపలేదు. వారు తిప్పిపంపివుంటే, నాకు సుఖమేకాని, దుఃఖం కలిగేది కాదు. ఆ పత్రిక తర్వాతి సామాన్యసంచికలో దానిని ప్రకటించారు. పబ్బం తప్పినికాని, బొబ్బట్లు తప్పలేదు అన్నది నిజమేఅయినా, ఎప్పుడో వడ్డించిన బొబ్బట్లను పబ్బంబొబ్బట్లని తింటామా? సంచిక పరటాయించడంవల్ల నా వ్యాసానికి కొరతా, నాకు కలతాలేకపోయినా, ఒకదానికోసమని వేడి మరొకదానికి వాడే ధార్ష్ట్యాన్ని ఏమనాలి

లేకపోతే సంపాదకులు అడిగినమేరకు, అడిగినవెంటనే వ్రాసి ఇస్తారనే కారణంవల్లనే రచయితలు 'ఇదిగోనండీ పీట, తీసుకోండి పీట, వేసుకోండి పీట, ఎత్తిపెట్టండి పీట, ఇచ్చిపోండి పీట'-అయిపోయారా అని మనస్సు ఉద్విగ్నం కాగా, నాదగ్గర ఉన్న కార్బన్ ప్రతితో దానిని సంప్రతించి, వారు ప్రకటించడానికిముందు మరొకపత్రికకు పంపనా, రెండు పడవలలోను రెండుకాళ్లుపెట్టనా అనిపించింది. వద్దు. అలా చేస్తే, నాకే కాదు, ఆ మరొక పత్రిక సంపాదకులకూ సిగ్గుచేటు అని ఆ అంకుశాన్ని అక్కడే విరిచివేశాను.

ఏడుసంవత్సరాలక్రితం నేను నామిత్రులొకరి గ్రంథానికి మున్నుడి వ్రాశాను. విమర్శకు లొకరు ఆ గ్రంథాన్ని 'కడగాంచనివారై' నా మున్నుడిలో ఆ గ్రంథాన్ని నేను మెచ్చుకున్నందుకు నన్ను రంకులరాట్నంలో కూర్చోబెట్టి ఒకమారు పైకి ఎత్తి, మరొక మారు కిందికితోశారు. వారి ఆ టీకనే మనస్సులో పెట్టుకొని, ఇటీవల మరొక మిత్రుని గ్రంథానికి వ్రాసిన మున్నుడిలో ప్రస్తావ సదృశంగా ఇలా ప్రత్యుత్తర మిచ్చాను:

"తాను మున్నుడివ్రాసే గ్రంథంలోని కొరతలను ఎత్తిచూపడం మున్నుడివ్రాతగాని పనికాదు; ఏమాత్రమూ కాదు. ఆపనికి సహస్రాక్షుడైన విమర్శకుడున్నాడు. భాపురేభాపు అని తన లేఖకుని వెన్నుతట్టడం, చాంగుభళా అని అతనిని ప్రోత్సహించడం మాత్రమే మున్నుడికారుని పని. మున్నుడికారుడు పురోహితునివలె తనవద్దకువచ్చిన వాని పౌరోహిత్యం నడిపి అతని శ్రేయస్సుకోరి ఆశీర్వదించాలి. అతని ఊనాలవైపు చూడరాదు. విమర్శకుడైతేనో వైద్యునిలాగ తనవద్దకు వచ్చినవానికి చికిత్సచేసి, నీరోగి అయినవాని ఆరోగ్యం కొనియాడాలి. చెండాడవలసినచోట చెండాడవలె, అతనిని నొప్పించేటంతటి నిర్దయతో కాదు, అతడు ముందుముందు ఆరోగ్యశాలి కావాలి అనే మమతతోనే సుమండీ. ఈవిధంగా మున్నుడికారుని, విమర్శకుని పనులలో వున్న ధ్రువాలంతటి వ్యత్యాసాన్ని మనలో పలువురు ఇంకా తెలుసుకోలేదు. ఆకారణంగానే ఈ సందర్భం పురస్కరించుకొని దానిని స్పష్టీకరిద్దామని ఈ ఒక్కమాటను ఇక్కడ ప్రాసంగికంగా చెప్పాను."

ఇంకా, మున్నుడికారుని, విమర్శకుని పనులు ఒక్కటేనని భ్రమిసి వాటిని కలగాపులగం చేసేవారు చేస్తూఉండనీ. ఊదేశంఖం ఊదాను, విననీ, వినకపోనీ..

కొన్నిసంవత్సరాలుగా కొన్ని విశ్వవిద్యాలయాలవారు తమ పాఠ్యపుస్తకాలలో నా కవితలను ప్రకటించడానికి అనుమతికోరుతున్నారు. వారు ఆ విషయమై ప్రతిఫలాన్నో సంభావననో ఇవ్వనీ, ఇవ్వకపోనీ, నాకు ఆగొడవేమీ లేదు, నేను ఒప్పుకొంటున్నాను. కాని, ఇంతవరకూ, ఒకే ఒక్కవైపునుంచి అయినా, ఒకేఒక్కమారయినా, ఉపకారానికి కాని, ఉపచారానికి కాని, ఒకేఒక పుస్తకమైనా నాకు ఉపాయనంగా రాలేదు. అడిగితే, "పొదలో తలదాచుకొని చుట్టూ [1]'చెవుల పిల్లి చీకటి,' ఏమిచేద్దాం ?-''అంటూ,కచేరీపని

1. చెవుల పిల్లులు తమను తరుముకొనివచ్చే మృగాలనుంచి తప్పించుకొనడానికి పొదలో తలదూర్చి 'చుట్టూచీకటి. ఇక మనను ఏ మృగమూ చూడదు. మనం కనిపించం' అనుకుంటాయట. దానిని కన్నడంలో 'మొల గత్తలె' (చెవులపిల్లి చీకటి) అంటారు.



తొందరను దూషిస్తారు. అయితే, మరుసటి సంవత్సరమూ వారు అడుగుతారు; నేను ఒప్పుకుంటాను. ఈ విధంగా ప్రతిసారీ అదే ఆట, అదే పాట.

కొన్ని అంటే కొన్ని విశ్వవిద్యాలయాలు అలాటి పాఠ్యపుస్తకాలను సంకలనం చేయడానికి ప్రాయశః సంవత్సరానికి ఒక్కరుగా సంపాదకులను దబ్బిచ్చి (?) నియమించడంకద్దు. వీరి పాటా అదే. వీరిలో ఒక విశేష మేమిటంటే, ఆయా రచయితలనుంచి తమకు కావలసిన రచనలను ఏరుకొనడానికి అతడు ఒప్పుకొని సంతకంచేసి పంపడానికి అంగుళం వెడల్పు పైపుచేసిన కాయితపు పీలిక ఒకటి పంపుతారు. గొడుగు పూర్తిగా బోయిదే అయిపోయింది సరే, ఆ పుస్తకం రూపరేఖలనయినా చూతునా అంటే, కాచిన ఇనుముపై పోసిన నీరులాగ ఆకథ అక్కడే ముగిసింది కాని, ఆయన-ఆ సంపాదకుడు-పుస్తకం పంపే ఆ దురభ్యాసాన్ని, ఆ చాపల్యాన్ని పెట్టుకోలేదు.

నా ప్రత్యేకవ్యాసం తుది ప్రూఫును తిద్దడంకోసం నా వద్దకు పంపాలనే నిబంధనను నేను పెట్టుకొనడంమాత్రమేకాక, ఆ ప్రూఫుచేరిననాడే తక్కిన పనులన్నీ పక్కకుతోసి, దానిని తిద్ది తిప్పిపంపే జాగ్రత్తలోను ఉంటాను. కొందరు సంపాదకులు ఈ నిబంధన ప్రకారం నడచుకొంటారు. "కొందరు ప్రూఫులు పంపడానికి తీరిక ఉండదండీ'' అంటూ కాలంపై సాకుచెప్పి తప్పించుకుంటారు. మరికొందరి ఆట చాల మజాగా ఉంటుంది. ప్రూఫులు నాకు పంపేటప్పుడో, లేక అంతకుముందో వ్యాసం ముద్రించడానికి ముద్రణ శాలకు సూచనయిస్తారు. ఒకసారి ఏమి జరిగిందంటే, ఏకారణం వల్లనో ప్రూఫులరెండు ప్రతులు నాకు వచ్చాయి. ఒకటి తిద్దిపంపాను. మరొకదానిని నావద్దే పెట్టుకున్నాను, పుస్తకం అచ్చయిందని విన్నాను. వాడుకప్రకారం నాకు పుస్తకంప్రతి రాలేదు. బజారులో ఒకప్రతి కొని నా వ్యాసం చూచాను. నాకు పంపినప్రూఫులో ఎన్నితప్పులున్నాయో అవన్నీ, కాదుకాదు అవే దానిలోనూ ఉన్నాయి! అంటే, పాలు పిండినతర్వాత దూడను వదిలేశాత్రం చేసినట్టయింది.

ఫైనల్‌ప్రూఫే నావద్దకు పంపవలసిందని నేను పునశ్చరణ చేసినా, దానిని అలక్ష్యం చేసి కొందరు మొట్టమొదటి ప్రూఫునే పంపుతారు. దానిని తిద్దడానికి కొన్ని గంటలు కాదు, కొన్నినాళ్లే కావాలి. అంతపొద్దు ఎక్కడ తేవాలి ?-అనుకుని, దానిని తిప్పిపంపి దయచేసి ఫైనలుప్రూఫు పంపండి అని వేడుకుంటే, అటుతర్వాత ప్రూఫే నావద్దకు రాదు. అర్జీ శివాయి జమాకు దాఖలయింది. (బుట్టదాఖలయింది.)

కొన్ని ప్రత్యేక సంచికలకూ వ్యాసాలు పంపుతాను. ఒకొకప్పుడు ఆసంచిక వెలువడిన పిదప కనీసం పదిహేను ఇరవైనాళ్లకులోపు ఎలాగూ కాదు-అది ఊళ్లో, పక్క ఊళ్ళలో అమ్మకమైనపిదపే నాకూ ఒకప్రతి అందుతుంది. తొందరపడితే ఆలోగా మరొక ప్రతిని కొనుక్కోవాలి. పోయినతూరి ఇలా అయిందని హెచ్చరిస్తే, మరుసటితూరి మరి నాలుగునాళ్ల ఆలస్యం. ఇంతేకాక కొందరు సంపాదకులు తమ ప్రత్యేకసంచికలను రెండు రకాల కాయితంపైన-మోటుకాయితంపైన, నునుపుకాయితంపైన ప్రకటించడం కద్దు-ఇది

ఇప్పటిసంగతి కాదు; యుద్ధానికిముందు కథ. రచయితలకు-నాకుకూడా-పంపేవి మోటు కాయితం ప్రతులు. నునుపుకాయితం ప్రతులు కొన్నో ఎన్నో అమ్మకానికి, తక్కినవి ముఖంచూచి వేసే పీటలాగ తమకు కావలసినవారికి ఇవ్వడానికి. ఈ పద్ధతిచూస్తే కుళ్లిన గుమ్మడికాయను ఏంచేద్దాము; గేదెకు వేయి; గేదె తినదు; సరి కరణానికి ఇచ్చేయి-అనే సామెత జ్ఞాపకం వస్తుంది. పడవకు పనికివచ్చే కలపను గడియమానుకోసం నరకరాదని భావించవలసింది సంపాదకులు. అయితే ఏమిచేద్దాము? కళ్ళకన్నా కనుబొమలుపైన అన్నట్టు సంపాదకులు ఎప్పుడూ అత్తగారు, రచయితలు కోడలు.

ఇవే కాదు, ఇంకా కొన్ని అనుభవా లున్నాయి, వీటికన్నా పెద్దవి. వాటిని చెబుదామంటే, గుడ్డిపంతులుగారూ నమస్కారం అని కయ్యానికి కాలుదువ్వినట్టు అవుతుంది; వద్దనుకుంటే గాయం జ్ఞాపకాన్ని మచ్చ రెచ్చగొడుతుంది. అటూ ఇటూ వున్నాయి అని ఇక్కడ 'సూతఉవాచ' అనే పనే చేస్తున్నాను.

కట్టకడపటిసంగతి-ఆయుష్కాలం ఎలాగూ బదికి ముగించాలి. గడియారపుగిన్నె నీటిపైన తేలేంతకాలం ఆడుతూ ఉండాలి. అస్తమయం అయ్యేవరకు పాటుపడుతూనే ఉండాలి, కలంతప్ప మరొక పనిముట్టు అలవాటులేనివాడు దానినే వాడుతూఉండాలి అనేది సహజమైనప్పటికీ నా ఆ అనుభవాలన్నీ మనస్సులో మెదిలేటప్పుడు ఒక్కొకసారి నాకు ఈవిధంగా అనిపిస్తుంది - [1] nolo episcopari

చెప్పడంకన్నా చెప్పకపోవడం ఎంతమేలు!
తంతి చెవి తిప్పితే, సూదికి తిప్పటం
వ్రాయడంకన్నా వ్రాయకపోవడం ఎంతో మేలు
చెరలో ఘంటం, గాలానికి నీరాటం.[2]

అయితే, రచయిత బ్రతుకులో ఈవిధంగా రకరకాల పెక్కుతాకిళ్లు ఉన్నా, కొసకు కొలిచేవారే అలసిపోతారేకాని, కొలపాత్ర అలసిపోతుందా అని మనసుకుపట్టిన వ్యధ తొలగిపోగానే, కళ్ళను మండించే పొగే కళ్ళకు ఇంపుసొంపు కలిగించే కాటుక అయ్యేట్టు, పొడిచే ఆ అనుభవాలే అతనికి మళ్ళీ వ్రాయడానికి విస్మయకరమైన ఒకానొక ఉత్సాహం కలిగించి రచనాభివృద్ధిలో ముందుకు సాగేట్టు చేస్తాయి.

---

1. నోలో ఎపిస్కోపరి - ఇవి లాటిన్‌పదాలు. నేను బిషప్‌కాలేను అని ఈ మాటల అర్థం. అంటే బాధ్యతను స్వీకరించను అని తాత్పర్యం.
2. ఒరెయువదకిం తొరెయదిరలు మేలేసు!
తంతియా కివి తిరువె, సూజిగె రాట
బరెయువుదరిం బరియదిరలెనితో లేసు
సెరెయొళగె కంట గాళక్కె నీరాట.

# 4. రామరావణ యుద్ధం

## కువెంపు

పొద్దుగూకినప్పటినుంచి పొద్దుపొడిచేవరకు పెరడూరు మేళం భాగవతుల ఆట చూచివచ్చి వంటింటిపొయ్యివద్ద చలికాచుకుంటూ కాఫీతాగుతూ కబుర్లు చెప్పుకుంటున్నాము. మావూరివైపు వీధినాటకాన్ని "భాగవతులఆట" అని అంటారు. రాత్రి మేము చూచిన 'కాళగ' (పోరాటం) రామరావణులది; పసివారికి చూచినదెల్లా విడువకుండా అనుకరించడ మనేది ఒకవెర్రి! దానిప్రకారం మేమంతా-నేను, తిమ్మ, మాను, ఓబు, ఎంకు, వాసు, డాని, రాజి-ఆ దినం రామరావణుల 'కాళగ' ఆడాలని మసలతు (ఆలోచన) చేశాము. పసివారిలోకంలో ఆలోచించినదంతా కానే అవుతుంది. కాఫీ ఉప్పుమాలను బిరబిరా పొట్టలో పోసుకొని, ఇంటివెలుపలి ముంగిలికి బయలుదేరాము. అమ్మ, చిన్నమ్మ, అక్కయ్య వీరంతా "రాత్రి నిద్రచెడ్డారు, పడుకోండి" అని తిట్టారు. పెద్దవారు పిల్లలను తమలాగే అని భావించడం శుద్ధతప్పు. వారికి అలసట అయితే, మాకూ అలసటేనా? మా రామరావణయుద్ధం ముందర వారి నిద్దరా ఏమిటి? వారి మాటలను కసువు చిమ్మితోనే మూలకుతోసి, వెలుపలి ముంగిట్లోకి పరుగెత్తాము. ఒకరినొకరు ఆతురతతో ప్రోత్సహించుకుంటూ తోసుకొనిపోయాము. రాజి, గడపను ఎదుర్కొని పడింది. మెల్లగా లేచి, చుట్టూతా చూచి, ఎవరూ చూడనందువల్ల ఆచారం ప్రకారం వెక్కి వెక్కి ఏడవడం ఆపుకొని, మా గుంపును చేరుకుంది.

ఉదయభానుడు పచ్చని మలెనాడు గుట్టలకొననుంచి లేఎండను చిలకరిస్తున్నాడు. ముంగిటిలోఉన్న పెద్దజువ్విమానులోను, చింతమానులోను పక్షులగుంపు కలకలారావం చేస్తున్నది. లేతయెండ కొంచెం దట్టమైన చిగురుటాకుల నడుమ దూరి రావడంవల్ల మాను నీడ వలవలగా ఉంది. ఆ వలనీడే మా రంగస్థలమైంది. ఇప్పుడు మాయింటికి పోయిచూస్తే ఆ చింతమానూ మాయమైంది; ఆ జువ్విమానూ మాయమయింది. ఆనాడు నా జతలో భాగవతులఆట ఆడిన సోదరసోదరీమణులు అనంతవిశ్వంలో అణగి మాయమైపోయారు. 'పాదూరు' ఆనాటి జనం, ఆనాటి మనం, ఆనాటి ధనం అంతా అంతర్ధానమైనట్టు వున్నాయి. కాళపోయినా, దాని జ్ఞాపకం తెచ్చేట్టు ఉంది. కాలమహిమ! "కాలోఽస్మి లోకక్షయకృత్" అని శ్రీకృష్ణుడు చెప్పలేదా? "కాలాయ తస్మై నమః" ఆకాల మొకటి ఉండినది!

ఆ కాల మొక టుండినది! దివ్యమై తా నుండినది! బాల్యమై ఉండినది!
మన్ను పొన్నయి, రాయి పూవయి, నీరు అమృతమై,
ఇల్లు మేరువై, కవిశైలమే (శ్రీశైలమే) కైలాసమై,

కాదె నందనమై, నేలే నాకాన్ని నవ్వే కాల మొక టుండినది !
ఆ కాల మొక టుండినది ! దివ్యమై తా నుండినది ! బాల్యమై ఉండినది.

నేనుమాత్రం నా తాతముత్తాతలనయినా మరిచేను కాని, ఆ చింతమానును, జువ్వి మానునుమాత్రం ఎన్నటికెన్నటికీ మరువను. ఆ జువ్విమాను పోవడమే నాకొక పెద్ద చోద్యం ! మహాసమస్య ! అప్పుడు మేము ఆ జువ్విమాను రాక్షసప్రకాండం చూచి, దానిని నరకడానికి ఎవరికీ సాధ్యంకాదు, తోట అవతలఉండే భూతానికికూడా సాధ్యంకాదు అని అనుకొని సంతోషించేవాళ్లం. అయితే, విధివిలాసం ! ఆనాడు అసాధ్యమని తోచినది ఈనాడు సాధ్యమైంది. ఆనాడు సాధ్యమైనదిమాత్రం ఈనాడు అసాధ్యంగా పరిణమించింది.

ఆ చింతమానుకింద, జువ్విమానుకింద ఎంతసొగసైన ప్రాతఃకాలాలను గడిపాము ! ఎన్నిసార్లు మా జీవితభవిష్యత్తువలను మాకు తెలియకనే నేశాము ! లేతయెండలో నేలమీద పొడుగ్గా పడుకున్న మా నీడలను కొలిచాము ! కొలవడం పూర్తికాకపోవడం అలా వుండనీ ! ఎన్నిసార్లు ఒక్కొరొకరి నీడల తలలను తొక్కి పోట్లాడుకున్నాము ! ఆహా ! ఆ ఇంపైన సన్నివేశాలను జ్ఞాపకపరచుకుంటే, "బాల్యమే పోయావా ?" అని ఎదలో లోపలే రోదించి మరగిపోక ఉండడంలేదు.

జువ్విమాను నీడ 'రంగస్థలం' చేరినపిదప రామరావణయుద్ధానికి మున్నుడివంటి సంభాషణ ప్రారంభమయింది. మొదట ఎవరెవరు ఏఏ పాత్రలను ధరించాలనే ప్రబలమైన చర్చ జరిగింది.

తిమ్ము "నేను రాముని 'పార్ట్' వేస్తాను" అని హఠం పట్టాడు. ఓబు (కొంచెం కిలాడి) తిమ్మమాట విని "జేనెడు వున్నాడు. వీడికి రామునివేషమంట !" అన్నాడు.

ఎంక్టు దానిని సమర్థిస్తూ "ఔనురా, తిమ్మన్నయ్యా, నిన్న భాగవతుల ఆటలో రామునివేషం వేసినవాడు భీమునిలాగ ఉంటినాడు" అన్నాడు.

రామునివేషం హక్కునిర్ణయం కావడానికిముందే, వాసు నేను లక్ష్మణుడవుతా నన్నాడు. మరి ఓబు "ఒక్కమణుగు తూకమన్నాలేవు, లక్షమణుడౌతాట్ట ! ఒరేయ్ వాసూ, నీవు హనుమంతుని పార్టుకు లాయక్కు ! నీముఖంకూడా అలాగే వుందోయ్" అన్నాడు.

వాసుకు ఎప్పుడూరానికోపం వచ్చి ఓబునుకొట్టడానికి పోయాడు. అయితే వాసు కోపం కన్నా ఓబు రెట్ట బలమైంది; పెట్టుపడగానే కోపం పరుగుతీసింది.

అంతలో నేను (ఊరికే వుండాలా వద్దా) రాజితో "రాజీ, నీవు లంఖిణిపార్టు వేయవే' అని ఆపుకోలేక నవ్వాను. రాజి తనకు లంకిణివేషం వద్దనిచెప్పే కోపం హడావుడిలో సాక్షాత్తు లంకిణియే అయి నోటికివచ్చినట్టు నాపైన తిట్లవర్షం కురిపించింది.



మాను (వట్టి అల్లరిపిల్లవాడు) రాజిని మరీ ఉడికిద్దామనుకొని, ఒకవిధమైన వెక్కిరింపు గొంతుతో "ఓహో ! మరేమిటి ? నీకు సీతపార్టు ఇస్తారూ అని ఆశపడుతున్నావా ఏమోయ్, ఈ పిల్లలకు ఇప్పటినుంచే మొగుళ్ళయోచన" అన్నాడు.

సీతవేషం ఆశించిన రాజిముఖం అప్పుడే హనుమంతునిముఖం అవుతూవచ్చింది. అంతలో ఓబు "దాని మొగమైనా బాగుందా ? తిమ్మూ, నీవే చెప్పవోయ్, దానిమొగం ఏవరివేషానికి లాయక్కని" అని అంటూ గంతులువేస్తూ నవ్వాడు.

తిమ్ము రాజిముఖంవైపు కొంచెంసేపు తీవ్రంగా చూచాడు. రాజి ముఖం రెండు చేతులతో మూసుకొంది. అయినా తిమ్ము ఓబువైపు తిరిగి "కాదోయ్ ఓబూ, నీవు ఏవేషం వేస్తావో ఆవేషం చెల్లెలు పార్టుకు రాజే సరైంది" అన్నాడు.

అందరూ గొల్లుమని చప్పట్లుకొట్టి నవ్వారు. ఓబుకు ముఖంకొట్టివేసినట్టయింది. కొసకు అందరమూ మానువే రామునిపార్టు వేయాలి అని నిర్ణయించాము. దానియే సీతపార్టు వేయవచ్చునని కొందరు సూచనచేశారు. అయితే నాకదేమో నచ్చలేదు. దానికి మాను పినతండ్రి. అందువల్ల దాని మానుకు కూతురు అయినట్టయింది. అలా అన్నప్పుడు, మాను రామునివేషం వేస్తే దాని సీతవేషం వేయడం నాకు సరిపోలేదు. కొసకు ఓబు ఒక సంజాయిషీ చెప్పాడు : ఆటలో రాముడు, ఆటలో సీత; అందువల్ల ఫరవాలేదు అని. నాకూ వాని సిద్ధాంతం మనస్సుకు ఒప్పింది, హూఁ అన్నాను.

కొసకు అటుపడి ఇటుపడి రావణుని పార్టు నాపైనపడింది. నాకేమో ఎలాగైనా రావణునివేషం వదలివేద్దామని ఆశ. అందువల్ల నాకు తొమ్మిదితలలు తెచ్చిపెడితేకాని నేను రావణుడిని కానేకాను అని మొండికెత్తాను. సూత్రధారుడైన మానువేమో కోపపడి పోయాడు. దానికికూడా చాల ఉద్వేగం కలిగింది - తనసీతపార్టు రావణుడులేక ఎక్కడ నిలిచిపోతుందో అని.

ఓబు రావణునికి పదితలలు లేనేలేవని నిరూపించడానికి చాల ప్రయత్నించాడు. నేను వాడికి సందుఇచ్చేవాడినా ?

"కళ్లు ఇంకిపోయేయేమిరా నీకు ? నిన్న భాగవతుల ఆటలో రావణునికి పదితలలు ఉండలేదేమిరా ?" అని కోపంతో అన్నాను.

ఆవేళకు, నా దురదృష్టానికి సరిగ్గా, వెనుకటిరాత్రి రావణునివేషంవేసిన సీనప్పయ్య గారు దూరంగా పోతూవుండడం కనిపించింది. ఓబు వారినిచూచి "చూడండి, అందరూ చూడండి, నిన్న సీనప్పయ్యగారే రావణుడయి ఉన్నది. వారికి పదితల లున్నాయా ? ఒక్క టయినా పూర్తిగాలేదు," అన్నాడు.

నిజానికి సీనప్పయ్యగారికి ఒక్కతలకూడా పూరా లేదు. ఏమిటో జరిగి కొంచెం లొత్తపోయింది. నాకేమో బలే పేచీవచ్చింది. ఓబు ప్రత్యక్షప్రమాణంముందు నా ఆట సాగలేదు. రావణుడు కావడానికి ఒప్పుకున్నాను.

నాకు రావణునివేషం ఇవ్వడానికి ముఖ్యకారణుడైన ఓబుమీద కసిపెట్టుకొని బదులు తీర్చుకున్నాను. అది ఎలాగంటారా ? ఓబు హనుమంతుడైతే నేను రావణుడిని అవుతాను, లేకపోతే లేదు అని హఠంపట్టాను. దాని లోగుట్టు వేరే. ఏమిటి అంటారా ? ఓబు హనుమంతుడైతే రావణునిమీదికి యుద్ధానికి వస్తాడు. అప్పుడు వాడిని కొట్టడానికి మంచిసమయం దొరుకుతుంది అని.

ఓబు హనుమంతుడయాడు. (కొత్తగా ఏమీకాలేదు !) బలాత్కారంతో రాజికి లంకిణి పార్టు ఇచ్చాము. మాదంతా ఒకే మందు. రాజి లంకిణిపార్టు వేస్తే మా జట్టు చేర్చుకుంటాము; లేకపోతే దాని జట్టు వదలివేస్తాము అని అందరం చెప్పివేశాము. పసిపిల్లల విషయంలో జత వదలడం అంటే, దేశబహిష్కరణంకన్నా కఠినమైనశిక్ష. రాజి మనసులేని మనస్సుతో ఒప్పుకుంది; లంకిణి అయింది.

రామునిపార్టు అయింది; సీతపార్టు అయింది; హనుమంతుని, రావణునిపార్టులూ అయాయి. లంకిణికూడ చిక్కినట్టే అయింది. నేను రావణుణ్ణి; మాను రాముడు; దాని సీత; ఓబు హనుమంతుడు; రాజి లంకిణి; ఇక మిగిలింది ఎవరు ?

అప్పుడు మాకు వాల్మీకిరామాయణమే ప్రమాణంగా వుండలేదు. అవసరమైతే సొంతంగా ఒక రామాయణం రచించేవాళ్ళం. ఎందుకు రచించగూడదు ? కోటానుకోటి రామాయణాలు లేవూ ? మా రామాయణం లుప్తమైన రామాయణాలలో ఒక్కటి !

న్యాయంగా చూస్తే రామాయణంలో భీముడు రాడు. అయినా జేనెడుపొడుపు వాసు గాడు భీముడవుతానని హఠంపట్టాడు. మేము ఎంతెంతో చెప్పాము, రామాయణం భీమాయణం కాదని. అయితే ఏమిచేద్దాం ? వాడికి భీమునిపార్టంటే చాలఖుషి. ఎప్పుడో ఒకసారి భాగవతుల ఆటలో భీముడు పొరిబియ్యం, వేయించిన సెనగపప్పు బొక్కుతుండడం చూచాడు. భీమునివేషం వేసినప్పుడెల్లా వేయించిన సెనగపప్పు, పొరిబియ్యం (బొరుగులు) దొరుకుతాయని వాడి మహదాకాంక్ష ! ఆదేది రామాయణంకానీ, శాకుంతలంకానీ, చంద్రహాసకానీ, మరేదైనాకానీ వాసుగాడేమో భీమునిపార్టు వేసేతీరాలి !

మాకందరికీ మంచిగొడవ వచ్చిపడింది, భీముణ్ని రామరావణయుద్ధంలో ఎలా తీసుకొనిరావడము అని. రామాయణంలో భీముడు రాడంటే వాసు వినలేదు; అంతటితో ఆగక వచ్చేతీరుతాడని సాధించాడు. మాలో ఒక్కరూ రామాయణం చదువలేదు; మేము ఆడిందే రామాయణం ! అందువల్ల వాసు చెప్పిందే రామాయణం కావలసివచ్చింది. సరి. అభినవ వాల్మీకిఅయిన వాడినే అడిగాము—రామాయణంలో భీమునివేషం తీసుకొని



రావడం ఎలాగుఅని. వాడూ కొంచెం యోచించాడు. కొత్త కవిత చెప్పాలంటే పాపం, ఆవేశం రావాలికదా మరి ! కొనకు ఆవేశం వచ్చింది; రామరావణులిద్దరూ యుద్ధానికి బయలుదేరడానికిముందు భీమపూజచేసి, కావలసినన్ని భక్ష్యభోజ్యాలను నివేదించాలని వాసు సలహా యిచ్చాడు.

అయ్యో ! వానివల్లకాదు ! భక్ష్యభోజ్యాలంటే యేమిటి ? బొరుగులు; పప్పులు. ఏమైనా, అభినవ వాల్మీకులవారు చెబుతున్నప్పుడు, కాదు అనడం అవుతుందా ? ఊఁ అని సమ్మతించాము. ఇక మిగిలినవారు ఎంక్టు, తిమ్ము. వారికి పార్టు ఇయ్యకపోతే వాళ్లేమీ ఊరకేఉండరు. రామాయణం నిలిపివేయవచ్చుననే భయం వేరే. ఎంక్టు విభీషణు డయ్యాడు; తిమ్ము కుంభకర్ణు డయాడు (తన స్వభావానికి తగినట్టు !). మొత్తంమీద రామాయణంలో ఉండేపాత్రలకు మా పాత్రలను జోడించడానికిమారు, మా మనస్సుకువచ్చిన పాత్రలను ఏరుకొని కొత్తరామాయణం తయారుచేశాము.

రామరావణులు యుద్ధానికి బయలుదేరడానికిముందు "భీమపూజ" ఆరంభమైంది. వాసు (మా గాలిభీముడు) చింతమాను వేళ్లమీద రాతివిగ్రహంలాగ కూర్చున్నాడు. రామరావణులిద్దరూ ఒట్టుగా (కలిసి) వచ్చి పూజచేయాలా, అథవా విడివిడిగా చేయాలా అని అభినవవాల్మీకిని అడిగాము. భీముడైన వాసు "విడివిడిగానే వచ్చి పూజచేయాలి" అని అనతి ఇచ్చాడు. ఇద్దరూ ఒక్కటిగా వచ్చి పూజ చేస్తే, నైవేద్యం ఎక్కడ తగ్గిపోతుందో అని వాడికి పెద్దభయం. పూజకు మొదట రాముడు రావాలా ! రావణుడు రావాలా అని అడిగాము. వాసు కొంచెం చీకాకుపడ్డాడు; అట్లాగే యోచనచేసి, "రావణుడే మొదటరానీ" అన్నాడు. వనవాసంలోవున్న రామునికి ఎక్కువ తినుబండారాలు చిక్కడమైనా ఎలాగా ? లంకాధిపతి అయిన రావణుడైతే రాక్షసుడు, పెద్దకడుపు, పెద్దచేతులు, పెద్ద పళ్లెం ! అందువల్ల తినుబండారాలు హెచ్చుగా దొరుకుతాయని యోచించాడు.

వాసు అంతరంగం తెలుసుకున్న ఓబు ఒక్కఉపాయం వెదికాడు. నేనే కదా రావణుణ్ణి. నా చెవిదగ్గరికివచ్చి ఒకటిరెండు గండుచీమలు, గొబ్బిచీమలు, చెదలు, మిడతలు, కుమ్మరిపురుగులు వీటిని నైవేద్యానికి తీసుకొనిపొమ్మని గుసగుసగా అన్నాడు. ఎందుకంటే, రావణుడు మాంసాహారి గదూ ! ఉపాయం సూచించిన ఓబువే ఈ పురుగులను "సప్లై" చేశాడు. రావణుణ్ణయిన నేను పురుగులను ఆకులో మూసుకొనిపోయి భీమదేవుని ఎదుట నిలబడ్డాను. అది రావణుడు చేసేపూజ అయినప్పటికీ, హనుమంతుడైన ఓబు దగ్గరే నిలబడ్డాడు.

వాడు భీముడైన వాసుకు "దేవుడు ఎప్పుడూ కళ్లుమూసుకొనే ఉండాలి" అన్నాడు.

వాసు కళ్లుమూసుకొన్నాడు. రావణుని పూజ ప్రారంభమయింది. నైవేద్యం దేవుని ముందు పెట్టాడు. దేవునికి తినమనీ చెప్పాడు. వాసు ఇంకా కళ్లుమూసుకునే ఉన్నాడు.

మాకందరికీ పొట్టచెక్కలయ్యేంత నవ్వు. అయినా, రెండుచేతులతోను నోరుమూసుకొని పట్టుకొనిఉన్నాము. భీమదేవుడు నైవేద్యానికి చేయివేశాడు. కళ్లుమూసుకొనివున్న అతని మనోవీధిలో తనముందు బొరుగులరాశే తోచివుండవచ్చు. వాడి సంతోషానికి పారమే లేదు!

ఓబు చీమలను సరిగా చంపలేదు. ఒక మిడతకూ అరకొరప్రాణం వుండినది. భీమదేవునికి తగిన నైవేద్యం! వాసు చెయిపెట్టాడో లేదో నొప్పితోను, కోపంతోను కొట్టుకొంటున్న గండుచీమ ఒకటి కుట్టింది! అనాహూతమే అనాహూతం! వాసు నిజమైన భీముడే అయివుంటే మాకంతా ఏగతిపట్టేదో దేవుడికే తెలియాలి. కొంచెం ఊహిస్తే రామరావణయుద్ధమే జరిగివుండేది కాదు, అనవచ్చు. వాసు కేరుమని కిర్లుకొని, తుపాకిమందుకు నిప్పుతగిలినట్టు లేచి నిలబడ్డాడు! ఓబు వట్టి అయిలు—వెర్రిబాగులవాడు; ఎప్పుడు ఎలా నడుచుకోవాలని వాడికి తెలియదు. వాసును చూచి "భీముదేవా, కల్లయిన దేవుడు అల్లలాడరాదు. కూర్చోండి! కూర్చోండి!" అని అరుస్తూ నవ్వడం ప్రారంభించాడు. భీముడు గోడుగోడుమని ఏడ్వసాగినాడు. దాని సీత అయినది సీతతనం వదలి పరిగెత్తివచ్చి భీముని నోరుమూసిపట్టుకొని ఏడవవద్దని ఎంతచెప్పుకున్నా భీముడు మరొక మాట వినలేదు. భీమునిగర్జన అంతరిక్షాన్ని అందుకుంది. ఇంద్రుడు గాభరాపడివుంటాడు! రాముడైన మానుకూడ పరిగెత్తివచ్చి భీముణ్ణి సమాధానపెట్టాడు. రాణి మానునుచూచి "నీవు ఎట్లాటి రాముడోయ్! గండుచీమ కుట్టినదానినికూడా వెంటనే నయంచేయలేవు!" అని చెప్పి "వాసన్నయ్యా ఏడవకు!" అని సమాధానపెట్టింది. వాడేమో బొబ్బలు పెట్టాడు! భీముని గర్జనలకు అడ్డం ఉందా? ఆకాశానికి అంటిన భీముని గర్జన వంటయింటికి చేరడమొక పెద్దమాటనా? పిన్నమ్మ గాభరాపడి చేతిలోపట్టుకున్న తిరుగమోత గరిటెతోనే ముంగిట్లోకి వచ్చారు. వేడివేడి చారులో అద్దిన ఆ గరిటె ఇంకా ఆవిరి కక్కుతూనే వుంది. పాపం! ఆమెకు మా రామాయణం పూర్వోత్తరాలు ఏమి తెలుసు? "కుశాలు (తమాషా) పోయి అసాలే (ప్రమాదం) అయింది. ఆటకు మారుగా అటమటించడం అయింది. రావణుడైన నన్ను రాముడు కొట్టడానికి మారుగా పిన్నమ్మ చేత్తో గుద్దారు. వెక్కివెక్కి ఏడుస్తున్న అభినవ వాల్మీకిని పిన్నమ్మ వంటింట్లోకి లాక్కొనిపోయారు; అక్కడ సరైన "భీమపూజ" అయివుంటుంది!

భీముడుపోతే రామాయణం నిలిచిపోతుందా? మేమేమో రామరావణయుద్ధం చేసే తీరుతామని మొండికెత్తాము. ఆట ప్రారంభమైంది. ఎక్కడ? లంకలో కాదు! జువ్వి మానుకింద వలవలగావున్న చల్లనినీడలో! భీమపూజోపాఖ్యానం కొసవరకు అయినతర్వాత సేతుబంధన మయింది. సేతుబంధనానికి రావణుడు, కుంభకర్ణుడు, లంకిణి అందరూ సహాయంచేశారు! సమయానుగుణంగా రాముడు మొదలయినవారు కోతులయారు. హనుమంతుడైన ఓబు చిన్నచిన్న గులకరాళ్లను తీసుకువస్తుండడం చూచి నేను "నీవు ఎటువంటి హనుమంతుడివోయ్! వడలలాంటిరాళ్లు తెస్తున్నావే!" అన్నాను.



హనుమంతుడు కైలాసపర్వతాన్ని ఎత్తడానికి పోయి, చేతులు ఇరికించుకొనడం (మా రామాయణం ప్రకారం) అభినయించక తప్పదని తిమ్మ మొండిపట్టు పట్టాడు. సద్యకు (అప్పటికి) వాడే శివుడయ్యాడు. లంకిణి అయిన రాణి పార్వతి అయింది. శివుడు, పార్వతి ఇద్దరూ ఇల్లు కట్టడానికి కొత్తగా తెప్పించి వేసిన బండరాళ్లమీద కూర్చున్నారు. ఆ బండరాళ్లే కైలాసమయింది. హనుమంతుడు కైలాసం వద్దకుపోయి దానిని ఎత్తేటట్టు నటించి సందులో చేయిపెట్టాడు. శివుడు కాలివ్రేలితో కైలాసాన్ని నొక్కాలి కదా! అలాగే తిమ్మ బండను గట్టిగా నొక్కిపట్టాడు. ఓబుకు చాల నొప్పి అయి "రామ రామ! రామ రామ!" అంటున్నవాడు అకస్మాత్తుగా అలాగే గొంతుమార్చి "తిమ్మ! తిమ్మ! చేయి! చేయి!" అని కేకలువేశాడు. వ్రేలి చర్మం లేచిపోయింది. అయినా శివుడు కైలాసాన్ని ఇంకా బలంగా నొక్కాడు. హనుమంతుని కేకలు నటన అనే భావించి తిమ్మ మరింత గట్టిగా నొక్కాడు. ఓబు గోడుగోడున ఏడ్చాడు. కళ్లలో నీరు ఉబికి వచ్చి పారింది. దగ్గరవున్న మేమందరం వాడి అభినయకౌశలం చూచి మెచ్చుకొన్నాము. అంత సహజంగా ఏడవడం ఏ నటశ్రేష్ఠునికైనా సాధ్యమా!

దైవకృపవల్ల మా రామాయణంలో కైలాసం కింద చేతులు ఇరుక్కొని కేకలు పెట్టినవాడు హనుమంతుడు; రావణుడు కాడు; రావణుడై వుంటే ఈ కథ వ్రాయడానికి నాకు చేతివ్రేళ్లు వుండేవికావు; నా అదృష్టం మంచిది.

ఓబు కేకలు వేశాడు, తిమ్మ, నొక్కాడు; హనుమంతుడు అరిచాడు, శివుడు నొక్కాడు. నిలబడివున్న మేమందరం నటనకు చాల సంతోషించాము. మా పుణ్యం, రామాయణంలో ఉరితీసే పద్ధతి లేదని తోస్తుంది. అది రామాయణంలో ఎక్కడైనా వుండి వుంటే, మాలో ఎవడైనా ఒకడిగతి ముగిసేది. ఎవడైనా ఎందుకు? నా గతే పూర్తి అయ్యేది. ఎందుకంటారా? నేను రావణుణ్ణి. ఈకాలంలో ఓడిపోయిన రాజులను ఉరి తీయడమే ధర్మం కదా! అలాగే రావణుణ్ణి గెలిచిన రాముడు ఊరికే వుండేవాడా? రావణుణ్ణి ఉరితీయనే తీయించేవాడు. అంటే నా కథ ముగిసేది.

ఓబు కేకలు విని అక్కడెక్కడో వక్కనుంచి పిన్నయ్య పరుగెత్తి వచ్చారు. వచ్చినవారు దూరంగా నిలబడి "ఏమిటర్రా అది, గలాటా!" అన్నారు. తిమ్మ బండను బలంగా నొక్కుతూ "ఏమీ లేదు పిన్నయ్యా! రామాయణం ఆడుతున్నాము! హనుమంతుని చేతులు కైలాసంకింద చిక్కుకొన్నాయి; శివుడు అదుముతున్నాడు?" అన్నాడు. ఓబు మాత్రం "అయ్యయ్యో! అన్నయ్యా, చచ్చాను! చచ్చాను!" అని దీర్ఘాలు తీశాడు.

పిన్నయ్య పరుగుతో వచ్చి కైలాసంమీద కూర్చుని కొలువుచేస్తున్న శివపార్వతులను ఇవతలికి లాగి కైలాసాన్ని ఎత్తారు; ఓబు చేతులు వెనక్కు లాక్కున్నాడు. చర్మం లేచిపోయి చేతివ్రేళ్లు రక్తమయమయి వున్నాయి. పిన్నయ్య అందరికీ చింతబరికెతో రెండు రెండు దెబ్బలు వడ్డించి, హనుమంతుని చేతులకు చికిత్సచేయించడానికి వాణ్ణి ఈడ్చుకొనిపోయారు. చలికాలం! ప్రాతఃకాలం! చింతబరికెల దెబ్బలు! మీరే ఊహించుకోండి!

రామరావణయుద్ధం ఇంతతోనే ముగియలేదు. నేను మానుతో "నీవు ఎటువంటి రాముడోయ్! చేతగాని రాముడివి! నీ భక్తుడు హనుమంతుడు నొప్పితో ఒర్లితే నీవు వచ్చి విడిపించాలా వద్దా? రాయిలాగ నిలబడి చూస్తూవున్నావు! నీ మూలంగా భాగవతుల ఆట ఆడనట్టే అయింది!'' అన్నాను, దెబ్బలుతిన్న కోపంతో.

మానుకు కోపం వచ్చింది. నామీద కలియబడ్డాడు. నాకూ, వాడికీ పోట్లాట అయింది. న్యాయంగా కథప్రకారం చూస్తే రావణుడు ఓడిపోవాలి. నిజానికి నేనే బలంగా వున్నాను; రాముడు పడిపోయాడు; రావణుడు గెలిచాడు. కింద పడిన మాను ఒంటిమీద నేను బలంగా అదిమి కూర్చున్నాను; వాడు ఏడుస్తూ "ఒరేయ్! పుట్టూ, నేను రాముణ్ణిరా! నీవు రావణుడివి! వదులు, నామీద నీవు కుర్చోరాదు!'' అన్నాడు.

నేను మరింత గట్టిగా వాడి శరీరాన్ని కుదిపించి "పోరా నీ రామాయణానికి నిప్పులు చెరగా! నా రామాయణంలో గెలిచింది నేనే!'' అన్నాను.

కిందపడిన రాముణ్ణి విడిపించడానికి లంకిణి, సీత, లక్ష్మణుడు, కుంభకర్ణుడు, విభీషణుడు—అంతమందీ వచ్చారు. అయినా నేను వెనక్కు తగ్గలేదు. కొసకు కుంభకర్ణుడు పరుగెత్తిపోయి మా జీతగాడు లింగణ్ణి పిలుచుకొని వచ్చాడు. వాడు రావణుణ్ణి పట్టుకొని ఇవతలికి లాగి, రాముణ్ణి విడిపించాడు. అయినా, రావణ వధకు బదులుగా రామవధ జరుగలేదు.

ఆనాడు మేము ఆడిన కొత్త రామాయణం ప్రకారం రామరావణ యుద్ధంలో రాముడే ఓడిపోతాడు! భీముడు గంధ్రచీమతో కుట్టించుకొనిపోతాడు! హనుమంతుడు కైలాసంకింద చేతులచర్మం ఒలిపించుకుంటాడు! రాముడు పడిపోయాడు;! రావణుడు గెలిచాడు!—ఇదే మా "రామ రావణుల యుద్ధం!''

# 5. కోకిల

## వి. కృ. గోకాక

అనుభవమే
అన్ని విషయాలలో లాగే సౌందర్యానుభవంలోను మన పూర్వులు పొందిన
మనకు పరంపరగ వస్తున్నది. దీనిని మనం కేవలం శాబ్దికంగా స్వీకరించేటట్టయితే
ఈ సంప్రదాయంలో కొత్తదనాన్ని చంపివేసే శక్తి వస్తుంది. ఈ సంప్రదాయం వెనుక
వున్న అనుభవాన్ని చూచి దానినే మనం అనుభవించేటట్టయితే అవకారి కావడానికిమారు
ఉపకారి అవుతుంది. కొత్తదాన్ని కమరిపోయేట్టు చేయదు. అయితే పాత కొత్తతో చేరి
కనిపించే చిరనవీన సౌందర్యాన్ని అది వ్యక్తపరుస్తుంది. సంప్రదాయ సౌందర్య సంపదను
కనిపెట్టేవారికి పరిశోధకుని చింత-జిజ్ఞాస-కావాలి. యుగపురుషులయ్యేవారికి సంప్రదాయ
ప్రయోగాల పదును తెలిసిఉండాలి.

సంప్రదాయం వెనుక ఉన్న అనుభవాన్ని కళోపాసకుడు కనిపెట్టినప్పుడు, వానికి
అమెరికాను కొత్తగా కనిపెట్టిన కొలంబసుకు కలిగిన ఆనందంకన్నా హెచ్చు ఆనందం
ఎలా కలుగుతుందో నేనిక్కడ ఉదాహరిస్తాను. అప్పుడు నేను జ్యూనియర్ బి. ఏ.
క్లాసులో చదువుతూ కర్నాటక కాలేజి విద్యార్థి వసతిగృహంలో ఉండేవాడిని. కాలేజినుంచి
ఆడవి చేరడానికి దగ్గరలో అనేక రాజమార్గాలున్నాయి. సప్తాపురందారి పట్టుకొని దినమూ
తెల్లవారి తిరుగాడడానికి పోయే పరిపాటిని నేను పెట్టుకొన్నాను. అప్పుడే వాఙ్మయ
ప్రపంచాన్ని నేను విమర్శాత్మకంగా చూడసాగాను. హళగన్నడం పఠించడం కూడ
అప్పుడే ఆరంభమైంది. ఆంగ్ల విమర్శరీతీ అప్పుడే నా మనస్సును పట్టివేసింది. అంతే
కాక "గుంపు" చెలికాండ్రను కొత్తగా కలుసుకొన్న నాకు సాహిత్య క్రాంతి మబ్బు బాగా
కమ్మింది. ఇలాగయి ప్రతిదినం తిరుగాడడానికి పోయేటప్పుడు నా ఆలోచనలు క్రాంతి
మయంగా ఉండేవి. హళగన్నడం అలంకారా లన్నిటినీ అవమానపరిచే స్వభావమూ నాకు
ఉండేది. మహా కావ్యాలలో కనిపించే అవాస్తవిక వర్ణనలు చదివి - ఈ కవులు అనుభవం
పొంది వ్రాయలేదు. తాము వ్రాసినదాన్నే అనుభవం పొందామని ముందు నుంచి తమను
తామే మోసగించుకొన్నారు - అని వారిని హిహ్హిహ్హీ అని పరిహసించేవాణ్ణి.

ఈలాటి ఆలోచనలతో మనస్సు నింపుకొని ప్రతిదినంలాగే ఒక తెల్లవారు జామున
తిరుగాడుతున్నప్పుడు ఒకపక్షి ఇంపైన ధ్వని నా చెవిలో పడింది. ఆ ధ్వనికి నేను
మైమరచాను. పక్షులు గానం చేస్తాయని చిన్ననాడు ఆంగ్లకవితలలో చదివి ఆ గానాన్ని
వినాలని విశ్వప్రయత్నం చేశాను. పక్షులు కలకలారావం చేసేవే కాని గానం చేసేవి
కావు. కొసకు నేను ఒక సాయంకాలం నిర్ధరించుకొన్నాను. నాకు పక్షిపాట వినబడనీ.

వినబడకపోనీ, దానిని గురించి నేడు నేను ఇంగ్లీషులో ఒక కవిత వ్రాయనే వ్రాయాలి; వ్రాయడానికి ముందు వెలుపలికి తిరుగాడడానికి పోయి పక్షిగానం వినడానికి ప్రయత్నించాలి! ఆప్రకారమే నేను తిరుగాడడానికి వెళ్లాను. వెళ్లేటప్పుడు పక్షిపాట వినడానికి ముందు "Oh! Independent! Free from cares of earth!" అనే పంక్తిని ఆనాడు వ్రాసే కవితలో వేయాలని మనస్సుకు వచ్చింది. ఏమైనా, పక్షిపాట వినడానికి ముందే ఆనాడు వ్రాసేకవిత రూపరేఖలు నిశ్చయమయాయి. దారిలోవుండే ఒక మానుమీద వాలి పక్షి ఒకటి కూత పెడుతూంది. గోల్డ్ స్మిత్ "పాడయి పోయినపల్లె" అనే కవితను చదివేటప్పుడు, ఆ కవి పిల్లవాడుగా వున్నప్పుడు ఒక చెట్టును ఆనుకొని నిలబడి పల్లె సొబగును చవిచూచే చిత్రాన్ని చూచాను. అవిధంగానే, నేనూ, చెట్టును ఆనుకొని నిలబడి, పక్షిగానం విన్నాను. ఆనందం కాకపోయినప్పటికీ, ఆనందమై భావనాపరవశుణ్ణయి వున్నానని నామట్టుకు నన్ను మోసం చేసుకొన్నాను. పక్షిపాట విని హర్షపులకితుడిని అయిన తర్వాత నేను నిజమైన కవి అయివుండాలి కదా! అప్పుడు నేను ఇంటికి పోయి దానికి ముందే మనస్సులో అర్ధాబర్ధంగా సిద్ధమయిన కవిత వ్రాశాను: ఇలా వుండినది చిన్ననాడు నా అనుభవం.

అందుకనే హళగన్నడకవులు కోకిలగానం వర్ణించడం చదివినవెంటనే నాకు తల తిరిగి పిచ్చిఎత్తేది. చిన్ననాడు నేను నన్ను మోసంచేసుకొన్నట్లు వీరిస్థితి అయివుండాలని నాకు సంపూర్ణంగా మనస్సుకు తెలిసిపోయింది. సంప్రదాయ శరణులై వారు ఆత్మవంచనకు పాల్పడ్డారని నా మనస్సు చెప్పేది. ఎవడో ఒక సంస్కృతకవి పక్షిగానం వర్ణించాడు. అప్పటినుంచి పంపరన్నాది కవులందరు కోకిలవెంటపడ్డారు.

ఈ విధంగా నా ఆలోచనలన్నీ క్రాంతిమయంగా ఉన్నప్పటికీ, ఆ తెల్లవారుజామున నేను పక్షిగానమంటే ఏమిటి అనేదాన్ని కనుక్కొన్నాను; ఆ గానానికి ముగ్ధుణ్ణయాను. ప్రతిదినమూ అదొకటి నాకు ఆనందవిషయమైంది. మరికొన్ని కారణాలమూలంగా తిరుగులాడడం నిలిపితే, ఆ దినమంతా నన్ను పక్షిపిలిచినట్లయి, మనస్సు బిణబిణలాడేది. ఈ విధంగా దినమూ ఉదయం అదేవిధమయిన పక్షిగానాన్ని అదేస్థలం చుట్టుపట్ల వినివిని దానికి నా మనస్సునే అమ్మివేసుకున్నాను.

అప్పుడు నా క్రాంతికారిత్వం మరొకదారి వెదకింది. గానమంటె కోకిలగానమని హళగన్నడకవులందరూ వర్ణించారు. వీరిలో ప్రతివాడూ కోయిలనుగురించి పదిపదిహేను శ్లోకాలనయితే వ్రాయనేవ్రాశాడు. ఒకడు కోయిలను గురించి వ్రాయగానే[1] "పుట్టుగ్రుడ్డు కూడి నిట్టలో (వాగులో) పడ్డట్లు"[1] ఈ వెట్టిబాగులవారంతా కోయిలను వర్ణించారు. వీరికి మరొకపక్షి దొరకలేదా? ఈ కవులకు చెవులే లేవా? కోయిల పంచమస్వరంలో పాడుతుందట. పాడనీ. అయితే ఇతరపక్షుల గానం వినకుండానే ఈ కవులు పంచత్వం పొందారే! వారిని చెవిపట్టుకునితెచ్చి ఇక్కడ నాతోపాటు తిరుగాడించవలసింది. అంటే,

1. బళ్లిగురుడరు కూడి హళ్లవనుబిద్దంతె.



ఎవరికీ వినిపించని కోయిలగానాన్ని ఎల్లవారూ వినదగిన ఈ పక్షిపాట ఎలా మీరుతుందనే విషయాన్ని వారికి చూపేవాణ్ణి. నా కావ్యంలో కవిగణవందితమైన కోకిలకు స్థానం ఉండదు. నేను విన్న పక్షిగానాన్నే వర్ణించి సాహిత్యంలో సత్యమైన అనుభవపుధ్వజాన్ని ప్రతిష్ఠిస్తాను. అసత్యాతిశయపరంపర చాలు.

ఈ విధంగా నా ఆలోచనలు పరస్పరం ఘర్షణపడ్డాయి. ఒంటిగా దినమూ తిరుగులాడడానికి పోయే నేను ఒకనాటి తెల్లవారుజామున నా స్నేహితుణ్ని పిలుచుకొని వెళ్లాను. అతనిని మనం రసికుడు అందాము. ఆ రసికుడు అప్పుడు సీనియర్ బి. ఎ. తరగతిలో చదివేవాడు. స్కాలరు; అంతేకాక హళగన్నడపు నుడితేనెను చాల చవిచూచినవాడు. వానిముందు నా ఈ ఆలోచన లన్నిటినీ చెబుతూ నడిచాను. కోకిలను, పాతకవులను తిట్టిపోసి, నేను విన్నపక్షిని, వ్రాయనున్న కావ్యాన్ని ప్రశంసించాను. రసికునిలోని కుతూహలం పెరిగింది. వినయశాలిఅయిన ఆ రసికుడు వాగుడుకాయఅయిన నా మాటలను నమ్మి చాలసార్లు అడ్డుతగులకుండా వినడంకద్దు. ఈసారికూడ నా నూతన పరిశోధనను కనుక్కోడానికి ఉత్సుకుడయ్యాడు. ఆ పక్షి అలవాటుగా అభిమానించేచోటు మేము సమీపించాము. సిద్ధంగాఉండమని నేను రసికునికి సూచనచేశాను.

"హూ—సి—హూ—
హో—హూ"

అనే ధ్వని చెట్టునుంచి వచ్చింది. ఆనందంతో నేను రసికునివైపు తిరిగిచూచాను. "ఇదేనా ఏమిటి నీవు విన్న పక్షి?" రసికుడు అడిగాడు.

ఔనని నేను సమాధానమిచ్చాను.

"అయ్యో! పిచ్చినాన్నా! ఇదే కోకిల!" అన్నాడు రసికుడు.

అప్పుడు నేను ఎగిరిపడ్డాను. "ఇది ఎలా కోకిల అవుతుంది? 'కుహూహూ' ఇత్యాదిగా ఇది ఎక్కడ కూస్తుంది?" అని నేను ప్రశ్నించాను.

"కోకిలేమో ఒక్కటే. కాని, దాని కూజితం వేరేవేరె జనానికి వేరువేరుగా వినిపిస్తుంది" అని రసికుడు చెప్పాడు.

అప్పటినుంచి నేను పరంపర-సంప్రదాయం-అంటే తక్కువ, పరిశీలన అంటే ఎక్కువ అనే తెలివిడిని వదలుకున్నాను. నిర్ణయబుద్ధి అనే గుర్రానికి ఇంతగా నియమాలనే కళ్లగంతలు వేస్తే చాలదు. సదా జాగృతమైన వివేకమనే కళ్లెం దానికి తప్పక ఉండాలి.

# 6. హంతకుని వేట

## నవరత్న రామరావు

నేను యడతొరె తాలూకాకు పోవడానికి కొన్నినాళ్లముందు అబ్బూరు గ్రామంలో జరిగిన భయంకర హత్యలను గురించి మొదలే చెప్పానుగదా ! ఆ హంతకులు, దొడ్డహైదన్న, పుట్టస్వామి అనే అన్నదమ్ములు సెషన్సులో తక్సీరు (నేరం) సాబీతుఅయి (రుజువయి) మరణదండన విధించబడ్డారు. తాము చేసుకొన్న అప్పీలు చీఫ్ కోర్టులో వజా అయినందున, విధించబడిన శిక్ష అమలుకావడానికి వారు మైసూరు జెయిలులో వేచిఉన్నారు. ఫాఁసీసజా (మరణశిక్ష) అమలుకావడానికి రెండుమూడునాళ్లమాత్రం ఉండగా వారు రాత్రి చీకట్లో తమ సాహసంతోనో, ఇతరుల కుమ్మక్కుతోనో తమకు కావలివున్న వార్డరును ఖూనీచేసి వాడు కాలికి చుట్టుకునే పట్టీలసహాయంతో జెయిలుకాంపౌండుగోడఎక్కి దూకి పరారి అయారు. వారు తప్పించుకొన్న సంగతి మరుసటిదినం తెల్లవారివరకూ పత్తాకాలేదు. తెలిసినతర్వాత చాల కోలాహలమైంది. డిస్ట్రిక్ట్ మ్యాజిస్ట్రేటు స్పార్క్స్ సాహెబ్ (దొరగారు) చాల శౌర్యంతో రిజర్వుపోలీసులను పిలుచుకొనిపోయి, జైలుకు రెండుమూడుమైళ్ళ ఫాసలాలో (దూరంలో) వున్న చెరకుతోటలలోదూరి తుపాకులుపేల్చి, చాల సాహసంచేశారని విన్నాను. సర్కారువారి మందుగుండువల్ల, పోలీసుల బూట్సువల్ల చెరకుగడలకు నొప్పయిందేకాని, మరేమీ ప్రయోజనంకాలేదు. అటుతర్వాత ప్రాణాలు దక్కించుకోదలచిన ఆ హంతకులు తమ జన్మస్థలం చేరి, అక్కడ తమవాళ్ళ సహాయంతో ఎక్కడో దాక్కొన్నారు; పగలంతా ఏటిఇసుకదిబ్బల మరుగుననో, చిట్టడవుల్లోనో ఉంటూ, రాత్రిళ్ల ఒక్కొక్కమారు ఊరికి ఆహారంకోసం రావడంకద్దు; ఒక్కొక్కమారు ఊరివాళ్లే ఆహారంతీసుకొని పోవడంకద్దు, అని బాత్మీ (సి. ఐ. డి. రిపోర్టు) వచ్చింది. స్పార్క్స్‌దొరగారు ఆ బాత్మీ మీద యడతొరెకు వచ్చి, చుట్టుపట్ల రెండుమూడునాళ్ల గుట్టపుస్వారీవారిని పరుగెత్తించారు. నేనూ వారితోపాటు తుపాకి చేతపట్టుకొని గుఱ్ఱమెక్కాను. తర్వాత దొరగారికి చాల వినయంతో చెప్పాను - ఈ హడావుడికి పట్టుబడేటట్టయితే వారు ఖూనీకోరులుకారు, వెట్టి వాళ్ళయివుండాలి. వాళ్ళను పట్టుకోవాలంటే మనకు నమ్మకస్తులైన సి. ఐ. డీ. లు కావాలి; అలాటి గూఢచారులు ఖరారైన బాత్మీఇవ్వాలంటే పరారి అయినవారి దగ్గరి వారితో సంబంధంపెట్టుకొని, వారి నమ్మకాన్ని సంపాదించవలసివుంటుంది. దీనికి కొంత వ్యవధి కావాలి; డబ్బూ కావాలి. జీవితాశవదలి ధూర్తులైన హంతకులను వేటాడడం పులి వేటకన్నా ప్రమాదకరమైన పని. ఈ హంతకులకు అన్నంపెట్టే స్నేహితులు ఆయుధాలను ఇవ్వకుండా వుండరు - అని.



కొసకు దొరగారు నా వాదాన్ని మన్నించి హంతకులను పట్టియిచ్చినవారికి 1000 రూపాయలు బహుమానం, పట్టుకొనడానికి సహాయంచేసినవారికి వారిసహాయానికి తగినట్టు ఇనాములను ఇచ్చేటట్టు సర్కారునుంచి మంజూరుచేయించుకొని జాహిరాత్ (ప్రకటనలు) చేశారు.

నాకు నగదుబహుమానం అపేక్ష ఈషత్తూ లేకపోయినప్పటికీ, పులివేటనుమించిన సాహసం అవసరమైన ఈ హంతకులవేట ఆడుదామని చాల ఉత్సాహం కలిగింది. దీని వల్ల నాకు సర్కారులో మంచిపేరు-దానికన్నా హెచ్చుగా, జనంలో ఖ్యాతీ వస్తుందనే నమ్మకం మరొకటి. ఈ వ్యవహారంలో నేను పూర్తిగా ముతువర్జి (ఆసక్తి) వహించి, నా బుద్ధిమంతనాన్నంతా ఉపయోగించాను. ఈ వేటవల్ల నాకు ఒకటి రెండు అపూర్వ అను భవాలు, ఒక అత్యంతన్యాయమైన, హృదయఖేదకమైన ధర్మబోధ చేకూరినవి.

మా ఇన్‌స్పెక్టరు మొట్టమొదట నావద్దకు లక్ష్మీపతయ్య అనే బాత్మీదారును (సి. ఐ. డి. ని) పిలుచుకొని వచ్చారు. ఇతడు సంతల్లో వ్యాపారంచేసే చిన్న వర్తకుడు. ఇతని వృత్తిక్రమం గ్రామాలలో తిరిగి, రైతులలో స్నేహం, నమ్మకం కలిగించి, వారి నుంచి సరకులను నేరుగాకొని, సంతలలో అమ్మడం. ఈ వృత్తిలో ఇతనికి చాలమంది పరిచయం; పలువిషయాలలో గుట్టు తెలివిడి. హబ్బూరు, హొద్య, హనసోగె, ఇవన్నీ ఇతని సర్కీ్యటుకు చేరిన గ్రామాలు. అబ్బూరులో ఖూనీ అయినవారి ఇంటివారు, ఖూనీ చేసినవారూ ఇతని గిరాకీలు; పటేలు, పట్వారీలు ఇతని ఆప్తమిత్రులు; ఊరి కబుర్లు గప్పాలు అన్నీ ఇతని సమక్షంలో నిరాఘాటంగా జరిగేవి; జనం ప్రవర్తన, వ్యవహారం పరస్పర సంబంధానుబంధాలు అన్నీ ఇతనికి బాగా తెలుసు. ఇతడు పరారిఅయిన హంత కుల సమాచారాన్ని ఉపాయంగా తెలుసుకొని తెలుపడానికి ఒప్పుకున్నాడు.

అతడు సామాన్యంగా ఇన్‌స్పెక్టర్ ఇంటికి రాత్రివేళల్లో వచ్చి, రహస్యవార్తలు తెలిపేవాడు. నాతో మొకాబిలా (పరిచయం) అయినతర్వాత ఒకసారి నాయింటికే వచ్చాడు. నేను అతనికి—ఏమి బాత్మీ (రహస్యసమాచారం) ఉన్నప్పటికీ ఇన్‌స్పెక్టరుగారికే ఇవ్వు, వారు నాకు రిపోర్టుచేస్తారు-అని చెప్పాను. నాకు అతనినిచూస్తే ఏమిటో ఒకరీతి అసహ్యం తోచింది. మొట్టమొదట నన్ను చూచినప్పుడెల్లా నాకూ, అతనికీ ఏమిటో రహస్యమైన సంబంధం ఉన్నట్టు ముఖభావం చూపేవాడు. అతనికి అలా చేయరాదని దయచేసి హెచ్చ రించండి. జనం అతనిని కుంటెనకాడు అని, నేను అతని వృత్తి చాతుర్యరసికుణ్నని భావిం చేరు—అని ఇన్‌స్పెక్టరుకు చెప్పాను. ఆయన బాగా హెచ్చరించి వుంటారు.

కొన్నినాళ్ళతరువాత ఇన్‌స్పెక్టరు-అబ్బూరు హంతకుల విషయమై సరైన కబురు వచ్చింది. లక్ష్మీపతి తమ (ఇన్‌స్పెక్టరు) ఆఫీసులో దానిని నాకు తెలుపడానికి కాచుకొని వున్నాడు - అని రిపోర్టుచేశారు. నేను అక్కడికి పోయాను.

వాడు తెలిపిన వర్తమానం :—

దొడ్డహైదన్న, పుట్టస్వామి ఇప్పుడు అబ్బూరు పరిసరాలలో లేరు. దొడ్డహైదన్న అబ్బూరులో ఒక చాకలదానిని ఉంచుకొని వుండేవాడు. అందువల్ల వాడి భార్యకు వానిపై ద్వేషం. అంతేకాక చాకలిదాని మగడు వానిని ఎలాగయినా పట్టుకొని సర్కారుకు అప్పగించాలని నిశ్చయించుకున్నాడు. అందువల్ల వారిద్దరూ అక్కడనుంచి రాత్రోరాత్రి సాలి గ్రామానికి పోయి, గ్రామపటేల్ (మునసబు) దేవరసే గౌడు మరుగుచొచ్చారు. గౌడు— ఈ పనికి నేను పాల్పడడానికి కాదు; మీరు తంద్రెకు పోయి, లింగణ్ని పట్టుకోండి. వాడు ఏదైనా దారిచూపుతాడు—అనిచెప్పి, వారికి రెండు పాతకంబళ్లు, పచ్చడాలు ఇచ్చి నాల్గైదు నాళ్ళకు అయ్యేంత రాగిరొట్టెలు ఇచ్చిపంపాడు. ఆ మీదట తంద్రె లింగడు వారిని కొన్నాళ్లు ఒక వాగు గుంతలో దాచిపెట్టి పిదప హొళెనర్సీపురానికి సావుకారుగారివద్దకు (ఆ సావుకారుగారి బంధువులున్నారు. వారి మనస్సు నొప్పిపడరాదు. అందుకని, పేరు దాచిపెట్టాను.) పిలుచుకొని పోయాడు; సావుకారుగారికి - గ్రహచారవశాన బలవద్వైరంతో అని కొందరు అంటారు—పోర్జరీకోసం రెండుసంవత్సరాలు శిక్షపడింది. జైలులో ఏక కాలంలో వున్నందున తంద్రె లింగనికి, వారికీ పరిచయం. పోలీసువారిచేతిలో చిక్కి కానూను (చట్టం) వల్ల కష్టపడే జనాన్నిచూస్తే వారికి కనికరం; వారు ఆ ప్రాణ తస్కరులను ఏదో దగ్గరిపల్లెలో తమ పొలంలో వుండే ఒక గుడిసెలో వుంచారు; పుట్టస్వామి కాయిలా పడ్డాడు. వానికి నయంకాగానే, ఇంకెక్కడికైనా పంపిస్తారు; ఇప్పుడేమో హొళెనర్సీపురం పరిసరాలలో సావుకారుగారి రక్షణలో వున్నారు—ఇలాగని.

తర్వాత ఇన్‌స్పెక్టరు చెప్పారు—తమకూ ఆ సావుకారుగారికీ గుర్తు, పరిచయం. సావుకారుగారికి శిక్షపడిన కేసు తనిఖీలో తాము పాత్రవహించినందువల్ల తమకూ, వారికీ మనస్తాపం; నేనే వారిని పిలిపించుకొని మాట్లాడితే మెరుగు; వారు చాల అహంకారులు - అని. వారిని చూస్తే ఇన్‌స్పెక్టరుగారికి కొంచెం సంకోచభావం (Inferiority complex) వున్నట్టు తోచింది.

అనుకూలమైనంత త్వరలో యడతొరెకు వచ్చి నాకు మీ భేటీ యిప్పించండి - అని సావుకారుగారికి వారివైపు వారిద్వారా చెప్పిపంపాను. వారు నాల్గైదునాళ్ళలోనే మైసూరుకు పోయే ప్రమేయం వుంది. యడతొరె ఆ దారిలోనే వున్నందున నన్నువచ్చి చూస్తానని జవాబుపంపారు.

ఆ విధంగానే వారు వచ్చారు. నేనప్పుడు కోర్టులో వున్నాను. వారిని నా చేంబరుకు పిలిపించి, నేనూ అక్కడికిపోయి వారితో మాట్లాడాను. గంభీరమైన వ్యక్తి, వారిచరిత్ర ఏదైనా కానీండి, తుచ్ఛులుగా మాత్రం కనిపించలేదు. వారి ప్రవర్తన చూచి ఈ విషయం వీరిని ఎలా అడగడం ?—అని సంకోచమయింది. నాపై చాల ఆదరమర్యాదలు వున్నట్లు ప్రవర్తించారు.



"తమతో ఒకవిషయమై మాట్లాడవలసివుంది. అందుకోసం తమకు ఇబ్బంది కలిగించాను" అని ప్రారంభించి వారికి అబ్బూరు హంతకులవిషయమై చేరిన బాత్మీని వివరించి "పరారీ అయినవారిని పత్తాచేయడానికి నాకు ఏమైనా సహాయం వారినుండి లభించీనా ?" అని అడిగాను.

నేను వారి మనస్సును నొప్పించరాదని ఎంతో గౌరవంతో మాట్లాడాను. అయితే ఎక్కడో వారి పూర్తిగా మాసిపోని గాయానికి దెబ్బతగిలినట్లు కనిపిస్తుంది. వారు నా మాట పూర్తిఅయ్యేలోపుగా ఉగ్రావేశంతో,

"ఇదేమిటండీ, ఉన్మత్తప్రలాపం ? నాకూ వారికీ ఏమిటి సంబంధం ? ఎవరో అలగా జనం నామీద తమకు అబద్ధంచెబితే తమకు వివేకం వద్దా ? విద్యామదంతో, అధికారమదంతో జనుల యోగ్యత చూడక తమరు ఈ విధంగా నాకు అవమానం చేయవచ్చా ? తమరు పసివారు, ప్రపంచజ్ఞానం లేనివారు, తమ ఇన్‌స్పెక్టరువంటివారిచేతి కీలుబొమ్మ కారాదు." అని లేచారు.

నాకు చాల కోపమూ, వారి విషయంలో, వారు చెప్పినమాటలలో న్యాయాంశం ఉందేమో అనే సందేహమూ ఒకసారి కలిగాయి. నేను వారితో,

"కూర్చోండి. అలా ధూర్తత్వంతో లేచిపోవడానికి కాదు. అధికారమద మని అన్నారు కదా, ఆ అధికారాన్ని అవసరమైతే వెంటనే ఉపయోగించడానికి సిద్ధంగా వున్నాను. ఇన్‌స్పెక్టరు నాకు కొత్తవారయినా తమ పాతపరిచయస్థులేనని కనిపిస్తుంది. తమయోగ్యత చూడక మాట్లాడారని అన్నారు; ఉండవచ్చు; తమరు (వారిపేరు చెప్పి) అని భావించి మాట్లాడాను. తాము వారు కాకపోతే నేను మాట్లాడినది తప్పు. తమను క్షమాపణ అడగడానికి సిద్ధంగా వున్నాను." అన్నాను.

దర్పపు అంతస్తునుంచి వెంటనే జారిపోయారు. కొసకు చెప్పారు :

"నా దురవస్థలో నేను లింగణ్ని చూచాను. వాడి పరిచయమూ వుంది. అయితే నాకు వాడి స్నేహం ఏమిటి ? వాడు కొన్నినాళ్ళక్రితం నా వద్దకు వచ్చి ఈ అబ్బూరువాళ్ళ కథచెప్పి, వాళ్ళకు సహాయం కావాలని చెప్పాడు. 'నాకు ఆ సంగతి సంబంధాలు వద్దు. ఎలాటి బీదబడుగుకైనా తిండి బట్ట సహాయం కావాలంటే, ఇదిగో తీసుకో' అని కొద్దిగా డబ్బు ఇచ్చాను. 'నీవు ఏమైనా చేసుకో. మళ్ళీ నావద్దకు రావద్దు' అని చెప్పాను. నాకు సత్యంగా ఇంకేమీ తెలియదండీ !"

ఆ మీదట వచ్చిన వర్తమాన మేమిటంటే, తంద్రె లింగడు హంతకులయిన ఆ అన్నదమ్ములను కొణనూరు రామస్వామి కనుమ మార్గంగా కొడగుకు పంపించి, అక్కడ ఫ్రేజరుపేటలో ఉన్న ఒక లింగాయతులమఠంలో జంగమ వేషధారులుగా వుండడానికి అనుకూలం చేయించాడని. ఫ్రేజరుపేటకు పోయి, అవసరమైతే అక్కడ స్థానికాధికారుల సహాయంపొంది పరారీ అయినవారిని పట్టుకొనడానికి ప్రయత్నించడానికి నిశ్చయించాను.

ఆ హంతకుల ముఖపరిచయం నాకూ లేదు; ఇన్‌స్పెక్టరుకూ లేదు. నేను వాళ్లను మైసూరులో విచారణకు పోలీసులు కోర్టుకు పిలుచుకొనిపోయేటప్పుడు ఒకసారిమాత్రం సకృత్తుగా చూచాను. ముఖం చహరా జ్ఞాపకం తెచ్చుకోలేకపోయాను. అందుకోసం మేము చుంచనకట్టె స్టేషను కాన్‌స్టేబిల్ గుండప్పను వెంటపెట్టుకొని పోయాము.

ఫ్రేజరుపేటలో భారీ ఫారెస్ట్ డిపో వుండి. అది టేకు, పున్నాగం, రోజ్‌వుడ్ కలపకు ప్రసిద్ధమైన స్థలం. ఇన్‌స్పెక్టర్ కలపవ్యాపారంచేసే లబ్బే షావుకారుగాను, నేను వారి గుమస్తాగాను ఫ్రేజరుపేటకుపోయి సత్రంలో దిగాము. మా వెంటవచ్చిన గుండప్ప నాకు వంటవాడుగాను షేక్‌అబ్దుల్లా లబ్బే షావుకారు వంటవాడుగాను వున్నారు. స్థానికాధికారుల సహాయం కావాలంటే, నేను ఫలానావాడిని అని చూపడానికిగాను నాతోపాటు తాలూకా మేజిస్ట్రేటుకోర్టు ముద్ర తీసుకొనివెళ్లాను.

లక్ష్మీపతయ్య ఏమో వ్యాపారంకోసం వచ్చినవాడులాగ హుణసూరు పెరియాపట్టణం మార్గంగా మొదట్లోనే ఫ్రేజరుపేటకు వచ్చాడు. అతడు - ఆ ఆసాములు ఇక్కడా వుంటారు. ఏటి అవతల అడవులమధ్య అక్కడక్కడ వున్న లింగాయత గ్రామాలలోను వుంటారు. సరైన సమాచారం కనుక్కోడానికి వారిజనంలోనే ఒకణ్ని ఏర్పాటుచేశాను—అని చెప్పాడు. ఆ వ్యక్తినికూడ మాముందు హాజరుచేశాడు. వాడు ప్రాణభయంతోనోఅన్నట్టు వణుకుతూ,

"చివాచారంవారంతా (లింగాయతులంతా) వంతులువేసుకొని వాళ్ళకు పిండి, తిండి ఇస్తున్నారు. చిన్నవాడు కొన్నాళ్ళక్రితం పాము కరిచి చచ్చిపోయాడు. వలెయూరువారు వాడిని అడివిలోనే మన్నుచేశారు (పూడ్చిపెట్టారు). ఇప్పుడు పెద్దవాడొక్కడే వున్నాడు. వాడు పగలంతా అడవుల్లో మరుగుగా వుండి ఒక్కొక్కరాత్రి ఒక్కొక్కపొలం మంచె మీద పడుకుంటాడు. ఫలానాదినం ఫలానాచోట పడుకుంటాడని తెలిస్తే పొంచివుండి కాచుకొని పట్టుకోవచ్చు" అని అన్నాడు.

"ఆ సంగతి సరిగా తెలుసుకొని మాకు తెలిపితే భారీ ఇనాము ఇస్తాము. సర్టిఫికెట్టు ఇవ్వబడుతుంది" అని చెప్పాను.

"అయ్యో బుద్ధి (దేవరా), మీ పాదాలు పట్టుకుంటాను. సర్టిఫికేటు గిర్టిఫికేటు ఇస్తే నాప్రాణాలు మిగులుతాయా? గ్రామం వాళ్లంతా దొడ్డహైదప్పను శూరుడు అని పొగడ్తూ వున్నారు: నేను సర్కారుకు సంగతి తెలిపానని తెలిస్తే ఆనాడే పొడిచి చంపేరు" అని వణుకుతూ చెప్పాడు. దీనిలో ఆలోచించవలసిన విషయం ఏమిటంటే, ఈ హత్యా పాతకులు గ్రామాలరైతుల దృష్టిలో పాపం ప్రాణాలు దక్కించుకొనడంకోసం పడరాని పాట్లు పడుతున్నవారు మాత్రమేకాదు: శూరులుకూడ. రైతులనుంచి మనకు సహకారం దొరకదు. మనం అక్కడ బేహూషారుగా వెళ్ళితే ఏదో మరుగుగా, గుంబనగా సాహసం చేస్తున్న అల్పసంఖ్యాకులైన మనకుకూడ ఒకవేళ అపాయమయినా కావచ్చును.



నది అవతలి హుణుసూరు తాలూకు చాలభాగం దట్టమైన, ఎత్తైన అరణ్యం; మధ్యన అక్కడక్కడ విరళంగా కొన్ని చిన్నగ్రామాలు. సుమారు పదహైదుమైళ్ల కైవారంలో ఏడెనిమిది కొంప లుండవచ్చు. ఈ గ్రామాలు ముసురుకున్న కారడవిని నరికి సాఫ్‌చేసిన స్వల్పప్రదేశాలలో అంటే యాభై అరవై యకరాలంత "క్లియరింగులలో" ఉన్నాయి. ఇక్కడి రైతులు తమతమ కుటుంబాలకు కావలసినంతే, లేక శక్తివున్నంతే జొన్నలసేద్యం చేస్తారు. ఫారెస్టు ఇలాకా(శాఖ)పనులు దొరికినప్పుడు—నిప్పును ఆపే కాలువలను సరిదిద్దడం, చెట్లు నరకడం, పొదలు గిదలు కొట్టివేసి అడవిదారిలో వెదురు దుబ్బులు తొలగించి శుభ్రంచేయడం - ఇలాటి పనులకు కూలికిపోతారు. ఇలాటి గ్రామాల నుంచి బాత్మీ (రహస్యవార్తలు) తెప్పించాలి. నేను కాని, ఇన్‌స్పెక్టరు కాని వెళ్లేట్టులేదు. కాన్‌స్టేబిలు గుండప్ప దొడ్డహైదన్నకు తెలిసినవాడు. కాన్‌స్టేబిల్ షేక్‌అబ్దుల్లా ముసల్మాను- పిల్లవాడు; లింగాయతులయిన ఆ గ్రామస్థులతో సహజంగా కలసిమెలసి వారి నమ్మకం సంపాదించి, ఆంతర్యం కనిపెట్టగలిగినవాడు కాడు.

కొంచెంసేపు ఆలోచించినమీదట నాకొకదారి తోచింది. దానిని వెంటనే అనుస రించాను. ఫారెస్టు ఇలాకానుంచి ఈగ్రామాలకు జీవనం. ఫారెస్టు ఇలాకాసిబ్బందికి గ్రామస్థుల పరిచయం, దాక్షిణ్యం వుండాలి. సుమారు పధ్నాల్గు మైళ్ళ దూరంలో వున్న పెరియాపట్టణంలోవున్న ఫారెస్టురేంజరును నేను పిలిపించుకొని, ఆయనకు నాఉద్దేశం వివరించిచెప్పి ఆయన సహాయం కోరాను. ఆ ప్రదేశంలో పనిచేసే ఫారెస్టు గార్డ్ ఆయనతో పాటే వచ్చాడు. నాకు వాడిని పరిచయం చేయించి "వీడు బుద్ధిశాలి, వీడు మీకు సహాయం చేస్తాడు: వీడి సహాయానికి తగిన ప్రతిఫలం ఇప్పించడం తమభారం; తమనుంచి ఒక్క మాట కన్సర్వేటరుకూ, డిప్టీకమీషనరుకూ చేరితే వాడు బతికిపోతాడు. నానుంచి ఏమి కుమ్మక్కు (సహాయం) కావాలసినా సిద్ధంగా వున్నాను." అన్నారు రేంజరు. తమవద్ద బందూకు (తుపాకి) ఉందా?" అని అడిగాను. లేదన్నారు. "అలాఅయితే, అపాయం వుండ గల పనిలో తమకు పాలు ఇవ్వడం సరికాదు. తాము ఐదారుమైళ్ళ ఫాసలాలో (దూరంలో) వున్న కొప్ప ఫారెస్ట్ లాడ్జిలో వుంటే, తమతో సంబంధంపెట్టుకొని, కావలసిన సహాయం పొందుతాము" అనిచెప్పి మర్యాదగా చేయి అందిచ్చి పంపించాను.

ఆ ఫారెస్టుగార్డుపేరు ఇప్పుడు జ్ఞాపకంలేదు. వాడికి అన్నిసంగతులూ చెప్పి, "ఆ ఫారెస్టు ప్రదేశాలన్నిటినీ గస్తుచేసి (తనిఖీచేసి) ఉపాయంగా సమాచారం కనుక్కొని దొడ్డహైదన్న ఆ ప్రదేశంలో ఉన్నాడో, లేడో, వాడికి ఆహారం ఎవరిస్తారు, ఎక్కడ దాక్కొని వున్నాడు, పడుకోడం ఎక్కడ, అనే విషయాలను తెలుసుకుని, ఆవర్తమానం మాకు తెలుపాలి" అని చెప్పాను.

ఒకటిరెండు రోజులలోనే ఫారెస్టుగార్డు వాపసు వచ్చి (తిరిగివచ్చి) "ఏటి అవతల ఐదారుమైళ్ళదూరంలో ఫారెస్టులో మలెయూరుఅనే గ్రామం వుంది. అక్కడ ఏవరో ఒక వెలుపలిమనిషి వచ్చి గ్రామస్థుల కుమ్మక్కుతో తలదాచుకొనివున్నట్టు కనిపిస్తుంది.

పగలంతా అరణ్యంలో అడవిమృగంలాగ చెట్టు, పొదల మరుగున కాలంగడిపి, రాత్రిళ్లు పొలాలలో కావలికి వేసిన మంచెలమీద పడుకుంటాడట. వాడికి గ్రామంపటేల్ (గ్రామ మునసబు) ఒత్తాసట. నాకు అక్కడ ఒక రహస్యాలు చెప్పేవాడున్నాడు. వాడు చెప్పేది యేమిటంటే 'ఈ మనిషి ఒక్కొక్కదినం ఒక్కొక్క మంచెమీద పడుకుంటాడు. వాడు పడుకునే మంచెలవంతు పటేలు ఏర్పాటుచేసివున్నాడు. వాడు వచ్చేనాడు ఆమంచె యజమాని వాడికోసం రొట్టెలు, చట్నీ, రాగిసంకటి మంచె గుడిసెలో పెట్టాలని పటేల్ కట్టడి. ఫలానాదినం ఇలాటి మంచెకే వస్తాడని తెలిస్తే సంగతి చెబుతాను' అని వాడన్నాడు. ఆదినం మనం మొదట్లోనే పోయి, సరైనస్థలంలో మరుగునవుండి కాచుకుంటే వాడిని పట్టుకోవచ్చు.'' అని అన్నాడు. అది జరిగిన మూడునాలుగునాళ్ల తర్వాత మళ్ళీవచ్చి;

"ఈ రాత్రి—రెడ్డి పొలం మంచెకు వస్తాడు'' అని వర్తమానం ఇచ్చాడు. తన బాత్మీదారు ఆ పొలంకూడ తనకు చూపాడని అన్నాడు.

సరి. మేము మధ్యాహ్నం మూడున్నరగంటకు ఫ్రేజరుపేటనుంచి బయలుదేరి పొద్దు మునిగేవేళకు మలెయారుగ్రామం సమీపంలోని ఫారెస్టు చేరాము. మాపార్టీ ఇన్‌స్పెక్టరు, నేను, ఫారెస్టుగార్డు, కాన్‌స్టేబిలు గుండప్ప. మాతోపాటు గుండప్ప ఉండనే వుండాలి. ఎందుకంటే, మాలో ఎవరికీ దొడ్డ హైదన్న ఆనవాలే తెలీదు. ఇన్‌స్పెక్టరువద్ద వారి రివాల్వరు, నా చేతిలోనా 'విన్‌చెస్టర్ రిపీటర్' (Winchester repeater) ఉండినవి.

పొద్దుమునిగి కొంచెం చీకటిపడేవరకు ఫారెస్టులోనే నిశ్శబ్దంగా వుండి, ఆమీద ఫారెస్టుగార్డు పిలుచుకొనిపోయిన ఒక జొన్నచేనిలో దూరాము. ఆ పొలం ఆ అడవిలోని ఒక మైదానంలో ఒక్కేఒక్కటి. చుట్టూ అడవి. అడవిలో ఇలాగే విడివిడిగా మైదానాలలో అక్కడక్కడ పొలాలు. ఈ పొలంలో సుమారు నిలువెత్తు కంకి వేసిన జొన్నపంట వుంది. ఒకమూలలో చేయెత్తిన మనిషి నిలువున కట్టిన మంచెమీద ఒకగడ్డిగుడిసె. మేము అక్కడికి వెళ్ళేవేళకు సుమారుగా చీకటిపడింది. మేము మంచెగుడిసె ఎదురుగా జొన్నచేనులో మరుగై పడుకుని కాపలాకాచాము. కొంచెం సేపటికి పొదలలో సరసర అని సవ్వడి వినబడింది. ఆ మీదట ఒకమనిషి కంబడిముసుగు కప్పుకుని దొంగలాగ ఇటు అటు చూస్తూ అడవివైపునుంచి పొలంలోకి దిగాడు. పెద్ద మైకట్టుమనిషి; చేతిలో ఒక బందూకు పట్టుకున్నాడు. కంబడిముసుగులో ముఖం కనిపించలేదు; మరుగైంది. చీకటి అయినందున ఏదీ స్పష్టంగా కనిపించదు. వచ్చినవాడు మంచెకింద నిలబడి పొలంవైపు చుట్టుపట్ల దేనినో వెదుకుతున్నట్లుగా చూచి, తర్వాత మంచెకిందవున్న చిన్ననిచ్చెనను తీసుకుని మంచెకు ఆనించి, మీదికిఎక్కి, నిచ్చెనను పైకిలాక్కున్నాడు. నేను నాపక్కన నక్కివున్న గుండప్పను చేతితోతట్టి "వాడేనేమోయ్ ఆసామీ?'' అనే అర్థంలో సైగచేశాను. నేను కదలడంవల్లనో, మరేంకారణంవల్లనో తెలీదు; మంచెమీదవున్న మనిషి బెదిరిపోయినవాడిలాగ సర్రుమని పొలంవైపు తిరిగి తుపాకిని మావైపుచూపి



ప్రేల్చాడు. సగంలేచిన నా చెవిపక్కనుంచే గుండు "షిష్'' మంటూ దూసుకుని పోయింది. దైవవశాత్తు ఒకగుండు తప్పింది. అయితే, దానిని పేల్చిన బందూకు జోడు గుళ్ళదయితే? ఈ శంకతో సగంలేచి కూర్చున్న నేను అట్లాగే ముఖంవంచి కింద నేలమీద పడుకున్నాను. నేను దెబ్బతగిలి కింద పడిపోయానని ఇన్‌స్పెక్టరు అనుకోవుంటారు. ఆయన "అర్రే'' (ఉపమాతిట్టు) అని పైకిలేచీ లేవడంతోనే ఆ మంచెవైపు రివాల్వరును ఎత్తిచూపుతూ తిట్టుకొకగుండుగా ఆరుగుండ్లు పేల్చారు. ఆరుగుండ్లూ మంచెను ఒకటిరెండు మూరల మేరలో తప్పిపోయి అడవిలోని చెట్లకు తగిలాయి. (రివాల్వరు గురితప్పక కొట్టడానికి ఎంతో అభ్యాసం, ఎన్నో తూటాల ఖర్చు కావాలి.) ఇన్‌స్పెక్టరు శస్త్రప్రయోగం ప్రారంభమయిన వెంటనే మంచెమీదిమనిషి "అయ్యయ్యో!'' అని పెడబొబ్బలుపెడుతూ, మంచెమీది గుడిసెగడపవద్దకు వచ్చి చేతిలోని తుపాకిని నేలమీద పడేసి, నోరు కొట్టుకొనడం ప్రారంభించి మంచెమీదినుంచి కిందికి దూకాడు. నేను బర్రునలేచి. నాబందూకు గురిపెట్టి "రెండుచేతులూ పైకి ఎత్తు. లేకపోతే, గుండుపేల్చేస్తాను'' అని కేకవెట్టాను. వాడు అరుస్తూనే రెండుచేతులనూ జోడించి పైకి ఎత్తాడు. ఖాళీ అయిన తమ రివాల్వరును బారుచేస్తున్న ఇన్‌స్పెక్టరుకు "తొందరపడకండి'' అని హెచ్చరించి, నేను గుండప్పతో "వీడేనా చూడు'' అన్నాను. వాడు దగ్గిరికి పోయి చూచి, అగ్గిపుల్ల గీచి మళ్ళీ చూచి, "కాదు మహాస్వామి" అన్నాడు.

వాడితుపాకిని తీసి భద్రపరచమని గుండప్పకు చెప్పి ఆమీదట కనుక్కోగా ఆ మనిషి ఆ పొలం యజమాని అని తెలిసింది.

"ఎందుకోయ్, మమ్మల్ని తుపాకితో కాల్చడానికి చూశావు?'' అని అడిగినందుకు—

"ఇక్కడ చాల పందుల రాయిడి. దానికోసమే తుపాకి పెట్టుకుని కావలి పడుకోడం. పొలంలో సరసర అనింది. పంది అనుకుని తుపాకికాల్చాను" అన్నాడు.

నవ్వుదామా? ఏడుద్దామా?

"మేమూ పందివేటకు వచ్చాము. పోనీ పో. ఎవరికీ ఏమీ నష్టంకాలేదు.'' అని చెప్పాను. మాతోపాటు ఫారెస్టుగార్డు వున్నాడు కాబట్టి నామాటలను ఆ రైతు నమ్మతాడని తోచింది. అక్కడినుంచి ఫ్రేజరుపేటకు తిరిగి వచ్చాము.

మా ప్రయత్నమేమో నిరర్థకమైంది. అయితే, ఆవిషయం అక్కడితో ముగియలేదు. ఆ ఫారెస్టుగార్డును ఎవరో తుపాకితో కాల్చి చంపడానికి ప్రయత్నించారు. వాడు ప్రాణభయంతో పై వారిని ప్రార్థించి బదిలీ చేయించుకొన్నాడు. వాడికి సమాచారం తెలుపుతున్న మనిషి ఆ పల్లెనే వదలి ఎక్కడో కాఫీ తోటలకు తరలిపోయాడు.

# 7. మరొక పురాణం

## "జడభరత"

నేను వుండేది 'ఆర్కియాలాజికల్' శాఖలో. మా దగ్గర ఈ పిల్లాట (పరిశోధన) గోడు ఎక్కువ. చెదలు పట్టేలాగ గ్రంథాలుపెట్టి "మేము దీనిని పరిశోధించాము; మాకిది భూగర్భంలో చిక్కింది; దీనికాలం వేదకాలంకన్నా ముందుది; అలాగ, ఇలాగ" అని నోటినిండా మాట్లాడేవారు ఎంతోమంది! అందులోను కాలనిర్ణయం, మతనిర్ణయం, జాతినిర్ణయం సంగతి వచ్చిందంటే చాలు, ఈ పరిశోధకుల నోరు అడ్డేవారే లేరు. అందుకోసమని తమలో తామే నోటికి నోరు (అలంకారికంగా) పెట్టి కొట్టుకుంటారు. చేతికి చేయి సాధ్యంకాదు; ఎందుకంటే వట్టి వ్రాతల పోట్లాట! ఒక్కొక్కసారి - కాదు, చాలసార్లు - పరిశోధకుల జాతిమతాలే పాపం అపరిశోధ్య అదృష్ట అవ్యక్త వ్యక్తికి అంటుకొనిపోయే సందర్భాలు ఎక్కువ! అభిమానం అనేది పెద్దదికదా! మన ఈ మహనీయులు తమ అభిమానావేశంలో బ్రతికి వున్నవారి కాలనిర్ణయంచేసినా చేసేవారే!

మొన్న ఒకసారి ఒక తమాషా జరిగింది. దానిని చెబుదామనే నేనిప్పుడు బయలుదేరడం. మొదట కొంచెం "ఉపోద్ఘాతం" లేక "మున్నుడి" వ్రాయాలి కదా! అలాగే ఇప్పుడు మున్నుడివ్రాయడం అయింది. ఇకమీద కథాప్రారంభం.

మొన్న ఒకమారు మేమంతా (అంటే మా శాఖవారే) ఒక పరిశోధన విషయవిమర్శ కోసం సమావేశమయాము. ఆదినమే నేను నా స్నేహితులొకరిని యథాలాపంగా ఆ సమావేశానికి పిలుచుకొనిపోయాను. పాపం! ఆయన కొత్తవారు. మా కాట్లాటనంతా ఆయన ఊరికే కూర్చుని వింటువ్నారు. మేము "ఆదిపురాణంముందు పురాణాలు ఉండేవా? అంత్యపురాణం చిక్కిందా?" అనే విషయాన్ని మాంచి గంభీరంగా చర్చిస్తున్నాము. నడుమ నడుమ సుడిగాలిలాగ మా చర్చ ఏదోఒక చిన్నవిషయాన్ని చుట్టుకుని భర్రుమని ధూళిరేపి దానిలో చిక్కుకున్నవారి కళ్లు మూసివేసేది. నా స్నేహితులు, దీనినంతా ఎంతోసేపువరకు ఊరికే సాక్షిభూతులుగా కూర్చుని చూస్తున్నవారు, మా వాదవివాదాల వేడి తగ్గగానే ముందుకు వచ్చి హఠాత్తుగా "మాకు మరొక పురాణం చిక్కింది" అన్నారు.

మే మందరమూ "ఆ! పురాణమా? ఇంకొకటా! చెప్పండి! చెప్పండి! ఏమిటది? ఎక్కడ? ఎలా వుంది?" అని మా విషయం వదలి ఆత్రంతో ఆయనను అడిగాము.

నా మిత్రులు శాంతంగా, గంభీరంగా ప్రారంభించారు:



"మొన్న మా పాతయిల్లు విప్పించి కొత్తయిల్లు వేయించేటప్పుడు ఒక పాతగోడను పడగొట్టవలసివచ్చింది. అప్పుడు దాని పునాదిలో ఒక చిన్న పేము పెట్టె దొరికింది. అంతా విరిగిపోయింది. అయినా జాగ్రత్తగా తీసి చూచాను. దానిలో తాటాకులవి ఒకటి రెండు గ్రంథాలు వుండినవి. వాటిని అలాగే తీసిచూచాను. చాల పురాతనమైనవి కావచ్చునని నాకు తోచింది."

"ఇప్పుడవి మీవద్ద ఉన్నాయా? ఎన్ని సంవత్సరాలముందువి?" అని భుజాలు ఎగురవేస్తూ ఒక పరిశోధకులు అడిగారు.

"ఓ! నావద్దే ఉన్నాయి. అయితే, ఎన్నిసంవత్సరాలముందువనే విషయం నాకు తెలీదు. అయితే, అంతా చదివిచూచాను."

"మీరే చదివారా? అలాఅయితే, మీకూ ఈ విషయంలో 'గతి' వుందన్నట్లయింది" అని ఒంటికన్ను పరిశోధకు లొకరు ఆశ్చర్యంతో అడిగారు.

"కావలిస్తే అనండి" అని నా స్నేహితులు గంభీరంగా సమాధాన మిచ్చి పురాణం ముందుకు కొనసాగించేటంతలో మరొక పరిశోధకులు గుటకలు మింగుతూ నడమ అడ్డు తగిలి "అది కాదు, ప్రారంభంలో ఎవరిస్తోత్రం వుంది?" అని అడిగారు. దానికి నా మిత్రులు "దాని ప్రారంభంలో తుంబురుస్తోత్రం వుంది" అని ఉత్తరం ఇచ్చారు.

"అలాఅయితే కథావస్తువు ఏది?" అని కొంచెం కుతూహలం పుట్టి నేనే అడిగాను.

"అలాఅయితే కథాసారాంశమే చెబుతాను, వినండి" అని ఆయన ప్రారంభించేంతలో భుజాలు ఎగురవేసే పరిశోధకులు "ఆ పురాణం పేరేమిటండీ" అని ప్రశ్నించారు.

"పురాణంకన్నా పేరే పెద్దదైందా? మొదట పురాణపు పురాణం వినండి" అని నా మిత్రులు కొంచెం గట్టిగాచెప్పి పురాణకథను ప్రారంభించారు.

"విష్ణువుకు ఒకదానిమీద మరొకటిగా మీదమీద అవతారాలు; తనకు ఎందుకు లేవు?—అని ఇంద్రునికి తానూ కలియుగంలో అవతారాలు ఎత్తాలని ఆశ కలిగింది. అయితే, అలా చేయడానికి ఈశ్వరాజ్ఞ లేదు. అందుకు ఇంద్రుడు తపస్సుచేశాడు. ఉన్నచోటునుంచి బ్రహ్మదేవుడు దిగివచ్చి ఇంద్రుణ్ని 'ఏమికావాలి?' అని అడిగాడు. ఇంద్రుడు అవతారాలవిషయమై తన మనోభీష్టం తెలుపగా, బ్రహ్మదేవుడు ఒకక్షణం యోచించి 'కలియుగంలో మనం ఎవరమూ ఈలాగే ఇదేరూపంతో పోయేట్టులేదు. పోతే పూటపూటకు రూపం మార్చవలసివుంటుంది. మన నిజరూపం వాళ్లకు తెలియగూడదు. నీవు ఎలాపోతావు? ఏ రూపంతో?' అని ప్రశ్నించాడు. 'పొద్దుచూచి రూపం బదలాయించే విద్యను నేనూ నేర్చుకున్నాను. నేను అదంతా చూచుకుంటాను. తమరు ఆశీర్వాదం చేయాలి, అంతే.' అని ఇంద్రుడు మారుపలికాడు. 'తథాస్తు' అని బ్రహ్మదేవుడు తన లోకానికి వెళ్ళిపోయాడు. ఇక్కడికి మొదటిసంధి (ప్రకరణం) సమాప్తమైంది. తర్వాత ఇంద్రుడు మంత్రి మొదలయినవారిని పిలిపించి, సభ సమావేశపరచి, 'భూలోకానికి

ఏ రూపంతో వెళ్లాలి ?' అని అడిగాడు. కొందరు మనుష్యరూపంతో నని, కొందరు స్త్రీ రూపంతో నని, కొందరు పులిరూపంతోనని, కొందరు పక్షిరూపంతోనని, తమతమకు తెలిసినట్లు చెప్పారు. ఇంద్రునికి ఇవేవీ మనస్సుకు నచ్చలేదు. కొసకు 'భూలోకానికి వెళ్లేటట్టయితే, సూక్ష్మశరీరులై పోవాలి. వారి కంట్లో పడగూడదు. మన పనిమాత్రం సాధించాలి. నిశ్చయంగా ఏరూపం ధరించాలనేది అక్కడ పోయినప్పుడు నిర్ధరిద్దాము ?' అని తానే ఆలోచించి చెప్పి సభ ముగించాడు. (ఇక్కడ రెండుమూడు తాటాకులు చినిగి పోయాయి. బాగా తెలియలేదు. అయినా సందర్భాన్ని కనిపెట్టాను.)''

''ఏమండీ ! ఎంతటి మహాకార్యం చేశారు ? మీ ఉపకారం మేము-కాదు, యావత్తు కర్నాటకం ఎంత మెచ్చుకొన్నా చాలదు ! మీనుంచి నిజంగా పురాణం జీర్ణోద్ధారమయింది.'' అని ఒంటికంటి పరిశోధకులు ఇంకా ఎంతో పొగడసాగారు. అయితే అంతలో నా మిత్రులు మళ్ళీ చెప్పడం ప్రారంభించారు ...

''భగవంతుడు ఇదంతా తన దివ్యదృష్టితో తెలుసుకొని వెంటనే బ్రహ్మదేవుని పిలిపించి, 'శుక్రాచార్యుణ్ని పిలిపించు' అని ఆజ్ఞాపించాడు.''

దీనిని విని మన ఒంటికంటి పరిశోధకులు కొంచెం గాభరాపడి తమ చుట్టుపట్ల చూచారు. అందరిలక్ష్యమూ మామిత్రులవైపే వుంది. ఒంటికంటి పరిశోధకులు సమాధాన పడి మళ్ళీ వినడం ప్రారంభించారు.

''ఎందుకు భగవంతుడా ? అని భయపడుతూ బ్రహ్మదేవుడు మారుప్రశ్న వేశాడు. భగవంతుడు చిరునవ్వునవ్వి 'అబ్బాయీ, నీవు లోకాలను పుట్టించగలవే అయినా, నీకు ఆ లోకాల అంతరంగసూత్రాలు తెలియవు. మీ వారి స్థితిగతులే నీకు తెలియవు. ఇంద్రుణ్ని భూలోకానికి ఎందుకు వదిలావు ?' అని అడిగాడు. బ్రహ్మదేవుడు గాభరాపడి 'భగవంతుడా, నాకు తెలియదు. ఏ మయింది ఇప్పుడు ?' అన్నాడు. దానికి భగవంతుడు ముఖంచిట్లించి, బొమముడివేసి, ''అయ్యోదేమిటి ? సహస్రాక్షుని సంగతి తెలియదా ? అందుకోసమే ఇప్పుడు 'వైద్యపితామహుడైన' శుక్రాచార్యులను పిలిపించు అని ప్రత్యుత్తరం చెప్పారు. (ఇక్కడికి రెండవసంధి ముగిసినట్టు కనిపిస్తుంది.)''

''వైద్యపితామహ అని దానిలో వుందా ?'' అని భుజాలు ఎగరవేస్తూ ఒకరు అడిగారు. దానికి నా మిత్రులు ''ఓహో, ఇంతే ఎందుకు ? సంజీవినిసూత్రం మొదలయిన వైద్యగ్రంథాలను వ్రాసినవారు వారేనని స్పష్టంగా దానిలో వుంది.'' అని చెప్పారు.

''హం ! కొత్తసంగతి ! దీనివల్ల మానవజాతి ఇతిహాసమే ఇక మారిపోయే లక్షణం కనిపిస్తుంది. చూడాలి. అటుతర్వాత ఏమైంది ? శుక్రాచార్యులను పిలిపించడ మయింది....'' అని ఇంతసేపటివరకు ఊరికే కూర్చున్న కళ్లజోడు పరిశోధకులు ఆవేశంతో అడిగారు.

''అక్కడినుంచి శుక్రాచార్యులు వచ్చి వంగి నమస్కరించి, 'ఎందుకోసం పిలిపించడమైంది ప్రభో ! నానుంచి ఏమి కావలసివుంది' అని అడిగారు.



'రాక్షసగురువైన నీకు దేవతలపై కసి తీర్చుకొనడానికి ఇప్పుడొక సుసమయం ఒనగూడింది. నీవు ఇప్పుడే నీ రాక్షసపరివార సమేతంగా భూలోకానికి పోవాలి' అని భగవంతుడు ఆనతి యిచ్చాడు.''

''ఈలాటిమాటలు ఏ పురాణంలోను దొరకవు. ఇది పూరా పాతది కావచ్చు'' అని ఒంటికంటివారు సవాలుచేశారు.

''అక్కడ ఏమిపని ప్రభో ?'' అని శుక్రాచార్యులు అర్థం తెలియక మళ్ళీ అడిగారు. దానికి భగవంతుడు 'ఎక్కువ ప్రశ్నలు అడుగకూడదు. ఇంద్రుడు భూలోకానికి పరివార సమేతంగా పోయాడు. సంగీతమూ వెంట వుంది. నీవు పోయి వాడు అక్కడ ఏమి చేస్తాడనే సంగతిని కనుక్కొని నాకు తెలుపాలి. భూలోకపు నా భక్తులు వృథాగా చిక్కులు పడరాదు' అని తెలిపాడు.

''శుక్రాచార్యుడు ఏకదృష్టితో ధ్యానిస్తూ 'మీ ఆనతి' అని నమస్కరించి వెళ్లిపోయాడు. (ఇక్కడికి ఒకసంధి ముగిసింది.) తర్వాతి సంధిలో ఇంద్రుడు అప్సరసలతోకూడ భూలోకానికి ఎలాపోవాలని చర్చ జరుపుతాడు. అప్పుడొక అప్సరస 'ప్రియా, ఇప్పుడెందుకు భూలోకానికి పోవడం ?' అని అడుగుతుంది. దానికి 'ఏమిటో భూలోకజనులు చాల సుందరులట; చూచివద్దామని ఆశఅయింది. అందుకోసం ఇప్పుడుపోవడం' అని అరమరలులేక ఇంద్రుడు సమాధానం చెబుతాడు. 'ఎందుకు, అహల్యను ఇంకా....' అని బెదరిన ఆ అప్సరస తన మాటలను పూర్తిచేసేలోగానే ఇంద్రుడు 'ప్రియా, భూలోకంలో ఈ కలియుగంలో గౌతము లెవరూ లేరు. చింతించవద్దు' అని సమాధానపరిచాడు.

''అక్కడనుంచి అందరూ భూలోకానికి బయలుదేరారు. దాని తర్వాతసంధి 'స్త్రీదర్శనసంధి' దానిలో వర్ణనలయితే అపురూపమైనవి. సన్యాసులనోట్లోనూ నీళ్లు ఊరించేట్టు వున్నాయి. దానిరీతి, దాని నాజూకుతనం, దాని సౌకుమార్యం, దాని మాధుర్యం ఎక్కడినుంచి వస్తాయి నా ఒరటునాలికకు. అయితే ఆసందర్భాన్నిమాత్రం చెప్పి ముందుకు సాగుతాను.

''పౌర్ణమిరాత్రి నిరభ్రమైన ఆకాశం. చెట్టు చేమ చిగిర్చివున్నకాలం. తెరలు తెరలుగా చల్లగాలి వీస్తున్నది. స్వచ్ఛమైన సరోవరం సృష్టిదేవి చెలువానికి అద్దం పట్టినట్టువుంది. ఇలాటి సమయంలో ఒకయువతి కడవ చంకనబెట్టి కాలిఅందెల తియ్యని నినాదంతో సరోవరంవైపు బయలుదేరింది. ఆమె చాల సుందరి. సరోవరానికి వచ్చి మోకాలువరకు నీటిలోదిగి వంగి కడవను ముంచేటప్పుడు పుట్టినధ్వనిని వినీ, నీటిలో తన ప్రతిబింబం చూచీ, ఏదో ఒకవిధమైన ఆనందంతో నవ్వింది.''

''ఆహా ! ఎంతసుందరంగా వుందండీ వర్ణన'' అని భుజాలు ఎగురవేసే పరిశోధకులు తట్టుకోలేక మధ్యనే అడ్డువచ్చి అన్నారు. నామిత్రులు ఆవైపు లక్ష్యంపెట్టక అలాగే ముందుకుసాగిపోయారు.

"ఈ సమయానికి ఆ సరోవరం గట్టుమీదే విడిసిన ఇంద్రుడు ఆమెను చూచాడు. ముగిసింది. ఇంద్రునికి ఇలాటిది చూచినతర్వాత తట్టుకోడం అయ్యేనా ! మరీ మరీ ఆమెను చూచాడు. చూచినకొద్దీ వాడిమోహం ఎక్కువయింది. ఆమె సమీపానికి పోదా మని ఆశపుట్టింది. యోచించాడు. కొసకు ఒకయుక్తి తోచింది. అప్సరసలందరినీ పిలిచాడు. వెంటనే వారూ వచ్చారు. వారికంతా చెప్పాడు. ఏమని ? రూపం బదలా యించాలని. తానుమాత్రం నీటిలోనే అణగివుండి, సమయంచూచి ఆమెలో ప్రవేశిస్తాడట. అప్సరసలు కనిపించకుండా ఆ యువతితోపాటు పోవాలి. సూక్ష్మశరీరం ధరించాలి."

"ఏమండీ ? ఆ సూక్ష్మరూపం ఎట్లావుండినది ? ఏమిటి ? ఎలాగు ? ఏమైనావర్ణన చేశారా ?" అని ఒంటికంటి పరిశోధకులు పరిశోధకదృష్టితో చూచారు.

"దానినే చెబుతున్నాను. కొంచెం తాలిమి వహించాలి. రూపం ఏదంటే, సూక్ష్మ తుంబురురూపం - గుర్రం ముఖం వేసుకోవాలి. తెలిసిందా రూపం ? అక్కడినుంచి ఆమె ఇంటికిపోయి ఆమె శరీరాన్నంతా అమృతం-పాడిపాడి-నింపి దానిని ఇంద్రునికి ప్రవేశించడానికి యోగ్యస్థానంగా చేయాలి. తర్వాత ఇంద్రుడు నీటిలోపలినుంచి ఆమెలో ప్రవేశించాలి. ఇదంతా తెలిసింది. యువతి కడవ యెత్తుకొని ఇంటివైపు బయలుదేరింది. ఆమెవెంట అప్సరసలు (ఇప్పుడు గుర్రం మొగంతో) పోయి ఆమెకు కనిపించకుండా ఇల్లంతా నిండిపోయారు. యువతి ఇంటిపని ముగించి ముసుగుపెట్టి పడుకుంది. సోబాన పాటలు పాడేట్టు వినిపించింది. యువతి ముసుగుతీసి చూచింది. ఎవరూ కనిపించలేదు. మళ్ళీ ముసుగుపెట్టుకొంది. అప్సరసలు మళ్ళీ తమ విరహగీతాలు పాడుతూ తెల్లగ తెల్లవార్లూ ఆ యువతిఒంటిలో అమృతం నింపారు.

మరుసటిదినం ఉదయం యువతి మళ్ళీ సరోవరానికి వెళ్ళింది. ఇంద్రుడు ఆమె కోసం కాచుకు కూచున్నాడు. కడవముంచేటప్పుడు కనపడకుండా కడవలో వచ్చి కూచ్చు న్నాడు. యువతి ఇల్లు చేరింది. ఇంద్రుడు కడవనుంచి చెంబుకు దూకాడు. చెంబునుంచి పంచపాత్రకు జారాడు. పంచపాత్రనుంచి యువతి గొంతులో దూరాడు. (ఇక్కడికి ఒక సంధి ముగిసింది.)

"మరుసటిదినంనుంచి యువతికి వణుకు పుట్టింది. కామబాధ కావచ్చును. చలిజ్వరం వచ్చినవారు వణికేటట్టు వణికిపోయింది - అని వర్ణించాడు. ఉపమాలంకారం అంతేమీ బాగాలేదుకదూ ? పాపం, వాళ్ళఇంట్లోవాళ్ల వైద్యులను పిలిపించారు. శుక్రాచార్యులే వైద్యులై వచ్చారు. ఇంద్రుణ్ని ఆమెపొట్టలో చూచి నవ్వారు. 'క్వనానా చూర్ణం' ఇచ్చారు. క్వనానా చూర్ణమనే మాటకు నాకు అర్థమే తెలియలేదు."

"కామబాధ చలిజ్వరమైనప్పుడు, క్వనానా ఇది క్వినైనా మరి ?"అని కళ్ళజోడు పరిశోధకులు నవ్వారు.

"ప్రాక్తన విమర్శ నడుస్తున్నప్పుడు నవ్వులాటలా ?" నా మిత్రులు కొంచెం కోపంతో గదిరించి ముందు చెబుతూపోయారు. "ముందు వినండి. తర్వాత ఇంద్రుడు



లోపల చిక్కుకున్నాడు. వాడిని ముసుగువేసి కట్టివేసినట్లయింది. అప్సరసలందరూ గాభరాపడ్డారు. వైద్యుడు (రాక్షసగురువుకదా !) వూరికే వదలుతాడా ? మునుపటి సురాసుర యుద్ధం కసిని ఇప్పుడు ఈ ద్వంద్వయుద్ధంలో తీర్చుకోవాలని శుక్రాచార్యులు శిష్యసమే తంగా ప్రయత్నించారు. ఇంద్రుడు చావలేదు. దినదినానికీ పెరిగి పొట్టనిండిపోయాడు. లోపలకూర్చుని వెలుపల అప్సరసలు పాడేపాటలను వింటూవుండినాడు. గాభరాపడవద్దని అప్సరసలకు చెబుతూవుండినాడు. లోపలకూర్చున్న ఇంద్రునికి అప్సరసలు అమృతాన్ని దినమూ ఎవరికీ కనిపించకుండా పంపేవారు. చివరకు దేవలోకపు అమృతంతో మానవ యువతి అమరురాలయింది. ఇంద్రుడూ ఆమే కలిసే స్వర్గవాసులయారు. (ఇక్కడికి స్వర్గగమనసంధి ముగిసింది.)

"నాకు దొరికిన తాళపత్రప్రతిలో ఇంతేవుంది. తర్వాత యింకా వుందో, ఏమో ! అది నాకు దొరకలేదు. అయింది. పొద్దుపోయింది. ఇక బయలుదేరుదాము." అని నామిత్రులు లేచారు. అప్పుడు "ఆపురాణం పేరేమిటి ? చెప్పనేలేదే ?" అని భుజాలు ఎగురవేసే పరిశోధకులు మరొకమారు అడగనే అడిగారు. నా మిత్రులు వెలుపలికిపోతూ "ఈపురాణం పేరా ? చలిజ్వరపురాణం" అని ఇంకా గంభీరంగానే సమాధానమిచ్చారు.

"దీనిని వ్రాసినవారు ఎవరు ? ఎప్పుడు ?" అని ఒంటికంటి పరిశోధకులు కన్ను మూసుకొని అడిగారు. నామిత్రులు గడబిడగా నన్ను తోసుకుంటూ ఇంకా ముందుకు పోయి మా ఆఫీసు వెలుపలివాకిలిదాటి నిలిచి "నేనే, ఇప్పుడు" అని నవ్వుతూ వెళ్ళి పోయారు.

నా మిత్రుల ముఖం విప్పారింది. మా సహచరులముఖం ముడుచుకుంది. నేను నడుమ నిలబడ్డాను. అందరూ నన్ను మింగివేసేటట్టు చూచారు.

"అలాఅయితే క్వనానాచూర్ణం క్వినైనే అయింది కదూ" అని నేనన్నాను.

"అలాఅయితే పాడుదోమలు అప్సరసలా ? సరిసరి ! మంచిపురాణమే !" అని శాంతస్వభావులైన కళ్లజోడు పరిశోధకులు తల ఊపారు.

# 8. బహిరంగ లేఖ

రా. శి.

"నా వెంట నున్నవానికి"

అయ్యా సాంక్రామిక జాడ్యమా !

నేను పోయినచోటెల్లా వెంబడే నీడలాగ వస్తూ, నా సుఖజీవితాన్ని మరుభూమిలాగ చేసే కటికవాడా ! నిన్ను నేను ఎంతని తిట్టను ? నీకు బుద్ధివచ్చేట్టు చేయడానికి ఏమి తపము ఆచరించను ? పరిషత్తుకు అంబికాతనయదత్తుని పద్యాలు వినడానికి వెళ్ళినప్పుడు వెనకకూచుని రాము అయి కనిపించావు. కురుక్షేత్రనాటకానికి శ్రీకృష్ణుడు గీతావాణిని చెప్పడం వినడానికి వెళ్ళినప్పుడు, కుప్పు అయి వెంటకనిపించావు. నీవు ఏరూపం దాల్చినా నీముఖ్యలక్షణాలను ఎవరూ మరిచేట్టులేదు. ఒక్కటి, నేను వెళ్ళినచోటికెల్లా నీవు రానే వస్తావు. రెండు, నా వెనకో, నా ప్రక్కనో కూర్చుంటావు. మూడు, నీ మౌఢ్యాన్ని గట్టిగా దగ్గర ఉన్నవారందరూ రేగిపడేటట్టు చూపించుకుంటావు.

నా జీవితపు సుఖలక్షణాలన్నింటిని ఖండితంగా నాశంచేసిన నీ అపరాధాన్ని ఒక మారు క్షమిద్దాము. పక్కనవున్నవారందరికీ పగగా పరిణమించిన నీతప్పును ఒక్కమారు మన్నిద్దాము. అయితే, నీ మానసికప్రవృత్తిని తెలుసుకొనడానికి చాల కుతూహలం కల వాడిని. దాన్నైనా తెలుపు.

పరిషత్తులో మొన్న సమావేశమయిన మనకందరికీ-నీకూ కూడా-కరపత్రాలను, కార్యక్రమం చీటీలను ఇచ్చారు కదూ ? మొదటి గమకి (పద్యాలు పఠించేవాడు) అంబికా తనయదత్తు అని, ఆయన తనపద్యాలు చదువుతాడని అందరికీ తెలిసేటట్టు స్పష్టమైన కన్నడంలో వ్రాశారు. దానిని చదివికూడ నీవు ఆయన వేదికమీదికి వచ్చినప్పుడు ఆయనే అరవిందఘోషు అని కేకలువేయడానికి కారణమేమి ? అరవిందులు నీకు 'జ్ఞానపరటా' చేశారా ? లేకపోతే, నీబుద్ధి ఆవిధంగా పారినందుకు కారణమేమిటి ?

మొన్న స్వాతంత్ర్యదినోత్సవం ప్రభాతఫేరీ వెళ్లుతున్నప్పుడు గాంధీజీ చిత్రాన్ని ఊరేగిస్తూ బయలుదేరినప్పుడు, నేను దవాఖానా (ఆస్పత్రి) వెలుపలి పడసాలలో(పంచలో) ఉన్నప్పుడు, నీవు నాప్రక్కనే వున్నావు కదూ ? ఆ చిత్రాన్ని చూస్తూ దానిలోనే నిమగ్నుడిని అయిపోయి, స్వయంసేవకుల విప్లవహృదయగీతాన్ని వింటున్నప్పుడు, నాపక్కలో పొడిచి "ఏమండీ, రాజాజీ చిత్రాన్ని ఇక్కడికి ఎందుకు తెచ్చారు ?" అని అడగడానికి నీకేమిరోగం వచ్చింది ? రాజాజీ చిత్రానికీ గాంధీజీ చిత్రానికీ వ్యత్యాసం చూడని నిన్ను భారతదేశంలో భారతమాత కనింది. దీనికేమి కారణం ?



ఒకసంగతిమాత్రం స్థిరం. నీ తల్లి హరికథలలో కూర్చుని మాటలాడుతున్న ఆడది అయివుండాలి. హరిదాసు పాటప్రారంభించినప్పుడు మాట్లాడడం ప్రారంభించే ముసుగు మహిళే నీ జనని అయివుండాలి. నాటకంలో వెనకకూర్చుని మంచి స్వారస్యమైన ఘట్టం వచ్చినప్పుడు చెడ్డచెడ్డగా దగ్గేవాడు, లేక గట్టిగా చీదేవాడు, అథవా ఫలహారపుపొట్లాలను పరపరమని విప్పేవాడు అయిన అన్యాయకారే నీ తండ్రి అయివుండాలి. వీధినాటకాలలో గాలివీచిన సమయంలో నశ్యండబ్బీ తీసి అత్యంతరభసంతో ఆఘ్రాణించే హత్యాకారే నీ సోదరుడయి వుండాలి. పాతగుడ్డలు మొదలయిన సామానులను దారిలో అమ్ముతూవుండి ఒక్కసారిగా విధివిధానంతో పౌరసభాసదస్యుడయినవాడే నీగురువు అయివుండాలి.

అయిందేమో అయిపోయింది. ఇకమీదనన్నా నీకు బుద్ధిరావాలంటే, నీవు ఈ క్రింది అంశాలను మనసార మననం చేసుకో.

(అ) ఉత్తరకర్నాటకంనుంచి వచ్చినవారందరూ అంబికాతనయ దత్తు కారు. అంబికాతనయ దత్తు కవి. ఆయన క్రికెట్ ఆటగాడు కాదు.

(ఆ) కురుక్షేత్రంలో గీతాశ్లోకాలను చెప్పేవారు శ్రీకృష్ణపరమాత్మ వేషధారి. నాటకం యజమాని కాదు; ఖండితంగా కాదు. నాటకం యజమాని వినోదంచేసే బఫూను. అంత కుచోద్యాలు లేనివారు నాటకం కంపెనీ యజమాని ఎందు కవుతారు ! అదీ తెలియలేదూ ?

(ఇ) నరిమన్ బొంబాయిలో ప్రసిద్ధ న్యాయవాది. గాంధీటోపీ పెట్టుకుని సభావేదిక దగ్గిరికి వచ్చినవారందరూ నరిమన్లు కాదు. నీకది తెలియకపోతే ఊరికే వుండాలి.

ఇదంతా చూచినమీదట నీకు ఏమి శిక్షవిధిస్తే సరిపోతుందా తెలుసుకోలేక పోతున్నాను. ఉన్నంతలో ఇంతమాత్రం తోస్తూంది. నిన్ను ప్రజాపక్షంలో చేర్పించి, పౌరసభకు సభ్యునిగా చేయాలి. లేకపోతే ప్రజాప్రతినిధుల సభలో చేర్పించి అందరితోను తిట్లుతినేట్టు చేయాలి. అథవా, గ్రామఫోను దగ్గర, దానిని పెట్టేపనికి నియమించాలి. ఇవేవీ కానప్పుడు, కొసకు గయ్యాళిసంఘం ఉపాధ్యక్షురాలిని నీకు ఇచ్చి పెండ్లిచేయాలి. అట్లయితే, నీవు నోరుమూసుకొని నన్ను గోడుపోసుకోవని నముతున్న

—"నీ ముందున్నవాడు."

# 9. చిలుక

## ఎన్. ఎస్. గదగకర్

రామణీయకం, రూపం, రంగు-వీటిదృష్టితో చూస్తే, చిలుక, పక్షిసందోహంలోకెల్ల అతిమనోమోహరమైనది. మధుమాసంలో పచ్చని వనశ్రీ, ఆహ్లాదకరమైన చల్లని గాలి, రంగవల్లి గీచిన నీలిమామయనిరభ్రాకాశం ఉన్నప్పటికీ, మృదుమధురమైన చిలుకల కలకలస్వనం లేకపోతే, అదొకక్షితిరనికొరతే.[1] "నీరున్న కాసారమునకు అరవిందములు లేవు" అన్నట్టి గతి అప్పుడు ప్రకృతికి ఏర్పడీని. ముఖ్యంగా ఎర్రని వంకరముక్కు, పచ్చని కోమలమైన రెక్కలు, మూడురంగుల మెడ, మంజులమైన మాటలు-చిలుకకు కళ తెచ్చాయి. విశాలవిశ్వంలోని వర్ణప్రపంచంలో చిలుకపేరుతోనే ఒక కొత్తరంగు అడుగు పెట్టిందని చెప్పినా సరే. అన్నిటికన్నా మించిన విషయమేమిటంటే, పండ్లు, కాయలు తిని బ్రదికే, నిరుపద్రవమైన పక్షి అని దీనిపైన ఆబాలవృద్ధానికీ విలక్షణమైన వ్యామోహం.

ఇన్ని సల్లక్షణాలూ వుంటే, ఒకవేళ దృష్టిదోషం తగులుతుందేమోననే సంశయంతో దేవుడు ఈ పక్షికి ఒకదోషమూ పెట్టాడు. అదే, దాని మాటల అపూర్వసరణి. అందు కోసమే చిలుక పంజరంలో వుండవలసివచ్చింది. "ఆత్మనో ముఖదోషేణ బధ్యంతే శుక సారికాః" అనే సుభాషితమూ ఈ మాటలకే పోషకంగా వుంది. ఉండనీ. రాచనగరులోనేమో దానికి బంగారుపంజరం వుంటుంది. నేను ముందు, నీవు ముందు అని, రాజు రాణుల పరివారము, తెరపిలేక పంజరంపక్కన సాలుకట్టివుంటారు. అందరూ తమ చేతులు చాచి, మమతతో మేను తడువుతారు. చిలుకకు అప్పుడు తినడానికి దానిమ్మ గింజలు, త్రాగడానికి అమృతసదృశమైన పాలు, ఆమీద ఎల్లప్పుడూ సత్కథాలాపం. అక్కడి మాటనే చిలుకనోటినుంచి చెప్పిద్దామనే కోరిక. ఇంతటి అనుపమ ఐశ్వర్యంలో అసలో కండెలాగవున్నప్పటికీ, చిలుకకు తనజీవితం నిరర్థక మనిపించడం ఎందుకు? స్వచ్ఛందవిహారం లేకపోవడంవల్ల దాని హృదయంలో కలిగినవేదన అంతింతకాదు. చెట్టునుంచి చెట్టుకు ఉన్మాదంతో-వెట్టిగా-ఎప్పుడు, ఎన్నడు ఎగిరేను అనే బుద్ధి దాని పాలిటికి తప్పిందికాదు,

మొట్టమొదట పక్షులలో చిలుకస్థానం మేలైనదని చెప్పనేచెప్పాలి. కోకిల మధుమాసజీవనమనే కల్పన జనంలో వున్నప్పటికీ, దాని నలుపు రంగుకు పేరు పెట్టేటట్టు వుంది. నారంగుకూడ అదేనని కాకి జంభాలు కొట్టాలంటే అవకాశమే లేదు. ఎందుకంటే

1. "నీరిద్ధకాసార కరవింద మిల్ల".



గయ్యాళితనం, మోసం, కర్కశధ్వని-వీటివల్ల వాస్తవప్రపంచంలో దానిని ఎవ్వరూ మోహించరు అన్నప్పుడు, చిలుకతో సరితూగే త్రాణ కాకికి రావడం ఎలా? జనం ఇంటి ముందు అందమైన గూళ్లుకట్టి గింజలు, పుల్లలు కొల్లబెడుతారనే దృష్టితో పావురాళ్ల సంగతి యెత్తామా, వాటిరంగు ఆకర్షకంగా వుండవద్దూ? ఒకేవిధమైన తెల్లరంగు! అంతే కాక, తమముందు గింజలు పడివున్నా, కసువు కడ్డి, పురుగు పుట్ర ఏరుకొనేజాతి పావురాళ్ళది. హంసక్షీరన్యాయంమూలంగా జాణతనానికి పేర్వాసిపొందిన రాజహంస ఒకవేళ తన చెలువపు వైభవాన్ని గొప్పలుగా చెప్పుకోవచ్చు. అయితే, పాపం! దానికి పాటలేదు; మాట లేదు-చిత్తాకర్షకమైన నిర్జీవపదార్థంలాగ. అంతా మూగవిద్య. అందువల్ల వ్యావహారిక ప్రపంచానికి అది నిరుపయోగమే. సందేహం లేదు. కలాపభారం ఆడంబరం మూలంగా, నెమలి తన అవర్ణనీయమైన తీవి సొగసును ప్రదర్శించడానికి పూనుకుంటే, దాని ఒంటిమీద వివిధవర్ణాలు వర్ణసంకరానికి మాదిరిఅని అనిపిస్తుంది. నైజ సౌందర్యాన్వేషణకు ఇదొకలోపం. అతఏవ, సుకుమారమైన చిలుకకే పట్టాభిషేకం నిశ్చయం.

ప్రాణివర్గంపై పరిసరప్రభావం వుందని మార్మికంగా తెలుపడానికి చిలుక నడవడినే నీతి నిపుణులు ఉదాహరించడం కద్దు. కటికవాడియింట్లోవుండే చిలుక అనుదినం అమంగళమైన మాటలు ఆలించి, అసహ్యమైన పనులు చూచి వచ్చిపోయేవారితో చెడ్డ మాటలే అనేదట. తద్విరుద్ధంగా అయ్యగారిమఠంచిలుక పురాణప్రవచనాల మంచి మాటలు విని, ఎప్పుడూ సత్సహవాసంతో వుండి, నయవినయాదిగుణాల ఆగారమై వుండినదట. మంచివారి లక్షణం ఇలాగు, చెడ్డవారి సంగతి అలాగు అని వ్రేలుపెట్టిచూపి సమాజానికి మేల్తరగతి నైతికస్థాయిని సూచించే సొత్తు పక్షినివహంలో చిలుక వినా ఏ మరొకపక్షి ఇంతవరకూ సాధించలేదు. ఈ విధంగా మానవసమాజం సామీప్యం పొందిన పక్షిఅంటే, చిలుకేనని నిర్వివాదంగా చెప్పవచ్చు.

పరిసరాల సునిశ్చితమైనకల్పన చేయించే ఒకేఒక కారణంవల్లనే చిలుకకు అటువంటి ప్రశస్తి కలుగలేదు. భావప్రపంచంలోనూ చిలుకకు విశిష్టమైన మన్నన ఉంది. ఏ చిన్నపిల్లలనైనా చెడ్డపనినుంచి మనసు తిప్పడానికి "నా రాచిలుక" అని ప్రేమతో పలుకులు పలుకుతున్నప్పుడు, అది ముద్దులకణి, సద్గుణమణి అనే మథితార్థం. ఈవిధంగా పిల్లలను నా రామచిలుక అని లాలించకపోతే, ఉబ్బించకపోతే వారికోపం తాపం శాంతం కాదు. ఇలాటి అపూర్వమైన సామోపాయం పక్కకుపెట్టి "థూ! గాడిదా!" అని తిడితే, పిల్లలు క్రమంగా గాడిదలలాగే మొండివాళ్లుకావడం నిశ్చయం. ఈ విధంగా, మనశ్శాస్త్రవిషయంలో మనకుగల అజ్ఞానమూ దీనివల్ల చాలినంత ప్రదర్శిత మవుతుంది.

మమత ముకుపుకట్టినట్టున్న ఇలాంటి చిలుకకు దేవవాణిలో "శుకం" అని పేరు. పౌరాణిక సన్నివేశాలలో ఉదాహృతమైనట్లు ఆపేరుగలవాడు మహావ్యక్తి, మహర్షి, తత్త్వజ్ఞాని. ఇతని నైతిక ఉన్నతస్థాయివల్లనే, రంభ అనే సుప్రసిద్ధ అప్సరస నిరుత్తరు

రాలైంది. ఆమె రతివాసన పేరులేకుండా పోయింది. ఆ శుకమునే ముందుముందు భాగవత పురాణం పరీక్షిన్మహారాజుకు చెప్పినట్టు పౌరాణిక ప్రవాదం. ఏమైనా, ఆత్మ సంయమనానికి, ఇతనిపేరు పూర్తిగా ఇంటిమాటకావడం సామాన్యమైన సంగతికాదు.

సౌందర్యానికి ఆయువుపట్టని కళోపాసకులూ చిలుకను సాహిత్యవివిధాంగాలలో వర్ణించిందీ వుంది. లక్ష్మీశకవి మహాకావ్యనాయిక అయిన సీతాదేవిని కీరవాణి అని వర్ణించి చిలుకజాతికి తగిన గౌరవం కలిగించాడు. "లేజిలుక మెడ విరిచి మోది రెవరు ?" [1] అని షడక్షరకవి శివభక్తురాలి మోహపుత్థళి అయిన బాలుని సుకుమారావస్థను హృదయవిదారకంగా వర్ణించేటప్పుడు, చిలుక కోమలతాభావం పాఠకుల మనస్సుకు రాకమానదు. ఎలాటి ఆడంబరభావాలు లేక లలితపదసముచ్చయంగల సాత్త్వికకావ్యాన్ని ప్రతిభావంతులైన కవులు ఇష్టపడుతారనడానికి దృష్టాంతంగా "చిలుకలు పండ్లు తినునట్లు" [2] అనే ఉపమ చెప్పడం ఎంత ఉచితం ? ఎటువంటి నిసర్గరమణీయత ! తక్కిన పదిపన్నెండు మాటల మాలలు ఇంత సమర్పకంగాను భావగర్భితంగాను ఈభావాన్ని తెలుపజాలవు. అలాటి దానిని చిలుకద్వారా సాధించడమైనది. బాణుని అద్భుతరమ్యమైన కాదంబరిలో అయితే చిలుకకు మానవపాత్రవంటి పెద్దతనం ఇవ్వడమయింది. చిలుకకు ఉన్న మాట్లాడే వైశిష్ట్యాన్ని అనులక్షించే, బాణుడు తన కాదంబరిలో దాని మూడుజన్మల శోభను పెట్టాడు కాబోలు ! ఆ పరిణామంవల్లనే పుండరీకుడు ముందుజన్మలో వైశంపాయనుడు కావడం; అంతకుముందు జన్మలో చిలుకయ్యాడు. తనపూర్వ జన్మకథ సొంతం వర్ణించినమీదట దాని శాపవిమోచనకాలం ఒదగింది; మహాశ్వేతతో సమాగమమయింది. ముఖ్యంగా, పాత్ర పరిపోషణకౌశలంలో, మహేంద్రజాలంవంటి స్వర్గీయకథను పేనడంలోను, కల్పనా విలాసాన్ని సృష్టించడంలోను, మానవుని భావప్రపంచాన్ని అద్దంపట్టి చూపించడంలోను బాణునికి చిలుక సహాయపడడం అంతింతకాదు.

ఆంగ్లసాహిత్య లోకంలో వర్డ్స్‌వర్థ్, షెల్లీ, కీట్స్ స్కైలార్క్‌పక్షికి లేక నైటింగేల్ పక్షికి మేలుస్థానం, మొదటిమానం సమకూర్చితే, చిలుకకూ కన్నడ సాహిత్యంలో అటువంటి లోకప్రియత సమకూరడం యుక్తం. కవితా సృష్టికి చిలుక స్ఫూర్తిదాయకం. షెల్లీకవి లార్క్‌పక్షిని "కాదంబినిలో కిన్నరకంఠి" అని సంబోధిస్తే చిలుక పలుకులూ అంత రుచికరమైనవే. ఆకాశపు ఉయ్యాలలో తూగాడి నక్షత్రమాల సొబగునే మరుగుచేసేటట్టు వున్నప్పటికీ, చిలుక చిన్నహృదయం ప్రతిదినం సంధా కాలంలో చెట్లగుబురులోని పిల్లల దగ్గరే ! కొనకు "జ్ఞానభారంతో చెడనివారి" [3] హృదయంలాగ చిలుక వాస్తవత. సుందరత, తాత్వికత - ఈ త్రివేణీసంగమమని మనం గ్రహించవచ్చును కదూ !

1. ఎళెగిళియం కొరళ్మురిదు మోదిదరార్ ?
2. గిళిగళు హణ్ణుగళన్ను తిన్నువంతె.
3. "జాణదభారదిం కెడదవర"

# 10. వ్యాసంగపు హవ్యాసం

డి. ఎల్. నరసింహాచార్

"కొన్నిటి ప్రాజ్ఞులం దెలిసి కొన్నిటి శాస్త్రములందు జూచుచున్" [1] అని పులిగెరె సోమేశ్వరుని మాట. ప్రాజ్ఞులనుంచి నేర్చుకొనేవిషయమైతే అతిశ్రేష్ఠమైనదే. ఈ విధంగా నేర్చుకొనడానికి సాధ్యంకానప్పుడు "శాస్త్రముల" చూచి నేర్చుకొనేమార్గమే సులభమైనది. ఇక్కడ శాస్త్రములు అనే మాటను కవి అన్నిరీతుల గ్రంథసముదాయాన్ని మనసులో పెట్టుకొని ప్రయోగించాడు. దీనిలో రసభావ ప్రధానమైన కావ్యనాటకాది గ్రంథాలు, విజ్ఞానశాస్త్రాలు, రాజకీయసాంఘిక గ్రంథాలు, చరిత్రలు, యంత్రోపకరణ విషయ గ్రంథాలు చేరివున్నాయి. ఇవే కాక రైల్వేగైడువంటి గ్రంథాలు, సర్కారు పరిపాలన విషయ ప్రకటనలు, ఇంకా మరికొన్ని లౌకిక పారమార్థిక జ్ఞానదాయక గ్రంథాలు ఉన్నాయి. ఈ గ్రంథాలన్నిటినీ ఒక్కడే తన ఆయుఃప్రమాణంలో చదివి ముగించడం పూరా అసాధ్యమైనది. తనకు ఏ విషయంలో ఆసక్తి వుందో, దేనిలో తన బుద్ధి చురుకుగా పారుతుందో, ఆ విషయాన్ని గురించిన గ్రంథాలనుమాత్రం ఎన్నుకుని చదువవలసివుంటుంది. ఇదికూడ కష్టసాధ్యమైనదే. ఎందుకంటే, ఏ అల్పవిషయమేకాని, దానిని గురించిన గ్రంథాలసంఖ్య ప్రపంచంలోని నానాభాషలలో అపారంగా వుంది. అందువల్ల దీనిలోను వ్యక్తి వివేకం ఉపయోగించి ముఖ్యమని తోచే గ్రంథాలనుమాత్రమే చూడవలసివుంటుంది. ఈ విధంగా గ్రంథాలను అవలోకించి జ్ఞానం సంపాదించడాన్ని వ్యాసంగం అంటారు. తీసుకున్న విషయాన్ని పట్టుపట్టి ఆసక్తితో అభ్యసించడం నిజంగా వ్యాసంగం. కాని, ఇక్కడ ఆపదం అర్థాన్ని కొంచెం సడలించి వినోదంకోసం చదువడానికి కూడా వర్తించే విధంగా వాడాను.

హవ్యాసం [2] అంటే ఇష్టం, ఆసక్తి, అభిలాష. ఒకనికి ఒకటి రెండు విషయాలలో మాత్రమే తీవ్రమైన ఆసక్తి ఉంటుంది. తక్కిన విషయాలలో దైనందిన వ్యవహారానికి ఎంతకావాలో అంతమాత్రం తెలుసుకొనిఉంటే చాలు. ఈ విధంగా తెలుసుకొనడం హవ్యాసం అనిపించుకోదు. కొందరి జీవితంలో చదువడం దైనందిన కార్యకలాపంలో ఒక అంశం. ఏనాడన్నా ఒకనాడు ఏవో కారణంవల్ల చదువలేకపోతే వారి మనస్సుకు నెమ్మది అనేది వుండదు. కాఫీ తాగకపోతే, నస్యం పీల్చకపోతే, జీవితం ఎలా

1. కెలవం బల్లవరిందె కల్తు కెలవం శాస్త్రంగళం నోడుతం
2. హవ్యాసమనేమాట పశ్చిమాంధ్రలో పిచ్చిఅలవాటుకు వ్యవహారంలో వున్నందున కన్నడపదానికి దగ్గరిదని వాడాను—అనువాదకుడు.

వ్యర్థంగా, వట్టిదిగా కనిపిస్తుందో అలాగే, చదువకపోతే, కొన్ని ప్రాణాలకు హితంగా వుండదు. ఇలాటివారికి దినసరి రూఢి అయివుంటుంది. హవ్యాసం అనేపదాన్ని ఈ అర్థం లోనూ వాడడం మన జనంలో కనిపిస్తుంది. ఏదైనా ఒక హవ్యాసం ప్రతివానికీ వుంటుంది. కొన్ని హవ్యాసాలు, తీవి వున్న వ్యక్తులకుమాత్రం హితమో, అహితమో కలిగించ వచ్చు; కొన్ని చుట్టూవున్న సమాజానికిమాత్రం మంచిదిగానో, చెడ్డదిగానో పరిణమించ వచ్చు. మరికొన్ని వ్యక్తికీ, సమాజానికీ ఏకకాలంలోనే క్షేమం, క్షోభం కలిగించవచ్చు. వ్యాసంగపుహవ్యాసానికీ ఈ అన్ని లక్షణాలూ ఉన్నాయి. చదివినది మంచిదైతే, దానినుంచి ఎవరికీ చెడుపు కలుగదు. తస్కరశాస్త్రం చదివితే, చదివినదాన్ని ఆచరణలో పెడితే ఎవరికీ కష్టాలు తప్పవు; పత్తేదారుకు దీనినుంచి ప్రయోజనం వుండనేవుంది. గొడారి మొదలు మంత్రివరకు, రాక్షసుడు మొదలు తపస్వివరకు ఎవరికివారు వ్యాసంగం చేయ వలసిన విషయాలు చాల ఉన్నాయి. వీటినిగురించి ఇక్కడ వివరించడం సాధ్యంకాదు. పొద్దుగడపడానికీ, వినోదానికీ కొద్దీ గొప్ప జ్ఞానార్జన చేసుకోడానకీ అవసరమైన గ్రంథ వ్యాసంగంగురించి మాత్రం ఇక్కడ కొంచెంచెప్పాను.

స్వంతఅనుభవంతో వచ్చే తెలివితేటలే ఉత్కృష్టజ్ఞానమైనప్పటికీ, అది అందరికీ, అన్నివిషయాలలోను లభ్యంకాదు. ప్రతివారి అనుభవానికీ పరిమితి వుంది. ఆ పరిమితిని కొంచెం విస్తరించుకోవాలంటే గ్రంథవ్యాసంగం అవసరం. ఈ విస్తరణకార్యం ఒక్క దినంలో జరిగేది కాదు. ప్రతిదినమూ కొంచెంకొంచెం విస్తీర్ణమవుతూపోతుంది. అందువల్ల వ్యాసంగం అనేది హవ్యాసం కానే కావాలి. మనుష్యస్వభావం బాగా తెలియాలంటే, ఒక వ్యక్తి నూరారుమందితో కలిసి తిరిగి పరీక్షచేయాలి. ఇది ఎంతమందికి సాధ్యం? లోకంలో ఎంతోమంది వున్నప్పటికీ, వ్యక్తిపాలిట వారు లేనట్టే; అందరితోనూ, వాడు సన్నిహితంగా సంబంధం కలిగించుకోడం కానిపని. వాడి ప్రపంచంలో వీధిలోకి వెళ్లితే "ఏమండీ, బాగున్నారా?" అని అడిగేవారిసంఖ్య హెచ్చుగానే వుంటుంది. వారిలో వీడికి కావలసినవారు, కష్టసుఖాలలో ఆదుకొనేవారు తీరా తక్కువ. ఆత్మీయత పొందే వారయితే, ఎన్నికకే దొరకరు. వ్యక్తి ప్రపంచం ఇంత చిన్నది. దీనినుంచి కలిగే అను భవం విశాలంగాను, గంభీరంగాను ఎలా వుంటుంది? అయితే ఇది ప్రత్యక్షమైన అనుభవం కావడంవల్ల విలువయింది. దీనిని విస్తరింపజేసుకోవాలంటే; వ్యాసంగంకన్నా ఉత్కృష్ట మైన మార్గం లేదు. కథలు, నవలలు, నాటకాలు చదివితే, మనుష్యస్వభావపరిజ్ఞానం ఎక్కువగా కలుగుతుంది. మన అనుభవంలో ఎదుర్కొజాలని వ్యక్తులను మనం అక్కడ చూస్తాము; మనం కానని సమస్యలూ, ధర్మసంకటాలూ అక్కడ కనిపిస్తాయి. మన కంటే నూరింతలు అనుభవశాలి అయిన కవి జ్ఞానభండారం మనవశం అవుతున్నది. కవి మాట అలా వుండనీ. న్యాయస్థానాలలో జరిగే అభియోగాల నివేదికలను చదివినా చాలు. లోకంలో ఎలాంటి చిత్రవిచిత్ర స్వభావంగలవారున్నారనే విషయం తెలుస్తుంది; లోకలీల చూచి ఆశ్చర్యపడుతాము. ఈవిధంగా వ్యాసంగంవల్ల వచ్చేజ్ఞానం ప్రత్యక్షమైన అనుభ



వానికి సాటి కానప్పటికీ, దాని ఎల్లలను విస్తరింపజేస్తుంది. అనుభవజ్ఞానానికి వ్యాసంగ జ్ఞానం పూరకమవుతుంది.

వ్యాసంగం హవ్యాసంగా వున్నవారికి తమజ్ఞానం పెంపొందించుకోవాలనే ఒకేఒక ఉద్దేశం వుండదు. కొందరు తాము నేర్చిన విషయాలను ఇతరులకు తెలుపాలనే కోరికతో గ్రంథరచన చేస్తారు. ఇతరులు అర్థంచేసుకోనీ, చేసుకోకపోనీ, వ్రాసినగ్రంథం ఖర్చయి, కొంచెండబ్బు చేతికివస్తే, ఎవరిది ఏమిపోయింది అనే మనఃప్రవృత్తి కొందరిది. కీర్తికోసం వ్రాసేవారు మరికొందరు; మనస్సులో కొట్టుకుంటున్న ఆలోచనలభారాన్ని వెలుపలికి పడవేసి, మనస్సమాధానం పొందాలని వ్రాసేవారు కొందరు; సమాజంలోని అన్యాయాలతో కుతకుతలాడి క్రుద్ధులై జనుల మనస్సును రెచ్చగొట్టి విప్లవాన్ని రేపాలని వ్రాసేవారు మరి కొందరు: "కావ్యం యశసేర్థకృతే, వ్యవహారవిదే శివేతరక్షతయే; సద్యః పరనిర్వృ తయే కాంతాసమ్మితతయో పదేశయుజే" అని మమ్మటభట్టు కావ్యవ్యాసంగోద్దేశాలను వింగడించి చెప్పారు. ఈ నిర్వచనాన్ని అన్నిరీతులగ్రంథవ్యాసంగానికీ అన్వయించవచ్చు. ఉద్దేశంలేని వ్యాసంగహవ్యాసం అర్థహీనమైంది. కళ కళకోసం, వ్యాసంగం వ్యాసంగం కోసం అనే సిద్ధాంతాలలో నాకు నమ్మకం తక్కువ. ప్రయోజనాభిలాష లేక ఏ పనినీ ఏ మూర్ఖుడూ చేయడనేది పెద్దలమాట, ఇది అనుభవసత్యం. అందువల్ల వ్యాసంగహవ్యా సానికి వుండేతీరవలసిన ఉద్దేశాలనూ, ప్రయోజనాలనూ పరిశీలించడం అవసరం.

మనకు కలిగే సుఖదుఃఖాలు రెండువిధాలు. మొదటిది శారీరకం, రెండవది మాన సికం. ఒకటి స్థూలం, మరొకటి సూక్ష్మం. శారీరకసుఖంకన్నా మానసిక సుఖానికి విలువ ఎక్కువ. ఒకొక్కప్పుడు మానసికసుఖం ఎక్కువగా ఉంటే, శారీరకదుఃఖాన్ని కూడ మరచిపోవచ్చు. వ్యాసంగంవల్ల మనం ముఖ్యంగా పొందేటటువంటిది మానసిక సుఖం. దానిలోను, రసభావరసాయనమైన కావ్యనాటకాదులను చదివితే, మన మనస్సుఖం ఆనందపు అంతస్తును అందుకుంటుంది. దీనికి కుమారవ్యాసుని రచన భారతంనుంచి చిన్న ఉదాహరణం ఇవ్వవచ్చు. "ఇతరసకియలచూపు మేనిపై పారినా అలయదు, మనసు ఈమెతో నిండిపోయినా భరువుగా తోచదు, మేలైన మాటలనువిన్నకొద్దీ చెవులకు అరుచి పుట్టదు; నాసిక మేని పరిమళపూరంలో మరొకవాసననే కోరదు; రూపం ఏమందును?"[1] అని విస్మయపడినాడు. చూపరుల పంచేంద్రియాలకు అనుభవించినకొద్దీ ఇంకా కావాలనే దైహికసౌందర్య పరమావధిని ఇక్కడ కవి సూచించినాడు. ఇటువంటి అందకత్తె రాజ స్వయంవరమంటపంలో అడుగులువేస్తూ నడుస్తున్నప్పుడు, దగ్గరినుంచి చూచే

1. హొరెయ సఖియర నోట మైయలి
హరిదు బళలదు, చిత్త పీకెయొ
ధరిసి కుసియదు, కివిగళిగె మేల్నుడియ సవి సవిదు
అరుచి యాగదు, నాసికవు మై
పరిమళదపూరదలి గంధాంతరకె నెరెయదు, రూప నేనెంబెను!

సుందరుల అవస్థ ఏమైవుంటుంది? తమను తామే మరచి నిశ్చేష్టులయారట వారు. "మడిచిన తమలపాకు వ్రేళ్లసందునే, నోటిలో వేసికొన్న తమలపాకు నోటిలోనే. సచివులమాట వినరు. లోచనాగ్రములలో కాంతినే చూడరు."[1] అని కవి రససూక్తి. నృపులు రెప్పపాటు వేయకుండా కళ్లు తెరచుకొనే కూర్చున్నారు. ఇటువంటి పరవశభావం వారి మనస్సులో ప్రవహించింది; మానసికసుఖ పారవశ్యం వారిమీద వీచింది. కావ్యవ్యాసంగంవల్ల కలిగే పరిణామమూ ఇటువంటిదే. దీనినే "సద్యః పరనిర్వృతి" అని మమ్మటభట్టు అన్నారు. వీనులకు చిక్కని లలితారవసుఖాన్ని, రసనకు ఒదగని అమృతద్రవాన్ని"[2] పొందాలంటే కావ్యంవంటి కళతో మాత్రమే సాధ్యం. కావ్యవ్యాసంగ పరమార్థమే యిది. ఈ వ్యాసంగాన్ని హవ్యాసంగా పెట్టుకున్నవారు నిజంగానే సుఖవంతులు. వారి పాలికి దుఃఖంకూడ ఆనందదాయకమవుతుంది. లోకంలోని దుఃఖం కావ్యంలో రూపుగొన్నప్పుడు చెప్పలేని ఏదో రసాయనక్రియవల్ల ఆనందస్యందిగా మారిపోతుంది. ఇటువంటి ఆనందంముందు శారీరకసుఖం చప్పగా కనిపించడం ఆశ్చర్యమేమీకాదు.

శాస్త్రవ్యాసంగంతోను ఇలాటి మానసికసుఖాన్ని పొందవచ్చు. ఇక్కడ రాగభావాలు ఉద్రేకపడే ప్రసక్తిలేదు. బుద్ధికార్యమే ఇక్కడ ప్రధానం. ప్రకృతి రహస్యాన్ని భేదించడానికి బుద్ధి, తుపాకినుంచి వెలుపలికి వస్తున్న తోటాలాగ ముందుకు తోసుకొని పోతున్నప్పుడు ఇతరవిషయాల ఊసే దానికి వుండదు. అది తానే తానై తనసాహసంలో సుఖం అనుభవిస్తుంది రహస్యాన్ని కనిపెట్టినప్పుడైతే దానికి కలిగే ఆనందం వర్ణించడానికి అసాధ్యం. కఠినమైన ఒక గణితశాస్త్ర సమస్యను బుద్ధి పరిశ్రమతో పరిష్కరించినప్పుడు సంతోషం కలగడం అందరికీ అనుభవసిద్ధమే. ఆర్కిమిడీస్ తనపేరుతో ఖ్యాతి చెందిన గణితశాస్త్ర సూత్రాన్ని కనిపెట్టినప్పుడు "నేను కనిపెట్టాను" అని కేకలువేస్తూ చిందులు తొక్కాడట. అతని మనస్సుకు అంతసుఖస్పర్శ కలిగింది. అల్పమైన ఇటువంటి పరిశోధనతో ఇంత సంతోషం కలిగేటట్టయితే, అతిగహనమైన ప్రకృతి రహస్యభేదనంతో కలిగే ఆనందానికి మితి వుంటా? అణువుల, పరమాణువుల నిర్మాణరహస్యాన్ని కనిపెట్టడం, అణువును ఖండించడం, గ్రహనక్షత్రాల, పాలవెల్లి చలన వలన నియమాలను తెలుసుకొనడం, అగాధమైన భౌతికశక్తులను వశపరచుకొని వాటిని పాలించడం- మొదలయిన సాహసాలలో జయంపొందిన మానవునిబుద్ధి ఎంత ప్రచండమైనది! ఇలాటి బుద్ధి పౌరుషంతో కలిగే ఆనందం మేలైనది. కొన్నిశతాబ్దాలుగా మనుష్యబుద్ధి నిరంతరం పరిశ్రమించి సేకరించిన విజ్ఞానభండార పరిచయాన్ని వ్యాసంగంతో పొందే ఆసక్తికలవారికి ఆబుద్ధియాత్రలో ఆనందమూ లభిస్తుంది.

---

1. మడిఃదెలె బెరళొళగె బాయొళ
   గడసిదెలె బాయొళగె సచివర
   నుడియ కేళరు సుళియకాణరు లోచనాగ్రదలి.
2. శ్రవణకె సిలుకద లలితారవసుఖమం రసనె గొదవదమృతద్రవమం.



విజ్ఞానశాస్త్రపరిశోధనలలో ఎక్కువభాగం బుద్ధితర్కశక్తితో లభించినట్టి సిద్ధులు. అతిముఖ్యాలూ, ముందుముందు నూరారు సంశోధనలకు బీజభూతాలూ అయిన కొన్ని తత్త్వాలు విజ్ఞానశాస్త్రజ్ఞులకు మెరపులాగ స్ఫురిస్తాయి. దీనిని తర్కాతీతజ్ఞానమనో-స్వయం ప్రకాశితజ్ఞానమనో (Intution) అనవచ్చును. "సాపేక్షసిద్ధాంతం" ఐన్‌స్టీనుకు ఈ రీతిగా గోచరమైనదట. ఇటువంటి సందర్భాలలో విజ్ఞానశాస్త్రజ్ఞుడు ఋషిసదృశుడవుతున్నాడు. కవియొక్క దివ్యభవ్యసృష్టికి అతని ప్రతిభ ఎలా కారణమో, అలాగే విజ్ఞానశాస్త్రజ్ఞుని గంభీరసిద్ధికి అతని స్వయంప్రకాశితజ్ఞానం కారణం. ఇటువంటి విషయాలను వ్యాసంగం చేస్తూపోతే ఎవరికి ఒళ్లు పులికించదు!

ఈ విధ గా కావ్యశాస్త్రాలు రెండూ, వాటిని వ్యాసంగంచేసేవారికి ఆనందం లభింపజేస్తాయి. కావ్యంలో రాగభావాలమూలంగా ఆనందస్థాయి లభిస్తే, శాస్త్రంలో బుద్ధిమూలంగా ఆ స్థాయే లభిస్తుంది. ఈ ఆనందాలలో ఎలాటి వ్యత్యాసమూ లేదు. దానిని చేరుకోడానికి కావ్యశాస్త్రాలు వేరువేరు మార్గాలు. విజ్ఞానశాస్త్రజ్ఞుడు కళాభ్యాసాన్ని, కళాకారుడు విజ్ఞానాభ్యాసాన్ని పెట్టుకొంటే చాల మంచిది. ఇద్దరి మనస్సులూ పరిపూర్ణమవుతాయి. విజ్ఞానశాస్త్రజ్ఞుడైన ఐన్‌స్టీన్ ఫిడేలును వాయించడంలో అత్యంత నిపుణుడట. సుప్రసిద్ధ ఆంగ్లభాషాకవి టి. ఎస్. ఎలియట్ విజ్ఞానశాస్త్రంనుంచి కావ్యరచనకు ప్రేరణ పొందుతాడట. ఆల్డస్ హక్స్లే అనే మరొకకవి ఎక్కడికైనా వెళ్ళినప్పుడు వివిధజ్ఞానఖని అయిన "ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా" (ఆంగ్లవిజ్ఞానసర్వస్వం) అనే మహాగ్రంథాన్ని తనవద్ద ఉంచుకొంటాడట. పొట్టతిప్పలకోసం మానవుడు ఏదోఒక విద్యను నేర్చుకునే తీరాలి. దీనికి సంబంధించని ఏదైనా మరొక విద్యావ్యాసంగం వుండాలి. దీనివల్ల వ్యక్తి మనుగడ నిండుతుంది.

మానవుడు సుఖాపేక్షి. ఈ సుఖం అతనికి బాహ్యప్రపంచంనుంచి లభించవచ్చు: తనలోనే దానిని కానవచ్చు. మనసుకు వేసట కలిగినప్పుడు చీట్లపేక ఆడవచ్చు, సినీమా చూడవచ్చు, సంగీతం వినవచ్చు; ఇలాటి పలుక్రీడలలో మనస్సును నిమగ్నం చేసి, వేసటను పోగొట్టుకోవచ్చు. అయితే, మనం పోయినచోట్లన్నింటిలోను ఇలాటి అనుకూల్యం కలిగే భరోసా లేదు. మనఊరు వదలి ఏదో పల్లెటూరికి పోతే, చీట్లపేక చెలికాండ్రు, మానసప్రియులు, అక్కడ దొరుకుతారా? సినిమా మందిరాలు అక్కడ వుంటాయా? సంగీతకచేరీలు జరుగుతాయా! పరావలంబి అయిన సుఖం మనకు సర్వకాలాలలోను ఒకేవిధంగా దొరకడం అసంభవం. అందువల్ల తనలోనే తాను సుఖపడే సామగ్రిని పొందివుండడం వుత్తమమైంది. సంగీతాన్నో, వాద్యవాదనాన్నో హవ్యాసంగా నేర్చినవాడు ఎక్కడికి వెళ్లినా, ఎప్పుడు కావలసినా, ఒంటిగా వున్నా, గుంపులో వున్నా నిమిషంలో తన కళాశక్తిలోనే సుఖపడే జీవి కావచ్చు. జేబులో తనకు ప్రియమైనగ్రంథం ఒక్కటి వుంటే నూరుమంది మిత్రులు జతలో ఉన్నట్టు. అందువల్ల వ్యాసంగపు హవ్యాసం మానవుణ్ని ఆత్మారామునిగా చేయగలదు. ఇంతకన్నా మేలైనసుఖం మరొకటి ఏముంది?

వ్యాసంగపు హవ్యాసంవల్ల కలిగే పరమప్రయోజనం గురించి ఇంతవరకు చూచాము. దీనివల్ల కలుగగల కొన్ని అనర్థాలను ఇక చర్చించవచ్చు. "చదివి చదివి మతిపోయిన కూచిభట్లు"[1] అనేది ఒకసామెత. ఈ కూచిభట్లు ఎవరో సరిగా తెలియదు. కూచిభట్టారకుడనే ప్రాచీన జైనాచార్యుడొకడు ఉండేవాడు. అతడు పరమపండితుడనడంలో సందేహం లేదు. అతనికి కానివారో, భిన్నమతస్థులో పరిహసించడంకోసం ఈ సామెతను కల్పించి వుండవచ్చు. అశోకచక్రవర్తి ఎంతో శ్రద్ధతో తనను "దేవానాం ప్రియః" అని చెప్పుకుంటే, దానికి మోసగాళ్లు మూర్ఖుడు అనేఅర్థం కల్పించారు. ఈ విధంగా కూచిభట్టారకునికీ జరిగివుండవచ్చు; ఇది ఉండనీ; ఈ సామెతలోని కూచిభట్టుకు మతిపోయిందని, దానికి కారణం పఠనహవ్యాసమని స్పష్టమైంది. వ్యాసంగహవ్యాసం ఎక్కువయితే అది పిచ్చిగా మారవచ్చు. అందువల్ల ఈ విషయంలో మితిమీరకుండ హెచ్చరికతో వుండాలి. పఠన హవ్యాసం మన మనోబుద్ధి బలాలను ఆక్రమించుకొని మనను దాస్యంలో తొక్కివేయవచ్చు. ఇలా జరుగకుండా పఠనాభ్యాసంపై మన యాజమాన్యం సంతతం స్థాపితమయ్యేటట్టు చూచుకోవాలి. వ్యాసంగాభ్యాసం కొన్నివేళలలో స్వతంత్రాలోచనా శక్తిని కుంగదీయవచ్చు. కొత్తసమస్య తలయెత్తినప్పుడు, స్వంతంగా ఆలోచించడం మాని ఇంకొకడు ఏమిచెప్పాడని వెతుక్కోడంలోనే వుండిపోతే, దీనివల్ల తనబుద్ధిని కోల్పోయి నష్టవుతుంది. అవసరమైనది ఎంతో అంతే చదువు, ఎక్కువగా చింతనచేయి - అని కొందరు చెబుతారు. ఇది ఉచితమైన ఉపదేశమే అయినా, వ్యాసంగహవ్యాసం వున్నవారికి ఇది అంతగా రుచించదు. ఇతరుల ఆలోచనలను మనస్సులో నింపుకొంటున్నప్పుడే, వాటి విషయంలో కొంచెం సందేహిస్తూనే, సరో కాదో అనే విమర్శ చేసుకొంటూనే పోతూవుంటే చాలు; మనబుద్ధిని మరొకనికి అమ్మివేసే ప్రసక్తి కలుగదు. ఇంకొకరి ఆలోచనా నికషోపలంపై మనబుద్ధిని అటుఇటు తిప్పితే పదునవుతుంది; తీక్ష్ణంగా ప్రకాశిస్తుంది. అందువల్ల వ్యాసంగహవ్యాసం ఉన్నవారు ఎప్పుడూ తమబుద్ధిని తమచేతులలో పెట్టుకొని వుండాలి. ఇలా వుంటే, స్వంత ఆలోచనాశక్తి ఎన్నటికీ వట్టిపోదు. వ్యాసంగహవ్యాసంవల్ల బుద్ధికి కలుగగల సోమరితనపు ఈ అనర్థాన్ని పరిహరించుకొనే వివేకం ఉండాలి మనుష్యునికి.

సులభంగా కాలం గడుపడానికి-కాలక్షేపం చేయడానికి-వ్యాసంగహవ్యాసం ఉత్తమమైన మార్గం. కొందరికి కాలం గడపడమే చాలకష్టంగా తోస్తుంది. చురుకుగా పనిచేసే స్వభావంగలవాడు తన ఉద్యోగంనుంచి విరమించినట్టయితే "ఏమిటి గతి? కాలం ఎలా తోయడం?" అని దిగులుపడుతాడు. పనినుంచి విరమించిన సబ్‌జడ్జి ఒకరు బీడీ, సిగిరెట్, సోడావాటర్, నిప్పుపెట్టె, మొదలయినవాటిని అమ్మే చిల్లరదుకాణం పెట్టుకున్నారు. డబ్బు సంపాదించడం ఆయన ఉద్దేశం కాదు. ఆయనది పెద్ద ఆస్తి; పింఛనుగూడ చేతినిండా వచ్చేది. ఎవరైనా రిటైరయిన ఉద్యోగులు తమ దుకాణానికి వెళ్ళితే, "మీరూ నాలాగే చేయండి. సుఖంగా కాలంగడపవచ్చును" - అని ఉపదేశం చేసేవారు. ఉదయం

1. "ఓది ఓది మరుళాద కూచిభట్ట."



నుంచి సాయంకాలంవరకు దుకాణంలో కూర్చుని ఈగలు తోలుతున్న ఆప్రాణిని తలచుకొన్నప్పుడెల్లా నాకు దుఃఖం కలుగుతుంది. చదివే అభ్యాసమైనా ఆయన పెట్టుకునివుంటే ఆయనకు ఈ పాట్లు వచ్చేవి కావు. రామాయణమో, భారతమో చదువుతుంటే, కాలక్షేపంతోపాటు మనశ్శాంతినీ సంపాదించ వీలయ్యేది. వ్యాసంగహవ్యాసం మొదటినుంచి లేక రిటైర్ అయినతర్వాత పెట్టుకుంటానని చెప్పేవారి మాటలలో నిజం లేదు. ఎందుకంటే, వారికి అప్పైపే ఉత్సాహం వుండదు. మొదటినుంచి వచ్చిన అలవాటు మధ్యన ఆగక వస్తుంది; మధ్యవచ్చింది ఎప్పుడుబడితే అప్పుడు నిలిచిపోవచ్చు. అందువల్ల చిన్నప్పటినుంచీ వ్యాసంగాభ్యాసం పెట్టుకొనివుంటే జీవితపు అంత్యభాగంలో అది మనను కాపాడుతుంది. అప్పుడు కావలసిన కాలక్షేపానికి అది సహకారి: మనస్సు చాంచల్యాన్ని పోనాడి, దానికి స్థిరతను, సమాధానాన్ని కలిగిస్తుంది.

గ్రంథరచనచేసే వుద్దేశంతో పఠనాభ్యాసానికి పూనుకునేవారు పూనుకోనీ; కీర్తినో, డబ్బునో గడించవలెనని చదివేవారు చదవనీ; మరొకరికి ఉపదేశం చేయడానికి నేర్చుకొనేవారు నేర్చుకోనీ; శక్తిస్వరూపమైన జ్ఞానంనుంచి బలిష్ఠులు కావాలని కోరేవారు దానిని ఆర్జించనీ; నాకు వీటిలో దేనిలోను ఎక్కువ సంతోషం లేదు. "ఇల్లైసగవలెనన్న హఠపుబంధమె లేదు."[1] నా వ్యాసంగహవ్యాసం ఒకవిహారం. చేతికి చిక్కిన పుస్తకాన్ని తత్కాలపు కుతూహలంతో ప్రేరితుడనై చదువుతూ, చదువుతున్నప్పుడు దాని చవిలో మునుగుతూ, తర్వాత మరచిపోవడమంటే నాకు చాల ఇష్టం. చదివినదంతా మరచిపోని చిక్కని స్మరణశక్తి నాకు లేదు. అది ఆవశ్యకమూ కాదు. దానివల్ల మనస్సుకు, బుద్ధికి బరువుకలిగి బడలిక ఏర్పడుతుంది. చదివిన పెక్కువిషయాలలో కొన్నైనా నా సుప్తజీవితంలో ప్రవేశించి, అక్కడ నిక్షిప్తమైవుండి అనిరీక్షితంగా నీటిబుడగలాగ పైకితేలడం మాత్రమే నాకు చాలు. ఇంతమాత్రపు స్మరణంతోనే మిక్కిలి హర్షం కలుగుతుంది. పచ్చని పచ్చిక మైదానంలో స్వేచ్ఛగా తిరుగాడుతూ సొంపుగా కనిపించే చోట్లలో ఆగి పిడికెడు గడ్డిని కబళించే ఆవులాగ వుంది నా వ్యాసంగహవ్యాసం. నా గదిలో ఈజీచెయిరులో పడుకొని చేతికి అందిన పుస్తకాన్ని తెరిచి చదువుతూ చదువుతూ ఇహలోక తాపత్రయం దూరంగా తొలగిపోయినట్లెల్లా తన్మయత మడుగులో మెలమెల్లగా మునిగిపోతాను. పక్కన బల్లమీద ఉండే ఊదువత్తులు వదిలే పొగ చుట్టలు చుట్టలుగా, వంకరటింకరగా పైకిపోయి వ్యాపించి, గదిలోని పరిమితాకాశంలో కరిగిపోయేవిధంగా నేనూ సారె సారెకూ కరగిలనే వాంఛ నాకు పెద్దగా వుంది.[2]

1. "ఇంతెసగబేకెంబ హఠదబంధన విల్ల."
2. మైసూరు ఆకాశవాణి ప్రసంగం: 27-6-1950.

# 11. పుస్తకశాల విక్రేత

## ద. భా. కులకర్ణి

## 1

ఏదైనా కన్నడపుస్తకశాలను చూడండి; అక్కడ ఎప్పుడూ నలుగురైదుగురు సాహిత్యవేత్తలు కూర్చుని-నిలుచుని సాహిత్యపు అవుగాములను గురించి చర్చ నడుపుతుంటారు. అక్కడలేని సాహిత్యవేత్తల నడవడి సంగతీ వస్తుంది. వారే అక్కడికి దయచేస్తే మరొకరి విషయం. వచ్చినవారు వెళ్లుతారు; కొత్తవారు వస్తారు. కుర్చీలు ఖాళీకావడమే వుండదు. పుస్తకాల విక్రేత కూర్చునో, నిలబడో ఒక్కొక్కరి ముఖమూ చూచి తన అనుభవాలు చెబుతూవుంటాడు. నిరంతరం సాహిత్యవేత్తల సంసర్గంవల్ల అతని అనుభవకోశమూ చాల సుసిమెత్తగా వుంటుంది. అతని వ్యవహారపుమాటలకు అక్కడ ఏ సాహిత్యవేత్తలూ ఎదురాడేట్టు లేదు.

మరేపనీ నచ్చక, పలువురు మిత్రుల చర్చాసత్రానికి స్థలంగా వుంటుందనీ, వారి మూలంగా వ్యాపారం లేనప్పుడు వేసట కలుగరాదనీ అతడు ఈ స్వతంత్రవృత్తిని చేపట్టినవాడు. సాహిత్యవేత్తలు తాము వ్రాసిన పుస్తకాలను అతనితో సాధ్యమైతే అచ్చువేయించి, ఆ వ్యవహారం నెపంతో అతనిని నిత్యం చూడడానికి వస్తారు. మరికొందరు మరొక పుస్తక ప్రకాశకులకు తమ పుస్తకప్రకాశనం హక్కులను అమ్మి, రాయల్టీలో వచ్చిన ప్రతులను అతనివద్ద పెట్టి అమ్మినల్లా డబ్బుపొందే కరారు చేసుకున్నవారు. ఇంకొందరు తామే తమ పుస్తకాలను అచ్చువేయించి, అతనితో అమ్మించగోరేవారు.

ఇలా తాము కారణమైన ఈ సాహిత్యవిపణికి తామే సదస్యులై, చదివేవారు కొనేవారవుతారా-అనే పరీక్షకోసమూ ఇక్కడ చేరుతారు ఈ సాహిత్యవేత్తలు. వీరి ఈ సంతకు కొనేవారు బెదిరి, దూరంగా ఒదిగి, తమ డబ్బును మరొక అంగడికి-బహుశ ఉడుపి ఖజానాకు (హోటలుకు) చెల్లిస్తారు. పుస్తకాల అమ్మకంగురించి పుస్తకశాల విక్రేతను అడిగితే 'మీరే చూస్తున్నారు గదా' అని అతడు చిరునవ్వు నవ్వుతాడు.

వీరెవరో తెలియని ఒక గ్రాహకుడు అకస్మాత్తుగా వచ్చి చర్చచేసి, ఒకపుస్తకం కొనదలుస్తాడు. అతడున్నప్పుడే, అతడు కొనదలచిన పుస్తకవిమర్శ జరుగుతుంది. అతడు ఆ పుస్తకం వదలిపెట్టి వెళ్లుతాడు. ఆ పుస్తకానికి మారుగా మరొకపుస్తకం అతనికి అంటగడదామని పుస్తకశాల విక్రేత చూస్తాడు. గ్రాహకుడు వెళ్ళిపోయిన తర్వాత గుమిగూడిన ఈ మిత్రులకు గిరాకి వచ్చినప్పుడు చర్చకూడదు అని తనకుఉన్న స్నేహంతో, చనువుతో



విన్నవించుకోవలసివస్తుంది. "ఔను" అని ఒక సాహిత్యవేత్త; "పుస్తక విమర్శకన్నా ప్రశంసచేస్తే ఎలాగు?" అని మరొకరు; "కొనడానికి వచ్చినవారి రసికతను కొనియాడాలి" అని ఇంకొకరు: ఈ విధంగా కొనేవారిపైన చర్చ మళ్లుతుంది. "మీరు ఏమీచేయక, కొనడానికి వచ్చినవారిలాగ ఒక్కొక్క పుస్తకం చేత్తోపట్టుకుని నాటకం ఆడాలి" అని విక్రేత సలహా యిస్తాడు. అందరూ సమ్మతిస్తారు,

ఒకసారి అక్కడవున్న సాహిత్యవేత్త పుస్తకం ఒకటి అమ్ముడు అవుతుంది. గ్రాహకుడు ఉన్నప్పుడు ఆచరించవలసిన నాటకవ్రతం స్వీకరించిన సాహితీబృందం గ్రాహకుడు డబ్బిచ్చి, వెలుపల కాలుపెట్టే దారినే చూస్తూవుంటుంది. పుస్తక విక్రేత వీరి ఓర్పును పరీక్షించడంతోపాటు గ్రాహకుని అభిరుచిని, అతని డబ్బులసంచిని పరీక్షిస్తూ, అతనికి మరిరెండు పుస్తకాలు కట్టబెట్టడానికి ప్రయత్నిస్తాడు. "మరొకసారి చూద్దాం" అని గ్రాహకుడు తప్పించుకొంటాడు. అతడు వెళ్ళిపోవడమే ఆలస్యం-లోపలకోలాహలమే. చెలరేగుతుంది అమ్ముడుపోయిన పుస్తకకర్త స్వప్నలోకంనుంచి ఇహలోకానికి దిగినట్టు "ఏమిటి విశేషం?" అంటాడు. ఒకడు అతని పుస్తకాలపై జనానికి ఉన్న ప్రీతిని పొగడుతాడు. ఇంకొకడు నేరుగా "టీ తెప్పించండి" అంటాడు. పుస్తక విక్రేత చేతికి వచ్చినడబ్బు, ఎవరి లెక్కలోనైనాగాని, మళ్ళీ చేయి వదలుతుంది. ఆనాడు ఇలాంటి అమ్ముడుపోయే పుస్తకాలనిర్మాణం, చదువరుల సంస్కృతిమట్టంగురించి చర్చ జరిగి, విమర్శలనుంచి, సమీక్షలనుంచి ఆ పుస్తకానికి వచ్చిన ప్రచారాన్ని పుస్తకశాల విక్రేత జ్ఞాపకం చేసినమీదట, మళ్ళీ అందరూ సరేనంటూ ఎవరిదారిని వారు చెదరిపోతారు. వెళ్లేటప్పుడు అందరూ ఆరోజే వచ్చిన కొత్తపుస్తకం ప్రతులు చెరిఒకటి పట్టుకొనిపోతారు. మరుసటిదినం ఒకరిద్దరు చదివి తీసుకొనివస్తారు. ఒకరిద్దరు చదవడం పడక — మళ్ళీ చదివితే పోతుందిలే-అని తమ పుస్తకాల గుంపులో పారేస్తారు. మళ్ళీ ఆపుస్తకం స్నేహితుడైన పుస్తకవిక్రేతకు చేరుతుందనే భరోసా లేదు. మరుసటిదినంనుంచే అలాటి పుస్తకాలచర్చా పుస్తకశాలలో జరుగుతుంది.

'శుకసప్తతి' కోసం జనం దినమూ వచ్చిపోతారు. గళగనాథ, వేంకటాచార్య-వీరి లేని పుస్తకాలను అడిగిపోయేవారు కొందరు! ఉన్నవాటిలో అనేక పుస్తకాలు చూచి 'వెల జాస్తి' అని వదలిపెట్టివెళ్లేవారు కొందరు! "వెల ఎలా సరైంది" అనే విషయమై పుస్తకశాలవిక్రేత తత్కాలపు ఆర్థికపరిస్థితిపై చిన్న ఒక ఉపన్యాసం ఇచ్చి, కాయితంధర, ముద్రణవ్యయం, తర్వాత పన్నుగురించి చెప్పి, పుస్తకంవెల సముచితమైందేనని గ్రాహకులకు నచ్చజెబుతాడు. వారు "అదంతా సరే; మాకు ఐదురూపాయలకు పన్నెండుపుస్తకాలు రావాలి" అంటారు. అప్పుడు మళ్ళీ ఆ ధరలోవున్న ఇరవయ్యయిదు పుస్తకాలు తీసి చూపినప్పుడు ఒకటీ అరా వ్యాపారం అవుతుంది.

గ్రంథాలయాలవారు ఎవరైనా వస్తేనేమో పుస్తకశాలవిక్రేత మొట్టమొదటే టీ ఏర్పాట్లుచేసి, వారిని బాగా కూర్చోబెట్టి, ఒక్కొక్క పుస్తకమే తీసుకొని వాటిని చదివిన

దానికంటె హెచ్చుగా వాటిని వర్ణించి-పుస్తకమంటే పూవులాగ; ఆ విధంగానే అనేక మాలలు పుట్టుకొని వచ్చాయి అని చెప్పి[1] 'హూ' - 'ఒందరొలు ఒందిల్ల; ఒందరొళు కుందిల్ల' అనే బేంద్రేగారి కవిత పాడి, ఒక పుస్తకాలగుట్టనే ముందుపడేస్తాడు. వాళ్లు అంతా విని చూచి, "ఒక పుస్తకాలజాబితా వుంటే ఇవ్వండి. నేను కమిటీముందు పెట్టి అంగీకారంపొంది మీకు ఆర్డరు ఇస్తాను.'' అంటారు. దానికేం! ఉన్నట్టి, ఉండనట్టి, ఉండవగినట్టి, చిక్కని పుస్తకాల క్రయపట్టి పుస్తకాలవిక్రేతవద్ద సిద్దంగా వుంటుంది. దానిని తీసుకుని వాళ్లు గంభీరంగా వెళ్ళిపోతారు. పుస్తకాలవిక్రేత చప్పబడిపోయి, బీరువాలనుంచి కింద పరచిన పుస్తకాలను మళ్ళీ బీరువాలలో పెట్టడంకూడ చాలక, మరొక కప్పు టీ తాగివచ్చి, "గ్రంథాలయాల కార్యక్రమం'' గురించి, ఒక వ్యాసం వ్రాసి, సాయంకాలం వచ్చే సాహిత్యవేత్తల ముందుపెడతాడు.

## 2

కన్నడంలో ఎన్నో సాహిత్యమాలలు (గ్రంథమాలలు) పుట్టివున్నాయి గదా! వాటి సంచాలకులకు కన్నడపుస్తకాలు చదివే చిన్నపరిమితి రసికులందరూ తెలుసు. కన్నడ అక్షరాస్యులు ఏదో ఒక గ్రంథమాలలో చందాదారుకాక తప్పదు. గ్రంథమాలల వ్యాప్తి అంతగా పెరిగింది. ఈ గ్రంథమాలలలో చందావారులైన కొందరు ఐదురూపాయల చందాకు పదిరూపాయల విలువగల పుస్తకాలు వస్తాయని ఈ పుస్తకశాల విక్రేతకు తమపుస్తకాలను ఆరు రూపాయలకు అమ్మజూపుతారు. ఐదు రూపాయలకు తాను చందాదారు కాలేని ఈ పుస్తక విక్రేత ఈ ఆరు రూపాయల కొత్త చందాకు ఒప్పుకుని, తన "జాణ'' తనానికి తానే నొచ్చుకుంటాడు.

నాటకాలుమాత్రమే ప్రచురించే ఒక ప్రచురణకర్తవద్దకు ఈ పుస్తకవిక్రేత ఒకొక్కప్పుడు సుఖసంకథావినోదంకోసం పోవడం కద్దు. అక్కడికి ఒకరు వచ్చి "బల్లిపాటు శకునం ఉందా?''అని అడుగుతారు. ఆ నాటకప్రచురణకర్త "మావద్ద సాహిత్యపుస్తకాలు లేవు'' అని సమాధానం చెబుతాడు. "నాకు బల్లిపాటుశకునం కావాలిగాని, సాహిత్యం అక్కరలేదు. అని ఆగ్రాహకుడు మళ్ళీ అంటే, "అదే సాహిత్యం; మావద్ద వట్టి నాటకాలే వుంటాయి'' అని ఆ ప్రచురణకర్త సమాధానమిచ్చినప్పుడు మన పుస్తకశాల విక్రేత మూర్ఛపోకుండా తప్పించుకొనడానికి నస్యం పీల్చవలసివస్తుంది. ఆ నాటక ప్రచురణకర్త ఈ పుస్తక విక్రేతవద్దవున్న నాటకాలన్నిటినీ, సగం ధరకు కొందామని చూస్తాడు. "నాటకాలూ సాహిత్యమే" అని ఈ పుస్తకవిక్రేత అతనికి తేటతెల్లంగా తెలిపినప్పుడు, అతడు నాటక ప్రచురణ వదలిపెట్టి, ముద్రణాలయం ప్రారంభించి, తన నాటకాలను ఈ విక్రేత తలకు కట్టాలని ప్రయత్నిస్తాడు. "ఎందుకు?'' అని పుస్తకవిక్రేత అడిగితే, "సాహిత్యానికి లక్ష్మీశాపం వుంది'' అనే నిత్యసత్యాన్ని చాటుతాడు.

1. పూవు—ఒకదానిలో ఒకటి లేదు; ఒకదానిలో కుందు లేదు.



## 3

ఒక్కొక్కసారి ఈ పుస్తకవిక్రేత, కూర్చున్నచోట వ్యాపారంకాదని పర్యటనకు బయలుదేరడమూ కద్దు. అప్పుడు మిత్రులైన సాహిత్యవేత్తలు ఇతనికి శుభంకోరి, ఇంటికి పిలిచి ఆతిథ్యమిచ్చి త్వరగా వచ్చేటట్టు కోరుకుంటారు. "పుస్తకశాలలో మీరు లేకపోతే మాకు ప్రాణాలే లేనట్టు అవుతుంది'' అంటూ, తమ ఇంట్లోవున్న మరికొన్ని పుస్తకాలుగూడ అమ్ముకొని రావలసిందని ఇచ్చిపంపుతారు. స్టేషనుకుకూడా ఒకరిద్దరు వెళ్లి వీడ్కొలిస్తారు.

ఈ పర్యటనలో ఇంటింటికి, ప్రతిపాఠశాలకు, ప్రతికాలేజీకి, లైబ్రరీకి—ఈ విధంగా కొసకు పుస్తకాలను మోసుకొనిపోయి, ఒకసారి కాకపోతే మరొకసారి వాళ్ల వెంటబడి, రొఖ్ఖంగానో, లేక అరువుగానో వ్యాపారానికి చేతులు నలుపుతాడు పుస్తక విక్రేత. పుస్తకాల బరువుమోసి అలసిపోయినప్పుడు, కమిటీకోసం ముందు ఏర్పాటయిన లైబ్రరీలో "అంగీకారంకోసం'' అని పుస్తకాలజాబితాను, పుస్తకాలనుపెట్టి ఉస్సురుమంటూ వచ్చి తాను దిగిన హోటలు చేరుకుంటాడు. అక్కడచేరిన యువరచయితలు, ఇతనినీ, ఇతనిసంచినీ చూచి, గుర్తుపట్టి, తమరచనలను ఇతనికి చూపడానికి చుట్టుకుంటారు. పుస్తకవిక్రేత వాళ్లను తన "రూము'' కు రప్పించుకొని, "వ్రాయడానికి ముందు చదవాలి; చదవాలంటే పుస్తకాలు కొనాలి'' అని కన్నడసాహిత్యపు ఆనాటి ఔన్నత్యం, ఈనాటి నిలువులనుగురించి ఒకచిన్న ఉపన్యాస మిచ్చి వారికి కొన్నిపుస్తకాలు అమ్ముతాడు. వాళ్లు ఇతని చిరునామా తీసుకొని, ఇతడు ఊరికి తిరిగిపోవడానికి ముందే ఇతనికి పంపిన "లిఖిత ప్రతులు" ఇతని రాకకోసం ఆత్రంతో కాచుకొనివుంటాయి.

పరాయి ఊళ్ళలో తిరిగేటప్పుడు ఒకొక్కసంస్థవారు అతనితో వాదోపవాదాలు జరిపి, ఆ పుస్తకవిక్రేతనుంచి కమిషన్ కత్తిరించడమూ కద్దు. సంస్థకోసం బిల్లులో కమిషన్‌కాక, స్వంతానికి నోటితో లెక్కలతో కొందరు కమిషన్ యాచించడమూ వుంటుంది. అంతేకాక, తమవద్దవున్న పాతకొత్త పుస్తకాలన్నిటికీ ఇతనినుంచి బిల్లు వ్రాయించుకొని రొక్కంచేసుకోడమూ కద్దు. పుస్తకాలవ్యాపారం ఒక ఉద్యమం కావాలనే ఈ పుస్తకవిక్రేత ఇలాటి వాటికంతా తలఒగ్గి నడవవలసిన సందర్భాలు రాకుండావుండవు.

ఊరూరూ తిరుగుతున్నప్పుడు కొందరు కాంగ్రెసుభక్తులు దొరుకుతారు. తత్కాల పరిస్థితి వారి "ఏకమైన'' (సమైక్య) విషయం. అప్పుడు పుస్తకవిక్రేత ప్రస్తుత సాహిత్యం వదలి ప్రస్తుత పరిస్థితినిగురించికూడ మాట్లాడవలసివస్తుంది. గాంధీజయంతి, స్వాతంత్ర్యోత్సవాలు ఉంటే, ఇతడు ప్రసంగించవలసివస్తుంది. అప్పుడుకూడ ఇతడు తనకర్తవ్యమని గాంధీసాహిత్యం గురించి చెబుతూ, కన్నడంలోవుండే గాంధీసాహిత్యం అభివృద్ధిని చెప్పి తన పుస్తకాలసంచినుంచి ఒక్కొక్క పుస్తకమే తీసి, వాటి విషయసూచికలను చదువుతూ,

దానిని కన్నడీకరించినవారి సాహిత్యసేవను కొందాడి, అలాటి పుస్తకాలప్రచారంకావలసిన అవసరం వివరించి, తాను అలాటి మహాకార్యాన్ని చేపట్టి చేసిన 'సేవ' ను నివేదించడమూ ఇతని 'ప్రస్తుతపరిస్థితి' ప్రసంగంలో భాగం. ఆ వేడిలోనే ఒకింతవ్యాపారమై ఇతనిని ఆహ్వానించిన కాంగ్రెస్‌భక్తునికి గాభరా పుడుతుంది. అప్పుడు ఇతనికీ, అతనికీ రాజకీయ చర్చ జరిగి తను సంస్కృతిప్రచారకుడినని, కోర్టు కచేరి పర్మిట్లు మొదలయిన కాంగ్రెస్ వారి అధికార కార్యకలాపాలకు తను ఎగబడనని, తనది చిరంతన శాంతి 'కార్య' క్రమ మని, కాంగ్రెస్‌వారిని సంతోషపెడతాడు. "వీడి సాహిత్యం, వీడూ చావని. మన ఎలెక్షన్ సమయంలో వీడిని ప్రచారానికి లాగాలి" అని యోచించిన కాంగ్రెస్‌వాడు ఆ ఊరి వ్యాపారస్థులతో ఇతనికొక టీపార్టీ చేయించి పంపుతాడు.

వ్యాపారస్థుల పేటకు (బజారుకు) ఈ సాహిత్య పుస్తకవిక్రేత పోవడం అపురూపం. ఈసందు దొరికింది కదా అని, దీనిని ఉపయోగించుకుందామని అక్కడికికూడ తన సంచి నింపుకుని పోతాడు. అయితే, వారు సంస్థల కిచ్చిన చందా జాబితాలను ఇతనికి అప్ప గిస్తారు. 'వాగ్దానా' ల గతి తెలిసిన ఇతను వారి వాక్చాతుర్యానికి మెచ్చి, తన వ్యాపారం విషయంలో కొంచెం వెనక్కు తగ్గి, కన్నడసాహిత్యానికి ఇటువంటివ్యాపారం ఎన్నడు వస్తుందని విచారపడుతాడు. అయితే, ఆ వ్యాపారస్థులదృష్టి లాభంపైనే కేంద్రీకృతమై వుండడం చూచి అసహ్యపడుతాడు. మళ్ళీ తన వ్యాపారంవైపు అభిమానంతో వారికి కొన్ని పుస్తకాలవిషయమై చెప్పి, అమ్మడానికి ప్రయత్నిస్తాడు. అక్కడ సాహిత్య వ్యాపారం జరగదు. "ధర్మ" పుస్తకాలు కొందరు అడుగుతారు. ఇవన్నీ మన సమాజ ధర్మాన్నిగురించే వ్రాసినవని చెబుతాడు. ఇక్కడ ఇతని మాటల నాణేలు చెలామణీకావు. తర్వాత, తన రూముకు పరుగెత్తిపోయి, ధర్మంపేరుతో వున్న పుస్తకాలు తెస్తాడు. వారు అడిగిన ధర్మం కనిపించక చాల నిరాశపడుతాడు. వారు "చందాతీసుకోండి, పుస్తకాలు వద్దు" అని చెబుతారు. ఇతడు ఈ ధర్మస్వీకారానికి ధైర్యంలేక, వ్యాపారస్థుల "ధర్మ బుద్ధి" అర్థంకాక తనసంచి మోసుకొని బయలుదేరుతాడు. ఇతని మూర్ఖత్వానికి కాంగ్రెస్ వాది నవ్వుతాడు. వ్యాపారస్థులు తమ జాణతనాన్ని ప్రశంసించుకొంటారు.

ఈ విధంగా పర్యటనలో కలిగిన అనేకరీతుల అనుభవంతో సాహిత్యంపైనా అతనికి జుగుప్స కలుగుతుంది. వ్రాసినవారి యోగ్యతను కొలవడానికి ప్రయత్నిస్తాడు. తనస్నేహి తులను తలచుకొని 'పాపం!' అని అంటాడు. దారిలోని పట్టణాలలో పెద్ద సాహితీవేత్త లను చూడడానికి వెళ్ళినప్పుడు, వారు తమగ్రంథాల పీఠికలలోనే మాట్లాడుతు వుండడం చూచి, "ఏమిటి?" అని అడగవలసివస్తుంది. "ఇది నా ఫలానా పుస్తకంలోది. ఆ పుస్తకంలోను దీని వివరణ వుంది." అన్నప్పుడు ఇతని తల తిరిగినట్టయి "నేను పుస్తకాలు చదవడం మానివేశాను" అని అంటాడు. అప్పుడా విఖ్యాతరచయిత "ఎందుకు?" అని అడుగుతాడు. "నేను ప్రామాణికుడైన చదువరిని; నేను చదివిన పుస్తకం నేనే అమ్మలేకపోతున్నాను. అందువల్ల చదువకుండ పుస్తకాలు అమ్మడం



సులభం." అని ఇతడు జవాబు చెప్పినప్పుడు, ఆ సాహిత్యవేత్త ఆవేశంతో ఇంట్లోకి పోయినవాడు తిరిగి వెలుపలికి రానేరాడు.

# 4

ఏడాదికొకమారు జరిగే సాహిత్యసమ్మేళనాలకు ఇలాంటి పుస్తకాలవిక్రేతలు పోనిదే కళే వుండదు, అక్కడి జడివాన ప్రసంగాల ప్రతులను అమ్మాలి. వెంట ఆశ పెట్టుకున్న ఒకరిద్దరు స్థానికసాహిత్యవేత్తలను పిలుచుకొనిపోవలసిఉంటుంది. అక్కడ ప్రదర్శించిన ఇతని "సరసమ్మసమాధి"ని కావలికాయడానికి ఈ సాహిత్యమిత్రులు ఉపయోగపడుతారు. అయితే, అక్కడ నిండిన సాహిత్యపు సంతలో ఏమైనా కొంచెం వ్యాపారం అయితే, పుస్తకప్రియులు కొందరు చూస్తూచూస్తూ వుండగానే పుస్తకాలను చేతిలో పట్టుకొనే బయలుదేరుతారు. వారిచేతిలోవున్న పుస్తకాలను అక్కడ తెరిచిన అంగడిలో కొన్నవో ఏమో అనుకొని ఊరికే వుండిపోతాడు మన పుస్తకవిక్రేత. సాయంకాల సమావేశం ముగిసిన తర్వాత పుస్తకవిక్రేతలందరు 'సాహిత్యసమాధులను' (అంగళ్ళను) దింపి పడుకొనేముందు వ్యాపారం ఎవరికెంత అయిందని లెక్కలు వేసు కుని పుస్తకాలు ఎంచుకున్నప్పుడు, ఆ పుస్తకప్రియులు పట్టుకొనిపోయిన పుస్తకాలు ఎవరివద్ద అమ్ముడుపోయినవని చర్చజరిగి, ఆ పుస్తకాలు డబ్బుకు అమ్ముడుపోయినవి కావని తేలుతుంది. "కన్నడసాహిత్యంలో దొంగిలించి వ్రాయడం ఉన్నప్పుడు, దొంగిలించి చదవడమూ ఉండవద్దా?" అని ఒక పుస్తకవిక్రేత అంటాడు. పుస్తకం పట్టుకొనిపోయిన వారు పాఠకులా, లేఖకులా అనేచర్చ జరిగి, ఇప్పుడు పాఠకలేఖకులలో భేదభావం కూడ దనీ, పాఠకులందరూ లేఖకులేననీ తీర్మానం చేసుకొని, వారు భౌతికమైన పుస్తకాలను ఎందుకు దొంగిలించాలి? - అని అనుకుంటారు. సాహిత్యవేత్తలకు మరపు జాస్తి. రేపు తీసుకొనివచ్చి ఇస్తాడు—అని మరొకడు సమాధానం చెబితే, "అది నాటకం" అని మరొకడు వాదిస్తాడు. అప్పుడు "రాత్రి వివిధ-వినోదావళి-నాటకం జరిగివుంటుంది. సాహిత్యవేత్త ఎందుకు దొంగిలించాలి? అతనికి ఏ పుస్తకవిక్రేత అయినా పుస్తకం చదవ డానికి ధర్మంగా ఇవ్వడా?" అని మరొక విక్రేత అంటాడు. "పుస్తకాలు తీసుకొనివెళ్లే శాల" అని రేపు ఒకబోర్డు వేయండి. అప్పుడు పుస్తకాలదొంగ దొరుకుతాడు" అని ఒక పాత పుస్తకవిక్రేత తీర్పుచెప్పగానే, అలసిపోయిన పుస్తకవిక్రేతలు ఆ 'సరసమ్మసమాధి' మీదే ఒరిగి నిద్రపోతారు.

# 5

ఇలాంటి విస్తృతజీవితంగల సాహిత్యభండారి - విక్రేత తానూ అర్ధసాహితి అయి, వచ్చేడబ్బు లెక్కపెట్టక, ఇచ్చేడబ్బు చింతలో చిక్కి శల్యం అవుతాడు. ఇతని పుస్తకశాల

ఖ్యాతికి సర్కారు ట్యాక్సులు దండయాత్రచేసి, ఇతని లెక్కలలోనే ఇతనిని పట్టుకుంటాయి. ఈ వ్యవహారంనుంచి బయటపడడానికి చేసిన అప్పులతో, ఉన్నపుస్తకాలు అమ్ముడుపోక ఉచ్చులో పడినట్లయి గిలగిలకొట్టుకుంటాడు. సాహిత్యవేత్తల సావాసంతో మరేపనీ అబ్బే లక్షణాలు కనిపించక, ప్రాయం గడచిపోయి, మళ్ళీ కొత్తప్రతిజ్ఞలు చేసుకొని, అదే అంగడిలో కూర్చునే స్థలంలో పుస్తకాలబీరువాపెట్టి, బీరువాస్థలంలో తన పీఠంవేసుకొని "దిసె మారింది" అనే భ్రమతో మళ్ళీ ఆ వ్యాపారమే ఆరంభిస్తాడు.[1]

1. "హాసు, హొక్కు" అనే సంకథన సంకలనంనుంచి (1951 జనవరి)

# 12. ప్రాణిశాలమూలంగా పాఠశాలలకు

పు. తి. నరసింహాచార్

నేడు మిత్రులకు పనిదినం; నాకేమో ఆటవిడుపుదినం. నా మిత్రుడు పాఠశాలవైపు వెళ్లగానే, పొద్దుపోవడం కష్టమై, ప్రాణిశాల (మృగప్రదర్శనశాల-జూ) కయినా పోదామని ఆవైపు బయలుదేరాను. అక్కడికి వెళ్లదామనే కోరికేమో చాలకాలంనుంచి ఉంది. ఆకోరిక నేటివరకూ ఇచ్ఛాస్థాయికి పెరగలేదు. అంతేకాక, మన ఆత్మలో, అనేకమృగాంశ భావాంశాలున్నవని మహాసాహిత్యవేత్తలైన 'శ్రీనివాస' గారూ, డి. వి. గుండప్పగారూ చెప్పుతున్నప్పుడు, ఆస్థానవిద్వాంసులు మో. శం. సు. గారు మన మతగ్రంథాలలో దీనికి ఆలంబనం దొరుకుతున్నదని అంటున్నప్పుడు, ఈ ప్రాణిశాలలో నేను కుతూహలపడక పోవడం ఎలా? మానవునికి ఈ ఆత్మవిజ్ఞానపు ఆతురత లేకపోతే, చిత్రవిచిత్రమైన ప్రాణులను వాటివాటి స్థానాలనుంచి పట్టుకొని తెచ్చి ఒకచోట చేర్చి పెట్టేవాడేనా? అద్దం ఎలా నాగరికతకు చిహ్నమో అలాగే నగరానికి ప్రాణిశాల. ఒకదానినుంచి రూపదర్శనం; మరొక దానినుంచి భావదర్శనం. దానిని పొందడానికి—కేవలం వినోదంకోసం కాదు—నేడు నేను అక్కడికి వెళ్ళడం.

అక్కడ మొదట మనకు రెండు బూతద్దాలు కనిపిస్తాయి. వాటిలో మన ముఖ వికారాలను చూచి మనమంతా నవ్వుకుంటాము. అక్కడ ఒకవేళ మనముఖం సుందరంగా కనిపించిందా? ఏడవవలసి వచ్చేని! అక్కడినుంచి ముందుకు బంగళాలో తిరుగుతూ అదీ, ఇదీ చూచుకొని, కాళింగసర్పంబిలంవద్దకు వస్తాము. బిలంలో పాము పడుకొని వుండడం కనిపిస్తుంది. దాని చుట్టుముట్టు ఐదారు తెల్లఎలుకలు పిలపిలమని చూస్తూ తిరుగుతూ ఉంటాయి. దాని ఆహారంకోసం ఇవి. పాము ఆ విధంగా కదలక మెదలక పడివుండడమూ, ఎలుకలు ఈ విధంగా భయంలేక తిరుగులాడడమూ నాకు అత్యంత మోహకమైనదృశ్యం అయింది. అపమృత్యువును కాలసర్పంతో పోల్చి మనలో ఎన్నో కథలు అల్లుకునివున్నాయి. ఈ పాముచుట్టూ ఈ ఎలుకల వ్యవహారం చూచినప్పుడు ఆకథల వాస్తవాంశం నాకు స్పష్టమైంది. మనుష్యునికి ఈ నిలువు, ఈ చేతులు కలుగ డానికి ఈ ప్రాణి ఎంతవరకు కారణమయిందో నాకు తెలియదు. సోదరపక్షులకు దీని భయంతో రెక్కలు పుట్టుకురావడం మాత్రం నిజం. ఈ భయంకరప్రాణిబిలంముందు మనం అనివార్యంగా చాలసేపు నిలబడుతాము. ఇతర దుష్టజంతువుల క్రౌర్యానికి ఆకలి మొదలైన ప్రకృతి సహజమైన నిష్ఠురప్రేరణలు ఉంటాయి. దీనికి అలాటి ప్రేరణ లేవీ లేవు. దీని తీవ్రవిషానికి ఆత్మరక్షణమాత్రమే ప్రయోజనం. అన్ని ప్రాణులపైనా దీనికి అనుమానం పుట్టి, అన్నింటినీ శత్రువులుగానే భావించి ఇది ఇంతటి భీషణమైన రక్షణ సామగ్రిని పొంది జగమంతా తనకు భయపడేలాగ చేసుకుందా? మనకు మన దురభి

మానం ఇలాటి విషం కావచ్చా? ధీరుడయిన సాధుపుంగవుడు మాత్రమే దానిని త్యజించ గలడు; త్యజించి బతుకగలడు.

అక్కడినుంచి ముందుకు వెళ్లితే, నక్క, తోడేలు, అడవికుక్క, అడవిపిల్లి, పులి, చిరుతపులి, గాడిదపులి మొదలయిన హింస్రజంతువులు కనిపిస్తాయి. నేను శాకాహారి కావడంవల్ల వీటిలో నా ఆత్మభావాంశలను అంతగా చూడలేదు. అంతేకాక బోనులలో ఈ మృగాలు మనసుకు ఉల్లాసం కలిగించవు. చూస్తే భయం కలుగని పులిని చూచి ఏమిటి ప్రయోజనం? పులికి అలాంటి చారలదేహం, చిరుతపులికి ఇలాంటి చుక్కల ఒడలు, వీటి అందచందాలు ఇక్కడ వ్యర్థం. అడవుల్లో ఈ దేహాలు చెట్టుపుట్టల నీడలలో పొందికగావుండే చెలువాన్ని చూచే పుణ్యం ఈ కళ్లకు లేదు. ఈ ప్రాణులు పుస్తకాలను వదలిన అసంబద్ధమైన గాథలలాగ కనిపిస్తాయి. నా మొత్తం స్వప్నాలనుంచి వెలువడిన ఈ వ్యాసాలలాగ ఎప్పుడు కావలసినా చెప్పవచ్చు. సింహాలు తమ బోను వెనుకవున్న బయలులో తిరుగాడేదృశ్యం మనోహరంగా వుంది. దానికన్నా మానుకింద తొండమెత్తి కొమ్మలను రెమ్మలను చుట్టుకున్న ఈ ఏనుగు బాగుంది. వీటి పొందికను ఎంతచూచినా తృప్తికలుగదు. దీనిని చూస్తే, చెట్లకూ, ఏనుగు, ఒంటె, జిరాఫివంటి ప్రాణులకు చాల కాలంనుంచి పోటీనడిచి, ఇప్పుడు ఆ వైరంపోయి, స్నేహం పెరుగుతున్నదేమో అని అనిపిస్తుంది. మాను: "నీవు అలా ఆకులకొనలను గిల్లితే నేను ఇలా నా మొదలును మోటుగాచేసుకొని పైపైకి పెరుగుతాను: కొమ్మలుకొమ్మలుగా అల్లుకుంటాను; నీకు అందకుండా రెమ్మల కొనలలో మాత్రమే ఆకులు ముడుచుకుంటాను." మృగం: "నీదేహం మోటయితే, నా దేహమూ మోటవుతుంది. నోరు వెడల్పవుతుంది. చిగుళ్లు గట్టిబారి ఒళ్లు రాళ్లవుతాయి. నీవు పెరిగినకొద్దీ నా మెడో, తొండమో అంతఎత్తుకు తగినట్టు పెరుగుతూ వస్తుంది." ఇలా వీటికి స్పర్ధ జరిగి వీటికివీటికి యీయీ దేహాలు వచ్చివుంటాయి. సత్యాగ్రహాలవంటి చెట్టుచేమలను చెనకి బతకడం ఎంతటి ప్రాణికయినా కష్టమే. వీటిని కష్టపెట్టిన, కాలించిన ఎన్నో పెనుభూతాలు నామరూపాలు లేకుండా పోతున్నాయి. చెట్లుమాత్రం నిలబడివున్నాయి. తమ శత్రువులు నశించినప్పటికీ, వాటివల్ల కలిగిన చిక్కులను మరువక, ఆ భీతినీ, దానికి ప్రతీకారరూపమైన ఆ పెరుగుదలనూ తన సంతానానికి నేర్పి తమ లోకానుభవసంపద నాశంకానిరీతిగా అణుబృహత్తయి, బృహదణువై ఈ విస్తారంలో తమ జీవితం గడుపుకుంటూవచ్చిన ఈ మానులను, తమ సౌజన్యంతో ఎట్లో బ్రతికి వచ్చిన ఈ ఏనుగును చూచి నాకు చాల సంతోషం కలిగింది. ఈ ఉద్భిజ్జాలు మననుంచి తమను ఎలా రక్షించుకుంటున్నాయో తెలియదు. కరువుకాటకాలు తెచ్చి కసితీర్చుకుంటున్నాయో, ఇంద్రవరుణుల మరుగు జొచ్చి ఫలవంతమైన భూములను నీటిప్రవాహంతో కొట్టుకొని కోసుకొనిపోయేట్టు చేస్తున్నాయో, తమతల్లి అయిన భూదేవి మనపై కోపగించుకొని, మనం నాటిన విత్తులను మింగివేసేట్టు చేస్తాయో?—ఏమైనా, వీటి విషయంలో మనం హెచ్చరికతో వుండడం మంచిది. అశ్వత్థ ప్రదక్షిణం అంత అర్థరహితమైన వ్రతం కాదు. తోపులునాటి పెంచడం నిజంగా పుణ్యకార్యం.



ఈ విధంగా యోచిస్తూ, ఆ మాను, ఏనుగులముందు కొంచెంసేపు నిలబడివుండి, భారతదేశమనే కల్పవృక్షానికి ఇంగ్లెండనే ఐరావతానికీ ఇప్పుడు ఇలాటి మధురసంబంధం వుందికదూ అని మనసులో అనుకుని, ముందుకు వెళ్లి, తాబేలు, మొసలి, నీటిగుర్రం, నీటియేనుగు, తెల్ల ఎలుగుబంటి, నల్ల యెలుగుబంటి, దుప్పి, జింక, సారంగం, చుక్కలజింక, ఉష్ట్రపక్షి మొదలయిన విచిత్రప్రాణులను చూచాను. ముళ్లపందిని చూచినప్పుడు మన హైదరాబాదు దీనివలె కావాలని ఎందుకు కోరుకున్నదో అనిపించింది. అటుతర్వాత జిరాఫీలు, వాటికి మేతవేసే మంచెలూ-గూళ్లూ కంటబడ్డాయి. ఏమి సందర్భమో, చెప్పలేను, అక్కడ ఒకఒంటె తన మూపులను ఎగురవేస్తూ, అన్నిటికన్నా తనకు ముందుచూపు హెచ్చనేరీతిలో పొడుగాటి తన మెడను అలలలాగ ఊపుతూ, అంగలువేస్తూ వుండింది. ఆ మూపులను నేను చాల మెచ్చుకున్నాను. భారతదేశంవంటి సస్యసమృద్ధమైన దేశంలోను వీటి కెందుకు ఈ మూపుల ముందుజాగ్రత్త। అయితే లోక పరిస్థితి ఇలాగే అని చెప్పడానికి అవకాశంలేదు. దైవం ఇచ్చపుడితే ఫలవంతమైనభూమి ఎడారికావడం ఎంతసేపు? ధర్మభూమి అయిన మన ఈ దేశంలోను మనజేబులో చెక్కుబుక్కులూ, మన ఆడవారి ఒంటిమీద నగలు భద్రంగావుంటే మేలు. ఒంటెకు వున్నట్టుగా మనలో పలువురికి ఇలాటి మూపురాలు ఉండకపోవడంవల్లనే ఈ సంసారమనే ఎడారి భయంకరంగా కనిపిస్తుంది. వేపాకు తిని భలే అనే దీనిమనస్సు స్థాయి మనకు రావాలంటే మనం యోగులమే కావాలి. ఏమైనా ఏనుగులాగ ఈ ప్రాణికూడా నా మనస్సుకు నచ్చింది. కమ్యూనిస్టులకు దీనిరూపూ, మనుగడతీరూ బాగా కనిపించకపోవచ్చు. నేను ఆ మతం విషయంలో ఇంకా ఉదాసీనుడిని. ఒంటె నడుస్తున్నప్పుడు దానిమెడ ఛందోగతికి తగినట్టు, దాని మూపురపునాట్యం నాకు చాలవినోదం కలిగిస్తుంది.

నేను ఈ వినోదంలోనే వుండిపోవడానికి వీలులేదు. ముందు చూడవలసింది కావలసినంత వుంది. కోతులను మరచిపోవడం సాధ్యమా? నెమలిని చూడవద్దా? హంసను చూపుతో కలపవద్దా? కోతులగూళ్ళముందు నిలిచినప్పుడు నాకేమీ అంత సంతోషం కలుగలేదు. అవి మనదగ్గరి చుట్టాలు. వాటిమీద మన సానుభూతి తక్కిన మృగాలమీద వున్నదానికన్నా ఎక్కువ. అందువల్ల వాటి చెర నాకు నచ్చలేదు. అడవి మనిషి మనకు భయంకలిగించేటట్టే కరుణకూడా కలిగిస్తాడు. మనం విసిరివేసే వేరుసెనగలకోసం అతడు ఆ విధంగా ఆత్రపడడం, తన చెరసాల ఇనుప ఊచలను పట్టుకొని ఆ విధంగా ఊగులాగడం, మోటుగా పెట్టిన మొద్దులనుంచి తలుపు కమ్మీలమీదికి పల్టీలు కొడుతూ ఎగబ్రాకడం, తలకిందుగా ఊగడం ఇవన్నీ మనకు దుఃఖం కలిగిస్తాయి. మనం, ఆహారం అందేటట్టు వున్నప్పటికీ, ఆకలితో వుండగలం - కనిపించిన వారందరి ఎదుట ఈ విధంగా చేతులుచాచే స్వభావం మనలో చాలతక్కువ. బంధనంలో వున్నా నిశ్చింతగా వుండగలం. మనకు జంతువులకంటె ఎక్కువ సంయమశక్తి వుంది. ఆ ఒక్క శక్తి బలంతోనే మనం నరులం; ఈ శక్తిలేక, అది మనకంటె ఎక్కువగా ప్రకృతివశమై వున్నందున ఇంకా వానరం. దానిని దానిపాటికి వదలిపెట్టి ఇక నెమలిని చూడడానికి

పోదాము. ఎంతవిప్పిన పురి మగనెమలిది! ఆడనెమలి సామాన్యమైనది. దానిని రంజింప జేయడానికి - వలపింపజేయడానికి మగనెమలికి ఇంతటి అలంకారాల పరిధవం కావాలా? సద్య, మనలో ఈ విధంగా లేదు. ఆడదే మగవానిని వలపింప జేయడానికి నిరంతరం శ్రమపడుతుంది. గొంతుకు ఇంపును, మేనికి లావణ్యాన్ని సంతరించుకొని, అందచందాల ఉడుపుతొడవులతో లేని వయ్యారాలు చూపినా, మగవాడు వాటికి విస్తుపోవడం కష్టం. దీనిని ఒప్పుకోని మగవారిని ఒక్కప్రశ్న వేస్తాను - అలంకారానికి ఆశపడని ఆడవారిని నాకు చూపండి - అని. ఈ దినం ఈ మగనెమలి పురివిప్పి మా ఎదుట నాట్యంచేయలేదు. నేను అసంతృప్తితో ముందుకు వెళ్లాను. తక్కిన చిత్ర విచిత్రమైన చిలుకలను, పావురాలను, నీరుకోళ్ళను, బకహంసాది జలపక్షులను చూచుకొని, బంగారుచేపలు నీటిలో ఈదుతూ తళతళలాడడం చూచి, అక్కడవున్న ఒక బెంచీ మీద కూర్చున్నాను.

అక్కడ పాములు, ఇక్కడ పక్షులు; అక్కడ పులులు, ఇక్కడ జింకలు: అక్కడ ఏనుగులు, ఇక్కడ ఒంటెలు జిరాఫీలు - వీటికి చిక్కక సురక్షితంగా మీదికి పెరిగి వరచుకొని ఇప్పుడు సౌహార్దంతో వుండే మానులు - వీటిమధ్య నేను! ఒక్కొక్క కోరికా సంపూర్ణంగా వికసించి, ఇచ్ఛ అయి, ఇలాటి క్షేమకరమైన వ్యక్తిత్వాన్ని పొందినట్లు ఈ మృగపక్షి వృక్షస్వరూపసిద్ధిని చూడగా నాకు తోస్తుంది. అన్నిరూపాలూ సుందరమైనవి, స్వయసంపూర్ణమైనవి. ఈ ప్రాణికి ఈ వాతావరణంలో ఈ విధంగా పెరగాలని ఆశ; దానికి తగిన మేను, మనస్సు. ఆ దేహాన్నిచూచి, ఆ యా వాతావరణాన్ని, ఆ జీవాత్మ ఆశను మనం గుర్తించవచ్చు; దాని ఆశ యెల్లలను కొలవవచ్చు. నిర్దిష్టమైన కామన, నిష్కృష్టమైనకర్మ, ఆకామన చేకూరడానికి చేయవలసినకర్మకు తగిన అంగసామగ్రి, అంతః ప్రేరణ వీటికి వీటికి ఉన్నాయి. ఈ మృగపక్షులన్నింటి జీవితం సుసూత్రబద్ధమైనది, సువ్యవస్థితమైనది. వీటి మనుగడస్థాయి బుద్ధికి అందదగినట్టిది. మనుష్యునికీ అతని పేరాసకు తగినట్టు సమృద్ధమూ, కుశలమూ అయిన మనుగడ వుండాలని రష్యాప్రయత్నిస్తున్నది. మృగాలకు ప్రకృతి ఎలాగో, అలాగే మానవునికి జాతి సర్వనియామకశక్తి కావాలని దాని (రష్యా) ప్రయత్నం. ఇది మనం ఆపేక్షించవలసిన సిద్ధియే అని తక్కిన దేశాల చింత. నా మనస్సుకు ఈ మృగాలు కౌతుకాన్ని కలిగించాయే కాని, వాటి విషయంలో నాకు గౌరవం కలుగలేదు. ఈ మృగాలన్నింటి భావస్థితులను, మనుగడరీతులను మానవుడు తన మనుగడలోనూ పొందాలనే ఆరాటం విజ్ఞానశాస్త్రానికి ఉన్నట్లు నాకు అప్పుడు తోచింది. జలాంతర్గాములు, ఓడలు, విమానాలు, రేడియో, విద్యుచ్ఛక్తి, విషవాయువులు, అణ్వస్త్రాలు-వీటన్నిటిని మనం ప్రాణిజీవనంలో చూస్తున్నాము. ఈ జీవలోకంలో కనిపించే ప్రకృతిచోదిత సమస్త వైచిత్ర్యాలను జ్ఞానంతో సాధించక విజ్ఞానం విరమించదు. అయితే విజ్ఞానం సాంతమైనది, అనంతమైనది కాదు; మేయమైనది, అమేయంకాదు; సాధ్యమైనది, సిద్ధికి మించినది కాదు. ఇప్పుడు మృగత్వపు ఎల్లలను దాటుతున్న మానవునికి, లోపలి ఆరాటం అమేయాన్ని గురించి. ఈతని బుద్ధియొక్క సమస్త తేజస్సు జ్ఞానంతో ముందు



కురికి, అచింత్యంవైపు ప్రవహించి, ఆ గగన పరమరహస్యాన్ని నీలిమగా చేస్తుంది. తనదే అయిన ఒక రక్తిమను ఆ నిర్లిప్తవస్తువుకు అర్పించి, దానిలో విలీనమవుతుంది. మహాత్ములవలన ఇలా దీప్తమైన ఆ అచింత్యాన్ని, సూర్యుని వెలుగుతో నీలమైన అగాధ తమస్సును మనం ఆకాశమని గుర్తించి పేరుపెట్టుకొన్నట్టు, ఘనశ్యాముడు, రాధేశ్యాముడు అని పిలుచుకొని మనం కొంచెంసేపు మన అలసటను పోగొట్టుకొంటాము - మనస్సు పయనము తిరిగి జ్ఞానమార్గంలో ముందుకు సాగేవరకు. మృగపక్షులకు ఈ పయనపు అలుపు లేదు. ఈ విశ్రాంతి పొలుపు లేదు. ఇప్పటి మన నాస్తికత అలుపుతీర్చుకొనిన జ్ఞానపు ప్రయాణోత్సాహాన్ని చూపిస్తున్నది. అంతే, ఈ అలసటలో ముందు ఎలాటి ఆస్తిక్యం ఉదయిస్తుందో ఎవరికి తెలుసు?

ఇలాటి ఆలోచనతో నేను వెలుపలికి బయలుదేరుతాను. బయలు వెడలుతున్నప్పుడు మరొకమారు భూతద్దాలవైపు నాకళ్లు మళ్లుతాయి. నేను చూచి మెచ్చిన మృగపక్షుల ఆనవాళ్ళన్నింటినీ ఈ భూతద్దాలు నాముఖంలో రేఖలు రేఖలుగా విడదీసి చూపుతున్నట్టు వుంది. ఏ మృగాన్నీ జ్ఞాపకానికి తేని ముఖమే సుందరమైనదని అప్పుడు నాకు అనిపిస్తుంది. మనస్సుకూ ఈ మృగాంశాలు ఏవీ లేకపోయినప్పుడే భావనకు తగింది. ఒక రంగుచీర కనిపిస్తే చూపు దూసుకొనిపోయే ఎలాటి మనస్సు నాది! ఇప్పుడు నన్నుచూస్తే నాకే నవ్వు పుడుతుంది, భూతద్దంలో వికారంగా కనిపించే ముఖం బింబాలలో ఈ నవ్వు మోహకంగా వ్యాపిస్తుంది. మృగానికి ఈ మోహకత లేదు. నేను ఉత్సాహంతో పెద్ద చెరువు దారిని కాలేజీవైపు బయలుదేరుతాను, అక్కడికి చేరేవేళకు మిత్రుడు తనపని ముగించవచ్చు.

దారిలో సంస్కృతపాఠశాల వుంది. దాని వెనుకభాగంలోని విద్యార్థుల ఒకగదిలో నా మిత్రులొకరు ఇప్పుడు వున్నా వుండవచ్చు. నేను లోపలికి వెళ్లుతాను. అక్కడ ఆయన లేరు. ఈ పాఠశాల వాతావరణం నన్ను వెరగుపడజేసింది. ఇది ఒక విచిత్రజంతు ప్రదర్శనశాలవలె కనిపిస్తుంది. వెలువలి ప్రపంచమూ దీనిని అలాగే భావించి పోషిస్తున్నది. ఒకానొకకాలంలో మనను రక్షిస్తున్నవిద్య, ఇప్పుడిక్కడ రక్షణీయావస్థను పొందింది. ఇక్కడి నడతకూ, నుడికీ మనం బ్రతుకుతున్న లోకానికీ ఎంతమాత్రమూ సంబంధం లేదు. హృష్టపుష్టులైన వారెవరూ ఇక్కడ నాకంటికి తగులలేదు. విద్యార్థులంతా పేదవారు; ఉపాధ్యాయుల ముందు మంత్రముగ్ధులయినట్టు కూర్చున్నారు. ఆ విద్యార్థులలో అక్కడి ఆచార్యబృందంపుత్రాది సమీప బంధువు లెవరూ ఉండరు. వారికి ఇక్కడి విద్యానిద్ర వద్దు. వాజశ్రవసు ఒకయజ్ఞం ప్రారంభించి, నిరింద్రియాలైన ఆవులను దాన మిషతో దానంచేసినట్టు, ఇక్కడ మన ప్రాచీన విద్య దానం చేయబడుతున్నది. ఏ నచికేతుని వలన ఈదానం సార్థకమవుతుందో నాకు అర్థంకావడంలేదు. ఇక్కడి నడవడులన్నీ స్వప్న చేష్టితాలలాగ నాకు కనిపిస్తాయి. మహత్తరమైన ఆధ్యాత్మికసంపదను గడించి శ్రాంతమైన మన చైతన్యం ఇక్కడికి వానప్రస్థం వచ్చి విముక్తికి కాచుకున్నట్టుంది. మన

సౌభాగ్యశక్తి కాలంతోపాటు నడిచి నడిచి, అలసి సొలసి, ఈ అంతఃపురానికి వచ్చి బాహ్యప్రపంచాన్ని మరచిందేమో అనిపిస్తుంది. ఊపిరి పోసుకుంటున్న ఈ సచేతన ప్రాక్తన వస్తుప్రదర్శనాగారంనుంచి నేను వెలుపలికి వచ్చి కాలేజీ చేరుతాను.

ఇక్కడ ఇంకొకవిధమైన దృశ్యం నా కనులపడుతుంది. ఇక్కడి ప్రాణసంచారానికి ఆ పాఠశాలలో వున్నంత స్తబ్ధత లేదు. ప్రాణమేమో ఇక్కడ నిండుగానే వుంది. అయితే ఈ చైతన్యవాహినికి ఉండేవి వాన కారుకాలపు దొంగవాగుల మ్రోత, రభసము; నిండి పారే జీవనదిగాంభీర్యం లేదు; కాలువలుగా పారి నేలను పదునుచేసే ప్రాణశక్తి లేదు. ఈ పిల్లల గుంపు చూచి నాకు ఇలా అనిపించింది:—వీరి ముఖము తీరు, మేని గెలివి, కన్నుల పొలుపు, మనస్సు నిండుదనం - వీటినిచూచి మన మనుగడ సిరిమంతనానికి నేను సంతోషపడితే, వీరినడక ఎందుకింత విచిత్రంగా వుంది ? నుడి ఎందుకింత వికారంగా వుంది ? వ్యవహారం ఎందుకు ఆగర్భశ్రీమంతుల పుత్రులవలె వుండక అప్పుడప్పుడే ధనవంతులైన కృపణుల వలె రూక్షంగా వుంది ? - అని ఖేదపడ్డాను. ఇక్కడ వున్నంతమంది అసంస్కృతులను మనం మరెక్కడా చూడలేము. ఈ దొరబిడ్డలకు ఇలాటి ఆత్మగ్లానిని కలిగించి, రూక్షతను అలవరచి, కోతులుగా తయారుచేసి, ఈ తీరుగ గునిపించే మోహిని ఎవరు ? ఏ యక్షిణినుంచి ఈమె దీనిని సాధించింది ? ఈ విపన్నులకు శాపవిమోచనం మరి యే విద్యమహిమతో కలిగేని ? వీరు తమ స్వసంస్కృతిని ఎప్పుడుపొంది మునుపటిలాగ జగదాశ్చర్యకరులవుతారు ? - ఇలాటి విషాదమార్గంలో నామనస్సు పరుగెత్తుతుంది. ఇక్కడి జీవనమూ జాగృతమైనది కాదు. ఇక్కడ దానికి పరప్రత్యయచేషితమైన విస్మృతస్థితి. ఈ పిల్లవాళ్ల ముఖాన్ని విడివిడిగా నిదానించిచూస్తే ఆ మరపుఅట్టడుగున వారి చేతనాశక్తి, మూలప్రజ్ఞా జాగృతమైవున్నట్టు, దీనిపట్టుకు అవి కుంగివున్నట్టు, అవకాశందొరికిన క్షణంలో పొంగి తన తెలివికి తాను రావడానికి శక్తిమంతమై వున్నట్టు ఒక్క క్షణకాలం మనకు తోస్తుంది. వారి ఆర్ద్రదృష్టి అట్టడుగున, వినయం మరుగున, ఈ ఆస మనకు కనిపిస్తుంది. మన దుఃఖం ఎక్కువవుతుంది. ఈ పిల్లవాళ్ళకు దేశమంటే, దేశవత్సలులంటే, ధ్యేయమంటే, త్యాగమంటే ఎంతప్రేమ ! ఎంత ఆసక్తి ! ఈప్రేమ - వారి లోపలితీరుకు సాక్షి. అయితే ఇక్కడ, వీరి అరయదనంపై స్మృతికంటే విస్మృతి పట్టు హెచ్చు. ఇక్కడివారిది వికృత జాగృతి; ఆ పాఠశాలలో - స్వప్నజాగృతి. ఏదో భయంకర భీమశక్తి ఈ విధంగా మన చావజాలని తెలివిని రెండు వప్పులుగా చీల్చి విసరివేసినట్లు తోస్తుంది. అక్కడి వేదఘోష ఇక్కడికి పెరిగి, ఇక్కడి నూతనజ్ఞానం అక్కడికి వ్యాపించి, మనజీవితం ఎన్నడు నిండి నిబిడీకృతం అవుతుందో ? ఈ సమయంలో మాలవీయ, రవీంద్రుడు, గాంధీ, రాజేంద్రబాబు. హిరియణ్ణ, రాధాకృష్ణ, ఇలాటి స్వయంప్రజ్ఞాపూర్ణులైన మహానుభావుల జ్ఞాపకం వచ్చి అధీరమైన నామనస్సుకు ఉత్సాహమిస్తుంది. మనమిప్పుడు స్వతంత్రులం. మన మనస్సుకు ఇప్పుడు లేబ్రాయం, మన భవితవ్యం దొడ్డది, మన గత సౌభాగ్యాలకన్నా ముందు సౌభాగ్యాలు మేలయినవి. ఈ పిల్లవాళ్లు తమను పట్టుకున్న మోహినిమోహాన్ని పోనాడి స్వస్వరూపం ధరించి శోభించే కాలం చాలదూరం లేదు. శుభశకునపు తథాస్తు దేవతలాగ ఇదిగో బడివిడుమరగంట. శ్రోత్రమంగళమైన ఈ ఘంటానాదాన్ని చెవి ఆస్వాదించేవేళకు నా మిత్రుని సుందరమందస్మితం నన్ను గుర్తించి స్వాగత మిస్తుంది. ఆ ముఖంలోను నా కలలోని ఒకకళ వ్యాపించినట్టు నాకు తోస్తుంది. నా ఆలోచనలన్నిటిని ఆ మందహాసంలో కరిగించి నేను నిశ్చింతగా అతనివద్దకు చేరుకుంటాను.

# 13. మోడ్‌కా బాజార్

## ఎన్కే

నాకు పుస్తకాలు చదవడంకంటె పుస్తకాలు సంపాదించడంలో ఎక్కువ ఆస్థ. దీనికి ఒక మహత్తరమైన కారణం వుంది. నాయింటి గ్రంథాలయంలో ముప్పావుభాగం చేకరించింది మోడ్‌కా బాజారునుంచే. కొద్దిపైసలకు పెద్దప్రబంధాలు లభించడంవల్లనే పుస్తకపరిచయం చేసుకొనడంకన్నా పుస్తక "పర్చేస్" చేయడంలోనే నా ఆసక్తి విశేషంగా పెరుగుతూ వచ్చింది. నా సుదైవమో, సాహితులు దుర్దైవమో, ఏమైనా, మోడ్‌కా బాజార్‌లో మహాకవుల వెల తగ్గడం శోచనీయమైన సంగతి అనడం అబద్ధం కాదు.

మార్కెట్టులో దూరి వచ్చేటప్పుడు ఒక్కమారు మోడ్‌కా బాజార్ ముందు ఒకొక్కప్పుడు నిలబడి గ్రంథపరీక్షచేసినమీదటే ముందుకు సాగడం నాకొక చాపల్యమయింది. ఆ మోడ్‌కా బాజార్ యజమానికికూడ తెలుసు. నేను తొందరగా సైకిలు ఎక్కి పోతున్నా నారథం నిలిపి "బాబుగారూ బుక్కులు వచ్చాయండీ" అని పిలుస్తాడు. కన్నడిగుల పఠనాభిరుచి మట్టం ఎంత ఎత్తయినది అనడాన్ని ఆ గ్రంథరాశినుంచే కనుక్కునేటట్టు వుంటుంది ఆ గ్రంథరాశి. సాహిత్యరసం రుచిని కన్నడిగులకన్నా కన్నడదేశపు ఎర్రమట్టి చెదపురుగులే ఎక్కువగా తెలుసుకొన్నవేమో అన్నట్టు పుస్తకాల అంచులను మధ్యమధ్య విశేష భాగాలనూ అవి జీర్ణించుకొనడం కనిపిస్తుంది.

"కన్నడబావుట" ఒకమారు నాకు ఇక్కడ అరుదమ్మిడీలకు కైవసమయింది. ఇంత ఎందుకు, ఒకమారు మునిమాపువేళ కూరగాయలు తేవడానికి బయలుదేరాను. మోడకా బాజార్ ఘటోత్కచుడు "బాబూ ఒక ఎత్తలేనిపుస్తకం వుందండి!" అని గట్టిగా పిలిచాడు. వచ్చి చూతునుగదా-కిటెల్ శబ్దకోశం! "ఏ పుణ్యాత్ముడు నీ కీ పుస్తకం దయ చేశాడయ్యా?" అంటూ పుటలు తిరుగవేయసాగినాను. పుటకొక్కరి సంతకం వుంది. అచ్చుకాని మొదటిపుటలోనైతే నిండుగా సంతకాలు చేశారు. "ఏమైనా ఇంతమంది ఈ పుస్తకాన్ని ముట్టారుగదా!" అని సమాధానపడ్డాను. "ఏమయ్యా, ఏమి యివ్వమంటావు?" అని అడిగాను.

"ఏమిటో మీరే చూడండి బాబూ. నాకూ కొంచెం డబ్బుకు తగాదాగానే వుంది."

వాని తగాదా నాకు తరువాత అర్థమైంది. నా సాహిత్యపు తగాదాకన్నా అతని "దొంగసరకు" తగాదాయే ఎక్కువగా వున్నందున అడిగినంతకు పుస్తకం ఇస్తాడన్న భరోసాతో అన్నాను:

"ఏమిటో నీ....పుస్తకం అంతా చినిగిపోయింది. పైన చూడు. వట్టి శబ్దాల బుక్కు. ఒక కథకాదు; నవలకాదు."



"ఎంతకు ఇవ్వాలంటారు! ఏటి బాబూ!"

ఈ తగాదా సాహిత్యవ్యాపారికి ఏటే ఇద్దామనుకున్నాను; దెబ్బలతో కాదు.

"నాలుగణాలు ఇస్తాను చూడు!"

"ఏమిటి బాబూ!"

"అదంతా ఏమీలేదు. కూరగాయలకోసం తెచ్చిన నాల్గణాలున్నాయి. అంతే ఇవ్వడం." అంటూనే ముందుకు రెండడుగులు వేశాను.

"హూఁ! తియ్యండి, తియ్యండి. సంజవేళ అయిపోనీ. మరెవరు మోసుకపోతారు అల్లీమఠం వరకు?" అని భారమైన ఆ గ్రంథాన్ని నాచేతికి అందిచ్చాడు. నాలుగణాలకు ఎటువంటి అపురూపమైన కూరగాయలు దొరికాయి కదా అని పొంగిపోతూ ముందుకు వెళ్లాను. "కావ్యరస భోజనానికి ఈ శబ్దకోశం ఉత్తమమైన కూరగాయ." అని అనుకున్నాను. చంకలో పుస్తకం పెట్టుకొని నా మనోరథాన్ని అధిరోహించాను. దారిలో మరొక ఆలోచన కలిగింది. "నాకేమో ఈ మహాగ్రంథం నాలుగణాలకు దొరికింది. పాపం! ఆ మోడకా బాజార్ యజమానికి ఏమి లాభించింది?" అనుకున్నాను. శెట్టి ఊరికేనే వరదనపోతాడా? మరొకరినుంచి అతడు ఆ పుస్తకాన్ని రెండణాలకు కొనకుండా వుంటే, దానిని నాల్గణాలకు అమ్మడం సాధ్యమా! దానిని రెండణాలకు అమ్మిన మహారాజు తగాదా ఎంతటిదో!....అథవా, మరొక ఆలోచన: ఇతడే ఏమైదా "కల్లు" కోసం ఈ కల్లదుకాణం ఆరంభించాడా? ఈ దొంగకు దీని విలువ తెలియకపోయినా, దీనిని అమ్మిన ఆ సత్యసంధునికైనా తెలియవద్దా? తస్మాత్ ఇది చీకటి వ్యాపారమే...అనుకున్నాను. "అయితే ఇలా దొంగబజారుకు ప్రోత్సాహమిస్తున్న నేను నా సభ్యనాగరికతనే అమ్ముకోవడంలేదా?" అనిపించింది. "ఇప్పటి జగత్తు నిలబడి వుండేదే దొంగబజారుమీద." అని సమాధానం వెంటనే వచ్చినా, మనస్సు ఆలోచనాకల్లోలం నుంచి స్థిమితపడలేదు....అథవా దీనిని అతడు దొంగలించడానికైనా ఎలా సాధ్యమయి వుంటుంది?....ఇంత ఆలోచిస్తూనే పుస్తకాన్ని తీసుకొనివచ్చి మేజామీద అప్పగించాను. కూరగాయల చప్పుడుకు నా గృహిణి లోపల ఎగిరిపడి వెలుపలికి వచ్చింది. సాహిత్య భక్తుని ఈ కూరగాయలకు మూతిముడుచుకొని, "ఛీ" అంటూ లోపలికి నడిచింది.

పరిశోధకులు ప్రాచీనస్థలాలను తవ్వుతారు. ఎల్లప్పుడూ తిప్పలలో ఉప్పరిగ దొరుకుతుందని చెప్పలేము. అయితే మోడకా బాజార్ తిప్పలో ఉప్పరిగలు ఎందుకు, రత్నాలే దొరుకుతాయి—కృతిరత్నాలు. షేక్స్పియర్ నాటకాలను సంపూర్ణంగా రెండణాలకు ఈ మోడకా బాజారులో వెదకడమంటే సామాన్యమైన పరిశోధన అంటారా? మీకు ఎల్లప్పుడూ ఇలాటి అమూల్య రత్నాలే దొరుకుతాయని చెప్పడానికి వీలులేదు. ఒకసారి నా మిత్రుడొకడు నాలాగే ప్రయత్నించడానికి వెళ్ళినప్పుడు, ఔషధాలక్యాటలాగుకు ఎనిమిదణాలు అడిగాడట ఆ వ్యాపారి. కారణం ఇంతే: ఆ పుస్తకమంత చక్కని నున్నని

పుటలున్న, అనేక రహస్య చిత్రాలున్న గ్రంథం మరొకటిలేదు అన్న తర్వాత వెల సరే కదా ? ఒక్క చిత్రమూ లేని, కాయితాలన్నీ చెదలుపట్టి జీర్ణమై మిగిలిన లక్ష్మీశునిభారతం పాతబాశెల్ మిషన్ ప్రచురణే కదూ స్వల్పమైన వెలకు దొరకవలసింది ? అయితే, ఏదైనా అపూర్వవస్తువును వెదకడానికి 'పరిశోధకుని చూపు' అవసరమనే మాట అబద్ధంకాదు. మోడకా బాజార్ వంటి పుస్తకాలరాశి తిప్పలో కృతిరత్నాలను వెదకాలంటే, రవికనులకూ సాధ్యంకాదు. దొంగబజారు అన్నిరేఖలనూ తెలిసిన చాణాక్షుని (చాణక్యుని) చూపే కావాలి. అలా కాకపోతే, నా మిత్రునికి ఏ అపురూప విరూపగ్రంథమూ దొరకక, మరుసటిదినమే నాకు ఎందుకు మిల్టన్‌కవి "పేరడైజ్ లాస్ట్" దొరకాలి ? దీనిని అదృష్టం అంటారో, దృష్టి అంటారో ?

ఈ పరిశోధకదృష్టితోనే "మోడకా బాజార్" వ్యుత్పత్తినీ చూడడం ఇప్పుడు విహితమని తోస్తుంది. ఘటోత్కచునివంటి పురాణపురుషుడూ దొంగబజారును నడిపినట్టు మహాభారతంలో ఆధారం మన కున్నప్పుడు, చీకటిబజారుకు వివేకపు లైసెన్స్ అగత్య మేమిటి ? అయితే, సర్కారుకళ్లు తప్పించి సాగించే చీకటి 'దొంగబజారు' కూ, సూర్యుని వెలుగులో సర్వజనీన నేత్రాలు ఆకర్షించేట్టు సరకుసరస్వతిని బజారులో అమ్మడానికీ మహదంతరం వుంది. దొంగబజారులో సరకుధర ఇరు మడుంగులు, మున్మ డుంగులు ఎక్కువకావచ్చు. ఈ మోడకా బాజార్ సరస్వతి వెల అంతమట్టుకు తక్కువ. ఇక్కడ ప్రభుత్వం సరస్వతిమీద కంట్రోల్ విధించే కారణమే లేదు.

మోడకాబాజార్ స్వరూపమే విచిత్రమైంది, సెకెండ్‌హాండ్ బుక్‌డిపో అని వుంటుంది. పునర్వివాహమైన స్త్రీలలాగే, ఇక్కడ గ్రంథాల తలవ్రాత. ఒక్క ఒడయని కోల్పోయి ఇంకొక ఒడయని పడయడానికి దారికాస్తూ ఉంటాయి. ఇక్కడి గ్రంథాలకైతే సగం ధర అయినా, నిర్ధారమైన ఒక ధర వుంది. మోడకా బాజార్ అనగానే "అనాథ బాలికాశ్రమం" ఉన్నట్టు—చేతికి దొరికినవారిని చేతికి వచ్చినట్టు అమ్మడం. ఈ అనాథా శ్రమంలో ఒకొకమారు స్త్రీ రత్నాలూ "వీధి ఆడవారు" ఎలా అవుతారో అలాగే మోడకా బాజారులో కృతిరత్నాలూ కసువుపోచ లవుతాయి.

"మోడకా బాజార్" అనే పేరుతోనే ఇది మహారాష్ట్రంనుంచి వచ్చిన పేరని కానవస్తున్నది. "మోడకా" అనే పేరుతోనే విరిగిపోవడం వ్యక్తమవుతుంది. విరిగిన వస్తువులనుంచి సుందరవస్తువులను రచించే కైవాడం మరాఠీలకు చక్కగా అబ్బింది; లేక మరొక సామెతలో చెప్పాలంటే, "చవులలోనే డవులు"[1] అంటారుగదా—ఆ విధంగా. ఈ మోడకా బాజార్ పుస్తకాలది కావచ్చు; ఇనపసామానుది కావచ్చు; చెప్పులది కావచ్చు; మరొకటి కావచ్చు.

విరిగిన సామానులన్నిటినీ వీధిలోకి విసిరివేయడం మన ధారాళతనం. ఇది మరొక పరాకాష్ఠ. మా ఆవిడ ఇంటిని శుభ్రంగావుంచే సంబరంలో కంటికి అందంగా కనిపించని

1. చవులు = రెండణాలు (మరాఠీ)



సామానులన్నిటినీ వెలుపలపడేసేది. ఒకమారు నా పుస్తకాలన్నిటినీ సరిగా సర్దేటప్పుడు నాలైదు గ్రంథాలు చూడడానికి చాల అసహ్యంగా వున్నాయనుకొని, వాటిని, పొయిమీది పాత్రలను దింపుకొనడానికి "చేతిపట్టు" కోసం అని పొయ్యినందులో తురికిపెట్టింది. దాని ఈ పరిశుభ్రత తక్కువయినది మేము వరుస ఇంటికి వచ్చినప్పుడు మా కుడిపక్కకు మరాఠీదంపతులు ఉండేవారు. వాళ్ల ఇంట్లో కచాడా సామానుకు ఒక భోషాణం ఏర్పాటు చేశారు. దానిలో విరిగిన ఇనుపవస్తువులు, తెగినచెప్పులు, పిల్లల పాతపుస్తకాలు — మొత్తానికి అదొక ప్రాచీనవస్తు సంగ్రహాలయంగా వుండేది. అప్పుడప్పుడు మోడకా బాజారు మనిషి రావాలి, వాటి నన్నిటినీ ఆతనికి సరైన ధరకు అమ్మాలి. దీనినుంచి వారికి చాలినంతడబ్బు వచ్చేదనుకుంటాను. దీనినిచూచి మావిడకూడ ఒక భోషాణం తయారుచేసింది. దీనిలో కొద్దిగా కారుతున్న స్టౌ, గ్లాసులేని లాంతరు, వానకాలం కోసమని నేను దాచిన రబ్బరు బూట్లు,.....మొత్తానికి ఈవిడ మోడకా బాజారు బొంబాయి "వైట్ వే లేడ్‌లా" లాగ తయారయింది. మోడకా బాజారు సరకులను సిద్ధపరచడంలో నెలలోగా పది పదిహేను కొత్తసామానులు ఇంటికి తెచ్చితీరవలసిన సందర్భం ఏర్పడింది. తర్వాత నేను ఆ ఇళ్లవరసనే విడిచిపోవడం మినహా మరొక ఉపాయం తోచలేదు.

కసువునుంచి రసం తీయడమే మోడకా బాజారు రహస్యం. దానికి తగిన చూపు వుండాలి. కవిసంస్కారం కావాలి. ఇటీవల మా వూరులోని మోడకా బాజార్లు పెరుగు తున్నాయి. మార్కెట్టు ముఖ్య వీధిగుండ వీటిని చూడవచ్చు. బయలే వీరి బజారు. ఎటుచూచినా విరిగిన సామానురాశి—ఇనుపమేకులు మొదలు యంత్రాలసామాను, మంచాలు వరకు అన్ని వస్తువులు దొరుకుతాయి. విరిగి డొక్కైన ఒక పాతబస్సు బాడీయే వారి ఇల్లయిపోయింది. అక్కడే భోజనం, అక్కడే నిద్ర. ఇలాటివి స్థిరమైన అంగళ్లనే అనవచ్చు. కొన్ని సంచారపు అంగళ్లూ వుంటాయి. ఒకటి రెండు గాజుదీపాలు, నాలైదు గైడులు, హాండ్‌బుక్కులువంటి పుస్తకాలు, వ్యాపారం ముగియగానే ఇంత సామానును బుట్టలో వేసుకుని లేస్తారు.

వెనకటికి ఒకమారు కొందరు జపానీ యాత్రికులు వచ్చారు. వారి హస్తకౌశల మంటే ఆశ్చర్యకరమైంది. పురుషులూ అలాగే, స్త్రీలూ అలాగే. ఒక అణా చెరకుకొని దానిని నమిలి రసంమింగి మిగిలిన పిప్పినుంచి, చెరుకు పొట్టునుంచి అందమైన పూవులు చేసి మాముందే అణాకు ఒక్కటి అమ్మారు. కసువులో రసంనింపేవారి కౌశలానికి నేను తలఒగ్గాను. ఏ మోడకా బాజారు ఈ సృష్టికి సరిసమానమయ్యేని !

# 14. చావుతో సరసం

## ద. రా. బేంద్రే

"మృత్యోర్మా అమృతం గమయ"—ఉపనిషత్తు.

"మాటకు వెరవనివాడు తుంటరి,

మరణానికి వెరవనివాడు బంటు "—జానపద వేదం,"

"చిక్కిన వారికి చిక్కదు చావుతో సహవాసం"—స్వానుభవ వచనం.

చావు అనగానే సింహం-పులి అనేవాటికంటెకూడ ఎక్కువగా జనం ఎగిరి పడుతారు. సింహం, పులి భయపు ఉత్సవమూర్తులు. చావు మూలవిరాట్టు. కచ్చుగుండె కలవారు కొందరు. సింహాలను పులులను వేటాడుతారు. కొందరు చతురులు వాటితో చెర్లాట లాడుతారు. అయితే, అలాంటివారుకూడ చావు అనగానే సగం చచ్చినట్లవుతారు. షేక్స్పియర్ ఏమైనా చెప్పనీ, ఎంతటి పిరికివాడికైనా చావురావడం ఒక్కమారే. అయినా, జీవికి అవసరంలేని ఈ అనుభవం అనేక జన్మలలో కలిగి మృత్యుభయం అందరికీ రక్తగతమైంది. మనం నోటితో ఆత్మ అజరామరము అనుకొన్నప్పటికీ, అంతే. పుట్టినవాడికి చావు తప్పలేదని అన్నా అంతే. చావువేడిగాని చావుచలిగాని ప్రాణికి పట్టగానే, రక్తం ఉడికిపోవడమో, చల్లబడడమో ప్రారంభమవుతుంది. మనం, భయపడినా, ధైర్యంతో వున్నా, చావు మనచేయి పట్టుకొనడం జన్మలో ఒక్కమారే. అది ఎలాటి పట్టు! ఎలాటి స్పర్శం! ఆ క్షణంలో అంతా మరచిపోతుంది. మృత్యుయోగం అని అనడం అందుకోసమే.

ఇలాటి ఈ మృత్యువు, చావు, మరణాలతో 'సరస' మంటే మేను పులకరిస్తుంది. కొందరికి చెమట పట్టవచ్చు. కొందరికైతే వణుకు పుట్టవచ్చు; మరికొందరికి మూర్ఛకూడ రావచ్చు. అలాటి సరసమాడే పనిని నేను చేశాను. "ఎంత గట్టివాడు వీడు" అని కేకలు వేయకండి. నాకూ గట్టివారికీ అజగజాంతరం. అయితే, నా తీరువేరు. వజ్రకాయులైన గట్టివారు బలానికి ఆ కొస; నేను ఈ కొస. ఓరుగాలికి మానులు విరిగిపడుతాయి. గడ్డి అలాగయిందా? నేను వైద్యులమిండడు, అని పేరుపొందాను. పుట్టురోగాల పుట్ట నేను. గాడిద చిత్రకారులకు మిండడు—అని అనడంలేదూ? చిత్రకారుడు దాని రూపరేఖలను చూచి గ్రహించేటంతసేపు అది స్థిరంగా నిలబడదు. నా శరీరప్రకృతి దానికన్నా చంచలం. వైద్యులు నా నాడి చూడడమయితే ఏనాడో వదలిపెట్టారు. గుండె కొట్టుకోడాన్నిబట్టి నా ఆరోగ్యచికిత్స చేసేవారు. పొద్దస్తమానమూ చావును వెక్కిరిస్తున్న నాగుండె రానురాను కొట్టుకోవడం తగ్గింది. తాను చావలేదని చెప్పేమట్టుకు లోలోపలే కొట్టుకొనేదేమో!

1. "మాతిగంజదవ తుంట మరణ కంజదవ బంట."



మొదటే నా చేయివదలిన వైద్యులు వా గుండెకూ చేయి వేయలేదు. ప్రాణం ముక్కునే పట్టుకుంవాననో ఏమో నా ఉచ్ఛ్వాసనిశ్వాసాలనుంచే నాకు చికిత్స జరిపారు. రోగాలపుట్టలాగ ముడితే చెడ్డానని తనవరకు తాను నెమ్మదిగా తీరికవేళల్లో ఆడే నా ఊపిరి వైద్యులను చూచి విస్తుపోయి కాబోలు ఆగిపోయినచోటే ఆగి, గునిసేది. నేను కంటిరెప్పలు కొట్టడంనుంచి వైద్యులు జీవకళ ఉన్నట్టు కనుక్కొని వెళ్లేవారు. ఈ తపస్సును నేను అనేక సంవత్సరాలు సాగించాను, "తోడేలు! తోడేలు!" అని బెదిరించిన గొల్లపిల్లవాడిలాగ నేను ఏన్నోసార్లు నేను చచ్చాననే అబద్ధపు గలాటా లేపాను. అందువల్ల బుద్ధి వచ్చిన నా ఆప్తులు నేను ఒకటి రెండుసార్లు తీరా చచ్చినట్లు వున్నా, గుండె చెదరక పండుగకోసమని నాకు కొత్తబట్టలుకూడ కుట్టించారు. వారికి తెలుసు నేలకు తగిలిన చెండు (బంతి) పైకి లేస్తుందని. ఏరుదాటిన మీదట తెప్ప తగలేయడం అంటారు. నేను ఎప్పుడో జన్మపుటేరు దాటాను. అయితే జన్మపు ఆవలిగట్టుమీద వున్నవారు నన్ను అస్పృశ్యులలో పరిగణించారో ఏమో! నాకు అన్నిరోగాల ఇంజక్షనులు అయినందున నేను తక్కిన జనంలాగ ఏదోఒక రోగంతో చస్తాననే భయం నాకులేదు. నేను చావడం జరిగితే చావుతో చస్తాను. నేను చస్తే, దాని శ్రేయస్సో అపకీర్తో పూర్తిగా చావుదే. "నా కెందుకు ఈ అపవాదం!" అని చావు నాకు భయపడుతూ వుండవచ్చని నాకు రాను రాను ధైర్యం కలుగసాగింది. చావంటే భయం తగ్గుతూ రానురాను, అదంటే, అనాదరం కలుగసాగింది. నిజంగా చూస్తే చావు ఎంతపూజ్యమైన, అపూర్వమైన, ప్రేక్షణీయమైన వస్తువు కావాలి! సంవత్సరానికొకమారు వచ్చేపండుగ ఎంతరుచి! పండుగకు ఎంతప్రియం! ఎన్నడో ఒకనాడు వచ్చే గ్రహణం, తోకచుక్క ఎంత దర్శనీయమైనవి! నూరుసంవత్సరాల కొకమారు వచ్చేచావు ఇంత అనావరణీయం కావాలా? దీని మోరను జనం ఎందుకు తప్పించుకుంటారో! నా సంగతేమో వేరే అనండి. నాకు చావుతో భేటీ అంటే, సర్కసుకోని మేకకు పగలు, రాత్రి అయ్యే పులి భేటీవంటిది. ఆ పులి మేక ఒక తళిగలో (కంచంలో) పాలు తాగేట్టు నేను చావుతోపాటు ఒకే గిన్నెలో దినమూ కషాయం తాగే వాడిని. చావుకైనా భయపడనినేను ఒక్కొక్కసారి ఆ కషాయంలో పడిన నా ముఖం నీడనుచూచి ఎగిరిపడేవాణ్ణి. అయితే, దానినే చూచి నా వైద్యులు సంతోషపడేవారు "ఇంత జీవం వుందికదా వీడిలో" అని. ఇదేమి సరసమో మేము ఇలాటిది మరొక్కటి చూడలేదని జుగుప్సపడకండి. ఇది నా గరిడీసాముల సాధనమాత్రం. చమత్కారమంతా ముందర ఉంది. పదిమంది దొంగలను పరిగెత్తించిన ఒక దొంగసంగతి మీరు వినలేదూ! వాడు ముందు పరుగెత్తుతున్నాడట. వాడిని పట్టుకొనడానికి దొంగలు వానివెంట పడ్డారట. ఇలాటిదే ఇంతవరకు జరిగిన నా సరసం. నేను ముందు పరుగెత్తుతున్నాను. చావు నా వెనకనుంచి పరుగెత్తుతూ వుండేది. ఏమైనా నేను చావును పరుగెత్తించాను. అయితే, రోగాలపుట్ట అయిన వాడి జీవితం ఏమి సహించదగినది? రోగాలతోగాని. ఔషధాలతోగాని ఎలాటి భయమూ నాకు లేదు. నాజీవితంవల్లగాని, మరణంవల్లగాని ఎలాటి భయమూ నా ఆప్తులకు లేదు. నా మరణభయం వారికి లేదు; నాకూ లేదు,

నా జీవితాన్ని వారు లెక్కలో పెట్టుకోనేలేదు. నాకూ దాని లెక్క తలకెక్కేదికాదు. నాకు అలాటి జీవితం విసుగెత్తింది. నేను ఈ విధంగా అమరుణ్నయితే ఎలా? - అనే ఆలోచన కలిగి ఒళ్లు వణికింది. చావు నన్ను తీరా మరచిపోయివుండీనా? — అనే విచారం కలిగింది, వైద్యులు నాచేయి వదిలారు. చావు చేయి వదలింది. అలాగయితే ఈ జీవన్మరణంనుంచి చేయూతయిచ్చి నన్ను విడిపించే వారెవరు? చాల చింత కలిగింది. తల గోక్కున్నాను. చేతులు, ఒళ్లు గోక్కున్నాను. ఎక్కడా ఆలోచన తలయెత్తలేదు. విసుగెత్తి అలాగే, పక్కమీద పడ్డాను. "అయ్యో! విసుగా!" అన్నాను. సరి. ఒక్క ఆలోచన తోచింది, చస్తేతప్ప చావడానికి మరొక ఉపాయం లేదని! ఎలాంటి బంగారంవంటి మాట! ఎంత ఉజ్జ్వలమైన ఆలోచన! తాను చావనిదే స్వర్గం లేదు. చావు మనను చంపితే, ఎక్కడి స్వర్గం? చావు ఒంటిమీద మనం ఎక్కిపోవాలి. దానికీ మనకు మల్లయుద్ధం జరుగాలి. పట్టుకుపట్టు, పెట్టుకుపెట్టుగా మనం చావాలి. చచ్చి అమరులు కావాలి. మరి చావని వారు కావాలి. అదే వీరమరణం! అయితే, సంప్రదాయసిద్ధంగా వచ్చే వీరమరణ కల్పన నాకు సరిపోదు. మొదటి సంగతి - మొదటినుంచి కొనవరకు అదంతా హింసామార్గం. రెండవ సంగతి - రెండవవాని చేతిలో మన రణరంగంలో చస్తున్నాము. గుద్దితే చచ్చిపోయే నేను హింసామార్గానికి జాతివైరి అయ్యాను అనండి. అంతేకాక చేతిలోవుండే మరణాన్ని ఇతరులనుంచి స్వీకరించడం నాకు సమ్మతంకాదు. చావువంటి పనికోసమూ పరులపై ఆధార పడాలా? మన పరావలంబి స్వభావానికి ఇంతకన్నా హీనమైన స్వభావం వుందా? అంతలోనే, పురుషప్రయత్నానికి దైవం చేయూత ఇస్తుందనే లోకోక్తి జ్ఞాపకానికి వచ్చింది. నేను స్వతంత్ర ప్రయత్నంతో చచ్చే దారిపట్టాను. ఆ ప్రయోగాల ఇత్యర్థం (సారాంశం) ఇక్కడ ఇచ్చాను.

చావాలని ప్రయత్నం చేసేవారికి చావు తమ ఇచ్ఛప్రకారం రాదనేమాట అంత సరైనదిగా కనిపించదు. సులభంగా అనేస్తాము. "నాకు జీవితం అక్కరలేకపోతే, చచ్చిపోతాను." అని అనడం ఎంతసులభం. మరణం ఇంత సులభమైతే, బీదసాదలు కష్టాలతో కుళ్లేవారు కాదు. మరి స్వచ్ఛందమరణం అనేది పెద్ద సిద్ధి అనీ భావించబడేదికాదు. రోగిష్టితనం "చావు నోట్లో చిక్కుకున్న ముద్ద కాదు ప్రాణం" అని నేర్పితే, "చావూ ప్రాణం నోట్లో చిక్కుకున్న ముద్ద కాదు" అనే దాన్ని నా ఆత్మహత్యా ప్రయోగాలు నేర్పాయి.

నా జీవితంలో ముందెప్పుడూ తలయెత్తని గాంభీర్యం ఇప్పుడు తలయెత్తింది. నేను ఆలోచించసాగినాను, సులభంగా చావడం ఎట్లా అని. ఊపిరే ప్రాణం. ఈ ఊపిరాటనే నిలిపితే జీవం దూకులాటే నిలిచిపోతుంది. నా కార్యప్రవృత్తి అంతా కుదిరి వచ్చినట్టు-నాకు ఆలోచనకలగడమే ఆలస్యం, నేను ప్రయోగమే ప్రారంభించాను. ఇక్కడ ఒకటి రెండు మాటలుచెప్పడం అత్యవసరం. ఒకటి-ఈ నా ఆత్మహత్య ఉద్దేశాన్ని నేను ఎవరికీ తెలుపలేదు. ఇంతేకాదు. అది తెలియగూడదని నేను నా తిండితిప్పలు, నిద్ర



మొదలయిన వాటిని ఎక్కువ నియమప్రకారం చేయసాగినాను. రెండు - నాకు ఎక్కువ జంభమనేది లేదు. ఇతరులు చూడాలని ఏమిచేయాలన్నా నాకు అసహ్యం. మూడవది - ఆత్మహత్యాప్రయత్నాలు ఆత్మసంతోషంతోను, 'అక్కలు-హుషారి' తోను (తెలివితేటల, జాగరూకతతోను) సాగాయి. ఈ మాటలను జ్ఞాపకంపెట్టుకుంటే, ఇకముందు చెప్పబోయే మాటలవిషయంలో ఎవరికీ సంశయాలు కలుగవు.

చెప్పాను గదూ, ఊపిరి నిలిపి ప్రాణత్యాగంచేయాలని నేను చేసుకున్న నిర్ధారాన్ని. నేను ప్రారంభించింది ఈ విధంగా: మొదట లోపలవచ్చిన ఊపిరిని లోపలే లాగివుంచుకోడానికి సిద్ధపడ్డాను. కాని, నీరసమూలంగా అది సాధ్యంకాదు. ఊపిరి వదిలాను. అలాగే వదలనే వదిలాను. దేహమనే తడశలకొంప పాడయిపోయేవరకు అలాగే వదలివేద్దామనుకున్నాను. ఊపిరి వదలడమైనా ఎంతదూరం? మళ్ళీ అలాగే లాగి లోపలికి బొద్దుకు తాకించాను. "పిచ్చుకా, పిచ్చుకా, చచ్చావా?" అంటే, "నేనెందుకు చావాలి పిచ్చిబావడా, ఉయ్యాల ఊగుతున్నాను" అని చెప్పినట్టు జీవమూ చెప్పడం మొదలుపెట్టింది. నేను గుండెజారలేదు. ఈ ఊపిరాటతో ప్రాణాన్ని లాగిలాగి అలాగే మెసలకుండా-ఇవాళ కాదు రేపైనా-చేయవచ్చుననే భరోసాతో నేను ఎన్నోనాళ్లు ఈ ప్రయత్నంచేశాను. పద్ధతిలో తప్పుందేమోనని ఊపిరి తీసుకొనడంలో తిరుగుమళ్లుచేశాను. లోపలవున్న ఊపిరిని వెలుపలికి నెట్టినెట్టి, వెలుపలవున్నదానిని లోపలికి తోసితోసి ఆమీదట ఆ ఊపిరిని కట్టివేసి చూచాను. ఈ ఇగ్గులాటకు విసిగి ప్రాణం దేహాన్ని విడవవచ్చుననే భరోసా నాకు ఉండినది. మొదటే నాకు చావంటే భయంలేదు. దానిలోను, ఇప్పుడు దాని ఒంటిమీదే నడిచి సాగిపోతున్నాను. ఈ నిర్భయంవల్లనో ఏమో నా దేహప్రకృతి చక్కబడసాగింది! నా రోగకళ తగ్గింది. ఒకసారి నేను యథాలాపంగా కొన్నిపుస్తకాలు చూస్తున్నప్పుడు, "ప్రాణాయామం" వచ్చింది. నాకు ఆశ్చర్యమయింది. భయమైంది. అప్పుడు నాతప్పు నాకు తెలిసింది; నేను ప్రతిదినమూ చేస్తున్నది ఆత్మహత్యాప్రయత్నంకాదు. ఆయుర్వృద్ధి ప్రయత్నమని. నేను తప్పుగా ఉపాయం ఆలోచించినందుకు పశ్చాత్తాపపడ్డాను; అయితే నా నిశ్చయాన్నిమాత్రం వదలలేదు.

చచ్చేప్రయత్నంలో ఈ కొట్టుకులాడే గాలిని నమ్మక ఎక్కువ మనసు నచ్చిన గట్టిఉపాయం ఆలోచించాను. ఉరిపోసుకోడానికన్నా ఎక్కువ సులభమైన, తీరా చేతిలోని ఉపాయం మరొకటి ఏమిటి? సరి! ఆ రాత్రే ఉరిపోసుకొనడానికి నిశ్చయించుకున్నాను. తెల్లవారుజామున మూడు నాలుగుగంటలు ఆ పని చేయడానికి ఏర్పాటుచేసుకొని పడుకున్నాను. ఆనాడు పడుకొనేటప్పుడు నిర్విచారంగా వున్నంతగా నామనస్సు మరేనాడూ లేదు. ఆనాడు పట్టిన నిద్ర ఎలాంటి నిద్ర అది! అది అలాగే ముగియకుండా సాగివుంటే నాపని ముగియనే ముగిసేది. అయితే ఏమిటి? తెల్లవారుజామున ఆరుగంటలకు మెలకువయింది. మెలకువయినతర్వాత కొంతసేపటివరకు నాకు మరణచింతే తోచలేదు. ఉదయరాగాలను ఆలాపించసాగాను. మనస్సు అంత "ఝోక్"గా వుంది. ఉదయరాగాలు ఆల

పిస్తుండగా, "కరుణించుము కృష్ణా కరుణించుము" అనే చరణం వచ్చింది. అప్పుడు వచ్చింది మరణం జ్ఞాపకం. ఎంత మరపుస్వభావంగల వాడిని నేను అని అనుకున్నాను. మరుసటిరోజు గల్లుకువేసే మనుష్యుని ఇచ్ఛాపూర్తిచేసేవిధందా నేను ఆరోజు స్వేచ్ఛగా, ఆనందంగా కాలంగడిపాను. మూడుగంటలకు మెలకువ అయ్యేటట్టు 'అలారమ్' పెట్టుకున్నాను. కచ్చితమైన నిద్రముందు బెదురు గంటా ? నాకు అలారంవల్ల దోమకుట్టినంత ఇబ్బందికూడ కలుగలేదు. మరొక ఆలోచన పారింది. పడుకొనడానికి ముందు విరేచనానికి తీసుకోవాలి. అంటే, మెలకువ అవుతుందని. విరేచనానికి తీసుకోడంవల్ల ఇష్టప్రకారం మెలకువేమో అయింది. అయితే ఆ విరేచన బాధను తీర్చుకొనడంలో తెల్లవారింది. కొసకు ఆ వెలుపలి ఉపాయాలపైన నమ్మకంపోయి, నాలుగుకు లేవాలి అని మనస్సులో సంకల్పించుకున్నాను. సంకల్పబలంముందు మరొక బలమేమిటి ? సంకల్పానికి అనుగుణంగా నేను నాలుగుగంటలకు వెంటనే లేచాను. చేశాను, ఉరిపోసుకొనడానికి సన్నాహం ! సన్నాహ మేమిటి ? మెడ, ఉరితాడు, చచ్చేవాడు ఈ మూడూ ఉంటే చాలు. ఆమూడూ ఇక్కడ ఉన్నాయి. చచ్చేముందు భగవత్ప్రార్థన చేయాలనే ఆలోచన కలిగింది. ప్రార్థనకు కూచున్నాను. కళ్లమూసుకుని ధ్యానం ఆరంభించాను. ప్రారంభం ప్రారంభంలో ప్రార్థనపైన మనసు వుండేది. అయితే సొంపైన తెల్లవారుజాము తియ్యని నిద్రమత్తు; తెల్లవారగానే మెలకువ. ఈ విధంగా కొన్నాళ్లు గడచినతర్వాత నేను భగవత్ప్రార్థన చేయరాదని నిశ్చయించుకొన్నాను. ఎందుకంటే, ప్రార్థన చేయడానికి కూర్చుంటే, నిద్రపట్టేది. అంతేకాక, సర్వాంతర్యామి అయినవాడికి తెలియనిది ఏముంది కనుక ? నేను ఆరోజు మెలకువ అయినవెంటనే, పక్కను చుట్టిపెట్టాను. శాస్త్రం కోసమని భగవత్ప్రార్థనను ఒక్క నిమిషంలో ముగించాను. ఒంటిమీద బట్టలన్నీ తీసిచుట్టి ఒక పగ్గంతోకట్టి గూటానికి వ్రేలాడవేశాను చచ్చేసమయంలో ఒంటిమీద బట్టలూ పాతలూ ఎందుకు ?—అనుకొని ఒక పాతకౌపీనం మాత్రం పెట్టుకున్నాను. సన్నాహమంతా అయింది. అయితే ఏమిటి ? ఎక్కడ చూచినా ఉరితాడే దొరకలేదు. వెలుపలికిపోయి తెద్దామంటే, దిగంబరవేషం. కౌపీనంతో ఉరిపోసుకుందామా అనిపించింది. అయితే ఆ పాతపేలికకు నా బలిసినమెడకు ఉరిబిగించే గట్టితనంలేదు. ఆ పగ్గాన్ని వెదకనే వెదికాను. తెల్లగా తెల్లవారేటప్పటికి కనిపించింది. ఆ పగ్గంతోనే నా గుడ్డలు కట్టిపెట్టానని జ్ఞాపకం వచ్చింది. ఉరిపోసుకొని చావడం నా నుదుట వ్రాయ లేదు అని తోచడంవల్ల ఆ దారి వదలిపెట్టాను.

తుపాకిగుండు ప్రేల్చుకుందామనే ఆలోచన కలిగింది. ఒక స్నేహితునివద్దకు రోజూ పోయి, గురిచూచి కొట్టడం నేర్చుకున్నాను. కాని, దాని ఉపయోగాన్ని స్వంతంచేసుకోవాలని మనస్సుకు వచ్చినప్పుడు ప్రాణం తిరిస్కరించసాగింది. చావడానికి ఒప్పుకున్న ప్రాణాన్ని అడవిమృగాన్ని వేటాడినట్టు వేటాడడం తరమైనపనికాదని నా సాత్త్విక జీవితానికి తోస్తే, చోద్యమేముంది ? సరి ! గుండు గురితప్పింది. విషానికి చేయివేయక



మరేమిటి గతి ? వజ్రాన్ని నూరి తాగనా ? ఛీ ! ఈ బిడుగుజీవాన్ని చంపడానికి ఇంతవిలువగల ఉపాయమెందుకు ? అఫీము మింగనా ? చావడానికిముందు మత్తుఎక్కి తెలివి తప్పి, చావడం నాకు సరి అనిపించలేదు. కళ్లు తెరుచుకొని మెలకువతో చావాలనే నా సంకల్పం ఇంతేనా ? రానురాను నాకు విషప్రయోగం సరికాదని తోచింది. ఇటీవల నేనుబాగా ఆరోగ్యవంతుడయాను. ఇటువంటి ఆరోగ్యవంతుడు ఒక్కసారిగా చస్తే విషప్రయోగం అయివుండాలని కదా అనుమానిస్తారు జనం ! ముందు అనుమానమేమిటంటే, వేరేవాళ్లు విషంకలిపి వుంటారని. ఇదే నాకు ఇష్టంలేని విషయం. నాచావుతో ఎవరూ ఇబ్బంది పడరాదని నా ఆశ. ఈ ఆశకూ, ఆ విషానికీ మేళం ఎలాపడుతుంది ? సరి; విషం సంగతి వదలిపెట్టాను. ఇక చెరువుపాలో, బావిపాలో కావడమే నాకు ఉపాయం. చెరువుసంగతిని మొదట్లోనే కొట్టివేశాను. జనానికీ పశుధనానికీ ఉపయోగమయిన నీటిని పాడుచేయడం ఉచితంగా తోచలేదు. ఇక బావులు. మంచినీటిబావులలోనైతే నేను దూకలేను. ఏ నీళ్లుతాగి నేను బతికానో దానిలోనే నాప్రాణం పోయిందనే అపకీర్తి దానికెందుకు ? నేను గుర్రంఎక్కి ఊరుచుట్టూఉన్న బావులను పరీక్షించాను. ఎందుకంటే చవుడునీటి బావులైతే ఏమి ? ఊరిలోవన్నీ బీద బిక్కికి ఉపయోగం. అందువల్లనే నేను ఊరివెలుపలి బావులను తొంగిచూడడం. కొన్నిబావులలో నీళ్లే లేవు. అవి నాకు పనికిరానివి. నీరున్నవయితే వాడకం లేనందున కంపుగొడుతున్నాయి. అలాంటిబావులలో దూకి, నీళ్లు మింగలేక, మునగలేక కొట్టుకోడం ఎందుకు ? అంతేకాక, నాకు ఈత రావడం ఒక్కటి. అందువల్ల ఆ బావులూ నాకు సరిపోలేదు.

ఈలాగే కొన్నిరోజులు గడవగా నాకు ఒక ఆలోచన కలిగింది; నేను ఇంత ఆరోగ్యవంతుడినిగా వున్నప్పుడు చావడం ఎందుకని ? రోగిష్ఠిజీవితానికి విసుగెత్తి అన్న మాటలను ఆరోగ్యవంతుడైన తర్వాతగూడ అలాగే నడపాలా ? వైద్యులతోనూ చావని, స్వప్రయత్నంతోనూ చావని ఈ జీవంతో ఏదైనా మహాకార్యం కావలసిందివుందేమో ఎవరికి తెలుసు ? ఇప్పుడు నా జీవితంలో ఏదీ అతిగా లేదు; అంతా మితమే. ఆహారం, విహారం, విచారం, ఆచారం, అంతా సూత్రబద్ధం. చావు నన్ను వేటాడింది కొన్నాళ్లు. ఇప్పుడు మేమిద్దరం మిత్రులం; ఒకరిపై మరొకరికి ద్వేషం లేదు. కొందరి సరసం విరసమవుతుంది. నా సరసం సరసతరమయింది. మృత్యువునుంచి అమృతత్వమార్గం వెదకడం అంటారు. అది ఇదే అయివుంటుందా ? అట్లయితే ఇదే సరసం. ఇంతకన్నా వేరే సరస మేమిటి ?

# 15. కటువైన సత్యం

రం. శ్రీ. ముగళి

సత్యం అనేమాటలో ఎక్కువ అంటే మూడు అక్షరాలు వుండగా, దాని అర్థంలో నూరు రీతులు, నూరు మతాలు పుట్టాయి. 'ఏకం సత్ విప్రా బహుధా వదంతి'—సత్ ఒక్కటే, విప్రులు బహుధా చెబుతారు-అని వేదంలో వెయ్యేరు సంవత్సరాలకుముందు చెప్పినమాట ఇంతవరకు ఉన్న ఇతిహాసంచూస్తే సరైనదని తోస్తుంది. ఋషులమాట అది; జరుగనే జరుగాలి. ఒకేసత్యాన్ని నూరుమంది నూరుపక్కలనుంచి తోసి ముక్కలు చేశారు. తమ చేతిలో మిగిలిన ముక్కనే ప్రతివారు ఇదే సత్యమని ప్రాణంఇచ్చి చూపడానికి సిద్ధమయినారు. దూరంలో నిలబడి చూచేవారికి ఆ ఒకేసత్యం, దానిని తోసే జట్టీల చేతుల్లో ముక్కలుకావడం కనిపిస్తుంది. అయితే, ఒకేసత్య మంటే ఏమిటి? ఏమిటి ఈ విధంగా ముక్కలయింది అనేది వారికి కనిపించదు.[1] ఇటువంటి 'దూరదర్శ'ల విచారసరణివల్ల నూటఒక్కటవ మతమొకటి పుట్టి జగత్తు ముందుకు సాగుతున్నది; పోట్లాటకు మరొక నెపం కలుగుతున్నది. ఈ మనోరంజకమైన దురంతనాటకంలో ఇరవయ్యవశతాబ్దపు వినోదపాత్రగా 'కటువైన సత్యం' అనేది ప్రవేశించింది!

ఈ వినోదపాత్ర లక్షణ మేమిటి? జనం లోపాలను, దోషాలను వికారంగా ఎత్తి చూపి పరిహసించి, పరిహసిస్తున్నప్పుడు తన లోటుపాట్లను మరుగుచేసేటట్టిదీ, మరుగు చేసే ప్రయత్నంలోనే వాటిని ఎత్తిచూపేటట్టిదీ, ఈ విధంగా దానినుంచి మరింత నవ్వు పుట్టించేదీ అయిన పాత్ర. లోకంలో తమవిషయంలో వున్న సత్యాన్ని అందరూ మూసి పెట్టుకుంటారు. ఒకరిదొకరు మూసిపెట్టుకొనేదయితే సభ్యతరీతి అయిపోయింది. "పరస్పరం భావయంతః" అని భగవద్గీత చెప్పలేదా? నా సత్యం బయటపడకూడదంటే, పెరవారి సత్యాన్ని నేను బయటపెట్టగూడదు. ఈ పరస్పర సిద్ధాంతంపైనే సమాజనీతి అంతా నిలబడివుంది. మనం సత్యం చెప్పడమే లేదని కాదు. అయితే, మనకు, పెరవారికి ప్రియమైన సత్యం చెబుతాము. అంటే, "అబద్ధపు సత్యం" చెబుతాము. కటు సత్యం ఈ అబద్ధపు సత్యం 'ఇనుపతెరను' నరికి పారవేసి నిజమైన సత్యాన్ని ధైర్యంతో చూపుతుంది. దాని విశ్వరూపదర్శనంనుంచి లోకరూపి అయిన అర్జునుడు తత్తరపడి, చాలు చాలు అని కేకలు వేస్తాడు. అప్పుడు కటుసత్యం వినోదపాత్రమై తన దర్శనాన్ని నవ్వు మూసలో వేసి పికారమైన అకారమిచ్చి లోకంముందు పెడుతుంది. లోకం నవ్వుతూనే తనకు గుచ్చుకొనే ముల్లును సహిస్తుంది. ఇంటిలో, వీధిలో సహించని సత్యాన్ని

1. కనిపించకపోవడమే దాని విషయంలో సత్యమని వారు తెలుసుకుంటున్నారు.



కలారంగంలో సహిస్తుంది. అప్పుడు కటుసత్యానికి ఎంత సంతృప్తి? తన జీవితకార్యం సఫలమయిందని అది గంతులువేస్తుంది, కేకలువేస్తుంది. విచిత్రమేమిటంటే, 'కటు సత్యమూ' కూడ లోకంలో జీవించే వస్తువు. దానికికూడ తన విషయంలో వుండే సత్యాన్ని ఎదిరించే ధైర్యం వుండడం అపురూపం. అందువల్ల దానివంటివారు ఎవరైనా తగిలితే, దానిసహనం మీరిపోతుంది; పిత్తం నెత్తికి ఎక్కుతుంది. "నేను చేసేపనిని నీవు చేయడానికి ఎంతటివాడివి? నా శస్త్రాన్నే నామీద ప్రయోగిస్తావా?" అని అది ఎదిరిని అగౌరవానికి గురిచేసి, స్వప్రతిష్ఠ సంబరంలో మెరుస్తూ తనపేరుకు తానే మసిరాసుకోవచ్చు. తనకు సంబంధించిన అప్రియ విషయాలను వినడానికి అసహనం చూపడంలోనే, హెచ్చు వినోదం కల్పించవచ్చు. తాను కటు సత్యమని చెప్పింది సత్యమే కాదని ఎవరైనా సామాన్యంగా చూపిస్తే, కటుసత్యం సర్వాధికారి తానేనని, ఇతరులకు అది తెలియదని, చాటుతూ, అహంకారశిఖరం ఎక్కి కూర్చుని కోతిలాగ కుతూహల విషయం కావచ్చు.

సత్యమనేమాట చాల పాతది. సత్యం చెప్పు, సత్యంలాగ నడు అని చెప్పని మత ధర్మం లేదు. "సత్యమేవ జయతే, నానృతం"-సత్యమే గెలుస్తుంది, కల్ల గెలువదు - అని ఉపనిషత్తులు చాటాయి. 'సత్యానికి చావులేదు' అని (సత్యక్కెనావిల్ల) కన్నడం సామెత. సత్యం ఎరిగినవాడు చచ్చినట్టు ఉండాలి అని సర్వజ్ఞుడు చెప్పాడు. సత్యానికి చావులేక పోయినప్పటికీ సత్యాన్ని ఎరిగినవాడుమాత్రం చచ్చినట్టు వుంటాడు అనేచోద్యం దీనినుంచి బయలుదేరుతుంది! అల్లే హరిశ్చంద్రుడు సత్యంకోసం చచ్చిచచ్చి మిగిలాడు, సత్యమేమీ చావలేదు. అల్లే సోక్రటీసు సత్యంవెంటబడి విషం తాగి చచ్చాడు. గాంధీజీ సత్యమే దైవమని తాము కనుగొన్న సత్యం చాటినందుకు తలతిక్కబట్టిన వ్యక్తిరూపంలో వచ్చిన మృత్యుదేవతను కౌగిలించుకున్నారు. ఇదంతా సత్యం మాహాత్మ్యం. అయితే, సత్యమంటే ఏమిటది? ఎవరికి అది ఎలాగు తెలుస్తుంది? దీనికి కటుసత్యం సమాధానం ఏమిటంటే "అది తెలియడం చాలసులభం. అందరికీ తెలుస్తుంది. మరుగుకప్పిన తెరను తొలగిస్తే చాలు. జనానికి ఈపని చేయడానికి గుండెలు లేవు. అందువల్ల నేను ఆపని చేస్తాను" అని. ఇక్కడే అన్నిచిక్కులూ పుట్టడం. సత్యం తెలుసుకోడం ఇంత సులభమా? అందరికీ అది తెలుస్తుందా? మరుగుగప్పిన పరదానుఎత్తే దిట్టతనం వున్నంత మాత్రాన సత్యాన్ని తెలుసుకొనేదృష్టి వుండనే వుంటుందని అనడానికి వీలుందా? ఆత్మను తెలుసుకోవాలని, ఆత్మను తెలుసుకుంటే ఇదంతా తెలుసుకున్నట్టు అవుతుందని బయలుదేరిన వేదాంతకాలపు ధీరులు "నేతి నేతి" నిచ్చెనను ఎక్కి మాటను, మనస్సును వెనక్కుపంపి, ఏదో వర్ణించరాని అనుభవాకాశంలో లీనమైపోయారు. తర్కానికి ఈమతి (భావన) దొరకదు అన్నారు. 'తెలియలేదు అన్నవానికి తెలుస్తుంది. తెలుసును అన్నవానికి తెలియదు' అనే పొడుపుకథ చెప్పారు. నేడు బుద్ధితో, ప్రయోగంతో జ్ఞానపు వివిధభంగాలను మనముందు తెరచిపెట్టిన విజ్ఞానశాస్త్రజ్ఞులు లోకరహస్యాలకు వెరగుపడ్డారు. వారిలోను నాస్తికులు ఆస్తికులవుతున్నారు; "నాకు తెలియదు అనేవిషయం మాత్రం తెలుసు" అనే మార్గానికైనా చేరుతారు.

తెలిసినవారి పరిస్థితి ఇట్లా ఉన్నప్పుడు మనబోటి సామాన్యుల పాటేమిటి? దీనికి సమాధానం వుంది అనవచ్చు. ఆ తెలిసినవారు జీవుడు-జగత్తు-పరమాత్మ మొదలయినవాటి సంబంధం చెప్పే తాత్త్వికసత్యం వెంటపడ్డారు. మనం తెలుసుకొనేది లౌకికసత్యం. దీనిని అందరూ సులభంగా తెలుసుకోవచ్చును గదా? మనం మనకళ్ళముందున్న సంఘంలో ఎవరితో ప్రతిదినం భుజంభుజం తగిలించి వ్యవహరిస్తామో ఇంటింటా కలిసివుంటామో ఇలాంటివారి ఆద్యంతసత్యం మనకు తెలియకుండా పోతుందా? ఇదేమో చూడడానికి ఒప్పదగినమాట. అయితే, ఆలోచన చేస్తే, 'భక్తునికి నేను సులభుడిని' అని భగవంతుడు చెప్పినమాటలవలె దీనిలోను ఒకపద్ధతి వుంది. సులభం అనడంతో మనం సంతోషిస్తాము. అయితే భక్తుడుకావడం ఎంతసులభం అనే విషయాన్ని ఆలోచించము. ఆ విధంగానే లౌకికసత్యమూ దృష్టిగలవారికి అంటే 'ద్రష్టలకు' సులభం. అయితే ద్రష్టకావడం తెలిసినంత సులభం కాదు. ఏదైనా సత్యం తెలుసుకొనేవిషయంలో సత్యమనేది ఒకవస్తువు ఉన్నట్టే దానిని తెలుసుకొనే నేను అనే వస్తువూ వుంటుంది. నేను అనే అందరికీ సత్యం సులభమని చెప్పవచ్చునా? నేను ఒక మనుష్యుణ్ని; ఇష్టం-అనిష్టం, కావాలి-వద్దు మొదలైన ద్వంద్వాల సుడిగుండంలో చిక్కుకున్న మనుష్యుణ్ని. ఇలాంటి నేను సత్యం తెలుసుకొనడానికి నా చిన్నతనపు కళ్ళజోడును తీసిపెట్టి, శుద్ధమైన సత్యనేత్రాలను నాలో తెరిపించుకొని, లోపలవున్న నిజమైన నేను కళ్లుతెరవాలి. లోకపు అన్నిసత్యాలు తెలుసుకొనడానికి ఇది మొదటి అవసరం. దీనివల్ల సత్యమంతా తెలియనే తెలుస్తుందనే భరోసా లేదు; సత్యం ఎంత సూక్ష్మం, అగాధం, బహుముఖం అని మాత్రమే తెలుసుకోవచ్చు. అయితే తెలిసినంతసత్యం తేటగా వుంటుంది; హితంగాను వుంటుంది. కటుసత్యవాదులు దీనిని ఎంత బాగా తెలుసుకుంటే వారికీ, లోకానికీ అంతక్షేమం. సత్యాన్ని తెలుసుకొనడానికి మరుగుకప్పిన తెరను జరిపే ధైర్యం ఎంత అవసరమో మనకళ్ల పొరలను తీసివేయగల సంసిద్ధత, సాధనాలు అంత అవసరం. దీనిని తెలుసుకొనకపోతే, ఏ అబద్ధపుసత్యాన్ని ప్రతిఘటించడానికి కటుసత్యం బయలుదేరుతుందో ఆ అబద్ధపుసత్యాన్నే పునరావృత్తిగా తను ప్రకటించవచ్చు. నిప్పువంటి కోపం వచ్చినా చింతపడనక్కరలేదనే గుండె నిబ్బరంతో కన్నదానిని మాట్లాడడానికి పోయి, విపరీతార్థంలో ఇష్టంవచ్చినట్టు మాట్లాడను ఆరంభించవచ్చు. నేను కన్నదే దిటవు అనే మోహాహంకారాలజాలంలో చిక్కుకుని సత్యపు వెలుగునుంచి దూరమై అసత్యపు చీకటిలో అడుగుపెట్టవచ్చు. ఈ సంభవాన్ని తలచుకొనే 'హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపిహితం ముఖం' సత్యం ముఖం బంగారపుపాత్రతో మూయబడింది-అనే అర్థపూర్ణమైన మాటను ఈశోపనిషత్తు చెప్పింది. 'తత్త్వం పూషన్నపావృణు సత్యధర్మాయదృష్టయె' సత్యధర్మాల దృష్టికోసం ఆ పాత్రను తెరువు - అని సూర్యుణ్ని వేడుకొన్నది. సత్యంముఖంమీద బంగారుపాత్ర వుంది. ఎటువంటి బంగారువంటి మాట! ఆపాత్ర చక్కగా ప్రకాశిస్తున్నది. దానినుంచి మనకు సుఖం వుంది. అదే సత్యమని మనం దానిని మెచ్చుకుంటాము. సత్యాన్ని చూడడానికి ఇష్టపడక, చూడలేక మనం మెచ్చిన బంగారుపాత్రమీది మెరుగుసత్యానికి దాసుల మవుతున్నాము. ఈ దాస్యం



నుంచి మనను విముక్తులనుచేసి, నిజమైనదృష్టిని తెరిపించుమని మనలోని సూర్యుణ్ని మనం వేడుకోవాలి; దానికోసం మన మనుగడ అంతా ఒక సాధన కావాలి.

కటుసత్యం తెలుసుకోడం, చెప్పడం చాల సులభమని ఇంతకుముందే చెప్పడమయింది. దీనిని నమ్మినవారు కొందరు సంఘంలో కనిపిస్తారు. పైన చేసిన తత్త్వచర్చ వారికి సర్వదా వర్తించదు. ఎందుకంటే, అది వారితలలో ఎక్కదు. అరచేతిపుండుకు అద్దం ఎందుకు అనే సామెతే వారి నినాదం. ఊరికి ఒక సంపన్నుడు, సంభావితుడు అయిన నాయకుడు ఉన్నాడు. అందరూ అతనిమాట వింటారు. అతని ఎడల ఆదరం చూపుతారు. అతనికి ప్రతికూలంగా నోరెత్తే ధైర్యం ఎవరికీ వుండదు. కాని, మన పై సామెతలో చెప్పిన శూరునికి ఆ ధైర్యం వుంది. "ఆ నాయకుని కూకటివేళ్లన్నీ నాకు తెలుసు. ఎంతమంది కుత్తుకలు పిసికి వాడు సంపన్నుడు అయాడనడం నాకుతెలుసు. పెద్దదేభ అనుకుని ఊరేగుతున్నాడు. అంతేకాక ఊరికంతా ఉన్న ఒక్క ఆడదానివలలో చిక్కుకొన్నాడు." అని ఈ విధంగా, ఈ ధైర్యశాలి ఎవరికీ తెలియని కొత్తవిషయాన్ని చెప్పే ఆవేశభరంలో ఒకకల్పనాసృష్టినే మనఎదుట దింపుతాడు. అతని కటుసత్యం ఖ్యాతిని తెలిసిన మిత్రులూ, అభినందకులూ అతడు చెప్పినదానిలో ఏమీ అతిశయోక్తి లేదని నమ్ముతారు. అతడు చెప్పినట్లో లేక మరికొంత ఉప్పు, కారం చల్లిగాని కనిపించిన వారికంతా చెబుతూ పోతారు. కటుసత్యం ఈ విధంగా లోకమంతా వ్యాపిస్తుంది. ఆ నాయకుని శత్రువర్గంవారు (సంఘంలో నాయకులనేవారికి ప్రతిపక్షులు తప్పక ఉండే రూఢి వున్నది.) దీనివల్ల ప్రయోజనం పొంది, అతనిని హాస్యంచేసి, ఏదైనా ఒక ఎన్నికలో అతనిని పడగొట్టి తాము సత్యధర్మప్రతినిధులుగా పురస్కర్తలుగా ఎన్నికయి వచ్చినవారమని ఊరేగుతారు. ఆ ధైర్యశాలి వారివెంట పడేవరకు వారికి క్షేమం అనాలి. కటుసత్యం ఈ విధంగా సులభం అంటే చౌకగా కట్టుకతల రూపందాల్చి కలహానికి దారి తీరుస్తుంది. దానిలో సత్యాంశం ఉండవచ్చు. అయితే సత్యాంశం చెప్పే పద్ధతివల్ల అది సంపూర్ణసత్యమే అయి వ్యాపిస్తే గతియేమి? కటుసత్యమనే పేరుతో మూర్ఖసత్యమైతే, సత్యానికి విలువ యేమిటి?

మూర్ఖసత్యం అనగానే జ్ఞాపకం వచ్చింది. ఒక సుఖపురుషుడు ఉండేవాడు. అతనికి పుట్టినప్పటినుంచి దేనికీ కొరతలేదు. ఐశ్వర్యమనే ఉయ్యాలలో పెరిగి నలభై సంవత్సరాల వయస్సు వచ్చినా, ఇంకా తొట్లెలో ఆదే పాపాయివలె సరళస్వభావుడుగా ఉండేవాడు. మరుగు, కపటంఅంటే తెలియదు అతనికి. ఎవరైనా వుండనీ, వారిముందు వారి వాదాలను ముక్కలు చెక్కలు చేసేవాడు. సాధారణంగా అతని దినచర్య ఏమిటంటే, టీ సిగరెట్ల ఉద్దీపనంతో పుస్తకాలు చదువడం, తనవారయిన కొందరు మిత్రులతో సొంపుగా కబుర్లు చెప్పడం, ఆ కబుర్లలో ముక్కచెక్కలుచేసే విమర్శలు, వ్యాఖ్యలు ముఖ్యభాగం. దానిని అతడు ఎంత ధార్ష్ట్యంతో చేసేవాడో చూచి అతని స్నేహితులందరికీ ఆశ్చర్యం

కలిగేది. ఆ ధార్ష్ట్యంలోనే అతని హాస్యపు నెలమేరు వుండేది. ఎలాటివ్యక్తికానీ, పుస్తకం కానీ, ఎంత జగద్వంద్యమైనాసరే, వాటినిగురించి కటుసత్యం చెప్పేవిషయంలో అతనిది ఎత్తినచేయి. ఎత్తినచేయి అనగానే, మేము మీకులాగ కొట్టడానికి ఎత్తి ధైర్యంచాలక ఎత్తినచోటే నిలిచేటట్టిదికాదు. ఎత్తినచేయి సుత్తి పెట్టయి పడితీరాలి. అతని మిత్ర బృందం అతని ఈ గుణాతిశయం చూచి, "కటుసత్య కారణజన్ముడు" అని అతనిని కొని యాడేవారు. ఆ పుస్తకంమీదో, వ్యక్తిమీదో దాక్షిణ్యానికి ఏదో వ్యాఖ్యచేద్దామనే ఇచ్ఛ వున్నప్పటికీ చేయలేకపోయినప్పుడు వారు ఆ కారణజన్ముని శరణుజొచ్చేవారు. అతడు ఎల్లప్పుడూ దానికి సిద్ధం. ఎందుకంటే, అతడు అనేవాడు. "ఉన్నది చెప్పడానికి ఎందుకు భయపడాలి ? నాకయితే ఎవరి హంగూ లేదు. అలాగే భయమూ లేదు. మీరు నలుగురి మర్జీపట్టి పొట్టపోసుకొనేవారు. నాకు కావలసినంత డబ్బువుంది. చేతికింద, కాలికింద మనుష్యులు వున్నారు. మీకు దాక్షిణ్యం లేకపోతే గతిలేదు. నాకు నిర్దాక్షిణ్యమే సద్గతి." ఈ మాటలతో పరమసంతుష్టులయిన మిత్రులు తమకుకావలసిన టీకా టిప్పణులను, విమర్శలను తమ కారణ పురుషుని వ్రాతలతోను, ప్రసంగాలతోను చేయించి తాము నిర్లిప్తులుగా వుంటూ, కర్మలో కౌశలమనే కర్మయోగం ఆచరించేవారు. తమ ఉద్దేశం సఫలమైనదని వారికి సంతృప్తి: తాను పుట్టిన ఉద్దేశం ఒనగూడిందని అతనికి సంతోషం. అయితే లోకంలో అన్నీ అన్నికాలాలూ ఒకేపద్ధతిగా నడవవు గదా! నిర్దాక్షిణ్యంగా విమర్శించే వాడికి ఆ విధంగానో అంతకన్నా కఠినంగానో విమర్శించేవాడు తలపడే సమయం వస్తుంది. అప్పుడు తననుగురించి అలాటి అపశబ్దాలు ఎదిరి ఆడినందుకు కోపంతో నిప్పయి పోతాడు. కటుసత్యపుబంతి ఎగిరివచ్చి తన ముఖానికే తగిలినప్పుడు పళ్ళువిప్పి నేలకు కొడతాడు. మన సుఖపురుషునికి అలాటి ఒక సందర్భం వచ్చింది. అప్పుడు దానికి తన మిత్రులే కారణభూతులన్న విషయాన్ని కనిపెట్టి అతడు తన కటుసత్యబాణప్రయోగం వారిపైనే చేశాడు. స్నేహవాతావరణమంతా రణరంగధ్వనిగా పరిణమించింది. "మీరు అబద్ధమైన దానిని నిజమని చెప్పారు. మిమ్ములను నమ్మి నేను విమర్శించి నాపేరు పోగొట్టుకున్నాను." ఇత్యాదిగా మిత్రులముందు ఒక పెద్ద ప్రసంగం జోరుగా చేశాడు. వారు అన్నారు గదా: "సత్యాసత్యాల విచారం నీకిప్పుడు కలిగిందా ? ఇంతవరకు నీవు కాని, మేముగాని దానిగొడవకే పోలేదు. నీ కటుసత్యానికి మెచ్చి నీ భక్తులమయ్యాము. నీ విప్పుడు మాకే తిరగబడ్డావు. ఇక గత్యంతరంలేదు. నమస్కారం" అని ఈ మాటలు అని వారు వెళ్ళిపోయారు. ఇలా కటుసత్యం అడుగుల్లో ఆ సుఖపురుషుడు జీవితంలో మొదటిసారి మిత్రులను పోగొట్టుకొని దుఃఖానికి గురి అయ్యాడు. తను తెలుసుకొన్న కటుసత్యంలో ఉన్నసత్యం ఎంత అని అతడు పరీక్షించలేదు. కటుసత్యమంటే అప్రియమైంది; మరొకరిపై తీవ్రమైన విమర్శ అయినది. అప్రియమైనది సాధారణంగా సత్యమయే వుంటుంది. ఎందుకంటే ప్రియమైనది అసత్యమై వుంటుంది గనుక! మూర్ఖతర్కంమీద నిలిచిన సత్యమూ మూర్ఖజాతిది కాదూ: ముక్కచెక్కలుగా చెప్పడం ఒక్కటే దాని లక్ష్యం. మరొకరి చెక్కను ముక్కలుగా నరకడంలో రాక్షసులు, క్రూరకర్ములుకాక



నాగరికులుగూడ కొన్ని సమయాలలో సంతోషపడుతారు. అయితే, ఆ శస్త్రప్రయోగం తమమీదనే చేయడానికి ఎవరైనా వస్తే తమచెక్కను కాపాడుకొనడానికి ఎంతో చేస్తారు; చేయవలసినదంతా చేస్తారు. ఖండితవాదులకు విషయం ఖండితంగా తెలిసివుండాలి. ఖండితంగా తెలియడానికి నిరీహమైనశీలం, నిర్మలమైనదృష్టి పెరిగివుండాలి. ఈ గుణాలు వున్నందువలననే, సర్వజ్ఞుడు కన్నడజాతికే తాళ్కాణమైన ఖండితవాది అయినాడు. భూమండలం కినిసినా, చింతలేదని ఇష్టంవచ్చింది చెప్పాడు; వైరాగ్యమూర్తి అయి, లోకహితైషి అయి, కటుసత్యవజ్రాయుధంతో సంఘంలోని కుళ్ళ గుట్టలను కొట్టాడు. అతనివలె అస్పదామని బయలుదేరి, అతనిగుణాలు లవలేశమూ లేక మనం ఎన్నో సార్లు అతని వ్యంగ్యచిత్రాలవుతాము. "అంతా తెలిసినవారు లేరు" "అందరిలో ఒక్కొక్క నుడి గరచి విద్యాపర్వత" మయానని[1] వినయశాలి అయి సర్వజ్ఞుడు చెప్పుకుంటే, మనం తెలుసుకున్నదానిబలంతో ఎక్కువ తెలుసుకొనడానికి యత్నించక శ్రమపడక ఊరూరు సర్వజ్ఞులుగా ఊరేగుతున్నాము.

సత్యం చూడడానికి మన రాగద్వేషాలు, పూర్వాగ్రహాలు, (పట్టుదలలు) అసూయలు, ఆటంకాలు అవుతాయి. మనకు కావలసినవారు మంచివారని, కాబట్టనివారు చెడ్డవారని మనం నిజంగా నమ్ముతాము. ఎవరో ఒకరు మనను అన్యాయంగా హింసించారు. వాని ఎడల మన పూర్వాగ్రహం నెలకొనివుంది. అతనిని మనం ఎల్లప్పుడూ దూషితదృష్టితో చూస్తాము. అతని మాటలలో చేతలలో మంచి ఎంతయినా వుండనీ మనకది కనిపించదు. మన కటుసత్యప్రహారం అతనిపై పడుతూనే వుంటుంది. మనకంటే ఎవరో హెచ్చుకీర్తి గడిస్తున్నారు; యోగ్యత లేకనే ముందుకు వస్తున్నారు. సరే. వారివిషయంలో మన కడుపు మండుతూనే వుంటుంది. ఆమంట వెలుగులోనే మనం వారిలోని సత్యం చూస్తాము. మనుష్యులనే వారిలో ఇది సహజం. అయితే, ఇలా మనుష్యులైనవారికి సత్యంకానరాదు అనేదీ సహజమే. మనుష్యుడైపుట్టి నిజమైన మనుష్యుడు కావడానికి ఆతురపడి రాగ ద్వేషాలనుంచి పూర్వాగ్రహాలనుంచి వెలువడి సత్యాన్ని అన్నివైపులనుంచి చూచి తెలుసుకోవాలనే సంస్కృతిని మనం పెంచుకోవాలి. మంచికవి, కళాకారుడు ఇలాటి సంస్కృతి సంపన్నులై సమాజ ముఖానికి అద్దంపట్టి చూపడమేకాక ఆముఖం తేజోమయం అయ్యేట్టూ చేస్తారు. వారు చెప్పే కటుసత్యాన్ని జనత అదెంత తీవ్రంగా, తీంద్రంగా వున్నా వింటుంది. అతని కృతిరస మహిమవల్ల పరిణామం పొంది సరైన మార్గంలో ముందంజవేస్తుంది. కటుసత్యం సాఫల్యం ఇక్కడ కానవస్తుంది.

సత్యం చెప్పాలి, ప్రియంగా చెప్పాలి అని పాతకాలంనుంచి వస్తున్న అభియుక్తోక్తి. భగవద్గీతలోను మాట సత్యంగాను, ప్రియంగాను, హితంగాను ఉండాలని చెప్పారు. కటుసత్య మార్గానికి ఇది విరుద్ధం అని కొందరివాదం. ఎందుకంటె, ప్రియంగా చెప్పేటట్టయితే, కటుసత్యం చెప్పడమే సాధ్యంకాదు. కటుసత్యమంటే అప్రియమైనసత్యం. దానిని ప్రియంగా చెప్పడం ఎట్లాగు ? ఈ ప్రశ్న సహజమైనప్పటికీ వాదం సరైందికాదు. చూచిన సత్యాన్ని ప్రియంగా అంటే నయంగా మధురంగా చెప్పడమే సుసంస్కృతుడైనవాని

1. 'ఎల్ల బల్లవరిల్ల' 'సర్వరొళు ఒందొందు నుడి గలితు విద్యయ పర్వతవాదె'

సామాన్యరీతి కానే కావాలి. ప్రియంగా చెప్పడంకోసం సత్యాన్ని బలిచేయరాదు. ఈ విధంగా పై ఉక్తిలో సత్యం అప్రియమైనప్పటికీ చెప్పాలనే హెచ్చరికకూడా వుంది. భగవద్గీతలో ప్రియం అనే మాటతోపాటు వున్న హితం అనేమాటా దీనినే సూచిస్తున్నది. అప్రియంగా చెప్పడంలో వున్నట్టే, ప్రియంగా చెప్పడంలోను సత్యం వుంటున్నది. సత్యాన్ని ప్రియంగా చెప్పలేము అనే రీతిగానే, అప్రియమైన దానిలోనే సత్యం వుంది అనే అపసిద్ధాంతంనుంచి మనస్సును విడిపించుకోవాలి. సంస్కృతి సమన్వయంలో ప్రియమైన సత్యానికి, అప్రియమైన కటుసత్యానికి కలిసేస్థానం వుంది. ఈ సమన్వయసాధన మన లక్ష్యం కావాలి. కొందరి స్వభావంలో ప్రియకథనంపట్ల ఉత్సాహం వుంటే, మరికొందరిలో అప్రియకథనంవైపు ఉత్సాహం కనిపిస్తుంది. వారివారి దౌర్బల్యంమూలంగా రెండుఉత్సాహాల ప్రకటనంలోను దోషాలు కలగడం సహజం. వాటిని తెలుసుకొని సంస్కృతియొక్క సక్రమమార్గంలో ముందడుగువేయడమే వివేకసారం.

సరైన కటుసత్యం మహిమను ఎంత కొనియాడినా తక్కువే. మన అజ్ఞానాన్ని, అహంకారాన్ని, భ్రాంతినీ నాశంచేయడానికి దానిలాంటి శస్త్రం లేదు. అయితే ఈ శస్త్రం ఇరువైపులా ఇరుమొనలా వాడి అనే తెలివిమాత్రం కావాలి. కటువు అనే మొన వాడిగా వున్నట్లే సత్యమనే మరొకమొన అంతే వాడి కావాలి. కటువుమాత్రం వాడి అయి సత్యం అనేది మొండిదైతే ఆ శస్త్రందెబ్బతో హితం కలుగడానికిమారు హింస కలుగుతుంది. మరిన్ని హింసచేసినప్పుడెల్లా మరొకరికి హింసచేసినంత మనకూ హింసచేసుకొంటున్నా మనడం నిర్వివాదం. ఇట్లయి, కటుసత్యకథనం పరహింసను, దానితోపాటు ఆత్మహింసనూ చేసుకొనే దురభ్యాస మవుతుంది. ఇటువంటి దురభ్యాసమున్న కొందరు తమ ఉన్నతాదర్శాలు ఇంకా సత్యసృష్టిలో అవతరించలేదనే విషాదంతోనో, ఆత్రంతోనో ఎవరూ ఇంతవరకూ చెప్పని కొత్తసంగతిని మనస్సుకు ఆఘాతంలాగ చురుకుగా చెప్పాలనో, కటుసత్యాన్ని చెప్పడానికి తాము పేరుమోసినవాళ్ళమని దానినే చెబుదామనే వ్యామోహంతోనో చమత్కారమైన పద్ధతులను చేసి, వాటితో సంతోషపడుతూంటారు. ఉదాహరణకు : "లోకంలో ప్రీతి అనేదంతా అబద్ధం. అన్నిమతాలూ అఫీము మాత్రలు మాత్రమే. భారతీయసంస్కృతి అనేది కల్పనలబొంత. ప్రాచీన కన్నడసాహిత్యమంతా అబద్ధాలసంత. కొత్తసాహిత్యంలో మహాకవులే పుట్టలేదు. కన్నడ రంగస్థలం పూర్వమూ లేదు, నేడూ లేదు." ఇలాటి మాటలు వ్యాసాలలోను, ప్రసంగాలలోను అప్పుడప్పుడు వినబడుతాయి. విడంబనకళలో అతిరేకం అనేది నవ్వుకు ఒకసాధనం. అలాటి సందర్భాలలో ఇలాటి సత్యాపలాపాలకు అవకాశం ఇవ్వవచ్చు. కాని, గంభీరమైన ప్రసంగాలలో ఇలాటి పద్ధతులను గంభీరంగానే చూపి, వాటి సత్యాన్ని మనస్సులో నాటేట్టు చేయడానికి బుద్ధియొక్క యావచ్ఛక్తిని వెచ్చించేటట్టయితే, ఇలాటి కటుసత్యం కోసమూ ఒక కటుసత్యాన్ని చెప్పవలసివుంటుంది. ఇది కచ్చితంగా కటువు, దీనిలో సత్యంమాత్రం లేదు ! ఏతావతా, సత్యాన్నికోల్పోయి కటువైన కటుసత్యపు అర్ధసత్యంనుంచి సత్యమూ, కటువూ అయిన కటుసత్యంలోని పూర్ణసత్యంవైపు మనం బయలుదేరాలి. దానిని చాటడంలో బల్లిదులు కావాలి. అప్పుడే కటుసత్యం సఫల మవుతుంది.

# 16. దివాన్‌ఖానా అందచందాలు

## ఎ. ఎన్. మూర్తిరావ్

ఇటీవల నా దివాన్‌ఖానాలో ప్రవేశించడానికి నాకే ధైర్యం చాలలేదు. కొంతమట్టుకు నేనే సంపాదించిన, చాలమట్టుకు ఇతరుల సంపాదననుంచి అప్పుతెచ్చిన-ఏమైనా శ్రమపడి జమచేసిన డబ్బును ఉలవగింజలలాగ చలి: వాననక ఎండనక నిలబడి, ఒక్కొక్క ఇటుకను జోడించేటప్పుడూ ఎక్కడ చెడిపోతుందో అని శంకించి, ఆ యింటిని నాకు సుఖం వుంటుందనే ఆశతో కట్టడమయింది. ఆ దివాన్‌ఖానా అయితే నాకోసం, నా ఒక్కడి కోసం కట్టింది. వీధి గోలకు, ఇంటిగోలకు దూరంగా వుండాలని మాడీమీద కట్టినగది - దానికోసం నేను పడినశ్రమ ఎంత, పోసినడబ్బు ఎంత ! అంతరిక్షంలో ఏ దిక్కునుంచి గాలి వీచినా, అది నా గదిని చల్లబరచకుండావుండదు. వాన ఎండల తాకిడిని తట్టుకోడానికి చుట్టూ వడసాల లున్నాయి. గదిలో కూర్చుని పూర్వానికీ. ఉత్తరానికీ తిరిగిచూస్తే ఒక వైపు చాముండికొండ; మధ్యన దూరంలో కరీఘట్ట కొండలవరస; మరొకవైపు పచ్చని ఎండలో పడుకొని నెమరువేసే బసవనిలాగ, తనకు సహజమైన క్రౌర్యాన్ని మరచి శాంతముద్రతో నిద్రించే సింహంలాగ హిరోడ్‌గుట్టలు! అక్కడినుంచి ఎడమవైపు తిరిగితే కొద్ది నీలిరంగుతో కనులు చల్లబరుస్తూ, నా కులదైవ నివాసంతో పవిత్రమైన యదుగిరి. నాకూ, ఈ కొండలకూ మధ్య పచ్చనిచేలతో, కొబ్బరితోటలతో, నానావిధమైన లతా వృక్షాలతో విశాలమైన కనుమ. దీనినంతా గదిలోపలినుంచే చూడడానికి వీలుగా ఎండమరు చేయించి, ఆ వైపు పెద్దతలుపు పెట్టించాను. నా భాగానికి ఇల్లు అంటే ఈ ఒక్కగది మాత్రమే. వంటగది, భోజనాలగది మొదలయినవి....ఉండాలేమో, ఉండనీ. నా జీవితం చాలమట్టుకు ఈ ఒక్కగదిలోనే సాగిపోతుంది.

ఈ విధంగా నా మనస్సును నింపి, హృదయం ఆక్రమించిన గదిలో ఇప్పుడు నాకు ప్రవేశంలేదు. తలుపువద్ద దవాలిబంట్రోతు నిలబడి నన్ను అడ్డగిస్తాడని కాదు; ఆ అనుభవం మరొకచోట అయింది; నా ఇంట్లోను ఇతరులకు అలాటి అనుభవంకానీ అనే తుచ్ఛమైన కోరిక అప్పుడప్పుడు మనస్సులో మెసలవచ్చు. గృహాధిదేవత లలితాదేవి తలుపులకు బీగం బిగించిందనికూడా కాదు. ఆమె అధికారం చెలాయించేరీతి పరిణామకారి అయినా, అంత అనాగరకం కాదు. అథవా, గది అస్తవ్యస్తంగా వుండి దానిలో ప్రవేశించడం విసుగనిపిస్తుందనీ కాదు—దాని అందచందాలు చెప్పతరం కాదు. నిజంగా చూస్తే దాని సౌందర్యమే ఒక దుష్టశక్తిగా పరిణమించి నన్ను బయటికి వెళ్లగొట్టింది.

ఈ కష్టం ఎకాయెకిగా కలిగినది కాదు. ఇల్లు కట్టినతర్వాత చేతులు ఖాళీకావడంవల్ల నేను 'ఫర్నిచర్' కొనే గొడవకు పోలేదు. ఇంట్లో వుండే మూడు సుందర్‌కుర్చీలకు చిన్న

మెత్తలు వేయిస్తే అవే సోఫాలకర్తవ్యం నిర్వహిస్తాయి అని అనిపించింది. మా తండ్రిగారి కాలంనుంచి వచ్చిన పెద్ద మేజా ఒకటుంది. దానిమీద ఖద్దరువస్త్రం పరిస్తే ఇటు యథాశక్తి దేశసేవ అయింది, అటు సులభమైన ఖర్చులో మెరుగులేని కర్రనుమూసి గౌరవం దక్కించుకొన్నట్లూ అయింది. నయంగా సిమెంటుచేయించి, రంగురంగు పెంకులతో అలంకరించిన నేల వున్నప్పుడు, దానికి జంబుఖానా ఆవశ్యకత ఏమీలేదు. జంబుఖానా పరిస్తే దానిలో పుట్లకొద్ది ధూళి దుమ్ము చేరుతాయి. దానిని అడుగడుక్కు కొట్టి ఝాడించి, దులిపి పరవడం కష్టం. అలా కొట్టి ఝాడిస్తున్నప్పుడు దుమ్ము లోపలికిపోయి ఎంతోమందికి క్షయరోగం వచ్చిందట—మాయింట్లోవారి శ్వాసకోశం అంతేమీ గట్టిది కాదు!—చేతిలో డబ్బులేనప్పుడు సరళజీవనం గురించి ఈ విధమైన వాదం పేనడం కష్టం కాదు.

పెక్కుసంవత్సరాలు ఈలాగే గడచినతర్వాత ఒకదినం లలిత నా పరిచితు లొకరి ఇంటికి పేరంటానికి పోవలసివచ్చింది. ఆయన యుద్ధసమయంలో తమపనికి రాజీనామాయిచ్చి దేశాన్ని హిట్లర్, టోజో మొదలయిన నరరాక్షసులనుంచి ఉద్ధరించాలనే మహత్తరమైన ఉద్దేశంతో యుద్ధకార్యాలకు బలంగా నిలబడ్డారు. ఆయన సేవారంగం మిలిటరీ కంట్రాక్టు పట్టడం. దేశం యుద్ధ పాతకుల పిశాచ ముష్టినుంచి విముక్తమయినట్లెల్లా రావుగారూ బీదతనంనుంచి విముక్తులవుతూ వచ్చారు. ఆయన ఎప్పుడూ స్వామికార్యానికీ స్వకార్యానికీ భేదం కల్పించినవారుకారు. మనలో గుప్తంగావున్న సద్గుణాలూ, తేజస్సూ యుద్ధకాలంలో వెలుపలికి పొంగి దుస్సాధమైన పనులను సులలితంగా కొనసాగిస్తాయి. అలాగే రాత్రి కేవలం గుమస్తాగావున్న రావుగారు తెల్లవారగానే "చేతిపనుల క్యాప్టెన్" అయ్యారు; తమ కొత్త అంతస్తుకు తగినట్టు పెద్దయిల్లు కట్టించి, తాము మెచ్చిన రీతిలో అలంకరించారు. లలిత ఆయనయింటికి వెళ్ళిననాడు రావుగారి భార్య తమ దివాన్‌ఖానాను చాల ఉత్సాహంతో చూపించారట. ఆ విషగడియనుంచి నా కష్టం ప్రారంభమైంది.

ఇంటికి తిరిగివచ్చేవేళకు లలితకు పెక్కువిషయాలలో జ్ఞానోదయం అయింది. నాకు మూడువందలరూపాయలు జీతమని, దానికి అనుగుణమైన స్థానమానాలు వున్నాయని ఆమె దృష్టికి అంతగా రాలేదు. ఇప్పుడు ఆమెకు కనువిప్పు కలిగింది. యోగ్యతకు సరిగా మన జీవితస్థాయి పెరగవద్దా? మూడున్నర రూపాయల సుందర్‌కుర్చీలు, జనమేజయుడు పసికందుగా వున్నప్పుడు చేయించిన మేజాబల్ల ఒకటి—ఇంతేనా మనయింట్లో కనిపించే చరాస్తి! ఎవరైనా ఇంటికి వచ్చినప్పుడు కూర్చోబెట్టడానికి సర్వదా చక్కగా అలంకరించిన గదిఒకటి వుండవద్దా? స్నేహితులు వస్తే ఏముఖంతో వారిని లోపలికి పిలుస్తానో! రావుగారియింటి దివాన్‌ఖానాను చూడరాదూ! ఆయన అంత చదువుకోకపోయినా యింటిని ఎంత సలక్షణంగా వుంచుకున్నారు! ఈ అవస్థలో పెట్టుకోడానికి మనం అంతపెద్దయింటిని కట్టించడమైనా యెందుకు? దీనినంతా నేను మౌనంగా విన్నాను. ఆమెమాటలు న్యాయంగానే వున్నట్టు తోచాయి. నా స్నేహితులందరూ నేను వట్టి డబ్బుకక్కుర్తివాడి



నని అనుకొని వుంటారు; ఏమిటో మర్యాదస్తులయినందువల్ల ఆమాట అనకుండా వూరికే వుండివుంటారు. ఇకమీదనైనా యింటిసింగారంవైపు కొంచెం దృష్టిపెట్టాలని నిశ్చయించుకొన్నాను.

అంతవరకు నా దివాన్‌ఖానా గోడలు వెల్లవేయడంతప్ప మరే ఉపచారమూ పొందలేదు. అయితే, వెల్లవేసినగోడలు మున్నూరురూపాయల జీతంతెచ్చేవాడి అంతస్తుకు తీరా తక్కువ అని ఇప్పుడు స్పష్టమయింది. గుమాస్తాల ఇళ్ళలోను సున్నంకొట్టి వుంటారన్నప్పుడు నా పెద్దరికం, గొప్పదనం ఏమయింది! అందువల్ల నేను సున్నాన్నంతా చెక్కించి దానికిమారు కాల్కేరియం వేయించే యోచన చేశాను. 'సింధు' పత్రిక 'గృహాలంకరణ' భాగంలో ఎవరో మహిళ లేక మహిళపేరు పెట్టుకున్న మహనీయుడు వ్రాశాడట-సముద్రపు ముదురుపచ్చరంగు కంటికి చాలమంచిదని. వారి అభిప్రాయానికి తలఒగ్గి మేము ఆ రంగు కాల్కేరియమే తెప్పించాము. సున్నంఖర్చుకంటే ఎనిమిదింతలు ఎక్కువ ఖర్చయింది; అయితే ఒక్కసారిపూస్తే, పదిసంవత్సరాలు దానిగొడవకు పోవలసిన అవసరంలేదని 'సింధు' పత్రిక హామీయిచ్చింది. కాల్కేరియంపని ముగిసేలోపల గది కొలతలకు సరిగా నేయించిన జంబుఖానాకూడ వచ్చింది. ఇదయిన తర్వాత ఫర్నిచర్ దుకాణానికి వెళ్ళి ఇద్దరు కూర్చోదగిన సోఫా, అదేమాదిరి కుర్చీలు రెండు, దానికి పొందికయిన టీపాయి, సున్నితమైన పనితనంవున్న కంచు పూలకుండీ - నన్నూరురూపాయలు వెదజల్లి ఇవన్నీతెచ్చాము. గది దక్షిణపుగోడపక్కన సోఫాను, పక్కగోడలకు సరిగా రెండుకుర్చీలను అనుగుణంగా వేశాము. టీపాయి గది మధ్యభాగాన్ని అలంకరించింది. ఉత్తరభాగంమాత్రం కొంచెం నగ్నంగా కనిపించింది. దాని మానసంరక్షణకోసం ఒక మూలలో నల్లమద్ది ముక్కాలిపీట వేసి దానిమీద మా రేడియోయంత్రం స్థాపించాము. దాని పక్కనే నల్లమద్ది కుర్చీ కూడ వచ్చి కూర్చుంది. ఈ నవనాగరికం దాడిని ఎదుర్కొంచలేక మా సుందర్ కుర్చీలు లోపలి గదిలోకి పారిపోయాయి. మేజా బల్లకయితే దివాన్‌ఖానాలో స్థానమే లేకపోయింది.

ఈ ఏర్పాట్లన్నీ జరిగింది కేవలం ఆ గడియలో పిచ్చిఎత్తి చేసినట్టుకాదు. దీనికంతకూ ఆధారభూతమైన తత్త్వం ఒకటుంది. 'సింధు' పత్రికలో వ్యాసంవ్రాసినవారు చెప్పినట్టు-గదిలోని ప్రతి అంశమూ తక్కినవాటితో పొందికగా వుండాలి, అదే అలంకరణ మూలతత్త్వం. మా సోఫా, కుర్చీలు, నల్లమద్దికర్రతో చేసినవి; అందువల్ల రేడియో యంత్రంపెట్టిన ముక్కాలిపీట, దానిప్రక్కనవున్న టీపాయి అన్నీ నల్లమద్దివే కావలసివచ్చింది. నా అదృష్టవశాత్తు కిటికీతలుపులు, దంతెలూ నల్లమద్దివే అయివుండాలని లలిత మొండిపట్టు పట్టలేదు. ఇంతయినా, మా పొందిక తత్త్వానికి భంగం కలిగించే ఒకఅంశం వుండనే వుండిపోయింది. — గోడలకు మొదట్లోనే సముద్రపు ముదురుపచ్చరంగు వేయించాము! అయితే దానిని సరిచేయడానికి లలిత ఒక ఉపాయం ఆలోచించే పెట్టింది.

ఒకరోజు సాయంకాలం నేను ఇంటికి వచ్చేవేళకు గది అలంకరణం తుదిఘట్టం దాటి పూర్ణరూపం దాల్చింది. కిటికీల కిందిభాగమంతా పరదాలతో కప్పివుంది. గుమ్మాల

నుంచికూడా తెరలు వేలాడుతున్నాయి—సముద్రపు ముదురుపచ్చరంగువి అని మరి విడిగా చెప్పనక్కరలేదు. సోఫా, కుర్చీలు, టీపాయి, అన్నీ ఉడుపులు ధరించాయి—అన్నిటికీ అదే సముద్రపు ముదురుపచ్చరంగు చొక్కాలు. కొసకు రేడియోయంత్రమూ అదేరంగు కుళ్లాయి పెట్టుకుని దాని మధ్యనుంచి తొంగిచూచింది. దానిచూపులో ఒక విధమైన అవమానం, దైన్యం, తన దురవస్థనుంచి నేనైనా విడిపించవచ్చునేమోననే ఆశ, అన్నీ మిళితమైనట్టు తోచింది. దానినుంచి వెలువడే గానమూ హృదయవిద్రావకమయే వుండినది—అయితే, అది మన సంగీతవైఖరే కాని, రేడియోయంత్రం గోడు అయి వుండదు. అది ఎలాగయినా వుండనీ; గది అలంకారం మొత్తంమీద నా దృష్టిని ఆకర్షించింది. సముద్రపు ముదురుపచ్చరంగు కొంచెం ఎక్కువయినా, మా పెరటితోట నుంచి విడిపించి తెచ్చి, పూలకుండీలో పెట్టిన గులాబిపూవులు కొంతవరకు వర్ణవైవిధ్యం కలిగించాయి. వెలుపలినుంచి పరధ్యానంగా వచ్చిన నా ఎచుట హఠాత్తుగా, మెరసిన ఈ సొబగును చూచి ఆ గడియలో సంతోషం కలిగిందనే ఒప్పుకోవాలి. పిల్లిలాగ సద్దులేక నావెంటే వచ్చి నా ఆనందంలో భాగస్వామిని కావాలని నిలబడిన లలితవైపు చూచాను. ఆమె ముఖంలో వున్న సంతృప్తి కయితే మితే లేదు. గది పునర్నిర్మాణకార్యంలో ఆమెదే ప్రధానపాత్ర కదా! అందువల్ల ఆవిడ కల్పనారాజ్యంలోని సుందరస్వప్న మొకటి ఇప్పుడు వాస్తవత రూపురేక దాల్చింది. "ఇంటిని నాకు అప్పగిస్తే, ఎలావుంటుందో చూడండి" అనేవిధంగా దృష్టితోనే నా అభినందనలు కోరింది; పొందింది.

ఒకనిమిషం వాకిట్లోనే నిలబడి గది అందచందాలను ఆస్వాదించినమీదట చొక్కాను విప్పి సోఫామీదవేసి, కాళ్ళజోడును తీద్దామనుకుంటున్నాను. అంతలోనే లలిత తేలుకుట్టినట్టు కేకవేసింది. నా పాతశ్వపచతనాన్ని ఇకనైనా విడవవద్దూ! వీధిమన్నంతా మోసుకు వచ్చి జంబుఖానామీద దింపాలా? బట్టలను ఇలా నిలబడినచోటే విసరివేసేటట్టయితే, దివాన్‌ఖానాను ఒకపద్ధతిలో పెట్టడం ఎలాగు? చొక్కాలు తగిలించడానికి వేరే స్థలం వుంది, ఇక్కడ ఇవ్వండి—ఇత్యాది బుద్ధిగరపే మాటలు వెలువడ్డాయి. నాకు కోపం రాలేదు. ఎంతేకాని, న్యాయానికి తలఒగ్గే స్వభావం నాది. మారుమాట చెప్పక లోపలి గదిలోకి వెళ్ళి గుడ్డలు మార్చి, మళ్ళీ దివాన్‌ఖానాకు వచ్చి, ఒకకుర్చీలో కూచున్నాను. దాని మెత్తలు నన్ను అన్నివైపులనుంచి ముంచివేశాయి. ఎదుటవున్న గుమ్మంనుంచి నాకు ప్రియమైన గుట్టల, కనుమల దృశ్యం చట్రంవేసిన సుందరవర్ణచిత్రంలాగ కనిపించింది. పరదాలు కదలినప్పుడు, గదినిండా నీడలు మృదువుగా పారాడాయి. గులాబిపూవుల సువాసన వ్యాపించింది. కళ్ళతోచూచిన సొబగును కళ్ళలోనే చెరపట్టి వుంచుకొనేవాడిలాగ ఆనందంతో కళ్లుమూసుకొన్నాను.

లలిత, మేడమీదనుంచి కిందికి దిగిపోయినటువంటిది, అల్పాహారపుపళ్ళెం తీసుకొని వచ్చింది. కూర్చున్నచోటునుంచే చేయి చాచాను. కాని, నా అన్నపూర్ణ వరదహస్తం ముందుకు రాలేదు. అల్పాహారం తీసుకోడం దివాన్‌ఖానాలో కాదు. లోపలిగదికి పోవాలి.



లేకపోతే జంబుఖానామీదనంతా తిండిముక్కలు పడవచ్చు. టీ ఒలికితే, దాని గుర్తు పోవడమే కష్టం....ఉహూఁ! టీపాయికి సయితం టీని అంటనివ్వకూడదు; లోపలగదికి పోవాలి—నాకు కుర్చీవదలి లేచిపోవడానికి మనస్సు రాకపోయినా, ఆమె వాదాన్ని ఎదిరించడం చేతకాలేదు.

మరుసటిదినం సాయంకాలం ఇంటికిరాగానే వెనుకటిదినం నేర్చుకున్న పాఠాన్ని ఒప్పించేవాడిలాగ, వాకిట్లోనే కాళ్లు తుడుచుకుని, దుస్తులను నిర్దిష్ట స్థానాలలోపెట్టి అల్పాహారం ముగించిన తర్వాతనే దివాన్‌ఖానాకు వచ్చాను. మేము మాట్లాడుతున్నప్పుడు రాము కేకలుపెడుతూ మెట్లెక్కి వచ్చాడు. గదిలోకి వచ్చిరావడంతోనే కుర్చీమీద ఎక్కి దాని చేయిపట్టుకుని ఎగరడం ఆరంభించాడు. హసన్ముఖిగా కూర్చున్న లలితకళ్లు కెంపెక్కాయి. వాడిని ఎత్తుకొని గదిరించి, బుగ్గలు గిల్లింది. రాముకు దెబ్బతగలకపోయినా, అవమానం అయింది; సందర్భోచితంగా గొంతు పెద్దదిచేసి బొబ్బలు పెట్టాడు. లలిత దృష్టి అంతా కుర్చీమీద—దానికి కప్పిన సముద్రపు ముదురుపచ్చరంగు బట్టమీద రాము చిన్నిపాదాలముద్ర పడింది; వీధి ధూళినుంచి వచ్చిన చిత్రం। నేను రాముని ఎత్తుకొని లలిత గిల్లినది వాడి బుగ్గను కాదని వాదిస్తున్నప్పుడు, ఆమె కుర్చీమీద ధూళిని దులుపుతూ వుంది. నా మనస్సులో ఒకప్రశ్న తల ఎత్తింది: కుర్చీయా? బిడ్డడా? ఎవరు ముఖ్యం? లలిత చేసిన దేమీ తప్పుకాదు; పిల్లలకు శుభ్రంగా వుండడం నేర్పాలి; ముద్దుచేయడానికీ ఒక మితి వుంది. అయినా బిడ్డడి పాదాలచిత్రం తలచుకొని కొంచెం నవ్వువచ్చింది.

ఆ దినంతర్వాత దివాన్‌ఖానా రక్షణ ఇంకా ఎక్కువ బాధ్యతతో సాగింది. వీధిలో నుంచి వచ్చినప్పుడు దివాన్‌ఖానా పవిత్రమైన నేలను తొక్కకుండా మరొకగుమ్మంనుంచి లోపలిగదికి వెళ్లే అలవాటు చేసుకొన్నాము. ఇంటికిరాగానే, కూర్చున్నచోట వెలుపలి గుడ్డలు విప్పి పారేసి, వేరేగుడ్డలు వేసుకోడం నాకు మొదటినుంచి వచ్చినపద్ధతి. ఇప్పుడు ఆ సుఖం పూర్తిగా లేకపోయింది. హాయిగా కూర్చుండడానికి మూరు మూడుగదులు తిరగాలి. గుడ్డలను, కాలిజోళ్ళను, పుస్తకాలను ఆ గదులకు పంచిపెట్టాలి. అనంతరం నాల్గవగదికి వచ్చి కూర్చోవాలి. అప్పుడుకూడ నాకు ఇష్టమైనట్టు కాళ్లు ముడుచుకొని కూర్చునేట్టులేదు; అజ్ఞానంతో అలాటిది ఏమైనా చేస్తే, కుర్చీకి తొడిగిన ఒర మురికైపోతుంది. కాలుచాచి వెనక్కు వాలుదామన్నా, లేదు—కుర్చీ వీపుకు నా తలసోకి దాని రంగు మాసిపోవచ్చు. తలుపు ఎదురుగావున్న కుర్చీ నాకు ప్రియమైనది; అయితే సదా ఒక్కే కుర్చీమీద కూర్చుంటే, దాని స్ప్రింగు చెడిపోతుంది. అందువల్ల నా ప్రేమను అన్నికుర్చీలకూ నిష్పక్షపాతంగా పంచాలి. సోఫాలమీద గంతులువేయరాదనే పరిజ్ఞానంకూడ లేని ఆ కిరాతుడైన రామునయితే దివాన్‌ఖానానుంచి బహిష్కరించవలసివచ్చింది. ఈ విధమైన వస్తువులు కావాలంటే, ప్రతిదానికీ ఒక్కొక్కగదికి పయనం పెంచాలి. ఈ విధమైన వ్యాయామం దేహారోగ్యానికి మంచిదన్నా మనశ్శాంతికి భంగంకలిగిస్తుంది. నా [illegible]వాడికి కూర్చున్నచోటునుంచి చేతులుచాచితే కావలసిన వస్తువులు దొరికేట్టు వుండాలి.



నాకోసమే మూడుగదులూ మీదుకట్టినా, నేను వ్రాసుకొనే మేజాబల్ల, పుస్తకాల బీరువాలు, రేడియో, గుడ్డలస్టాండు—అన్నిటినీ ఒకేగదిలో నింపివేసుకొన్నాను. నా జీవనమంతా అక్కడే. నా స్నేహితులువస్తే అక్కడకే వస్తారు. అట్లే మాయింటికి వచ్చి దిగేవారు నాకు అత్యంత ప్రీతిపాత్రులైనవారు మాత్రమే దిగుతారు. పాశ్చాత్యపద్ధతిలాగ వారిని విడిగా అన్నిసౌకర్యాలున్న మరొకగదిలో ప్రతిష్ఠించి, వారి సన్నిధికి పోవడానికి ముందు తలుపులుతట్టి భేటీచీటీ యిచ్చిపంపడమేమీ కష్టంకాదు. అయితే, ఆ రీతి సత్కారంచేస్తే చెరసాలలో పెట్టినట్లేనని నా భావన, వారి భావనకూడ. అతిథి సత్కారానికి ఆ నాగరికత మెరుగు వస్తే సరళత నాశమవుతుంది. సంఘంలో ఈ విధమైన మెరుగు ఆవశ్యకం కావచ్చు: ఇంట్లోనైనా స్వతంత్రవాతావరణం కల్పించుకోవద్దా? ఈ స్వాతంత్ర్యమూ, సరళతా అక్కర లేనివారు, ఇరవైనాలుగుగంటలూ కాలరు టై సమేతం మడతలు చెదరని సూటుధరించి చక్కగా చెక్కుచెదరని గదిలో తమగోడవలో తాము వుండే అభ్యాసం వున్నవారు మాయింటికి రావడానికి అసహ్యపడితే—వారికి దూరంనుంచే నా నమస్కారం. నా అతిథులేమో నా గదిలో నా ఎదుటే కూర్చునివుంటారు. ఇద్దరి మనస్సులలోను ఏ గడియకు ఏ యోచన వచ్చినా, దానిని వెలుపలికివేసి చర్చనడుపుతాము. క్షౌరానికి కూర్చుంటే, సబ్బునురగ ముసుకున్న ముఖంపై వ్యాఖ్యానం చేస్తాము. గది అవ్యవస్థనే మనస్సులో పెట్టుకొని మన కష్టసుఖాలను చెప్పుకుంటాము. ఘనమైన గంభీరవిషయాలు, అల్పమైన తుచ్ఛవిషయాలు, కొసకు మృదువైన హాస్యపు మరుగున తన బీభత్సాన్ని మరుగుచేసి, సూక్ష్మంగా అడుగులువేస్తూ వచ్చే వ్యంగ్య అశ్లీలం—ఒకదానితర్వాత మరొకటి ఎలాటి ఆటంకమూలేక సంభాషణ ప్రవాహం పరుగులుతీయాలంటే ఇలాటి అవ్యవస్థిత వాతా వరణంలోనే. ఇప్పటి దివాన్‌ఖానాలో ఈ సౌహార్దమూ, సామీప్యమూ దుర్లభమయాయి. అదొకవిధమైన దేవాలయం. దేవాలయంలో మనం నివసించడం సాధ్యంకాదు. దైవ సన్నిధిలో మాట్లాడగూడని మాటలూ, యోచింపగూడని యోచనలు మనజీవితంలో పడుగు పేకలాగ చేరుకొనివున్నాయి. నిత్యశుచి, నిత్యపవిత్రం అయిన ఈ వాతావరణం సామాన్య మానవుని దైనందిన జీవనానికి పొందదు. అందువల్లనే ఈ గదిలో వుండడం నాకు కుదరదు. దానికి అభిషేకం చేయించి, అలంకరించి, పుష్పాంజలి సమర్పించి, దానితోనే తృప్తిపడుతున్నాను.

ఇంటివాళ్ల సంగతి అలా వుండనీ, వెలుపలివారు వచ్చి, కొంచెంసేపు అక్కడ కూర్చుంటే వారిమనుస్సులోను ఈ గది భయం నాటుతున్నది. వారిలో కొందరు సిగరెట్టు త్రాగేవారు. అంతశుభ్రంగా పెట్టిన గదిలో జంబుఖానామీద బూడిద రాల్చడం సాధ్యమా? ఈ యోచనే వారిని బాధిస్తూవుంటుంది. మరికొందరు నస్యంపీల్చేవారున్నారు. వారి పాప కృత్యాల కంతూ మితే లేదు. వారి మనస్సులోని శంకను తలచుకొని, నేను ఎన్నో సమ యాలలో కుమిలిపోయాను. ఇటు నాకూ శాంతిలేదు; అతిథులు గది అందాన్ని ఎక్కడ చెడుపుతారో అనే భయం మనస్సును కోస్తూవుంటుంది. ఇలాటి వాతావరణంలో సౌహార్దం పెరిగీనా! ముందులాగ అవ్యవస్థితమైన గది అయితే, దాని విషయమే వేరె. వీధిలోనుంచి



ఎవరైనా కేకవేయడం వింటే, నేను కుర్చీమీద వేసిన తువ్వాలును మడిచిపెట్టి, కాఫీకప్పును లోపలిగదికి సాగించి, ఆకులూ, వక్కలూ చెత్తబుట్టలోకి, చెత్తబుట్టను మేజాబల్లకిందికి తోసి, అపరాధపరిశోధకనవలను మరుగుచేసి, భగవద్గీతను ముందుపెట్టి, వారు మెట్లెక్కి వచ్చేలోపుగా గదిని చక్కబరచేవాడిని. తాము రావడానికిముందు ఈ సంబరమంతా జరిగిం దని వారూ గ్రహిస్తారు. వారి ఆగమనసూచన తెలియగానే అనాసక్తితో వుండక సంతోష సంభ్రమంతో వారిని ఆహ్వానించుకుంటే, వారికీ సంతోషం కలుగాలి. అందువల్ల గది నిత్యాలం కారభూషితమై వుండక సమయానుగుణంగా మారుతుండడమే హితకరం. ప్రతిదినం ఇంటి నిండా ముగ్గులుపెట్టి ఎర్రమట్టి గీతలు లాగితే, పండుగనాడు ఎలాటిసంబరమూ సాధ్యంకాదు.

ఈ కొత్త దివాన్‌ఖానా నాకు పరిచితమైనది కాదు. నా వ్యక్తిత్వంకాని, నావారి వ్యక్తిత్వంకాని ఏమైనావున్నా దాని ప్రభావంలో కొంచెమైనా గోచరించదు. ఈ గదికి మనుష్యుల సంపర్కమే లేదు. అథవా తాత్కాలికంగా ఏర్పడినా, అది వెంటనే ఆ మాలి న్యాన్ని పోగొట్టుకొని, తన నిత్యశుద్ధతను మరల పొందుతుంది. అది నాగది అనడానికి గురు తేమిటి? దానిని అలవడజేసుకునే రీతి నా స్వభావానికి అనుగుణంగాలేదు. ఆ సముద్రపు ముదురుపచ్చరంగు—ఎటుచూచినా తానే తానై హుంకారంచేసే ఆ అసహ్యమైన రంగు పేరు వింటేనే నాకు ఒళ్లు మండుతుంది. దానికి ఆహ్వానం ఇచ్చినవా రెవరు? మామీద కసితో ఆ రంగుపూసిన 'సింధు' పత్రిక రచయిత్రికి నా శాపం తగులుగాక!

గదిని అలంకరించే క్రమంలోగాని, అక్కడ సర్వాధికారం నడుపుతున్న ఆరంగును గాని మేము మార్చేట్టులేదు. ఆ కుర్చీలకు మా ఆదరం అవసరంలేదు. మా కోపతాపాలను అవి సహించవు. అక్కడి వ్యవస్థను మేము అనుసరించి నడవాలసిందేకాని, మామనస్సులో కలిగే వేయిమార్పులకు అది పొందుకొనేట్టులేదు. వెలుగులో మిలమిలలాడుతూ, నీడలో నీలమై ఇక్కడ ప్రశాంతంగా పొర్లుతూ అక్కడ ఉత్సాహంతో తుళ్లుతూ ముందుకు దూసు కొనిపోయి, ఒకసారి సాహసంతో దూకి, మరొకసారి ప్రేమతో సరసమాడి, ఒకమారు కోపంతోగర్జించి, మరొకమారు మంజులంగా పాడుతూ ప్రవహించవలసిన జీవన వాహిని ఇక్కడమాత్రం నిశ్చలంగా నిలిచిపోయింది. ఒకవిధమైన పరిపూర్ణతను పొందిన ఈ సౌందర్యం నా కళ్ళకు సింగారించిన శవంలాగ కనిపిస్తుంది. ప్రకృతి జీవితంలోగాని, మానవుని జీవితంలోగాని, ఈ విధమైన పరిపూర్ణతకాని నిశ్చలతకాని కనిపించవు. ఆ టీపాయి మీదవున్న పూవులు ఎన్నోసార్లు తమ రంగులు మార్చాయి. కాని చలనవైవిధ్యాలు ఎన్ని ఉన్నా జీవితంలో ఏ ఘట్టంలోను వాటి సౌందర్యానికి చ్యుతిలేదు. నా రాము క్షణకాలం నిలిచినచోట నిలువడు; వాడి ముఖం కళ నిమిషానికి పదిసార్లు మారుతుంది. ధూళి ధూసర మైనా, ప్రఫుల్లమైన ముఖంతో లోపలికి తోసుకొనివస్తాడు; ఎడువుకొని మోకరించిపడడం కూడ లెక్కపెట్టక పరిగెత్తివచ్చి పైన పడుతాడు. నా గుడ్డలు మురికవుతాయనే అభి ప్రాయం వాడికీ వుండదు; నాకూ వుండదు. వాడిబుగ్గలు క్షణక్షణానికి విచిత్రసౌందర్యంతో గుంటలుపడి, మళ్ళీ అంతలోనే నిండుకుంటాయి. గదిరిస్తే, నవ్వు మాయమై కళ్ళలో నీళ్లు

తిరుగుతాయి. మళ్ళీ దానిలోనే నవ్వు మించుతుంది. ఒక మనోభావానికీ మరొక భావానికీ సాదృశ్యంలేదు. అయితే అవన్నీ మేళవించి దివ్యసౌందర్యమొక్కటి ఉత్పన్న మౌతుంది.

నాకు ప్రియమైన వాసగృహంలో ఈ చంచలత కావాలి. జీవితంలోని మలుపులూ, పొలుపులూ, ఓరలూ బారలూ నిండి ఉండాలి. అది నిజంగా నాదైతే దానిలో (గదిలో) ఒకచోట లలిత సిగనుంచి జారిన పూవులు కళ్ళకు కనిపించాలి—దానిని చూచి విసుక్కోవచ్చా? ఏమిటో తలచుకొంటున్న లలిత కళ్ళనుంచి ఒకనీటిబొట్టుపడి నేను వ్రాస్తున్న కాయితంమీది అక్షరాలు చెరిగిపోయాయి—ఆ కాయితాన్ని చింపిపారేయలేను. అక్కడే మరొకచోట దానినొసటినుంచి కొంచెం కుంకుమ రాలింది, జేబురుమారులో దానిని తుడిచి వేయలేను—ముద్దిస్తే ముఖం తుడుచుకొనేవా రుంటారా! నేలమీద రాము గోలీ దొర్లుతుంది, వాడు కోపంతో విసరివేసిన బొమ్మమోటారు తల్లకిందుగా పడి కాలికి తగులుతుంది. అక్కడివస్తువులు ఒక్కటీ పెట్టినచోట ఉండవు; అన్నీ నాతో దాగుడుమూతలు ఆడుతాయి. నాకలం ఎక్కడ మాయమైనదని వెదుకుతుంటే, అది ఒకచోట నక్కి నా పరుగులాట చూచి నవ్వుతూ ఉంటుంది. వెదికి వెదికి విసిగి నేను ఓడిపోయానని ఒప్పేసుకొనే వేళకు "ఇదిగో! ఇక్కడ వున్నాను" అనేట్టు కాయితాలమధ్యనుంచి, తుంటరిచూపుతో తొంగిచూస్తుంది. అది చిక్కకపోతే, లలితపై ఒక్క కేక వేస్తాను. "మీ వస్తువులు మీరు చూచుకోరాదూ?" అని ఆమె రెచ్చిపోతే, నేను పరిహాసం చేస్తాను. నేను రెచ్చిపోతే ఆమె గేలిచేస్తుంది. మేము గది వదలిపోగానే, అక్కడి వస్తువులన్నీ మా పిచ్చి పనులు తలుచుకొని హాస్యం చేసి నవ్వుకుంటాయనే నా నమ్మకం. ఏమైనా, అక్కడ యెవరు ఉన్నా, లేకపోయినా, జీవననృత్యం విడుపులేకుండా సంతతం సాగుతుంది. క్షణకాలం అంతా నిశ్చలంగా కనిపించినా, ఆ నిశ్చలత లాస్యపు ఒక భంగిమ మాత్రమే.

నా వ్యక్తిత్వం, నాకు ప్రియమైనవారి వ్యక్తిత్వం నా మనస్సులో సుళ్లుతిరిగి మాయమైనట్లు వేయిభావనలు ఆగదిలో ఏకమై, దానికి మానవత్వం వచ్చినట్టుంది. లలిత నన్ను చూచిన వెంటనే నవ్వుముఖంతో లేచి స్వాగతమిచ్చే విధంగా ఆ గదికూడ మరొక ప్రేయసివలె లేచి నన్ను స్వాగతమిచ్చి కౌగిలించుకుంటుంది. అది ఎర్రరంగు పులుముకొనివుంటే ఆ శృంగారమంతా నా కోసమేకదా! చనువుతో ఆ అలంకారాన్ని కదలించకపోతే, చక్కగా దువ్విన కురులను సరదాగా రేపకపోతే నాకు తృప్తిలేదు. అయితే ఇప్పటి దివాన్‌ఖానాకు నా కూరిమి మాలిమి అక్కరలేదు. దాని కురులను చెదరగొట్టే ధైర్యం నాకు లేదు.

అందువల్ల నేను అక్కడ అడుగుపెట్టడమే మానుకున్నాను. లోపలి గదిలో నా పాత నెచ్చెలులు సుందర్‌కుర్చీ లున్నాయి; ఆకలయినప్పుడు నాతోపాటు తిని, దప్పయినప్పుడు నాతోపాటు తాగిన పాత మేజాబల్ల వుంది. అవి నేను ఎంత స్వతంత్రంగా ప్రవర్తించినా, ఎంత చనువుతో వున్నా తట్టుకుంటాయి. దివాన్‌ఖానాలో కనిపించే పాషాణహృదయపు నిశ్చల సౌందర్యం నాకూ వద్దు, నా ఆత్మీయులకూ వద్దు.

# 17. స్వతంత్ర భారతంలో వినాయకుడు

జి. పి. రాజరత్నం

"పెరిగితే బాడు; పెరుగకుంటే పాడు"[1]

వినవయ్యా, భక్తుడా!

ఈ సంవత్సరం మీ గాంధీగారు మా శివుని పాదాలు చేరిన సంవత్సరమయినందున నాకు మీ పూజా నైవేద్యోపచారాలు అంత రుచించకపోయినా, ఈ సంవత్సరం జరిగినంతటి పూజా నైవేద్యోపచారాలను నేను చూచి ఎన్ని సంవత్సరాలయ్యాయో! నూరారు సంవత్సరాలుగా పరులకు దాసులైన మీకు దైవమయ్యే దౌర్భాగ్యం వచ్చింది కదా అని ఎంతగా కుమిలిపోయేవాడినో ఆ పరమేశ్వరునికే తెలుసు. సరే పోనీ! ఆ పాత పీడ కలకరగిపోయి, కొత్తగా స్వతంత్రులైన మీ పూజా నైవేద్యాలను మళ్ళీ పొందేటట్టు అయింది కదా అని నాకు నేనే దిష్టికాయ కొట్టుకోనా అనేటంతటి సంతోష సంభ్రమాలతో మేను మరిచాను. అయినా తగినంత తెలివిని హెచ్చరికను కాపాడుకొని, నీకు ఒకటి రెండు అగత్యమైన విషయాలు చెప్పిపోవాలని వచ్చాను; విను.

నీ మేజాబల్లమీద ఆరు లివరుల లావుపాటి పెద్దతాళం ఒక్కటి పెట్టావే, జ్ఞాపకం వుందా? నీవు దానిని కొన్నప్పుడు తాళమనే కొన్నావు. గదిలో నీవు వున్నప్పుడు, గాలికి కాయితాలు ఎగురకుండా దానిని పేపరు వెయిటుగా వాడడం లేదూ? ఒకసారి దానితో కలకండ పొడి చేయలేదూ? మరొకమారు దానితో గోడకు మేకు కొట్టలేదూ? ఇంకొకమారు ఏడుస్తున్న బిడ్డను ఓదార్చడానికి ఆ తాళం తాళంచెవిని పీపీ లాగ వూదలేదూ?

ఇది ఎందుకు చెబుతున్నానంటే—ఏ పదార్థమైనా సృష్టికావడం ఒక ఉద్దేశానికి గాను; అయితే అది వాడుక కావడం, ఆ యా కాలాల ఆవశ్యకతలకు అనుగుణమైన ఉద్దేశ్యాలకోసం. ఆ విధంగానే, గణపతి అనే ఈ నా సృష్టి మూలతః ఏ ఉద్దేశం కోసం అయిందో అది మీలో ఎవరికీ సరిగా తెలియదు. ఒక్కొక్కరు ఒక్కొక్కటి మీ ముక్కుకు సూటిగా చెబుతున్నారు. అలా చెప్పడంవల్ల ఏమీ నష్టంలేదు. అయితే ఇప్పుడు స్వతంత్రులైన మీకు నానుంచి ఏ మవుతుంది, ఏమి కావాలి అనే విషయాన్ని నేనూ నా ముక్కుకు సూటిగా—నేను వక్రతుండుడను అయినప్పటికీ—చెబుతాను విను.

---

1. "బెళెవరే బాళు; బెళెయదిరె హాళు." బాళు అనే మాటకు జీవితం అనే అర్థంలో 'బాడు' వాడాను. బాడు బాడవలబట్టి మొదలయిన ప్రాచీన ప్రయోగాలలోను, పశ్చిమాంధ్రంలోను కనిపిస్తుంది. అను.

నాకు ముఖ్యమైన లక్షణం ఏమిటయ్యా? నీవు చెబుతావు నా ఏనుగు తల అని. కాని, నేను చెబుతాను, నా దొడ్డ పొట్ట అని. గజవదనుడు అనడం కన్నా లంబోదరుడు అనేదే నాకు చాల ప్రీతి పాత్రమైన పేరు. ఎంత గుండ్రంగా, గట్టిగా, పగిలిపోయేటట్టు ఊది, ఉబ్బుకొని వుందో చూడు, ఈ పొట్ట! ఇదిప్పుడు సర్వ సమృద్ధమై అన్నంతో నిండిన కణజం (గాదె).

అన్నం అంటే నీవు దినమూ తినే పక్వం చేసిన బియ్యమని అనుకోవద్దు. నా ఈ చేతిలో ఏముందో చూడు. ఏముంది? పాత్ర. దానిలో ఏముంది? నీవు కుడుములు ఉండ్రాళ్లు అంటావు. కాదు, అవి మోదకాలు. నీకు తెల్లవారగానే ఆరు గంటలకు కాఫీ మోదకం, ఏడు గంటలకు ఉప్మా మోదకం, పన్నెండు గంటలకు అన్నం, కూర, పులుసు ఇవి మోదకాలు, మధ్యాహ్నపు ఎండకు చల్లని నీరుమజ్జిగ మోదకం, రాత్రి భోజనం అయిన తర్వాత వేపుడుగింజలు మోదకం. అందువల్ల నేను తినేవి వట్టి ఉండ్రాళ్లు, కుడుములు కావు; నాకు ఇష్టులైన మీకు ఏఏ మోదం ఇస్తుందో అదంతా నాకు మోదకం.

ఇలాటి అనేక మోదకాలను లోపల నింపుకొని పొట్టగాదె పగిలేట్టు వుంది అనడం సూచించడానికే ఇదిగో ఇక్కడ ఎలుకలు కింద చుట్టాడుతున్నాయి చూడు. రేషన్ రాజ్యంలో అహరహం తోస్తూ పోతున్న మీ యిండ్లలోని పిల్లి, పాపం, ఎలుకను చూచి ఎంతకాలమయిందో!

ఈ విధంగా ఎలుక పారాడుతున్నా గాదెకు దానినుంచి ఎక్కువ అపాయ మేమీ లేదు, చూచావా? ఎందుకు? అక్కడ గాదెమీద, గాదెచుట్టూ ముద్ర వేసినట్టు పాము చుట్టచుట్టుకొని వుంటూ పడగ విప్పింది, చూడు. ఆ పామును 'క్షేత్రపాలుకు' అంటారు. చేలల్లోను, మళ్లల్లోను పైర్లు పెరిగి కంకులువేస్తాయి. వాటిని తినడానికి ఎలుకలు వస్తాయి. ఈ పొలాలు, మళ్లు కాపలా కాయడానికి పాములు లేకపోతే, ఎలుకల రాయిడివల్ల జనానికి గింజలే మిగిలేవి కావు. గాదె వున్నచోట ఎలుకలు వుండాలి; ఎలుకలరాయిడి మితిమీరితే, అడ్డగించడానికి పామూ వుండాలి-ఇది భగవంతుని నియమనం.

అయినా, ఈ పామూ, ఎలుకా వుండే రీతిని చూడు. దాని స్థానంలో అది, దీని స్థానంలో ఇది. దాని పాటుకు అది. దీని పాటుకు ఇది. ఎలుకకూ, పాముకూ సహజంగానే వైరం కదా! ఒకదాని నొకటి మింగాలి కదా! అయినా, పైన అది బెదిరించినా, కింద ఇది భయపడక రెండూ ఎలా అన్యోన్యంగా వున్నవో చూడు! గణపతి ఉపాసన చేసే మీరుకూడ ఈ అవైరాన్ని అనుకరిస్తే నేను నిజంగానే గణపతి అనిపించేను.

అది వుండనీ. ఈ గాదెను ఈ విధంగా నింపడానికి కావలసినన్ని మోదకాలు ఎక్కడినుంచి వస్తాయి, తెలుసా? ఆ మోదకాల పాత్రకు ఈ వైపు వున్న చేతిలో ఏముందో చూడు. నీవు దానిని 'ఏకదంతం' అంటావు. ఔను. నిజం. చిన్ననాడు నీకు ఆ కథ చెప్పారు. నేను ఇంటింటికీ పోయి, తిరిపెమెత్తి ముఖం ముడుచుకొని ఎవరికంటా



పడకుండా తిని, పొట్ట పగిలినప్పుడు నవ్విన చంద్రుని దండించడానికి నేనే నా కొమ్మును విరుచుకొన్నానని కదూ! కథ చక్కగా వుంది, పిల్లలకు. నీకు మనమలు పుట్టినప్పుడు వారికి ఈ కథ చెప్పు.

విను. ఇది ఏకదంతం కాదు. ఈ దేశపు కావ్యాలలో ఏనుగు కొమ్మును "నాగలిలాగ వుంది" అని వర్ణిస్తారు, తెలుసునా? ఇది నా చేతిలో వుందేది, "కొమ్ములాగ వున్న" నాగలి, నాగలికర్రు. ఈ నాగలి బలంతో పెరిగిన మోదకాలను నింపి నింపి నేను ఈవిధంగా లంబోదరుణ్ణి అయాను. ఎలుక నా దగ్గర పారాడింది, పాము నేను పిలిచి బిగించుకొంది.

ఒక్కొక్కసారి నేను ఈ 'కొమ్మువలె వున్న' నాగలి కర్రును వదలి ఘంటమనే మొనదేలిన వ్రాతపుల్లను పట్టుకోడమూ కద్దు. అది కూడ విరిగిన కొమ్ము కొనలాగే కనిపిస్తుంది. అయితే నిజంగా ఘంటమే. వ్యాసమహర్షికి భారతం వ్రాసి యిచ్చినప్పుడు నేను వాడినది ఈ ఘంటాన్నే.

నన్ను ఆరాధించే మీరు ఈ విరిగిన కొమ్ము కథను పిల్లలకు వదలి, నేను తీసుకున్న నాగలి కర్రును ఆశ్రయించి మోదకాల సమృద్ధిని చేకూర్చ రాదూ? దానికి తోడు నేను పట్టిన ఘంటం పట్టుకొని, దేశ నిరక్షరాస్యతను నీగరాదా?

ఈ బుద్ధి ఎప్పుడు వస్తుందో, తెలుసా? నేను నా తక్కిన రెండు చేతులలోను పట్టుకున్నవాటిని మీరూ మీ చేతులకు తీసుకున్నప్పుడు.

నా తల చూడు. ఇది ఏనుగు తల. ఏనుగు దేహం చాల పెద్దదట. అయినా, ఏనుగు తినేదీ వట్టి చొప్పేనట. ఏనుగు ఒక్క అడుగు గుర్తులో తక్కిన ప్రాణులు పెక్కింటి అడుగుల గుర్తులు అడగించవచ్చు. ఏనుగు కళ్లు చాల చురుకట. దాని జ్ఞాపకశక్తి చాల దీర్ఘమట. దీనినంతా నమ్మితే నమ్ము. వదలితే వదలు. అది నాకు ముఖ్యం కాదు.

ఏనుగు తల వున్న నా ఈ చేతిలో ఏముందో చూడు. పాశం ఈ చేతిలో, అంకుశం ఆ చేతిలో. ఔను! పాశం, అంకుశం. దుష్టమైన దేహాన్ని కట్టి ఆపడానికి పాశం. దుష్టమైన మనస్సును దిద్ది తీర్చడానికి అంకుశం.

అయితే, ఒక విశేషం వుంది. ఏనుగుకు వేసే పాశాన్ని, ఏనుగుకు వేసే అంకుశాన్ని రెండు చేతులా పట్టుకున్న వాడిని - ఏనుగుముఖం గల నేనే! ఇదే సర్వతంత్ర స్వ-తంత్రమైన స్థితి! ఈ కారణంతోనే నేను వి-నాయకుడు అని అనిపించుకున్నది.

ఎన్నడు మీరు ఇలాగే - నావలెనే మీకు కావలసిన పాశాలను, మీకు కావలసిన అంకుశాలను మీరే ధరించుకొనే మట్టానికి వస్తారో, ఆనాడు లోకంలో నాకు అగ్రపూజ జరిగినట్టే మీకూ అగ్రపూజ జరుగుతుంది.

ఈ విధంగా ఒక్కొక్క చేతిలోను పాశం, అంకుశం, మోదకపాత్రం, ఏకదంతమో, మరేమో మొత్తానికి నాలుగు చేతులూ నిండిపోయినా, "వెన్న పెట్టుకుని నేయికోసం ఏడ్చారు" అన్నట్టుగా, తినడానికి వుండికూడ నేను పొట్ట ఎండించుకొని ఊరికే కూర్చోలేదు, చూడు. తొండాన్ని అలాగే వంచి ఒక్కటొక్కటిగా మోదకాన్ని పాత్రనుంచి ఎత్తి, పొట్టకు బదిలీ చేస్తున్నాను. నీవు ఎన్నిసార్లు "సవరించడమూ చాలదు; సామగ్రీ చాలదు" అని గొణుక్కోలేదు. జ్ఞాపకం చేసుకో. మనస్సు వుంటే మార్గాలు నూరు, వాటంతట అవే తోస్తాయి.

చూడు, నేను ఈ గణనాయకుని పదవికి ఒక్కసారితో ఎగిరి రాలేదు. మొట్టమొదట నేను ఒక గ్రామదేవత అనిపించుకున్నాను. రానురాను ఇప్పుడు ఆర్యదేవతలకు మొదట నాకు పూజ చెల్లిస్తున్నారు. ఈనాడు కూడ కొన్ని ప్రాంతాలలో నన్ను ఎలా భావన చేస్తారో, చూడు. ఒక చిన్న పేడవుండ చేసి, దానిలో రెండు పచ్చని గరికపోచలు గుచ్చి, దానిని 'పిళ్లారి' అని అన్నిటికీ మొదట పూజ చేయడం లేదా! అదే నా మొట్టమొదటి రూపం. ఇప్పటి నా దివ్యభోగాన్ని చూచినవారు దీనిని నమ్మకపోవచ్చు. కాని, ఇది నిజం. నేను మొదట పంటనూర్పు దేవతగా పుట్టినవాడిని. పొలంలో పెరిగిన పైర్లన్నీ అడవి ఏనుగు, ఎనుము. అడవి పందులనుంచి నాశమై పోతున్నప్పుడు ఆర్తులైన జనులను సాంత్వనపరచడం కోసమే నా ఆవిర్భావమైంది. అందువల్లనే నాకు పందికి వున్నట్టు, ఏనుగుకు వున్నట్టు పొడుగాటి ముక్కు, ఈ తిండిపోతుతనం.

"న త్వహం కామయే రాజ్యం న స్వర్గం నా పునర్భవం,
కామయే దుఃఖతప్తానాం ప్రాణినా మార్తినాశనం."

అన్నారు గదా, దానిలాగే నాకు రాజ్యం ఆశ లేదు, స్వర్గం వద్దు, ముక్తి వద్దు; దుఃఖంతో కాలిపోయే ప్రాణుల సంకటాన్ని నాశంచేయడం ఒక్కటే నాకుండే ఆశ. ఈ బుద్ధిని శివుడు నాకు కరుణించి యిచ్చాడు. ఈ ఆర్తత్రాణపరాయణత నాకు రావడం వల్లనే నేను పేడముద్ద పిళ్ళారితనం నుంచి ఈ విఘ్నేశ్వర పదవికీ, సిద్ధివినాయకుని స్థానానికీ, విద్యాగణపతి విభవానికీ ఎక్కి వచ్చాను - మీ గాంధి, నెహూరు మొదలయినవారు సంవత్సరాలకొద్దీ చెరసాలలో మగ్గుతూన్నవారు, ఇప్పుడు ఈ దేశం అధినాయకులై విదేశాలలోను అమోఘమైన మాన్యత, గౌరవం, ప్రీతి, ఆదరం సంపాదించుకున్నట్టు.

చూడవోయ్! నేను అవతరించింది దక్షిణదేశంలో ద్రావిడుల దేవతగా. ఆర్యులు వచ్చినప్పుడు నన్ను ప్రీతితో ఎత్తుకున్నారు. క్రమక్రమంగా ఎవరెవరో నన్ను చేతులతో ఎత్తుకున్నారు—బాలకృష్ణుణ్ని చూచామా అన్నట్టు. ఇప్పుడు చూడు: భారతదేశం, నేపాళం, టిబెట్, బర్మా, జావా, బోర్నియో, చీనా, జపాన్,—ఈ దేశాలలో అంతా నన్ను పైకి ఎత్తుకున్నారు. నిజమే. ఆ యా దేశాలలో వాళ్లవాళ్ల తమకు కావలసినట్టు నాకు వేరే వేరే అలంకారం చేశారు. అయితే, లోపల నేనేమో ఆ గణపతినే, అదే ఏనుగుముఖమే, అదే పెద్దకడుపే.[1] పాత అమెరికాలోను నా రూపాన్ని పూర్వం మెచ్చుకొన్నారు. ఈ విషయం కావాలంటే 'హిందూ అమెరికా' అనే పుస్తకం చూడు.[2]



ఇంతటి అతిశయమైన లోకాదరం నాకు ఎందుకు ప్రాప్తించింది, ఎలా ప్రాప్తించింది అనేదానిని గురించి నా అభిప్రాయం చెబుతాను, విను.

నేను ఒకరు చెప్పి మరొకరు వినేంతటి సురూపినేమీ కాను. దేవగణంలో నా కంటె లక్షణమైనవారు లక్షలకొద్దీ ఉన్నారు. నా ఈ పెద్దపొట్ట, మోటుచేతులు, మోటుకాళ్ల, అన్నిటికీమించి ఈ ఏనుగుముఖం! అయినా జనం నన్ను ఆదరించడం నా మినుకు మినుకు కళ్లకోసం అని నా నమ్మకం. నేను ఎవరినైనా, ఎన్నడైనా ద్వేషించడంగాని, ఎవరిమీదనైనా, ఎప్పుడైనా సిడిసిడిచేయడంగాని, ఎవరికైనా, ఎక్కడైనా చెడుపుకోరడం గాని లేదని శివునితోడు చెప్పగలను. అందువల్లనే ఇలాటి శతవికారమైన దేహం పొందినప్పటికీ, నన్ను చూస్తే జనానికి అంత ఇష్టం. కళ్లు జీవం తొంగిచూసే కిటికీలు అనే మాట తప్పుకాదు. నా అంతర్యానికి నా కళ్ళలో తొణికిసలాడే తాలిమి, తంపు (చలవ) లే సాక్షి.

నాలాగే మీలో ఒక్కరు ఉండేవారు, చూడు: ఆ గాంధీ అతనికీ నాలాగే చేట చెవులు. అతడూ నాలాగే సురూపి అనేమీ అనిపించుకోలేదు. అయినా, ఈ కాలపు సర్వప్రపంచంలోనూ అతనివలె సర్వలోకవ్యాప్తి అయినవారు వేరే ఎవరు చెప్పు? ఈ వినాయకుని తర్వాత రెండవ వినాయకుడంటే అతడే, ఆ గాంధీ!

నేనూ, ఆ గాంధీ ఏకోన్ముఖులమై ఉన్నాము. సమృద్ధి, స్వాతంత్ర్యం, సంయమం, సహకారం, సారస్వతం, సర్వాభిరుచులు మొదలయిన సకల ససససలకోసం సదా సాధనచేసి, సిద్ధిపొందాము. గణపతి అయిన నాపేరు చెప్పే మీరు, గాంధీ అయిన ఆయన పేరు చెప్పే మీరు, ఈ మా మార్గం పట్టి పెరిగితే, పెరిగి మనితే,—అదే మాకు ఇష్టార్థసిద్ధి.

అందుకోసమే చెప్పడం:

"పెరిగితే బాడు; పెరగకుంటే పాడు."

---

1. ఈ సంగతి కావాలంటే ఈ పుస్తకం చూడండి: Ganesha by Alice Getty. Oxford University Press, 1936.
2. Hindu America - Chamanlal New Book Co., Bombay, 1948.

# 18. పాద రక్షలు

రా. కు.

ధారవాడజీవికి పాదరక్ష చాల చాల అవసరం. ఏమిచేయాలి స్వామీ! ఊరే అట్లా వుంది. వాహనాలలో తిరుగాడే శ్రీమంతుల పాదాలకు పలుచని పట్టుచెప్పులు ఒక భూషణం. అయితే, తమ కాలగతిలో అచలమైన విశ్వాసముంచి తెల్లవారగానే మ్యునిసిపల్ సామ్రాజ్యం రహదార్లను పాదాక్రాంతపరచే అకోమల మహాశయులలో నే నొకడిని. ఇంతటి వీధులను అరగగొట్టే ఉగ్విజయి అయిన పాదాలకు కోమలమైన చెప్పులసేవ సార్థకంకాదు. మన పాదాఘాతాలను తట్టుకొనేశక్తి లేనందున పాదత్రాణమనే బిరుదు ఈ దుర్దైవులకు చెల్లదు. చెప్పులు కొన్నిరోజులలోనే చినిగిన అట్టముక్కలు అవుతాయి. బహుశః ఎక్కడాలు (ముందు పడగలాగ తలఎత్తిన బలమైన పాపోసుల వంటివి) వేసు కుంటే ఈ దుఃఖం తప్పుతుందేమో! కాని, దానికి మన కాలుగాని కాలంగాని ఒప్పుతుందా? ఈ సమస్యను ధారవాడ గొడారివారు సుందరంగా పరిష్కరించారు. సమన్వయం అని అంటారు గదా—దానిని వారు స్థాపించారు. ఎక్కడాలు చేయలేదు; చెప్పులు విడవలేదు. అట్టలు కొంచెం లావు కావచ్చు; వారలు కొంచెం హెచ్చుగా బిగిశాయేమో; నాదప్రియులు తమ పదగతి సౌఖ్యాన్ని విని ఆనందించనీ అని మేకులు, లాడాలు కొట్టినా కొట్టవచ్చు.

అయితే, ఏమిచేసినా, కాలగతిలో అంతా తుక్కుతుక్కుఅయిపోతుంది. ధారవాడ బురదకు, ధూళికి పాదరక్షలు నోరుతెరచుకొని పేగులు తెంపుకుంటాయి. అవి బాధతో చేసుకొన్న వాంతితో వాటిని తొడుక్కొని నిలబడినవారి, వారి పక్కన ఉన్నవారి ఉడుపుల మీద ఆ అన్యాయపు అనంతప్రతీకలవలె చిత్రవిచిత్రాకారపు నక్షత్రాలు ఉదయిస్తాయి. నిర్భాగ్యమైన చెప్పుల ఆఖరులోజులయితే అత్యంతహృదయవిదారకంగా వుంటాయి. ఒక దుర్దినపు రొచ్చులో అది ఓడిపోయి అక్కడే నేలపట్టిందీ అంటే, దాని అవసానం వచ్చింది అని తెలుసుకోండి. రెచ్చిపోయిన గండచీమ కుట్టి గట్టిగా పట్టుకున్నప్పుడు, మీరు లాగితే, దానితల అక్కడే వుండిపోయి, వీపుమాత్రం విరిగి వచ్చేటట్టు ఆ మరణ సన్నమైన చెప్పును లాగుదామనుకుంటే, దాని ఉపరిభాగంలోని అవయవాలు అలాగే నీలు క్కొని పైకి వూడివచ్చి, దాని కరుణాజనకమైనదేహం నిర్విణ్ణమై నేలతల్లి ఒడిని గట్టిగా కరుచుకొని పడుకుంటుంది. తొడుక్కున్న నిష్కరుణుడు దానిని శపించి ముందుకు వెళ్ళి పోతాడు. విరహిణి అయిన మరొకచెప్పును అతడు మరొకపక్కకు విసిరివేస్తాడు. మానవజాతి కృతఘ్నతకు అవి కింగ్ లియర్ వలె శోకించవా? (లేక పీడ విరుగడ అయి పోయింది అని అనుకుంటూ ఉండవచ్చునా?)



ధారవాడ ధూళిని చూస్తే, దానికి ధూళివాడ అనే పేరే తగిందని అనాలి. మునిసిపల్ కీర్తిని మొయిళ్ళకు తాకించే నాగరికుల ప్రయత్నంలో ధారవాడవీధులు తమ ఒడలుతోడి రాశిరాశిగా తమభక్తిని వారి పాదాలకు అర్పిస్తాయి. ధారవాడ తల్లి సుపుత్రుడైన ఒకకవి దీనిని ఈ విధంగా వర్ణిస్తాడు :—

[1]"ఆలమందల కాలిధూళీ
సంజెహాళహాళీ
మొయిలుముట్టిందీ మొయిలుముట్టిందీ!"

నిజానికి పశువులవల్ల లేచే ధూళి చాలతక్కువ. ధూళికి "మొయిలు ముట్టే పెంపు" (ముగిలం ముట్టువ పెంపు) ప్రసాదించిన శ్రేయస్సు చెప్పులకే చెందాలి. చెప్పులకు కావ్యంలో ప్రవేశం కలిగించే ఉత్తమ కరుణామయులు ఇంకా పుట్టలేదు కాబట్టి దాని ఉల్లేఖం అధ్యాహృతమైంది. పూర్వకావ్యాలలో సైనికులు ధూళిలేపే వర్ణనలు మీకు తెలుసుగదా? అవి అతిశయోక్తులనే ధార్ష్ట్యాన్ని ధారవాడ రసికులు ఎన్నిటికీ చూపరు. అది వారు దినమూ చూచే ఆపాదమస్తకమైన సత్యం.

వట్టి ధూళిస్నానానికే ఊపిరికట్టి ప్రాణాలు వదిలే ఏడుపుగొట్టు స్వభావం ధారవాడ పాదరక్షలకు ఉన్నదంటేమాత్రం అది శుద్ధ అన్యాయం. పాదరక్షలు అంగహీనాలై ప్రాణాలు వదలడం, అకాలమరణానికి పాలుకావడం ఈ వూరు పొడువు వెడల్పులవల్ల, ఎక్కుదిగడాలవల్లాను. ఏమి ఊరు! మనసుకు తోచినట్టు ఇండ్లుకట్టుకున్నారు పుణ్యాత్ములు. దండకారణ్యంలో తపస్వులు ఆశ్రమాలు కట్టుకొన్నట్టు, అలిగిన చిన్నపిల్లలు మూలకొక రుగా గోడవైపు తిరిగి కూర్చునట్టు, మునిసిపల్ హలాల్‌కోరు (విశ్వాసపాత్రుడు) ఊడ్చి పోగుచేసిన పెంటకుప్పలలాగ-అక్కడొక గోపాలపురం, ఇక్కడొక మదిహాళ; ఆమూలకు సప్తాపురం, ఈ మూలకు సారస్వతపురం. సాధనకేరి అయితే గంగోత్రి, యమునోత్రి - టిబెట్ రాజధాని. అక్కడకు వెళ్ళడమూ చంపూప్రబంధం చదవడమూ ఒక్కటే. 'అడిగళిం దెశెదాడె హాదియుద్దో ఉద్ద" (అడుగులు లాగుతూ వెళ్ళితే, దారి పొడువో పొడువు.) పోవాలి పోవాలి. దారి ముగియనే ముగియదు. విన్నపానికి వాయి లేదనే పాదరక్షల మూకవేదనను మెట్టిలాగుతూ, ఎత్తెత్తి కుక్కుతూ, ఎగుళ్లు ఎక్కుతూ దిగుళ్లు దిగుతూ దేకుతూ, మన పాదపద్మోపజీవుల వెన్ను సమిసిపోయేట్టు చేస్తాము. మనపాదాలలో త్రాణ తత్తరపడేప్పుడు ఎడుపుకొని పడుతాము. పాపం! మన అడియారి చెవి తెగిపోతుంది. వెన్నెముక లేచి నిలబడుతుంది. దాని వంశోద్ధారంచేసి మనం దాన్ని-అంగహీనమైన ఆ గాయపడినదాన్ని-లాగితెచ్చి గొడారిచేతికి అర్పిస్తాము. మనం ఎడుపుకున్నది తప్పా? 'నడచేవారు ఎడుపుకోకుండా, కూర్చున్నవారు ఎడుపుకుంటారా?' అని అడగడం కరుణాపవయిన రాఘవుని తప్పుకాదు. దయాపవయిన గొడారిహృదయం

1. "దనకరద కాలినాధూళి
సంజెయా హూళి
ముగిల ముట్టిద ముగిల ముట్టిద!"

కరిగి చెబుతాడు ; "స్వామీ ఇది చచ్చిపోతుంది. అట్ట కొట్టించండి. నేను కొత్తచర్మం వేసి—" అయితే మన రాక్షసహృదయం కరగదు. దాని గొంతులో ఒకమేకు కొట్టించో లేకపోతే తెగినచెవికి ఒక టాకావేయించో, మరొకమారు పాదాక్రమణం చేస్తాము. తిద్దుబాటు (మరమ్మతు) చేసిన దీనిని మెట్టి నాలుగడుగులు సమ్రాట్టుశీవితో, వర్ణనకావ్యంలాగ నిర్వేగంగా పోదామనిపిస్తుంది ఎన్నోసార్లు. అయితే మన పాదకమలాలు ఈదవలసిన పంకవిస్తారం (అథవా ధూళిధార) ఇంకా ఎంతవుందో, దానినిబట్టి నిర్ణయించాలి.

చెప్పులకు కలిగే అపఘాతాలు గోధూళిలగ్నంలో హెచ్చు. అందులోను, శుక్లపక్షమయినప్పుడు నగరసభ (పురపాలక సంఘం) డబ్బు అపవ్యయమవుతుందనే భయంతో వీధిదీపాలు కళ్లుమూసుకుంటాయే, అప్పుడు. ఇంటికి తిరిగివచ్చే పశువులు, గుడ్డిసైకలు, ఒక్కంటిమోటారు, వెదుళ్లతెచ్చేబండి కలిగించే కోలాహలంలో మనప్రాణాన్ని నిలుపుకొనడమే ఒక ఆత్రం. ఆ సమయంలో మనపాదాలను శరణుజొచ్చి, గట్టిగా పాదాలను పట్టుకున్న మన ఈ సేవకులను మనం కళ్లుపెట్టి చూస్తామా ? లేదు. తిద్దుబాటు (మరమ్మతు) ప్రయోజనం ముగిసిపోయి, మరల తిద్దుబాటు చేయించవలసి వస్తుంది. కుట్టినచోటే కుట్టికుట్టి దాని ఒక్కొక్క అవయవం ఎంత జీర్ణం, శీర్ణం అయివుంటుందంటే, మరొక ఆపరేషనును ఓర్వలేక నోరుతెరుచుకుంటుంది. దయామయుడైన గొడారి మనస్నేహితుల సమక్షంలో దానికి రాజీనామా యిప్పిస్తాడు. నేడు ఒక ఉంగటం, రేపొకవార, మర్నాడొక అట్ట-ఇలా కొత్తకొత్త సంస్కారంపొంది చెప్పులు కొత్తకొత్తదేహం ధరిస్తాయి.

"నేను దాల్చిన దేహాల లెక్క
పెట్టేవారి తిక్క
యముడు కని నవ్వే చక్కా"

అని అవి పాడుకుంటాయి.[1]

ఇప్పుడు నేను మెట్టిన చెప్పులు ఎన్నవదఫా మరమ్మతు పొందినట్టివో చెప్పలేను. ఆ లెక్కపెట్టే గర్వం—తిక్క-నాకు లేకపోయినా మరమ్మతుచేయించడం చాలసార్లు అని మాత్రం ఎరుగుదును. అదేమిటో విచిత్రం, గొడారి తన గిరాకులను ఆకట్టుకునే చాతుర్యమో, నా పేదపాదత్రాణాల ముప్పు దౌర్బల్యమో, అథవా నా పాదాల నిష్ఠురవిన్యాసమో తెలియదు. ఈ మరమ్మతులకు చెల్లించిన డబ్బు లెక్కపెడితే, ఇలాటివి నాల్గుజతలు కొనుక్కోవచ్చు. పోనీలేండి. మనం ఇంతవరకు ఇచ్చిన ఇంటిఅద్దెను జమచేసి ఉంచి ఉంటే, మూడంతస్తులమేడ కట్టవచ్చునయ్యేది.

మనపాదాలను అవి రక్షించడానికి మారు, వాటినే మనం రక్షించవలసిన సందర్భాలు ఎక్కువ అని తోస్తుంది. "రక్షతి రక్షితః" అనే ధర్మం వాటిది. త్రాతీతి త్రాణం అనేది

1. నాతొట్ట దేహగళ లెక్క
ఇడువవర సొక్క
యమ నోడి నక్క.



వ్యాకరణం మాత్రం. ఏమయినా చెప్పులవియోగం దుస్సహమైన దుఃఖం. దాని చరమ (చర్మ) గీతాన్ని పాడి విలపించే కాళిదాసు ఇంకా కాలగర్భంలోనే ఉన్నాడు. కులదీపకుడు సుపుత్రుడయ్యే త్రాణలేక అకాలమరణానికి బలి అయినప్పుడు కలిగే తండ్రి వ్యథకూ, పాదరక్షలు అల్పాయువులై అకాలంలో కాళ్లు వదలినప్పుడు వాటి ఒడయునికి కలిగే దుఃఖానికీ అంతరం ఉన్నప్పటికీ, ఎడదకు తగిలేగాయం రెండింటిలోను లేకపోలేదు. ఏమిచేద్దాము ? దుఃఖాన్ని మింగి కొత్తజోళ్ళను పొందుతాము. జీర్ణమై, విరూపమై పడిన మన పాదపద్మజీవుల పీనుగులను అవి ఎక్కడ ప్రాణం వదలాయో అక్కడే నిష్కరుణగా - మాస్కోదండయాత్రలో నెపోలియన్ తన మరణాసన్న సైనికులను వదలిపోయినట్టు - విసరివేసిపోతాము. దుఃఖసూచకంగా నాలుగడుగులు వట్టికాళ్ళతో నడుస్తాము-అంతే. వాటి అంత్యసంస్కారం మునిసిపల్ కుక్కల ఇగుళ్ళతో పండ్లతో జరుగుతుంది.

కష్టమనేది ఎంతో తీవ్రమైనప్పటికీ కాలంతోపాటు కరుగుతుంది. జీవితం కొత్తను యిచ్చి, పాతను మరుగుజేస్తుంది. చినిగినచొక్కా. అరిగినచెప్పులు, విరిగిన అద్దం మనను వదలి దూరంగా వెళ్ళిపోయినవి ఎన్నో ! కొంతకాలం సహచరాలై జీవితంలో అక్కర పుట్టించి, నట్టనడినీటిలో మనచేతులు వదలిపోయే ప్రియవస్తువులు మనజీవితపు నెలవును, మనకు తెలుపుతాయి. జీవనపు అనంతయాత్రలో వైయక్తిక సంయోగవియోగాలకు విలువ లేదు. ఒకవస్తువు ప్రయోజనం ముగిసినవెంటనే, జీవితం దానిని పోగొట్టుకొని ముందుకు సాగుతుంది. తీగ, వాడి కిందికిరాలిన పూవు తనదే అయినా, దానిని మళ్ళీతీసుకొని కౌగిలించుకోదు. మనమూ ఒకదినం ఈ విధంగానే వాడి రాలిపోతాము.

ఇది తెలిసినా మనలో సౌజన్యం ఉదయించిందా ? పాదరక్షలు మనకాళ్లు పట్టుకుని ఈ వినయపాఠాన్ని చెబుతాయి. వాటి సౌజన్యం ఎలాటిది ? మన ఎంతటి పాదాలనైనా శిరసా వహించి, మనం పోయినచోటికంతా మోసుకొనిపోతాయి. అరికాలుకు సిగ్గులేదం టారుకదూ ! మీరు మీ అరికాలూ సిగ్గుపడే స్థలాలలో వాటిని నిర్దాక్షిణ్యంగా లాగుకొని పోవడంలేదూ ? అంతేకాదు. అతిథులు, స్నేహితులు ఎవరు వచ్చి ఆక్రమించినా అవి వారి సేవకు సిద్ధం. సభ్యతా రాజ్యంలో వాటికి ఉండే పట్టం అందరినోట్లోను ఎప్పుడైనా రావడం కద్దు. విశేషంగా కోపం తలకెక్కినప్పుడు, గ్రామీణప్రజలు ఎవరికైనా వాటిబెదురు చూపుతారు. ఈ దేశీయమైన సొగసుకు ముగ్ధులయిపోయిన కవులు తాటాకులలోను వాటిని గండరించారు. పిలువకనే వచ్చేవాడికీ, వట్టికాళ్లతో తిరిగేవాడికీ చేయదగిన మర్యాదనుగురించి చెప్పేటప్పుడు సర్వజ్ఞుడు తనకాళ్లనే చూచుకొని ఉంటాడు.

కేవలం అడుగులక్రింద ఉండడంవల్లనే, చెప్పులకు ఈ మర్యాద వచ్చిందా ? అలా అనిపించడంలేదు. దానికొక దుర్గుణం వుంది; లేక, నిష్ఠురనిర్గుణత అందాము. దానికి తనవారనే మోహం లేదు; పెరవారనే భేదం లేదు. వచ్చినవారి కాళ్ళమీదపడి, వారితోపాటే పరుగెత్తిపోయే విశ్వాసఘాతుక ప్రవృత్తి వాటికి ఏరాళంగా ఉంది. ఇంతటి కృతఘ్నులమీద మన హృదయసంపదను చూరలిచ్చి ఏమిటిఫలం చెప్పండి ? నేను కొల్లాపురంలో

కొన్న కోమలమైనచెప్పులు నన్ను తప్పించుకొని, నన్ను మోసగించి, ఎక్కడికి వెళ్ళి పోయాయి? అవి వచ్చినకొత్తలో నూనె అంటి అటికమీద ఒరిగించాను. ఆమీదట ఎంత అనునయంతో వాటితో నడచుకొన్నాను? నేను వెళ్ళినచోటికెల్లా అవి నాతోపాటు వచ్చేవి. ఎన్ని ఇళ్లు? ఎన్ని ఊళ్లు? విద్యాలయం, చిత్రవస్తు సంగ్రహాలయం, పఠనాలయం, ఒకటా, రెండా వేలాది స్థలాలను, పురాతన పట్టణాలను తవ్వి తీసేటప్పుడు అవి నా కాళ్ళ లోనే ఉన్నాయి. ప్రాగైతిహాసికస్థలం తవ్వకాలకోసమని హరప్పాకుకూడా వెళ్లాను. ఐదువేలసంవత్సరాల కిందటి కోట కొత్తడాల అడుగుభాగాన్ని చీల్చుకొని తల్లినేలను తాకివచ్చిన నా పాదరక్షలు ఆ ధూళీస్నానం మరవడానికిముందే లాహోరులోని ఒక హోటలులో నా కాళ్ళను పరదేశి చేసి పోయాయి. ఏ పంజాబీపాదాలను శరణుచొచ్చి ఆ పురాతన దూళి మీది ఆశతో అడవి అడవీ, ఆ పాడు ఎడారీ తిరుగులాడుతున్నాయేమో!

నా చెప్పులను మెట్టుకొనిపోయిన చెప్పుల దొంగను నేను తిట్టదలంలేదు. ఈ "ధకణి" సౌందర్యం వాడి కళ్ళను లాగిందంటే ఆశర్య మేమిటి? ఈ నష్టానికి నా అలసత్వం, అనాదరం కారణమయివుంటాయి. ప్రణయం కాని, స్నేహంకాని, వాటి మొట్టమొదటిరోజు లలో చూపే ఆస్థ- ఆదరోపచారాలను మనం కొసవరకు పాటించేటట్టయితే, జీవితంలో ఎన్నో దుఃఖాలు మనకు ఉండేవికావేమో! పాపాత్ములతో నిండిన ఈ దుఃఖజగత్తులో ఒళ్లంతా కళ్లుచేసుకుని నడవక తప్పదు. పసికందు, వయస్సుపిల్ల, కొత్తచెప్పులు-ఏమీ తెలియని ఈ సుందర వస్తువులను మీరు ఎంత జాగ్రత్తగా కాపాడితే అంత మంచిది. ప్రాణమున్న పదార్థంపోతే పోలీసులకు రిపోర్టు చేయవచ్చు. చెప్పులు పోతే, అనాధులవలె విచారణలేక పోయినదొక్కటే గతి. మరేమిటి? ఒక్క నిట్టూర్పు! ఒక్క అల్ప విరహానుభవం! అంతే.

దీనివల్ల ప్రపంచమేమీ మునిగిపోదన్నమాట నిజం. మరొక జోడును లాక్కు వచ్చి మన కాళ్లకింద తొక్కి పెడుతాము. కాని, మొదటిజత మననుంచి దూరంగా తొలగి పోకుండా చూడడమే లెస్స. దానినుంచి వియోగపు దుఃఖం లేదు; హెచ్చు వెచ్చం లేదు. కొత్తసంబంధం సరిపోయేవరకు అయ్యే ఘర్షణ గాయమూ ఉండదు. కొత్తజోడు పాత దయ్యేవరకు, అది సేవాసక్తమై ముసలితనపు లక్షణాలను, అపఘాతాలను, అవశేషాలను ఒంటినిండ తాల్చేవరకు కళ్లల్లో నూనెపోసుకుని (దానికి కూడ కొంచెం పోసి) కాపాడు కోవాలి. గుడి-గుండారం, పెండ్లి-పెటాకులు, సభలు-సమావేశాలు-ఇవి చాల గండాంతర మైన పట్టాలు. ఇక్కడ మీరు కొంచెం తన్మయులయారా, మీ చెప్పుల ఆశ మీరు వదలుకొన్నట్టే గ్రహించాలి. తస్కరణ కాకపోయినా తారుమారన్నా అవుతుంది. బాల్‌రూమ్ డ్యాన్సులో కనిపించిన వారితో కలసి నాట్యమాడినట్లు, ఏ, ఎలాటి ఇజ్జోడు చెప్పులకు మీ పాదాలు తొడిగించవలసి వస్తుందో చెప్పలేము. ఇదింకా క్షేమ మనండి. తస్కరణ గండాంతరం అద్భుతమైంది. చెప్పుల దొంగల సంతతి నిన్న మొన్నటిది కాదు. బసవన్నగారి పాదరక్షలనూ వదలలేదు ఈ జనం. దేహం శివాలయంలో ఉన్నా మనసంతా వెలుపలే ఉందికదా అని ఆయన మరగిపోయారు. ఏమి చేస్తారు పాపం! చెప్పులను



దేవాలయం లోపలికి తీసుకొని పోవడానికి అయ్యేనా? బిజ్జలుని మంత్రికి పేదరిక మేమిటని అంటారు గదా! అలా అనకండి. వీధివీధీ తిరిగే దాసయ్యలకూ ఈపాటు తప్ప లేదు. పురందరదాసులవారి చెప్పులను ఏపాపి మోసేశాడో ఏమో! "ఎన్న పాపోసు కళెదవయ్యా!" (నా పాపోసులు పోగొట్టుకొని పోయాయయ్యా!) అని తిరగదోడు కున్నారు ఆయను. అందుకోసమే ఇంకా జాగ్రత్తగా కాపాడుకోండి అంటున్నాను. ఎవరూ లేని స్థలం కదా అని నిర్భయంగా ఉందామనడానికీ వీలులేదు. దండకారణ్యపు సీతను ఏ రావణుడు ఎప్పుడు ఎత్తుకొని పోతాడో చెప్పలేము. ఇంటి పట్టున కూర్చున్న ముసలి వగ్గుకు ఆ భయంలేదు.

నాకు ఇప్పుడున్న జోడు అరిగిన నాణ్యంకంటే, స్వామిభక్తిపరాయణ మైనది. ఇష్టంవచ్చిన చోట వదలిపెట్టిపోయినా, నేను తిరిగి వచ్చేవరకు అది ఆదరంతో కాచుకొని కూర్చుంటుంది. వినయపూర్వకంగా నా ఎదుట పడివున్న ఈ చెప్పులు నా గతికి సంబం ధించిన గుర్తులను ఎన్నింటిని కాపాడిపెట్టాయి! వాటిలోని ఒక్కొక్క మేకు నేను అడుగు తప్పి చేసిన అపఘాతాల అవశేషం. ఎన్ని వూళ్ళ ఎందరు గౌడారులచేతి నీళ్లు తాగి, గుద్దులు తిని నయమైందో ఈజోడు! ఆ ఇతిహాసమంతా నా కళ్ళకు కడుతుంది. నాజీవితపు ఎన్ని సుఖదుఃఖాలకు సాక్షి భూతమై, నా ఉన్మాదంలో, ఉద్వేగంలో నాతో యోగ్యమైన మౌనంతో నడచుకొన్నది. ఈ నెచ్చెలి ఇక ఎక్కువకాలం మనదు. దీనిని మధురస్మృతి కోసం దాచుకోడానికో, నవీనత్వంపై మోహంతోనో నేను కొత్తజోడును త్వరలో కొనుక్కొని వస్తాననుకోండి. ఆ మీదట ఈ పాత జోడును పెట్టుకుని ప్రయోజనం ఏమి టనే యోచనకూడ కలుగుతుంది. నేను పోయిన తర్వాత దీనిని ఎవరు చూస్తారు? మాసి నూనెమకలపట్టిన టిప్పుసుల్తాను తలగడను, ఔరంగజేబు చింపిరి టోపీని, మాగ్నకార్టా తోలుపట్టీని జాగ్రత్తగా పెట్టినట్టు నా పాతచెప్పుల జోడును చిత్రవస్తు సంగ్రహాలయంలో భద్రపరచడం అయ్యేనా? నేను మహాత్మాగాంధీ కాలేదు ఇంకా! పోనీలెండి. నేటి రాజు కెందుకు రేపటి రాజ్యచింత? ఇదిగో చూడండి. పాదాలంకారాల అంగళ్ళలో వరుసలు వరుసలుగా ఎలా మెరిసిపోతున్నాయో జోళ్లు? లేలేత కాంతులతో వున్న ఈ జోళ్లు ముగ్ధ హృదయులైన పసిపాపలవలె ఏమేమి కలలుకంటూ ఎవరి పాదారవిందాల ధ్యానం చేస్తు న్నాయో, ఏమో? అవి ఎవరి పాదాలపై పడుతాయో ఎవరికి తెలుసు?

ఔను? చదువరీ, నీవు తెలుసుకొన్నదే సరి! చెప్పులజోడు నాకు జీవిగా కనిపించింది. తాను "ఊపిరున్న ఒడలు" అని నా కది చెబుతూ వచ్చింది. ఇంతకూ అది ఎన్ని కష్ట జీవులకు ప్రతీకం కాలేదు? సేవలో జీవంసమసి, సన్నబారి, చిక్కినవారికాళ్లు పట్టుకొని చచ్చిపోయినవారికి, ఉన్నప్పుడు చిక్కిన సౌభాగ్యమేమి? చచ్చిపోయిన పిదప నిలిచిన స్మారక చిహ్నమేమి?

# 19. మా గేదెకు మాటలు వచ్చా?

గొరూరు రామస్వామి అయ్యంగార్

మననాడు గేదెలనాడు. మహిషమండలం అనేది మనం సంతోషంతో చెప్పుకొనే పేరు. మన రాజుగారికి మహిషాసురమర్దని కులదేవత. మన మందరం గేదెపాలుతోనే పెరిగాము. గేదె ఈ విధంగా మనకు దేవత అయినందువల్లే మనదేశంలో ఇతర దేశాల కన్నా గేదెల ప్రాబల్యం ఎక్కువ.

ఇక మా యింటి మాట. మా యింటికి గేదె ప్రకృతివలె శాశ్వతం. గేదె లేని కాలం మాకు లేనే లేదు. ఇంటి యజమానుల వంశాన్నీ, పెద్దలనూ, మూడునాల్గు తరాల నుంచి గుర్తించేలాగ మా యింటిగేదె వంగడంమూలాన్ని నాలుగు తరాలనుంచి గుర్తించవచ్చు. ఇది హీరేగౌడ పల్లె గేదె. దీని పేరు దొడ్డు. ఇది తొమ్మిది దూడలు ఈనింది. దీని నాలుగో దూడ తెల్లచారల గేదె. దాని మూడవ దూడ చిన్నగేదె. దాని రెండవదూడ వడ్డ. చిన్న గేదె మొదటిదూడ అప్పుడే రెండు దూడలు ఈనింది. ఈ విధంగా మా యింటి గేదె వంశ వృక్షం రాజుల, మహారాజుల వంశ వృక్షాలకన్నా ఎక్కువ స్పష్టంగానూ, శుద్ధంగానూ, ఋజువుగానూ ఉంది. చిన్నగేదె సాధు స్వభావాన్ని, అందమైన గీతలను, అంత చిన్న పొదుగు, అంతంత పాలు చూచి పలువురు దాని తల్లి, తండ్రి జాతి, తళం, వంగడం ఏమిటని పదేపదే కనుక్కొని పోతారు. ఈ కారణాలవల్ల మా గేదె వంశవృక్షాన్ని భద్ర పరచడం నాకు అవసరం.

మా యింటికి గేదె ప్రకృతిలాగా శాశ్వతమని అన్నాను. మా యింట్లో ఎల్లప్పుడూ గేదెలు వుండనే వుంటాయి. కాని ఈ అన్ని గేదెలు హీరేగౌడ పల్లెలోని పెద్ద గేదెవంశంవే నని మా పెద్దలు హఠం పట్టి వాదిస్తారు. హీరేగౌడపల్లె పెద్దగేదెకు ఇప్పటికి మన్ఫయి, నలభై సంవత్సరాలయి ఉంటుంది. అయితే దాని వంగడం సంఖ్య హెచ్చుగా పెరగడం వల్ల దాని తండ్రి, తాత ఏది అని గుర్తించడం అసాధ్యమవుతున్నది. అయితే ఇదిమాత్రం నిజం. మనకు గాలి, నీరు, నది, మాను, చేను, చెరువు, పూవు, అడవి ఎలా ప్రకృతియో అలాగే గేదెకూడ ప్రకృతి. జనం రావచ్చు; జనం పోవచ్చు; జనం పుట్టవచ్చు; జనం గిట్టవచ్చు; రాజ్యాలు మారవచ్చు; రాజ్యంలో విప్లవం కలుగవచ్చు. అయితే మా కొట్టంలో మాత్రం గేదె నిత్యం; పురాతనం; అచలం.

ప్రకృతిని అర్థం చేసుకోడం చాల కష్టం. దానిని అర్థం చేసుకోడం కూడ సాధ్యం కాదు, ఊరికే చూడాలి. సాధ్యమైతే అనుసరించాలి. మన పూర్వపు ఋషులు ప్రకృతిని అర్థం చేసుకొనడానికి ప్రయత్నించ లేదు. దానిని అనుసరించారు. దాని పూజారులయారు. గేదె ప్రకృతి వంటిది; దానిని అర్థం చేసుకోడమూ సాధ్యంకాదు. దానిని ఊరికే అనుస



రించాలి. మహాత్మాగాంధీ వంటి భారత భాగ్య విధాతకు కూడ గేదె అర్థం కాలేదు. "గేదె గోజాతికి చేరినది కాదు. దీని అభివృద్ధివల్ల భారతదేశంలో గోవుల ప్రాబల్యం తగ్గింది. సాధ్యమైనంత త్వరలోనే గేదెలను లేకుండా చేయాలి. దీని పాలు జనానికి ఆరోగ్యకరం కాదు. ఆవుపాలలో ఉన్న త్రాణ, పుష్టి గేదెపాలలో లేదు. అందువల్ల గేదెలను లేకుండా చేసి, మంచి జాతి గోవులను వృధ్ధిపరచడమే గోసేవ." గాంధీమహాత్ముడు పదే పదే చెప్పారు. మా యింటి గేదె ముఖం చూస్తే అది నన్నుచూచి కనికరంతో "పాపం, ఋషులకు ప్రకృతి అర్థం కాలేదు. అలాగే గాంధీకి మేము అర్థంకాలేదు. మేము లేకుండా చేయాలట; ఎలాచేస్తారు? గుట్టలను లేకుండా చేస్తారా? నదులను, అడవులను లేకుండా చేస్తారా? పాపం! గాంధీకి ఏమి తెలుసు?" అని చెబుతున్నట్టు తోస్తుంది. గాంధీగారి తత్త్వాన్ని జ్ఞాపకం పెట్టుకొన్న నేను ఆ గేదె ముందుకు వెళ్ళినప్పుడు నా మనసులో ఉన్నదానిని తెలుసుకొన్నట్టు అది "నా కంతా తెలుసు" అన్నట్టు తల ఊపుతుంది. గాంధీ గారి తత్త్వాన్ని తెలుసుకొనడమే నా తప్పు అనే భావం నాలో కలిగి నేను ఈ గేదె విష యంలో అపరాధిని అని అనుకొంటాను.

మన దేశప్రజల లాగే మనదేశపు మచ్చిక పశువులూను. ఇప్పుడయితే, పుష్టిగల జనం మనలో ఎక్కడా కళ్లకు కట్టడమే లేదు. అందరూ గుజ్జారులే; వామనులే. మరి కొంతకాలం గడిస్తే వీళ్లు మనుష్యులేనా అనే విషయం ఆలోచించవలసి వస్తుంది. కడుపు నిండ తిండిలేనివాడు పెరగడం ఎలాగు? జనమే కడుపుకు లేకుండా తిరుగుతున్నప్పుడు పశువులకు ఏమి దొరికేని? మన ఆవులు గొర్రెలు, మేకలులాగ ఠింగణాలయి పోతున్నాయి. ఆహార నిపుణుల సలహా ప్రకారం మనలో ప్రతివారూ పది ఔన్సుల పాలన్నా తాగాలట. లేకపోతే మన ఆరోగ్యం సరిగా ఉండదట. పాలు ఉండనీ. ఈ నలభైకోట్ల జనానికి పది ఔన్సుల గంజుకూడ దొరికే టన్ని మేలురకం ఆవులు మనదేశంలో లేవు. గేదె విశ్వా మిత్రుని సృష్టి అని అంటారు. విశ్వామిత్రుడు కారుణ్యం, కోపం, మాత్సర్యం, మను ష్యత్వం, అభిమానం, రసికత-వీటికి ప్రతిబింబం. వశిష్ఠునిలాగ అతడు ఎండిపోయిన కట్టె కాదు. అతడు అంతటి కరుణామూర్తి కావడంవల్లనే తల్లి తండ్రు లిద్దరికీ అక్కరలేని శునశ్శేపుని యజ్ఞబలిపశువు కాకుండ కాపాడినాడు. అతడు కరుణామయమూర్తి అయి నందువల్లనే, వశిష్ఠుని, వశిష్ఠుని పుత్రుల క్రోధానికి బలిఅయి చండాలుడు కమ్మని శప్తు డయిన త్రిశంకుతో యజ్ఞం చేయించి అతనిని స్వర్గానికి పంపాడు. కాని, సంప్రదాయాల కంతా విరుద్ధంగా విప్లవం రేపిన విశ్వామిత్రుని శిష్యుడు త్రిశంకువుకు, ఈ సంప్రదాయ శరణుడయిన ఇంద్రుడు, తన సంస్థానంలో స్థలం ఇవ్వలేదు. త్రిశంకువు తలకిందుగా "భో!" అని అరుస్తూ భూమిపై పడ్డాడు. ఆ ఆర్తనాదం విని కరుణామయుడైన విశ్వామిత్రుడు అతనికి ఒక "పాకిస్తాను" నే నిర్మించాడు; నూతన జగత్తునే సృష్టించాడు. కొబ్బరిచెట్టుకు మారు ఈతచెట్టును సృష్టించాడు; ఆవుకు మారు గేదెను సృష్టించాడు. విశ్వామిత్రుడు చేసినదే సరి అన్నట్టు కొబ్బరిచెట్టునుంచి కూడ కల్లే తీస్తున్నారు. విశ్వామిత్రుడు గేదెను సృష్టించడానికి కారణం అతనికి ఆవుపై కలిగిన ఒకానొక తిరస్కారభావమే.

వశిష్ఠ మహాఋషి తన వద్ద ఉన్న నందినీధేనువును విశ్వామిత్రునికి ఇవ్వలేదు. విశ్వామిత్రుడు కోపంతో ఆవుకన్నా ఎక్కువ పాలిచ్చే గేదెనే సృష్టించాడు. విశ్వామిత్రుడు మైసూరువాడే అయి ఉండాలి. అందువల్లనే ఇక్కడ గేదెలు ఎక్కువ. ఈ దేశానికి గేదెల దేశమని పేరు.

మనలో కొంచెం బుద్ధి మందగించిన వారిని "గేదెపాలు తాగినవారు" అని పరిహాసం చేస్తారు. పాలు తెలుపో నలుపో అనే విషయం మనదేశంలోని పెక్కు పల్లెల వారికి తెలియదు. పాలు ఆవునుంచి వస్తుందన్న సంగతి కూడ అనేకులకు తెలియదు. మా వూరినుంచి కొడగుకు ఒకమారు బస్సులో వెళ్లుతున్నాను. బస్సు ప్రయాణికులలో ఒక స్త్రీ ఒక పసిపాపను ఎత్తుకొని కూర్చుంది. పసిపాప చచ్చేలాగవుంది. పది పదిహేను దినాలుగా జ్వరం వస్తున్నదని ఆమె మరొక ప్రయాణికునితో చెబుతూంది. మధ్యాహ్నం ఒంటిగంటకు మండుటెండలో బస్సు ఒక పల్లెముందు ఆగింది. తల్లి ఎత్తుకున్న పసిపాప నెమ్మదిగా చిన్నగొంతుతో ఏడువసాగింది. దాని గొంతునుంచి ధ్వని వెలువడడమే కష్టమైంది. తల్లి దానికి కొంచెం పాలు తగిలించాలనుకొని, పైనపెట్టిన బుట్టను కిందికి దింపుకొంది. బుట్టలో ఒకసీసాలో పోసిపెట్టిన పాలు ఒలికి బుట్టలోని గుడ్డలు తడిసిపోయాయి. పాలు పూర్తిగా ఒలికి పోయాయి. పసిపాప ఆకలితో చచ్చేలాగ అరుస్తూ చేతులు కాళ్లు కొట్టుకోసాగింది. మాకేమో, పాలులేకుండా ఆ పసిపాప చచ్చిపోవడం తప్పదనిపించింది. ఆ పల్లెలో ముప్ఫయి ఇళ్లున్నాయి. మేమందరం దిగి పాలకోసం ఊళ్లోకి పోయాము. ముప్ఫయి ఇళ్లూ కనుక్కున్నాము. సేరుపాలుకు రూపాయ ఇస్తామని కూడ అన్నాము. అయినా, పాలు దొరకలేదు. ఒక్క ఇంట్లోనన్నా పాలు పితికే ఆవుగాని, గేదెగాని లేదు. ఆ పల్లెవారు నెలకు ఒక్కరోజయినా మజ్జిగ పోసుకొనేవారు కాదు.

ఇలాటి దేశంలో "గేదెపాలు తాగితే బుద్ధిమందం. ఆవుపాలు తాగు." అని చెప్పడం, పొట్టకు అన్నం ఒదిగించే చైతన్యం లేనివాడి పాపకు "శక్తి రావడానికి గ్లూకోస్, ఓవల్టీన్ సేవించు" అన్నట్టు వుంటుంది. వశిష్ఠుడు శ్రీమంతుల (అరిస్టోక్రాట్) వర్గానికి చేరినవాడు. ఆయన గోవు నందినీధేనువు యజ్ఞానికి పాలు, నేయి ఒదిగిస్తుంది. అయితే దాని పాలు అందరికీ చాలదు; గోవుపాలు అత్యంత సాత్వికం, వశిష్ఠఋషిలాగే. మేనక నృత్యం చూసి ముగ్ధుడై ఇంద్రియాలమీదిపట్టు సడలి, ఆమెతో పదిసంవత్సరాల పాటు విలాసంతో గడిపి "నీవు ఇక్కడికి రావడం నిన్ననే కదూ!" అని ఆమెను అడిగిన రసికత, వేడి, రాజసం వున్న రాజర్షి సృష్టి గేదెపాలు. వశిష్ఠుని ఎదుట నూరు మంది మేనకలు నూరు భావభంగిమలతో నూరుసంవత్సరాలు గంతులు వేసినా ఆ మోడు చిగిరించేది కాదు. అయితే, మానవుడే అయిన విశ్వామిత్రుడు మేనకకు మనసు అప్పగించాడు. అదే రాజస గుణం. కలియుగంలో ధర్మానికి మూడుకాళ్లు లేవన్నట్లు సాత్విక గుణానికి స్థానమే లేదు. అది రసం అయితే తామసగుణం అవసరంలేదు; అది విరసం. కావలసింది సమరసం. అదే రాజసం. కాఫి ఈ రాజసగుణానికి గుర్తు. అది కృతయుగం



నాటి అమృతంవంటి సాత్త్వికవస్తువూ కాదు. కలియుగపు కల్లు సారాయిలాంటి తామస వస్తువూ కాదు. కలియుగ నాగరికత పరాకాష్ఠ కాఫి. స్వాభావికంగానే ఋషి అయిన విశ్వామిత్రునికి ఈ రహస్య భవిష్యత్తు తెలిసింది. అతడు రాజసమైన కాఫికి అనుగుణమైన రాజసమైన గేదెలను సృష్టించాడు. గేదెపాలు చేరని కాఫి కాఫియే కాదు; స్వర్గలోకంలో కాంగ్రెస్ మంత్రి మండలాలు వచ్చి ఎక్కడ బడితే అక్కడ మధ్యనిషేధ శాసనం జారీ అయింది. అమృతాన్నంతా ఉగ్రాణంలో వేసి "సీలు" చేశారు. అమృతపానంతో మత్తులు కావడంలో నిరతులవుతున్న ఇంద్రాదులు కూడ గుట్టుగా గేదెపాలు తెప్పించి కాఫి చేయించుకొని తాగి కొంచెం సంతుష్టి పొందారట.

ఇలాటి పూర్ణపురుషుడైన విశ్వామిత్రునినుంచి ప్రతి జగత్తుగా సృష్టి అయినందువల్లనే గేదె మొదలు జగత్తులోని ఆవుకన్నా హెచ్చు బలంగా ఉంది. హెచ్చు మోటు. హెచ్చు నలుపు. హెచ్చు లావు. పాలూ హెచ్చు. వెన్నా హెచ్చు. ఇటువంటి ప్రాణి పాలు తాగేవారికి బుద్ధి మంకు అని చెప్పేవారి బుద్ధిని ఏమని అంటాము? మన మైసూరువారి బుద్ధి మంకా? వీరిని చూడగానే వీరు గేదెపాలు తాగారనేది తెలియదూ? గేదెపాలు తాగేవారి బుద్ధి సంగతి అలా ఉండనీ. స్వతః గేదె బహు చురుకైన తీక్ష్ణబుద్ధి గల ప్రాణి. గేదెను అనుసరించి దాని జతలో తిరుగులాడేవారికి ఇది తెలుస్తుందే కాని ఎక్కడో దూరంనుంచి, దాని నల్లటి శరీరం చూచేవారికి ఖండితంగా తెలియదు. బుద్ధి సంగతి ఒక్కటే కాదు. గేదెకు మాటలుకూడ అర్థమవుతాయి. ఒక్క ఉదాహరణం వినండి.

మాయింటి గేదె-ఇది సాధారణంగా దూడను ఈనడం అంటే, నిలబడే దూడను బయటికి తోసివేసేది. అలాటి మోటు ప్రాణి! కడుపు లోపలినుంచి వెలుపలికి వచ్చే టప్పుడే, అలాటి తన్నులాటతో, రభసంతో భూమిమీదపడిన కొత్త లేదూడ పాపం తెప్పరిల్లి కొనడానికే రెండు మూడు గంటలు పట్టేది! ప్రపంచమేమీ సుఖంలేదు. ఇక్కడ తన్నులే జాస్తి. తల్లి తండ్రి అన్న తమ్ముడు భార్య కొడుకు అందరూ ఒకరి నొకరు తంతారు, కొడతారు. జగత్తుకు రావడం సుఖంకోసం కాదు అని ఆ బడుగు లేదూడకు జగత్తుకు వచ్చేటప్పుడే తెలుస్తుంది. పో! నీ పాపాలకు అక్కడ అనుభవించు-అని తనను తెచ్చి బయటికి తోసినట్లయి దూడ భూమిమీద రెండుగంటలు పడివుండి ముందు రాబోయే కష్టాలకు సిద్ధమవుతుంది. ఈ విధంగా రెండుమూడుసార్లు దూడను తోసివేయడంచూచి నా పని మనిషి తూరడు "ముందుసారి దూడను తోసివేయడానికి వదలగూడదు. గోనెసంచి పట్టుకొని దూడను ఆదుకోవాలి." అన్నాడు. గేదె ముందుసారి చూలై ఈనే కాలము వచ్చింది.

ఆదినం ఉదయం తూరడు నాతో "ఈరోజు సాయంకాలం గేదె దూడవేస్తుంది." అన్నాడు. ఆ విషయం వాడికి బాగా అనుభవం. ఈ విషయాలు వీడికి ఇంత ఖండితంగా ఎలా తెలుస్తాయని నేను పెక్కుసార్లు ఆశ్చర్య పడ్డాను. తూరడు గేదెకు వినపడేట్టు

"ఉండు. నీకు చేస్తా. దూడను తోసి పడేస్తావా?'' అన్నాడు. నాతో "గోనెసంచి పట్టుకుని ఆడుకోవాలి" అన్నాడు. ఆ మాటవిని గేదె సర్రుమని ఒకసారి నావైపు తిరిగింది. ఆ చూపుచూసి నేను ఎగిరిపడ్డాను. ఒకరిని మీరు మనస్సులోనే తిటుకొంటూ పోతున్నప్పుడు అతడు మీ ఎదుటవచ్చి నిలబడితే ఎలా అవుతుందో అలా అయింది. ఆ క్షణంలో ''దీనికి బుద్ధి వుంది. మాటలూ అర్థమవుతాయి; చెవులూ వినబడుతాయి.'' అనే భావం కలిగింది. దీనివల్ల నా మనస్సులో ఎల్లెల్లో అయింది. వెనకటికి హాలివుడ్ సినిమాతారలు నీగ్రో పురుషులను పురుషులుగానే పరిగణించక వారి ఎదుట అస్తవ్యస్తంగా దుస్తులు ధరించి అంతఃపురాలలో తిరుగాడుతూండే వారట. నీగ్రోలు నాగరిక జనాంగం అని అయిన తర్వాత వారికి చాల ఇబ్బంది కలిగిందట. నా విషయమూ అలాగే అయింది. గేదెకు మాటలు అర్థంకావని దాని ఎదుట మనస్సుకు వచ్చినది వదరుతున్న నాకు నా గేదె చూపు చూచి గాబరా అయింది. గేదె ''కాసీ'' అన్నట్లు నా వైపు చూచింది. ఆ చూపు దాని మోరలో చూడడం ఒక్క క్షణం. మరుసటి క్షణం గేదె తన మోరను మరొక వైపు తిప్పుకొంది. దాని కళ్ళలో నాకు ఆ మొదటి తేట చూపు ఇప్పుడు కానరాలేదు.

సాయంకాలం అయింది. గేదెకు నొప్పులు ఆరంభమయ్యాయని తూరడు సూచించాడు. గేదె నిలబడే వుంది. "ఇది పడుకొని దూడను ఈనదు. ఇదే దీని చెడ్డ చాలు'' అన్నాడు తూరడు. మేము గేదె నిలబడిన దిక్కునుంచి సుమారు ఒక బార అవతలగా ప్రాయశః దూడను ఇక్కడికి తోసివేయవచ్చు ననుకొని, గోనెసంచి ఆ కొస ఈ కొస పట్టుకొని, నిలబడ్డాము. గేదె ఒక బార కుడివైపునకు తన పృష్ఠభాగాన్ని తిప్పుకొని నిలబడింది. మేము సర్రున గోనెసంచితో దాని వైపునకు దూకి నిలబడ్డాము. గేదె వెంటనే ఎడమ వైపునకు తన వెనుక భాగాన్ని తిప్పింది. మేమూ గోనె సంచితో దూకాము. గేదె నిమిష నిమిషానికీ తిరుగసాగింది. మేము నిమిష నిమిషానికీ ''కొక్కు'' ఆటలో లాగ (కోతి కొమ్మంచి ఆటలో లాగ) దూకసాగినాము. సర్కసులో పైన ఒక ఆటకాడు తన పనితనం చూపుతున్నప్పుడు వాడు చేతులు కాళ్లు జారిపడుతాడనే భయంతో కింద పదిపదిహేనుమంది జంబుఖానా పట్టుకొని వాడి పక్కకే తిరగడం మీరు చూచారు. మాకూ, గేదెకూ కలిగిన స్పర్ధ ఈలాటిది. రానురాను గేదె నిమిషానికి రెండుసార్లు తిరగడం ప్రారంభించింది. అది ఆ వినోదంలో దూడను ఈనుదామనే విషయాన్నే పూర్తిగా మరచిపోయినట్టు తోచింది. ఈ పరుగులాటలో గేదెకన్నా మాకే ఎక్కువ అలసట అయి పొత్తికడుపు, పక్కలు కదలిపోయాయి. గేదె ఈ వినోద చేష్టల నవ్వుతో మరొకమారు నా వైపు చూచింది. ఇది ఇప్పట్లో దూడ వేయదు. ఇక గంట తాళి వద్దామనుకుని నేనూ, తూరడూ గోనెసంచిని ఒక మూలలోపెట్టి లోపలికి వెళ్లాము. ఒక్క నిమిషంలోపలే కొట్టంలో దప్పుమని సద్దయింది. పోయిచూస్తే గేదె తన పూర్వపు పద్ధతి లాగానే నిలబడే రెండుబారలకు అవతలగా దూడను విసిరికొట్టింది,

ఈ విధంగా తనను అవమానం చేసినందువల్లనోఅన్నట్టు ప్రతిసారీ ఏ ఇబ్బంది లేకుండా పాలు ఇస్తున్న గేదె, ఈ దూడను ఈనిన తర్వాత పాలు పితకడానికిపోతే తన్న



డానికి ప్రారంభించింది. అప్పుడు దానికి తౌడు, గానుగపిండి, పత్తిగింజలు మొదలయిన తినుబండారాలను రెండు పొద్దులూ పాలుపిండే వేళకు పెట్టసాగాము. తినుబండారాలను తన ముందు పెట్టినప్పుడు గేదె "తీసుకొనిరండి. మీరేమో పరోపకార దృష్టితోను, గోసేవా బుద్ధితోను తీసుకొని రావడంలేదు. నా పాలు మీకు కావాలి. దానికోసం ఇవన్నీ తెస్తున్నారు.'' అనేటట్టు మావైపు చూచేది. ఉదయపు కాఫీ మనకు ఎలా సకాలానికి కావాలో ఆలా గేదెకు తిండి సకాలానికి కావలసివచ్చింది. ఒకదినం ఈ తినుబండారాలు పెట్టి పాలు పితకడంకోసం నా భార్య రావడానికి ఉదయం పదిగంటలయింది. "ఇంతపొద్దు ఎందుకయింది? పొద్దుకావడానికి ముందే పితకడానికి ఏమిటి? ఇప్పుడు ఇస్తుందా?'' అన్నాను. నా భార్య "ఇవ్వక, దాని కేమి రోగం? కడుపు పగిలేట్టు తిండి తినడంలేదూ?" అన్నది. గేదె ఒకసారి సర్రుమని దానివైపు చూచింది. ఆ చూపులో ఆ నాటి పాత తెలివి కనిపించింది. గేదె భాష నాకు అర్థమైంది. నా భార్య దాని పొదుగును ఎంత సాగదీసినా గేదె చేపలేదు. ఇనప పుటికలోని తిండి అంతా ముగిసింది. "తిండి కొట్టివేయడానికి ఇది మంచి అభ్యాసం చేసుకొంది. పాడు ముండా గేదె!'' అనుకొని నా భార్య మరొక పుటిక తిండి తీసుకుని రావడానికి లోపలికి పోయింది. ఆమె లోపలినుంచి తిండితెస్తున్నప్పుడు గేదె మరొకమారు చురచుర చూసింది. "తీసుకొని రండి. తెండి. లేకపోతే మీరు తెస్తారా?'' అన్నట్టు కళ్లు మిటకరించింది. "ఇది ఈ ఉపాయం కనిపెట్టకుండా ఊరికే సాధువై పాలు యిచ్చివుంటే మీరు ఇలా నిత్యమూ దీనికి ఇరుపొద్దులా తినుబండారాలు పెడుతారా?'' అని నేను నవ్వాను. ఇట్లని గేదెకు తిండి రెండుసార్లు పెట్టవలసి రావడంవల్ల అప్పటినుంచి నా భార్య గేదెకు సకాలంలో తిండిపెట్టి పాలు పితుక్కొనేది.

ఈ గేదెను సాధారణంగా నా భార్యే పితికే అలవాటు ఉండేది. ఒకసారి ఆమె ఎనిమిది రోజులపాటు నరసీపురం రథోత్సవానికి వెళ్ళింది. నేనే తిండి కలిపి గేదె వద్దకు తీసుకొని వెళ్లాను. తూరడు "గానుగపిండి చాలదు. ఇంకొక పిడికెడు రాగిపిండి వేయండి'' అన్నాడు. నేను "సరిసరి. జనానికి తినడానికి రాగులు లేవు; హనుమంతుడు పగ్గాలు మేస్తుండగా, పూజారి సేమియాలు కోరినట్లయింది. నడు. చాలు.'' అన్నాను. గేదె తిండి తీసుకొనిపోయి గేదె ముందుపెట్టి నేనే పాలు పితకడానికి కూర్చున్నాను. గేదె ఒక్కసారి తిండి మూచూచింది. నేను పాలు పితకడానికి చేతిలో పట్టుకున్న పాత్రను కిందికి పడేటట్టు ఫెడీమని తన్నింది. నేను తూరడితో "నీ మాట నిజం. దీనికి రాగుల పచ్చి పిండిరసం పళ్ళల్లో దిగి అలవాటయింది. మరికొంచెం పచ్చిపిండి వేసుకొని మరొక గడియతాళి వద్దాము. అంతా చెడ్డ అలవాటు'' అని లోపలికి వచ్చాను. మళ్ళీ తిండి సరి చేసుకొని పోవడానికిముందే తూరడు "దీనికి అమ్మగారు దూడవచిలే అలవాటు. మీకు పాలివ్వదు. ఖండితంగా తంతుంది.'' అన్నాడు. అప్పుడు నేనొక ఉపాయం చేశాను. దీనిని చదివే పాఠకులు నవ్వవలసిన అవసరం లేదు. నా భార్యచీర ఒక్కటి ఒంటినిండా కప్పు కొని గేదెముందు కూర్చున్నాను. గేదె ఈ మోసంలో పడిపోయింది. పాలు యిచ్చింది. ఇలా నేను ఐదారునాళ్లు అభినవ సైరంధ్రి అయి, రాగిపిండి గానుగపిండి పూరావేసి పాలు

పితికేవాడిని. నా భార్య తిరిగి రావడం రేపనగా, నేను గేదె ముందు పాలు పితుకుతూ కూర్చున్నాను. తూరడు "అవయితే వాసనపట్టి తన్నివేసేది. ఇది గేదెజాతి. దయ్యామంత ముండ. బుద్ధిలేదు." అన్నాడు. నేను నా భార్య గొంతులాగ గొంతు పెట్టుకొని "దీనికి బుద్ధి వుంది" అన్నాను. గేదె తన్ననే తన్నింది.

ఈ గేదెకు ఒక మారు జబ్బుచేసింది. తూరడు ఆవులన్నింటిని మేయడానికి కొండకు తోలేవాడు. "గేదెను తోలవద్దు. పశువుల ఆస్పత్రినుంచి మందు తెప్పించి పోస్తాను." అన్నాను. ఆ మాటలు అక్కడే నిలబడివున్న గేదెకు వినిపించి ఉండాలి. మేము లోపలికి పోయినప్పుడు గేదె తలుగు తెంపుకొని కొండకు పరిగెత్తింది. ఈ గేదెకు రాగి అంబలి చాల ఇష్టం. జబ్బు పడినప్పుడు కూడ వేరే గడ్డి తింది ముట్టకపోయినా, ఇది రాగి అంబలి మాత్రం ఎప్పుడూ తాగుతుంది. దీనికి జబ్బులు చేసినప్పుడు "దీనిని పట్టుకుని, గొంతులోకి గొట్టం పోనిచ్చి, మందుపోయడం కష్టం. అంబలిలో కలిపి యిద్దాము" అన్నది, నా భార్య. మొదటిసారి అలాగే చేసి గేదెముందు పెట్టాము. అది ఏమీ తెలియని ప్రాణిలాగ ఊరికే అంబలి తాగివేసింది. ఆ సాయంకాలం పశువుల వైద్యులు ఇంటికి వచ్చి గేదెను చూచారు. "దీనికి మందు ఎలా తాపుతారు?" అని అడిగారు. తూరడు "అంబలితోపాటు తాగుతుంది." అన్నాడు. ఆ మాటలు గేదెకు వినిపించాయి. ఆ సంధ్యాకాలంనుంచే అది అంబలి తాగడం మానేసింది. మరుసటిరోజు ఉదయం వచ్చిన వైద్యులు "దీనికి మందు తాపించే తీరాలి" అన్నారు. అప్పుడు గేదె పడుకొనివుంది. తూరడు "పడుకున్నప్పుడు కాళ్ల కట్టి గొట్టంతో పొయ్యాలి." అన్నాడు. గేదె లేచి నిలబడింది. తూరడు ఇంట్లో ఉన్నంతవరకు అది పడుకుంటూనే ఉండలేదు. హుషారుగా లేకపోయినా నిలబడే ఉండేది. తూరడు పదకొండుగంటలకు పశువులను కొండకు తోలుకొని పోయిన మీదటనే అది పడుకునేది. అనంతరం తూరడు కొండనుంచి సాయంకాలం వచ్చిన తర్వాత, తక్కిన పశువులన్నీ లోపలికి వచ్చిన వెంటనే నిలబడేది. రాత్రి మేమంతా పడుకొన్న తర్వాత పడుకొనేది. తెల్లవారి మా ముఖం చూచిన వెంటనే లేచి నిలబడేది.

ఈ విధంగా మా గేదె మా యింట్లో ఒక అదృశ్యశక్తి అయింది. భగవంతుడు కళ్ళకు కనిపించక పోయినా, మన పనులపై తన ప్రభావాన్ని ప్రసరింపజేస్తున్నట్టు గేదె మూక ప్రాణి అయినా, మా ఆచరణకు మాటలకు ఒక విధమైన అంకుశమైంది. ఆ గేదె మాత్రమే కాదు. ఏ మూకప్రాణి ఎదుటా మనస్సుకు వచ్చినట్టు మాట్లాడ్డం అంటే మాకు భయమైంది. ఎందుకంటే, ఏ ప్రాణికి ఏ శక్తి ఉందో తెలిసినవా రెవరు? ఇలా ఉన్నప్పుడు గేదెకు బుద్ధిలేదని చెబితే నమ్మడానికి అయ్యానా? ఆ గేదెపాలు తాగిన మమ్ములనే చూడండి!

# 20. టైగర్ వరదాచార్యులు

## మైసూరు వాసుదేవాచార్

"గురువుగారూ!"

"............"

"గురువుగారూ! తమకు ఒక విజ్ఞాపన; తమరు అసమాధాన పడకుండా ఉండే పక్షంలో...."

"ఈ ద్రావిడ ప్రాణాయామం అవసరం లేదు. విషయం ఏమిటి అనేదాన్ని నేరుగా, సంకోచం లేకుండా చెప్పి వేయవచ్చుగదా!"

"తమరు పెట్టుకొన్న టోపీ తమకు అంతగా నప్పడంలేదు గురువుగారూ. దయచేసి దానిని తీసివేయడం జరగనీ.

"దీనిని చెప్పడానికి ఇంత మీనమేషాలు ఎంచుతున్నావా? మంచి భూపతివే నీవు! ఈ తలమీద ఆ సాక్షాత్తు దేవేంద్రుని సువర్ణఖచిత కిరీటాన్నే తీసుకొనివచ్చి పెట్టినా ఇంతే వాళ్లు, కవయ్యా! బ్రహ్మసృష్టే అలా ఉన్నప్పుడు, పాపం ఆ టోపీ తప్పేముంది? వాళ్లు, వీళ్లు టోపీవేయడానికి ముందుగానే మనమే టోపీ వేసుకోడం మేలుకదా! ఉండిపోనీ, వదలిపెట్టు."

వరదాచార్యుల స్థూలకాయంమీద ఆ చిన్నటోపీ విచిత్రంగా కనిపించేది. అందరి పెదవులమీద నవ్వు పుట్టించేది. వరదాచార్యులకు ఈ సంగతి తెలియకుండా ఉండలేదు. స్వయంగా రసికులు, హాస్యప్రియులు; తమను తామే హాస్యం చేసుకోడానికీ ముందు వెనుకలు చూచేవారు కారు. శిష్యుణ్ని చెనకి వినోదం పొందాలనే ఉద్దేశంతో పట్టిన పట్టు వదలక టోపీకి తలమీద స్థిరమైన స్థానం కల్పించారు. వరదాచార్యుల శిష్యులకూ మిత్రులకూ, ఏమీ తోచనట్లయి, నా వద్దకువచ్చి తమ సంకటాన్ని వెళ్ళబోసుకొన్నారు. "మీరు వారికి పరమ మిత్రులు. మీ మాటకు వారెప్పుడూ బదులు చెప్పరు. ఏమైనా, ఎలాగైనా ఆ టోపీ వారినుంచి విడదీయించండి. పుణ్యం కట్టుకోండి" అన్నారు. "చూద్దాం. భగవంతుడున్నాడు" అనుకున్నాను.

ఒక సాయంకాలం; సుమారు ఏడుగంటల సమయం. నా స్నేహితుల చిన్న గుంపొకటి చేరింది నాయింట్లో. వారి కోరిక మేరకు కొంచెము కాంభోజిరాగం ఆలాపన చేసి, మధ్యమకాలం పాడుతున్నాను. ఆవేళకు సరిగ్గా వరదాచార్యులు టోపీతోసహా ఏతెంచారు; పాడడం ఆపాను. "అన్నా! నేను చేసిన అన్యాయమేమిటి? నా చెవుల్లోనూ వేయండి కొంచెము మీ సంగీతాన్ని" అని బలవంతంచేశారు. సుమారు ఎనిమిదిన్నర గంటలవరకు

పాడాను. "బ్రహ్మానందమైంది. అన్నా ఏమి ఇవ్వను మీ ఈ భవ్యమైన సంగీతానికి" అన్నారు. ఇదే సరైన సమయమని, గ్రహించి, "నేను అడిగింది లేదు అనగూడదు మీరు" అన్నాను. "ఏమి కావాలి, చెప్పండి" అన్నారు. "మీ ఆ టోపీని దయచేసి అను గ్రహించండి." అన్నాను. అందరూ విరగబడి నవ్వసాగారు. విడుగడ పొందిన ఆటోపీకి పరమానందం అయివుండాలి!

ప్రపంచంలో గోముఖ వ్యాఘ్రాలు సామాన్యం. అయితే వ్యాఘ్రముఖగోవులు అతి విరళం. వరదాచార్యులను "టైగర్" అని పిలవడం వాడుక. వారి ఆకృతి, వారి నడక, వారు పాడేటప్పుడు చేస్తున్న అభ్యాసబలంతో వచ్చిన అంగవిన్యాసాలు-వీటివల్ల జనం వారిని "టైగర్" అని సంబోధిస్తూ వచ్చారు. వరదాచార్యులకు అదీ ఒక వినోదమే అని పించింది. "టైగర్" అనేదానికి తోడు "లయన్" అనీ చేర్చి "టైగర్ లయన్ వరదా చార్య" అని తమ లెటర్ హెడ్‌లో అచ్చు వేయించి, హాస్యప్రవాహంలో జనంతోపాటు తామూ చేరారు! నిజానికి వరదాచార్యుల పాటలో గండుపులి ఠీవి వుండేది. గాంభీర్యం ఉండేది. ఆ దృష్టితో "టైగర్" అనే అడ్డపేరు వారికి ఒప్పేది. పసిపాప హృదయంవంటి తేట హృదయం వారిది. తెరచిన హృదయంలో, ఎలాటి మరుగు మూతలకూ ఎడంలేదు. చాల ఉదార స్వభావం వారిది. ఇతరులు పన్నే కపటం, కుతంత్రం, పన్నాగం నిమిషార్ధంలో కనిపెట్టే సూక్ష్మబుద్ధి వారిది. కాని, వారు మాత్రం ఏనాడూ, తమ బుద్ధిని ఆ కుమార్గా లలో పోనిచ్చేవారుకారు. అసూయాపరులు కారు. చిన్నదానిలోను పెద్దదాన్ని చూసే పెద్ద గుణం వుండేది వారిలో.

వరదాచార్యులకు శారీర సౌలభ్యం ఉండలేదు. అందువల్ల సముద్రమంత విశాలమైన వారి భావనా విశేషాలలో కొన్నంటే కొన్నే వెలుపలికి వచ్చేవి. ఆ కొన్నీ ఆణిముత్యాలే! వారి నోటినుంచి వెలువడుతున్న రాగాల స్వరాల చిటకాలలో కళాకౌశలం తొణికిసలాడేది. తమ అపారమైన మనోధర్మాన్ని విరజిమ్మడానికి ఆటంకమైన తమ శరీరాన్ని శపించే వారు. పాడడానికి ముందు కుతకుతలాడే వేడినీటిని గొంతులో పోసుకొనేవారు! ఏమి చేసినా శారీరం స్వాధీనానికి వచ్చేదికాదు. "జన్మాంతర పాపకర్మ ఫలం" అని తమను తామే నిందించుకొనేవారు. "తంబూరాశ్రుతి పెట్టుకొని పాడిందే అపురూపం. కూర్చున్న చోట, నిలబడినచోట, తోచిన దానిని తోచిన రీతిగా పాడుతూ వచ్చాను అన్నా. ఇప్పుడు చూడండి ఆ పరిణామాన్ని. తంబూరా చెప్పినట్టు శారీరం వినడం అలా ఉండనీ; శారీరానికి తంబూరాను సరిచేసుకోవలసిన పరిస్థితి వచ్చింది" అనేవారు. వరదాచార్యుల సంగీత రుచిని అనుభవించడం అందరి పాలికీ వచ్చింది కాదు. వెర్రివాగువంటిది వారి సంగీతం. పది పన్నెండు కచ్చేరీలను ఓర్పుతోవింటే, ఎప్పుడో ఒకసారి వారి అన్యా దృశమైన పాండిత్య ప్రతిభల అనుభవం లభించేది! నిజంగానూ అది దేవయోగ్యమైన సంగీతమే అయివుండేది. ఆ కారణంవల్ల వరదాచార్యుల సంగీతపు పెంపు జనసామా న్యానికి సకాలంలో అభివ్యక్తం కాలేదు. చాలకాలం వారు అజ్ఞాతవాసంలోనే గడపవలసి వచ్చింది.



"మైసూరు వదలి రానని భీష్మప్రతిజ్ఞ చేశారా ఏమిటి? నా కోసమైనా కొంతకాలం మద్రాసుకు వచ్చి వుండరాదూ?" అని లెక్కలేనన్నిసార్లు నాతో అంటూవుండేవారు. ఆఖరు రోజులలో నయితే నిష్ఠురపు మాటలే అనేవారు. "నీ తలవ్రాతకు ఎవరేమి చేసేరు?" అని కూడ నన్ను బెదరించారు. ఇప్పుడు నేను మద్రాసులో స్థిరపడడానికి చాలమట్టుకు కారణ మైన వారెవరంటే టైగర్‌గారే. ఇటీవల కొన్ని సంవత్సరాలక్రితం కళాక్షేత్రంలో ఏర్పాటుచేసిన ఒక సంగీతోత్సవంలో పాల్గొనడానికి నాకొక ఆహ్వానం వచ్చింది. ఇది వరదాచార్యుల కైవాడడమేననేది క్షణమాత్రంలో నాకు విశదమైంది. ఆహ్వానం అంగీక రించి మద్రాసుకు నేను వెళ్ళినప్పుడు వారికి కలిగిన ఆనందాశ్చర్యాలు అంతింతకావు. తోడబుట్టిన వారిలోనూ అంత అన్యోన్యప్రీతి విశ్వాసాలు ఉంటాయా అనే సందేహం నాలో ఉద్భవించింది. వరదాచార్యులను కలుసుకొనడానికి నేను కళాక్షేత్రానికి వెళ్ళినప్పుడు అపరాహ్ణం సుమారు నాలుగుగంట లుండవచ్చు. వరదాచార్యులు శ్రీమతి రుక్మిణీదేవిగారికి ఏవో రాగలక్షణాలను ఉదాహరణ పూర్వకంగా తెలుపుతున్నారు. నేను వచ్చిన సంగతిని కళాక్షేత్రపు అధికారవర్గంలోని వారెవరో వారి చెవిలో వేశారు. పాఠ ప్రవచనాలకన్నిటికీ వెంటనే విరామమిచ్చి దడదడా లేచి, వెలుపలికి వచ్చి, దీర్ఘదండప్రణామం చేసి, రెండు చేతులతోను కౌగిలించుకొని, "అన్నా, నేడు మా భాగ్యోదయమైంది! ఇప్పటికైనా ఈ పామరుని మీద కరుణ కలిగిందికదా!" అని మనసు కరిగేటు అన్నారు. హృదయం నిండిపోవడం వల్ల నానోటినుంచి మాటలే వెలువడలేదు. ఎంతటి ఘన విద్వాంసులలో ఎంతటి సరళమైన మనస్సు! అనుకున్నాను. కనుకొలకులనుంచి జారిన నీటిబొట్లతో కృతజ్ఞత సూచించాను. "బహుకాల ప్రయత్నం ఫలించి, అమృతపాత్రను మీముందు తెచ్చి పెట్టాను. దానిని దక్కించుకోడం, వదలుకోడం మీ ప్రయత్నం, మీ జవాబ్దారీ" అన్నారు. కళాక్షేత్రంలో వున్న ప్రతి ఒక్క విద్యార్థిని, అధికారులను, పిలిపించి నమస్కారం చేయించి, వారికి పరిచయిం చేయించే నెపంతో నా విషయంలో నా యోగ్యతకు మించిన, ప్రశంసే చేశారు. నేను ఎంత అంగలార్చి అడుకున్నా వారి ఉపమానోపమేయ ప్రవాహం అడ్డులేకుండా సాగింది. ఇక వుండలేక అప్రయత్నంగానే కళాక్షేత్రం వదలి, సంకోచంతో బసకు వెనుదిరిగాను.

మరుసటిదినమే సంగీతోత్సవం ప్రారంభమైంది. టైగర్‌గారిదే మొదటి కచేరీ. కచేరీ జరుగ వలసిన ఆ సుందర కళాభవనంలోని ఏర్పాట్లు చాల ఉత్తమంగా ఉన్నాయి. ఎంతటి అరసికునికైనా, రసికత కలిగించేటంత సొగసుగా ఉన్నవి. నిండు సభైనా, సూదిపడినా వినిపించేటంత నిశ్శబ్దత. వేదికముందు కూర్చున్న ప్రతివిద్యార్థిముందు ఒక్కొక్క చిన్నబల్ల, వ్రాత సామగ్రి వున్నవి. "ఈ ఏర్పాటు ఉద్దేశం ఏమిటి?" అని అడిగాను. "పాటకచేరీ విషయంలో విద్యార్థులు తమ అభిప్రాయాలను, తోచిన విశేషాంశా లను, పొడమిన సందేహాలను గుర్తువేసుకొని, కచేరి ముగిసినతర్వాత పాడిన విద్వాం సులతో చర్చ జరిపి జ్ఞానాభివృద్ధి చేసుకొనడం ఇక్కడి పద్ధతి" అని సమాధానం. నూరారు కచ్చేరీలు చేశాను. నూరారు సంగీతసభలను చూచాను. అయితే కళాక్షేత్రపు ఆ సంగీత

కచేరీల పద్ధతిని, గాంభీర్యాన్ని మరెక్కడ నేను చూడలేదు; వినలేదు. వరదాచార్యుల ఆనాటి కచేరీ వైఖరి కేవలం అనుభవ వేద్యమే కాని వర్ణించడం అసాధ్యం. ఎన్నడూ లేని, శారీర సౌలభ్యం లభించింది వారికి. ముట్టినదంతా బంగారం అన్నట్టు పాడిన సంగతి స్వరం అనర్ఘరత్నాలవలె ఉండినవి. ముఖారి రాగాన్ని సుమారు ఒకగంటసేపు పాడి, దాని సారమంతా వెదజల్లి చూపారు. "ఎంత నిన్నె శబరిభాగ్యం" అనే త్యాగరాజకీర్తనను పాడినప్పుడయితే ప్రతిఒకరూ భావలహరిలో మునిగిలేచినట్టు తోచేది. ప్రతి ఒక కచేరీలోను, మధ్యమకాలం పాడేవారు. ఆనాడు కాంభోజిరాగం పాడి, మధ్యమకాలం పాడకనే పల్లవి ప్రారంభించారు. శ్రోతలలో కొంచెము కుతూహలం కలిగింది. "కొంచెము మధ్యమకాలం పాడాలని కోరుతున్నాము" అనికూడా ఒకరిద్దరన్నారు. "మధ్యమకాలం పాడడానికే మరొక మహనీయులు ఆహూతులయి ఉన్నారు. రేపు మీ మనసు అలసిపోయేట్టు మధ్యమకాలం.... వినవచ్చు. మధ్యమకాలం వారిసొమ్ము." అని నావైపు వేలు చూపించి అన్నారు. "క్షమించాలి. అంతపెద్దమాట అనకూడదు. మధ్యమకాలం పాడి పల్లవి ప్రారంభించాలి" అని కోరాను. "ఈ ఒక్క విషయంలో మీమాటను మీరడానికి అనుమతి ఇవ్వాలి" అన్నారు. పల్లవిని కొనసాగించారు. అలాటి విద్వత్సభలో నాకు అంతటి గౌరవం చూపిన నా మాన్యమిత్రులు, ఘన విద్వాంసులు అయిన టైగర్‌గారిని ఆజన్మం కృతజ్ఞతతో స్మరిస్తాను. కళావేత్తలలో అంత నిర్మల హృదయం విరళం!

మద్రాసుకు నేను పోయినప్పుడల్లా నా మిత్రులు సంగీతకళానిధి టి. వి. సుబ్బారావుగారి ఇంటికిపోయి రావడం పద్ధతి. ఒకసారి ఒక స్వారస్యమైన సంగతి జరిగింది. సాయంకాలము ఉపాహారం ముగించుకొని, నేనూ సుబ్బారావుగారూ వారి ఇంటి వసారాలో కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నాము. పట్నం సుబ్రహ్మణ్యయ్యర్, మహావైద్యనాథయ్యర్, తిరుకోడ్‌కావల్ కృష్ణయ్యర్ వీరి శైలివిషయం ప్రస్తావించుకుంటున్నాము. సుబ్బారావుగారి కోరికపై వారి శైలులను, అయినంతమట్టుకు అనుకరణచేసి చూపించాను. క్రమంగా చర్చ వరదాచార్యుల శైలివైపు తిరిగింది. టైగర్‌గారి పెక్కు కచేరీలను విని, మననం చేసుకొన్నందువల్ల వారిని అనుకరించసాగాను. సుబ్బారావుగారు లోలోపల నవ్వుకుంటున్నారు. కంబిడిముసుకులో, తలదాచుకున్న వరదాచార్యులు ఉన్నట్టుండి లేచి, చంకలో చాప చుట్టను, దిండును ఇరికించుకొని, కపటపు కన్నీరు కురిపిస్తూ "సుబ్బారావుగారూ, ఇక మద్రాసులో నాకు స్థలంలేదు. నా ఆస్తినంతా ఈ దొంగ అపహరించుకొన్నాడు. ఎక్కడికైనా పరిగెత్తిపోవడ మొక్కటే మిగిలింది నాకు" అన్నారు. సుబ్బారావుగారు, టైగరుగారు కడుపు చెక్కలయ్యేట్టు నవ్వారు. "క్షమించాలి అన్నా! కేవలం వినోదం కోసం మీలాగ పాడి చూపడానికి ప్రయత్నించాను. అంతే" అన్నాను. వరదాచార్యులు నన్ను బలవంతంచేసి, మళ్ళీ నాతో అదేశైలిలో కొంతసేపు పాడించి వినోదించారు.

టైగరుగారు నన్ను మద్రాసుకు రప్పించుకొనడానికి ఎలా ఆవేదన పడేవారో, ఆ విధంగానే, వారిని మైసూరు సంస్థానానికి పిలిపించి, మహాప్రభువుల కృపా కటాక్షానికి పాత్రులనుగా, చేయాలనే కోరిక నాకు! కళాపోషకులు, స్వయంకళావిదులూ అయిన



ఇప్పటి ప్రభువులు వరదాచార్యులను పిలిపించి, ఆస్థాన విద్వన్మణిగా నియమించిననాడు నాకు కలిగిన ఆనందానికి మేర, మితి, లేవు. మా యిద్దరికీ ఒకే సందర్భంలో ఒకే విధమైన బిరుదులను ప్రభువులు అనుగ్రహించినప్పుడు "ఏ జన్మలోనో ఒకతల్లి బిడ్డలం అయివుండాలి మేము." అని ఒకరినొకరి కౌగిలించుకున్నాము.

టైగర్‌గారికి వేషభాషలమీద దృష్టి అంతంతే. ఎన్నోసార్లు లాల్చిని జేబువీపుమీదికి వచ్చేట్టు తొడుక్కున్నది కూడ కద్దు! లోపల లాల్చి వేసుకోకుండా నల్ల లాంగ్‌కోటు తొడుక్కొన్న సందర్భాలెన్నో. తలపాగా చుట్టిన అభ్యాసమే లేదు. ఎవరో తమ తల కొలతకు చుట్టుకొన్న తలపాగాలో బలవంతంగా తమ తల దూర్చేవారు. అద్దంముందు నిలబడి "ఆంజనేయస్వామినే నమః" అని తమను తామే హాస్యం చేసుకొనేవారు. "ఈ విచిత్రరూపానికి తగిన స్థూలకాయం వేరే" అని ఎగతాళి చేసుకొనేవారు. కూర్చుంటే లేస్తే "అప్పనే, ఆదిమూలనే" అని రాగంతీయడం వారి అలవాటు. చూడడానికి ఎలా వుంటే ఏమి? సరస్వతి వరపుత్రులైన వారి ముఖంమీదవున్న అపూర్వకళ ఎవరికైనా సరే, వారిని చూచిన వెంటనే వారి ఎడల పూజ్యభావం కలిగించేది.

టైగర్‌గారి బాల్య జీవన పరిచయం నాకు అంతగా లేదు. వారుకూడ ఆ విషయమై నాతో ఎప్పుడూ ప్రస్తావించలేదు. వారు 1876 లో చెంగల్పట్టుజిల్లా శ్రీపెరంబూదూరు తాలూకా కొళత్తూరులో జన్మించారు. "త్యాగరాజ హృదయం" అనే గ్రంథం వ్రాసి గాన ప్రేమికుల కందరికీ చిరపరిచితులైన శ్రీనివాసయ్యంగారు వరదాచార్యుల అన్నగారు. సుప్రసిద్ధ వైణిక విద్వాంసులైన కృష్ణమాచార్యులు వారి తమ్ములు.

సేలంజిల్లా కావేరిపట్టణంలో వరదాచార్యులు ఏదో ప్రభుత్వశాఖలో గుమస్తాగా ఉండేవారట. "సర్కారు నౌకరీ వదలి సంగీత ప్రపంచానికి ఎలా వచ్చారు?" అని అడిగినప్పుడెల్ల "అదొక రామాయణం. మరెప్పుడన్నా చెబుతాను. అని వేరేవిషయం ప్రస్తావించేవారు. కాలాడిపేట మాసిలామణి మొదలియారు అనేవారు. ఉత్తమ సంగీత విమర్శకులు, ఫిడేలు విద్వాంసులూ నట. "వారే నన్ను సంగీత ప్రపంచంలో ప్రవేశించేటట్టు ప్రేరేపించారు." అని ఇంతమాత్రం టైగరుగారు అప్పుడప్పుడు చెప్పేవారు. మొదట్లో వరదాచార్యులు నీలకంఠశాస్త్రిలనే వారివద్ద సంగీత శిక్షణ పొందారట. "మా గురువులు అప్పుడప్పుడు తెచ్చూరు సింగరాచార్యులనే విద్వాంసుల ఇంటికి వెళ్ళి వచ్చేవారు. ఆ సందర్భాలలో పట్నం సుబ్రహ్మణ్యయ్యరు వారివద్ద శిష్యులై విద్యాభివృద్ధి చేసుకొనేవారు" అని టైగరుగారు చెప్పేవారు.

మద్రాసు మ్యూజిక్ అకాడెమీ టీచర్స్ కాలేజి మొదటి ప్రిన్సిపాలుగాను, మద్రాసు అణ్ణామలై విశ్వవిద్యాలయాల సంగీత శాఖల ముఖ్యాధికారిగాను, వరదాచార్యులు శ్లాఘనీయమైన సేవ చేశారు. జీవితపు చివరి దినాలను, కళాక్షేత్రంలో గడిపారు. వృద్ధాప్యంలో తమకు ఆశ్రయ మిచ్చి, గౌరవించి, కాపాడిన శ్రీమతి రుక్మిణీదేవిగారి ఎడల వరదాచార్యులకు అపారగౌరవం, కృతజ్ఞత, ఆదరం ఉండేవి. జీవితం ప్రశాంతంగా వున్నందున కళాసేవ నిర్విఘ్నంగా సాగడానికి అవకాశం కలిగింది. పెక్కు వర్ణాలు, కీర్తనలు, తిల్లానలు రచించి కీర్తిపొందారు.

1951 జనవరినెల తుదిదినం వరదాచార్యుల ఇహలోకయాత్ర సమాప్తమైంది.

# 21. వీధి కొళాయి

బి. ఆర్. వాడప్పి

సంఘసంస్కర్త లనే వారంతా మొదట వీధికొళాయి దగ్గరికి వచ్చి అక్కడ జరిగే కార్యకలాపాలను చూడడం మంచిది ! ఎందుకంటే, వీధికొళాయి నిజమైన సంఘదర్శనాన్ని చేయిస్తుంది. వీధికొళాయి అని సంఘసంస్కర్త లయిన మనం అవహేళనం చేసే కారణం లేదు. వీధికొళాయి దర్శనలాభాన్ని ఒక్కమారు పొందడం - అనుభవదృష్టితో చాల అవశ్యం ! అంతెందుకు ! వీధికొళాయి ఈ శతాబ్దపు ఒక మహత్త్వపూర్ణసంస్థ అని అంటే, అరసికులకు దాని యథార్థస్థితి తెలియకపోయినా, రసికులుమాత్రం చిరునవ్వు వెదజల్లకుండ వుండరనే భరోసా నాకు ఉంది. పట్టణాలలో తిరుగులాడే మనకంతా ఇప్పుడు వీధికొళాయి మహిమ ఎంతవుంది అనే విషయం చెప్పి ఇవ్వవలసిన కారణంలేదు. తెల్లవారి లేచి మీ పనికోసం వీధిగుండా బయలుదేరితే, ఎక్కడ లగ్గపట్టి నోటి పెడబొబ్బలు చెలరేగి ఉంటాయో అదే నిశ్చయంగా వీధికొళాయి స్వస్థలం ! స్నేహితులారా ! ఎలాటి అభ్యంతరమూ లేక అక్కడికిపోయి నిలబడింది. ఎన్నోసార్లు ఆ జనుల సందడిలో మీకు కొళాయి దర్శనమూ కాకపోవచ్చు. దాని దరిసెనం కావాలంటే, తపస్సు ఆవశ్యకం ! ఎండవేడికి ముఖంమీద చెమట బిందువులు కురియిస్తూ, కొళాయినీటికోసం కాచుకొని నిలబడిన మహిళలను చూచి పఋవురికి కనికరం పుట్టవచ్చు. వానకాలంతో కొళాయినీరు ధారగా పడుతున్నప్పుడు, తలమీద గోనెపట్టను-కాదుకాదు, దేశీయ ఓవరుకోటును-కప్పుకొని, "తేవక్కా బిందెనూ, నేను నీటికి పోతాను తేవే బిందెనూ" అని బిందె మోసుకొని వీధిగుండ బయలుదేరిన కన్నెలను చూడడం అపురూపం కాదుకదా ?

పట్టణవాసులమైన మనకందరికీ, వీధికొళాయినీళ్ల సంపాదించుకొనడానికి పడవలసిన పాట్లను వట్టి మాటలతో చెబితే తెలియడం సాధ్యంకాదు. వేరే ఊరినుంచి మీ యింటికి అతిథిగా వచ్చినవారికి బిందెయిచ్చి వీధికొళాయికి పంపినప్పుడే తెలుస్తుంది. పట్టణంలోని నిజమైన సుఖసౌకర్యాలరీతి ! మనం ఎన్ని ఇబ్బందులు పడినా, పడుతున్నా వీధికొళాయి మన సంస్కారానికి ద్యోతకం కాదా ? నాగరికులమయిన మనం ఈమాటలను నిరాకరిస్తే, అనాగరికత మనలో తలయెత్తుతున్నదని చెప్పినట్టవుతుంది. అలా చెప్పడం ధార్ష్ట్యం అయ్యాని. సంఘంలో పెక్కు మార్పులు చాల సూక్ష్మంగా జరిగాయి. ఈమార్పులను మనం చూడాలంటే వీధికొళాయి వద్దకు పోయి నిలబడాలి. సాంఘికశాస్త్ర పారంగతులు చెప్పే ఎన్నో మహత్వపూర్ణమైన విషయాలు అక్కడ మనం తెలుసుకోవచ్చు. అక్కడ, ముఖ్యంగా తలనెరసినవారు — ముసలివారు, నడివయసువారు, తరుణులు, పిల్లవారు—వీరందరూ తమ తరాల రాజకీయ, సాంఘిక జీవితాన్నే ఎత్తిచూపుతున్నట్టు



ఉంటుంది. వారివారి మాట పలుకు, నడవడి, వేషభూషలు-మొదలయిన వాటిలో ఎంత వ్యత్యాసం !

నిజంగా మన హక్కులను బాధ్యతలను మనం కాపాడుకొని నిర్వహించగలిగే మొదటిపాఠం నేర్చుకోవాలంటే వీధికొళాయివద్ద నేర్చుకోవాలి ! తమ కడవలను వరుసగా పెట్టి, నడుముపై చేయి పెట్టుకొలి, పెరవారి ఆచారాన్ని తిద్దుతున్న ముసలమ్మల బలగాన్ని మీరు చూచి, క్షణకాలం ఆశ్చర్యపడి నిలుచుకోవచ్చు. వారి మాటల రహస్యాలు ఏమిటో తెలుసుకోగలరా ? సి. ఐ. డి. డిపార్ట్‌మెంటువారికీ అసాధ్యమైన రహస్య విషయాలను పత్తాచేసి, వీధికి ఈడ్చే ఆ ముసలమ్మలను చూచినప్పుడు పూర్వజన్మలో వీరు సి. ఐ. డి. లే అయివుండినవారో ఏమో అని జన్మాంతరంలో నమ్మకమున్న మహనీయులు తెలుసు కొనడం సహజం ! ఇక యౌవనంలో అడుగుపెడుతున్న సుందరుల చంచలమైనచూపులకు ఓడిపోయి, తమ మనస్సులను వారికోసం ముడుపు కట్టిన యువకుల సహాయానికి అక్కడ కొరతలేదు. కొన్ని రోజులలోనే స్వయంవరవార్త వ్యాపింపజేయడానికి సిద్ధమైన యువతి పెండ్లిమాటలు అక్కడ ఇక్కడ రహస్యంగా వినిపిస్తే - సుసంస్కృతులమైన మనం క్షణకాలం ఓర్పు చెడక వినడమే మేలు. [1] "విరహి జన హృదయ శూలము తానెయన్నట్టు" వసంతాగమనం అవుతూంటే సరేసరి-కొళాయి దగ్గరవున్న చెట్టు ఆశ్రయం పొంది ఉబుసుపోక కబుర్లు కొడుతూ కాలం గడపడానికి - సందుగొందు నిరుద్యోగి యువకులకు అవకాశం చిక్కిందనే తెలుసుకోవాలి. వీధికొళాయి స్థలమాహాత్మ్యం చిన్నది కాదు. ప్రతి ఒక్క పురాతన దేవాలయానికీ స్థలపురాణం ఉంటుందట. అలాగే ఈ ఒక్కొక్క వీధికొళాయికీ స్థలపురాణం ఉన్నా ఉండవచ్చు. దానిని తెలుసుకోవాలంటే, - వెనుకటి పరంపరను కాపాడుతున్న ముసలివారిని అడగాలి. అంత కష్టపడడం ఎందుకులేండి ? దానిని వదలి పెట్టడమే లెస్స. వీధికొళాయి వద్ద ఎందరు ఆధునిక దుష్యంతులు "చల్ చల్‌రె నౌ జవాన్" అని పాడుతూ శకుంతలల ఆగమనంకోసం దారి కాచివుండడం లేదు. బిందె ఎత్తుకుంటున్నప్పుడు తన ప్రియుణ్నే పిలిచి-"గచ్ఛతి పురశ్శరీరం ధావతిపశ్చాదసంస్థితం చేతః" అని కవి చెప్పినట్టు, సావకాశంగా ఓరచూపులు విసురుతూ బయలుదేరిన అందకత్తెను చూచినప్పుడు శృంగారరసానికి ఆలంబనమైన కొళాయి మహిమ కొనియాడవలసి ఉంటుంది. ఉండనీ! ఒక్కొక్కమారు తత్త్వజ్ఞానపు మూటను విప్పి ముసలివారు తమ వెనుకటి అనుభవాల కథలు చెప్పి అక్కడ చేరిన జనానికి బుద్ధిచెప్పడమంతూ తీరా సామాన్యమైన సంగతి. రస సన్నివేశా లుండనీ, విష సన్నివేశా లుండనీ రెండింటినీ సమరసం చేసుకొని, ముందుకు సాగాలంటే - వీధికొళాయి సాన్నిధ్యం తప్పక మనకు ఉండాలి ! నాలుగు వీధులు చేరిన స్థలంలో మునిసిపాలిటీ కొళాయి నిలబడి వుంటేనో ఇంకా మహత్త్వం ఎక్కువ. నాలుగు సందుల జనుల సమావేశంజరిగి అభిప్రాయ వినిమయానికి ఎక్కువ అవకాశం దొరకవచ్చు. ఎన్నోసార్లు జనుల గొప్ప ప్రోగ్రాముల సంకల్పాలూ అక్కడ కలుగవచ్చు, జరుగవచ్చు. యాత్రలకు, జాతరలకు వెళ్లడానికి

1. విరహిజన హృదయశూలం తానెనె

అంగలార్చే జనం వీధికొళాయినుంచే "ఉధో! ఉధో!" నినాదాలు ప్రారంభం చేయడమైతే సులభమైన సంగతి. (యాత్రికులు "ఉధో ఉధో" అనడం సంప్రదాయం.)

వీధికొళాయి ఎంతమందినో తనవైపు ఆకర్షించుకొనే మహత్వపూర్ణమైన ఒకానొక సంస్థ అని చెప్పలేదా? అది పూర్తిగా నిజం. కట్టెల మోపు, గడ్డిమోపు మోసుకొని, సర్కారు వీధిపట్టి బయలుదేరిన పాదచారులు సిరిగలవారి మోటారుధూళిని పోగొట్టుకొనడానికి ఉస్సురుమని మోపును కిందికి విసిరివేసి - చలిపందిరిపని నిర్వహించుకొన్న కొళాయి ఆశ్రయం పొందుతారు. పశువులను తోలుకొనిపోయే పసులకాపర్లు అక్కడ చేరి, ఆ స్థలానికి మరికొంత కళ కట్టేట్టు చేస్తారు. అపరిచితులైన వారుకూడ బీడీ, ఆకు, వక్క నెపంతో పరస్పరం పరిచయం చేసుకొంటారు. ఒక్కొక్కసారి అయితే వీధికొళాయి విశ్వబంధుత్వాన్ని చాటే మహాపురుషునివలె కనిపిస్తుంది. మన స్థానమానాలను వదలి వీధికొళాయి దగ్గర గుమిగూడిన జనంవద్దకు పోయి నిలబడుదామని ఎన్నోసార్లు నా మనస్సు చెప్పడమూ కద్దు. జనంలో పరిచయం పెరిగి, ఒకరి నొకరు అర్థం చేసుకుంటే, సంకుచితభావాలు అణగారిపోతాయని మనం విన్నాము. అలాటి మహాకార్యాన్ని వీధికొళాయి సాధించడంలేదా?

మధ్యాహ్నానంతరం వీధికొళాయివద్ద జనుల సందడి తక్కువయి, అది కేవలం పిల్లల ఆటస్థలంగా పరిణమిస్తుంది. చిన్నపిల్లలు తానాలు పోసుకుంటూ రాళ్లు బెడ్డలు వేస్తూ, ఆ స్థలానికి ముందులేని శోభను కలిగిస్తారు. వీధికొళాయిపై ఆటలాడిన ఎందరో పిల్లలు ఇప్పుడు అసెంబ్లీ మెంబర్లు అయినా అయివుండవచ్చుగదా అన్న తర్వాత, వీధికొళాయి స్థాయిగా నిలబడి, ప్రపంచ ప్రవాహాన్ని పరీక్షిస్తున్నదన్న తరువాత దాని గొప్పతనం చెప్పక తప్పదు. నేను పెక్కుసార్లు కొళాయి దగ్గరనే పొయివేసుకొని వంటచేసుకొంటున్న భిక్షుకులను, బావాజీలను చూచాను. అలాంటివారికి వీధికొళాయి ఎంత సహాయకారి? కులమతభేదాన్ని నిర్మూలించడం అసాధ్యమైనదని కేకలువేసే వారెల్లా-ఈభేదాన్ని నిర్మూలించిన కొళాయికి ధన్యవాదాలు అర్పించాలి. జాతి కుల మత భేదాలు తలయెత్తి తాండవమాడడం జనుల వైమనస్యం వల్లకాదు-అధికారం, స్వార్థం కోరే వంచకులవల్ల అనేదాన్ని వీధికొళాయి చాటి చాటి చెబుతున్నట్టు నిలబడివుందికదా!

తెల్లవారినుంచి సందెవరకు వీధికొళాయివద్ద సందడి తప్పిందికాదు. అంతటి రభసమైన జీవితం అక్కడ సాగుతుంది. పుట్టినింటికి సమాచారం చెప్పి పంపుదామనే అపేక్షగల క్రొత్తపెండ్లికూతురుకు ఒకరు కాకపోతే మరొకరు చుట్టాలలో ఎవరో ఒకరు అక్కడ భేటీ కానే కావాలి. అత్తా-కోడళ్ల పోట్లాటను తీర్చే న్యాయాధీశులు అక్కడ లభించడం ఏమీ అపురూపంకాదు. ఈ విధంగా జీవితంలో సాగవలసిన అనేక సమస్యలకు రంగభూమి అయి వీధికొళాయి, మన నాగరికతకు ద్యోతకమై, ఒక నిష్కామకర్మిలాగ వీధిమధ్యన ఎండ, వాన, చలి-వీటి దండయాత్రలను లెక్కచేయక ధీరునివలె నిలిచి తన వైపు జనాన్నిమాత్రం ఆకర్షిస్తూ ఉంటున్నది కదా!

# 22. ఖెడ్డా

## సి. కె. వేంకటరామయ్య

మన సంస్థానాలో కాకనకోటె అడవులలోని కారాపురం, చామరాజనగరం తాలూకాలోని బూదిపడగ మొదలయిన స్థలాలలో ఏనుగులను పట్టుకోడంకోసం ఖెడ్డా ఏర్పాటు చేయడానికి కావలసిన సమస్త సౌకర్యాలు ఉన్నాయి. స్థూలంగా చెప్పాలంటే, కొన్నివేల మంది వేటకాళ్లు, పలువురు అధికారులు చేరి అడవి ఏనుగులను భూమార్గంగానో, నదీ మార్గంగానో తరుముకొనివచ్చి ఒక పెద్ద ఆవరణంలో తోసి, తర్వాత మచ్చిక అయిన ఏనుగుల సహాయంతో వాటికి పగ్గాలుకట్టి సాగించుకొని వెలుపలికి తెచ్చి వేరువేరుగా చెట్లకు కట్టివేసి, ఉపాయంతో మచ్చిక చేయడమే ఖెడ్డా కార్యక్రమం అనవచ్చు. ఖెడ్డా పనులు కారాపురం సమీపంలో జరుగడమే ఇప్పుడు ఎక్కువగా ఉంది. అక్కడ ఉండే కాకనకోటె అడవిని చూచి హర్షాతిశయంతో మైమరవనివారే విరళం. అడవి ఏనుగులను గుంపుచేర్చే ఆవరణం వాటి బలానికి తట్టుకొనేట్టు ఉండక తప్పదుకదా! ఆడవిమానుల మొద్దులనే లోతైన గుంతలలో నాటి వాటికి అడ్డు గొయ్యలను పగ్గాలతో బిగించి, వది పన్నెండు అడుగులఎత్తు (రెండు నిలువులయెత్తు) బలమైన ఆవరణం ఏర్పాటు చేశారు. ఆ ఆవరణానికి ముందుభాగంలో ఒక పెద్ద తలుపూ, వెనుకభాగంలో ఒక పెద్దతలుపూ ఉంటాయి. ఆ తలుపులు పైనుంచి కిందికి మూసుకొనేట్టు ఉంటాయి. వాటిలో ఒకదానిని మూసే వుంటారు. మరొక దానిని పైకిలాగి దాని పగ్గాలను చెట్టుకొమ్మలకు కడుతారు. ఏనుగులగుంపు ఆవరణంలోకి తోసుకొని రాగానే, ఆ పగ్గాలు విప్పితే తలుపు దభీమని కిందికిపడి మూసుకుంటుంది. ఆవరణానికి ఐదారడుగుల దూరంలో చుట్టూ చాలలోతైన కందకం త్రవ్వివుంటారు. ఏనుగులు ఆవరణాన్ని భేదించుకొని రావడం సాధ్యంకాదు. ఒక వేళ అవి దానిని భేదించుకొని వెలుపలికి వచ్చినా, ఆ కందకాన్ని చూచి భయపడి వెనుదిరిగి పోవాలని ఆ కందకం త్రవ్వినవారి ఉద్దేశం. ఆ కందకం వెడల్పు పైభాగంలో ఎనిమిది అడుగులు, కింద అడుగుభాగంలో నాలుగడుగులు, లోతు ఎనిమిది అడుగులు. ఆవరణం తలుపులున్న స్థలాలలో మాత్రం వెలుపల కందకం ఉండదు; కందకం ఆవరణం చుట్టూ ఉండడం తలుపులవరకు మాత్రమే. మొదట్లోనే సూచించినట్టు ఏనుగులు ఆవరణం లోపలికి ప్రవేశించడానికిముందు ఆవరణపు ఒక తలుపును మూసివేస్తారు. మరొక తలుపు తెరిచిపెట్టి, ఆ తలుపునుంచి కపినీనదీతీరం వరకు ఒక పెద్దదారి ఏర్పాటు చేశారు. ఆ దారికి ఇరువైపులా పెద్ద పెద్ద స్తంభాలు నాటి వాటికి అడ్డగంబాలు బిగించి, ఆ దారిని వచ్చిన ఏనుగులు పక్కలనుంచి తప్పించుకొని పోవడం సాధ్యంకానట్టు చేశారు. ఆ మార్గంకూడ నదీతీరానికి పోయేటప్పుడు క్రమక్రమంగా వెడల్పవుతుంది. నదీమార్గంగా

తరుముకొని వచ్చిన ఏనుగులగుంపు ఆ దారిని మళ్ళి దానిలో ముందుకు పోయేట్టు చేస్తే అది ఖెడ్డా ఆవరణంలోకి పోయి చేరడమే కాని, పక్కలలో ఎక్కడినుంచైనా తప్పించుకొని వెళ్ళిపోవడం సాధ్యమేకాదు. ఈ విధంగా కపినీనదికి ఒక వైపు ఖెడ్డా ఆవరణం, నది మరొకవైపు దూరంలో ఏనుగుల అడవి ఉంటాయి. ఏనుగులను పట్టేపని సాధారణంగా వైస్రాయిగారు మొదలయినవారు వచ్చినప్పుడు ఐదారు సంవత్సరాలకొకమారు, ఏనుగుల రాయిడి ఎక్కువయితే ఇంకా ముందుముందుగాను జరుగుతుంది. వైస్రాయిగారు మొదలయిన వారు రావడానికి ఒకటి రెండు నెలలముందే నగరు వేట అధికారులు, సర్కారు అటవీ శాఖాధికారులు కాకాపురంలో మకాంచేసి పైతనిఖీ చూస్తారు. వారు కొన్నివేలమంది వేటకాళ్లను కపినీనది అవలిగట్టున దూరంలో ఉన్న ఏనుగుల అడవికి పంపి, తామూ అప్పుడప్పుడు అక్కడికిపోయి పనిని నిర్వహిస్తారు. ఈ వేటకాళ్లలో అడవి గొల్లలు మొదలయినవారు ఉంటారు. వీరు ఏనుగులగుంపు ఉండే స్థలాలను కనిపెట్టి ఏనుగులు ఏవైపు వస్తున్నాయనే విషయాన్ని తెలియజేస్తారు. రెండువైపులా ఏనుగుల గుంపునుంచి సుమారు ఒకమైలు దూరంలో ఉండి, దానిని చుట్టుముట్టి, గుంపు ఎడమవైపు తిరిగే సూచన కనిపిస్తే ఎడమవైపు వారు, కుడివైపు తిరిగే సూచన కనిపిస్తే కుడివైపువారు, వెనుకవైపువారు అప్పుడప్పుడు సద్దుచేయడంవల్ల ఏనుగులు అపాయం శంకించి, క్రమంగా నదివైపు బయలుదేరుతాయి. అయితే, ఏనుగులు రెచ్చిపోతే వేటకాళ్లలో ఒక్కరూ మిగులని అపాయం సంభవించడం ఎప్పుడూ ఉంటుంది. నదివైపు కొంతదూరం వరకు ఏనుగుల గుంపు రాగానే, దగ్గరి కొండమీదినుంచి చూచేవారు సైగ చేయగానే, మూడు నాలుగువేలమంది వేటకాళ్లు ఏనుగుల గుంపుచుట్టూ చాల దూరంలో ఆవరించి నిర్దిష్ట కాలంలో, నిర్దిష్ట స్థలాలలో మంటలు వేస్తారు. ఏనుగులకు నిప్పును చూస్తే చాల భయం. అప్పుడు అవి నదిలో దిగి దాటిపోవడం మినహా మరెక్కడినుంచి దాటిపోవడానికైనా అవకాశం వుండదు. మాన్యులైన అతిథులు, శ్రీమన్మహారాజాగారు, రాజకుటుంబంవారు, తక్కిన ప్రేక్షకులు నదీ గర్భానికి చాల ఎత్తులో వున్న నది గట్టు వెంబడిని ఏర్పాటుచేసిన సుఖాసనాలను అలంకరించిన తర్వాత, నిర్దిష్టమైన సంకేతం ప్రకారం ఆనతి కాగానే, ఏనుగులను చుట్టుముట్టినవారు కొమ్ములను ఊదడం, డబ్బాలను వాయించడం, చాలచప్పుడయ్యే వెదురుబొంగులను కదలించడం, తప్పెటలను వాయంచడం మొదలయిన పనులతో ఆకాశమే చిల్లులు పడేరీతిగా సద్దుచేస్తారు. అడవి ఏనుగులు బెదిరిపోయి నదిలోదిగి పారిపోవడానికి ప్రయత్నిస్తాయి. నది రెండుగట్ల వెంబడీ జనం నిలబడి అల్లరిచేస్తారు. ఏనుగులు నీటిలో దిగిన తర్వాత నది ఎగువకుపోకుండా ఆపడానికి నదిలో అడ్డంగా వెదుళ్లతో అడ్డకట్టకట్టి దానిమీద వేటకాళ్లు నిలబడి చప్పుడు చేస్తారు. అందువల్ల ఏనుగులు ఆవైపు పోకుండా నీటి వాలును బట్టి దిగువకు పోతాయి. అప్పుడు మచ్చికయిన ఏనుగులమీద ఎక్కి కూర్చుని వేట అధికారులు, ఇతర అధికారులు కేకలువేస్తూ ఏనుగులను తరుముతారు. అది వారి అదృష్ట పరీక్ష సమయం. వారు మచ్చికయిన ఏనుగులమీద కూర్చున్నా, అడవి ఏనుగులు ఎదురుతిరిగితే వారి ఆయుస్సు మూడి



నట్లే వారు నది నీటిలో అడవి ఏనుగులను తరుముకొని పోతున్నప్పటి దృశ్యం చాల రమణీయమై వుంటుంది. నదీ మార్గంగా వెళ్లేటప్పుడు పిల్లయేనుగులు నీటిలో మునిగిపోకుండా పెద్ద ఏనుగులు సహాయం చేయడం, పెద్ద ఏనుగులు పిల్ల ఏనుగులను సరసాలాడుతూ పిలుచుకొని పోవడం, కొన్ని ఏనుగులు భయంతో ఘీంకరించడం, మొదలయినవి ఆకర్షకంగా వుంటాయి. నదీతీరంతో ఖెడ్డా ఆవరణంవైపు మళ్లే దారికి కొంచెం దూరంలో అడవి ఏనుగులు నదిలో ముందుకు పోకుండా అడ్డగించడానికి మచ్చికయిన ఏనుగులు నదిలో అడ్డంగా వరుసగా నిలబడి వుంటాయి. వాటిమీద కూర్చున్నవారు కొమ్ములను, బాకాలను ఊదుతూ, అల్లరి చేస్తుంటారు. అందువల్ల వెనుక తరుముకొని వస్తున్నవారికి పట్టుపడక తప్పించుకొని పారిపోవడం కోసం అడవిఏనుగులు ఖెడ్డా ఆవరణానికి పోయే మార్గంలో వెళ్ళడ మొక్కటే సురక్షితమైన ఉపాయమని భావించి ఆ దారికి తిరుగుతాయి. అంతేకాక మచ్చికయిన ఏనుగులతో ఆ దారిలో అక్కడక్కడ లద్దెలు వేయించికూడ వుండడంవల్ల అడవి ఏనుగులకు తమకంటే ముందు మరికొన్ని ఏనుగులు ఆవారినే వెళ్లాయని, తాము వెళ్లడమూ క్షేమకరమని తోచి అటువచ్చి ముందుకు పోతాయి. ఇంతేకాక ఆదారి నిశ్శబ్దంగా వుండడంవల్లనూ, ఆవరణ స్తంభాలను ఆకులతో కప్పడంవల్లనూ నిరపాయమని అడవి ఏనుగులు ధైర్యంతో ముందుకుపోతాయి. వెనుక తరుముకొని వస్తున్నవారి సందడి హెచ్చినకొద్దీ అవి ఉత్సాహంతో ముందుకుపోయి, ఖెడ్డాఆవరణంలో ప్రవేశిస్తాయి. ఏనుగుల గుంపులో ఆఖరు ఏనుగుకూడ ఆవరణం తలుపునుంచి లోపలికి పోగానే చెట్లమీద వుండే వేటకాళ్లు చెట్లకొమ్మలకు కట్టిన తలుపుల పగ్గాలను విప్పుతారు. ఖెడ్డా ఆవరణం తలుపు దభీమని కిందికిపడి మూసుకొంటుంది. దాని వాకిలి దగ్గర (గుమ్మం దగ్గర) మూడు మూడు వరుసలలో పది అడుగులకన్నా ఎత్తయిన అడవిమాను మొద్దులను నాటి వాటికి అడ్డంగా వాటివలెనే వున్న పెద్ద పెద్ద తుండ్లను పగ్గాలతో బిగించి భద్రంగా కట్టివుంటారు. అడవి ఏనుగులన్నీ ఆవరణలో పట్టుపడి తలుపు కిందికి పడగానే కొన్ని వేలమంది వేటకాళ్లు ఆవరణంచుట్టూ వున్న కందకం ఒడ్డున ఇరవై ముప్పై గజాలకు ఇద్దరు చొప్పున కూర్చుని, వెదురు బొంగులు మొదలైన వాటిని ఉపయోగించి, చప్పుడు చేస్తూ, నిప్పు ముట్టించి రాత్రిళ్ళు ఒకేరీతిగా మంటలు వేసుకొంటూ కేకలువేస్తూ, కావలి వుంటారు.

ఏనుగులను ఆవరణంలో చేర్చినమీదట వాటికి సమృద్ధిగా మేత నీరు ఒదిగిస్తూ, పిదప ఒకటి రెండు రోజుల తర్వాతనో లేక ఇంకా కొంతకాలం తర్వాతనో ఆ అడవి ఏనుగులలో కొన్నిటిని ఆవరణం గుమ్మంనుంచి వెలుపలికి వదులుతూ, వాటి కాళ్ళకూ మెడకూ భారీ భారీ పగ్గాలను బిగించి తోలుకొనిపోయి, చెట్లకు కట్టివేసే సాహసకార్యం కొనసాగుతుంది. అందుకోసం ఖెడ్డా ఆవరణం గుమ్మానికి వెలుపల ముందుభాగంలో మూడు మూడువరుసలలో పెద్దపెద్ద మానుమొద్దులను నాటి అలాంటి వాటినే అడ్డంగా పెక్కుచోట్ల పగ్గాలతో బిగించి భద్రంగా ఏర్పరచిన చిన్న ఆవరణ మొకటి ముందే సిద్ధమై

వుంటుంది. దాని వెనుక మహాస్వామి (మైసూరు మహారాజు) గారూ, రాజకుటుంబము వారూ, మాన్యులైన అతిథులూ, తక్కిన ప్రేక్షకులూ ప్రత్యేకంగా సిద్ధపరచిన 'గ్యాలరీ'ని అలంకరించి వుంటారు. ఈ చిన్న ఆవరణం ఎలావుంటే అడవి ఏనుగులను బంధించేటప్పుడు కలిగే అపాయం చాల తక్కువగా వుంటుందనే విషయాన్ని దీర్ఘంగా ఆలోచించి నిర్ధరించి దానికి తగిన ఏర్పాట్లు చేసిన యశస్సు పూర్వపు శ్రీమన్మహారాజుల వారిది. ఈ విధంగా ఏర్పాటయికూడ, ఎలాటి అపాయాలు కలుగవచ్చు ననడానికీ, ఆవిధంగా అపాయం సన్నిహితమైన సందర్భంలో, మహారాజులవారు ఎంత ధైర్యసాహసాలతో ప్రవర్తించి, బహుమంది జనుల ప్రాణరక్షణ చేశారనడానికి మొదటి అధ్యాయంలో కొన్ని నిదర్శనలు తెలుపబడినవి. బంధనానికి లోబడవలసివచ్చినప్పుడు అడవి ఏనుగులు చేసే భయానకమైన బృంహితధ్వని, అవి ప్రదర్శించే రోషభీషణత, అపార బలప్రదర్శనం ప్రత్యక్షంగా చూచి గ్రహించవలసిన అంశాలేకాని, వర్ణనతో తెలిపి ముగించవలసినవి కావు. పెద్ద అవరణపు తలుపును పైకి ఎత్తించి, దాని ముందున్న చిన్న ఆవరణంలో వున్న చెరకుగడలు మొదలయినవాటి ఆకర్షణతో కొన్నికొన్ని అడవి ఏనుగలను పెద్ద ఆవరణంనుంచి చిన్న ఆవరణానికి తోలి తలుపును పైనుంచి దింపి బంధించి, అవి ఇరుకులో చిక్కుకొనేట్టుచేసి, వాటి ఎదురుగను, వాటి వెనుకను, వాటి పక్కలలోను మచ్చికయిన ఏనుగులు-కుమ్కీ ఏనుగలు-చుట్టూ నిలబడేటట్టు ఏర్పాట్లు జరుగుతాయి. ఏడెనిమిది టన్నుల బరువున్న ఈ మత్తగజాలు బంధనానికి లోబడేటప్పుడు ఒక్కొక్కటీ ఎదిరించి నిలబడి ఆవరణ స్తంభాలను తొండంతో లాగి, కుంభస్థలాలతో ఢీకొట్టి ప్రదర్శించే భీమబలాన్ని చూచి తల ఊపనివారు ఉండరు. ప్రత్యేక శిక్షణ పొందిన అనుభవశాలులయిన సాహసికులు కిందికి దిగిపోయి మచ్చికయిన ఏనుగుల మధ్యనవున్న అడవి ఏనుగుల వెనుక కాళ్లకు బొటనవ్రేలిలావయిన పొడుగాటి నూలుపగ్గాలతో పెక్కువరుసల కొలుకులను బిగించి, కాళ్ల స్వాధీనం తప్పించి, తర్వాత చేయి రెటకంటే లావైన నూలుపగ్గాలతో కట్లను వరుస వరుసగా బిగిస్తారు. పెక్కు సందర్భాలలో అది అడవి ఏనుగులకు తెలియని విధంగా హస్తలాఘవంతోను, చాతుర్యంతోను వారు ఆ పనిని నెరవేరుస్తారు. మచ్చికయిన ఏనుగుల-కుమ్కీ ఏనుగుల-సహాయంతో అడవిఏనుగు మెడకు పగ్గంబిగించే పని తర్వాత జరుగుతుంది. పిదప మచ్చికయిన ఏనుగుల సహాయంతో దానిని తీసుకొని వెళ్లి మానులకు కట్టివేస్తారు. తాను బంధనానికి లోబడిన సంగతి తెలియగానే బంధనం నుంచి విముక్తి పొందడానికి అది ఎంత ఎక్కువ సాహసం చేస్తుందన్న విషయం వర్ణింప సాధ్యంకాదు. పెద్దపెద్ద అడవి ఏనుగులను కట్టివేసిన పిదప చిన్నచిన్న ఏనుగులను, ఏనుగుపిల్లలను కట్టివేసే పని జరుగుతుంది. ఇది పెద్ద ఏనుగులను కట్టివేయడంకన్నా కొంచెం సులభంగా సాగేపని. మెడకు పగ్గపుకొలికి తగిలించేటప్పుడు పిల్లఏనుగులు మొండితనం చేయడం, తప్పించుకొనడం, పిల్లల్లా అల్లరిచేసేటట్టు అరవడం, గోలచేయడం ప్రేక్షకులకు చాలవినోదం కలిగిస్తాయి.



అడవి ఏనుగులను కట్టివేసేటప్పుడు మృత్యుముఖంలో నిలబడినట్టు అపాయానికి ఎదురొడ్డి అత్యంత ధైర్యసాహసాలతోను చాల జాణతనంతోను పని చేయవలసివుంటుంది. దానిని వర్ణించడంకంటే కొన్ని దృష్టాంతాలను తెలియజేయడమే మేలు. 1907 లో (అప్పుడు ప్రిన్స్ అఫ్ వేల్సుగా వున్న ఐదవజార్జి ప్రభువులు మేరీ రాణిగారితో సహా దయచేసినప్పుడు) అడవి ఏనుగులగుంపు నాయకమణి అయిన పిడిఏనుగును బంధించడానికి ప్రయత్నం జరిగినప్పుడు, అది అటు ఇటు కదలడానికి ఆస్పదంలేనట్టు మచ్చికయిన ఏనుగులమధ్యన వున్నప్పటికీ, ఆ ఏనుగు తన కాళ్లకు పగ్గాలు బిగించడానికి ప్రారంభించినవానికి స్మృతితప్పే టంతగా హాని కలిగించింది. స్మృతి తప్పిన అతనిని దూరంగా తీసుకొని పోయిన తర్వాత కూడ అతనితోపాటు వున్న వారు దానిని బంధించడానికి ప్రయత్నించారు. వారు అత్యంత ధైర్యంతోను, చాతుర్యంతోను పని చేసినప్పటికీ దానిని బంధించడానికి చాలసేపు పెనగులాడవలసి వచ్చింది. ఆఖరుకు దానికాళ్ళకు పగ్గాలు బిగించి, దానిమెడకూ, ఒంటికీ బిగించిన పగ్గాల కొనలను దాని రెండువైపుల వున్న మచ్చికయిన కుమ్కీ ఏనుగల మెడలకూ, దేహానికీ బిగించి ముందుకు తోలడానికి ప్రయత్నించినప్పుడు, అది అత్యంత రభసంతో - తన అంగాంగాలు కట్లుకట్టి స్వాధీనంతప్పిన స్థితిలో వున్నప్పటికీ - జతలోవున్న ఏనుగులను జరజర లాగుకొనిపోయి అగడుతనం చూపించి. అప్పుడు అది అంతటితో ఊరుకోక అవరణంలోని అడ్డుకంబాన్ని తొండంతో పట్టి ఊగించి లాగి పారేయడం చూచి ప్రేక్షకులు వలువురు భయంతో వణికిపోయారు. కొందరు మావటివారు ప్రాణభీతితో తల్లడించి తాము కూర్చున్న మచ్చికయిన ఏనుగులమీది నుంచే దభీమని కిందికి దూకి తలదాచుకున్నారు. అప్పుడు పూర్వపు మహారాజులవారు తమ దేహాపాయముగూడ లెక్కచేయక ముందుకు తోసుకొనిపోయి, కార్యసాధనకు చతురతతో సలహాలిచ్చి నాయకమణి అయిన ఏనుగుతోపాటు కోపంతో దాని అగడుతనానికి అడ్డుతగులుతున్న ఐదు మచ్చిక ఏనుగుల జతకు ఆరు భారీఏనుగులను రప్పించి పని సాగించవలసిందిగా ఆజ్ఞాపించారు. మహారాజులుగారు తామే ముందుకురికి నిలబడి అసాధారణమైన సమయస్ఫూర్తితో సలహాలిస్తూ భయపడిన పనివారి హృదయంలో మరల ధైర్యం కలిగేటట్టు చేసిన తీరును ఎంత కొనియాడినా తీరదు. మహారాజులుగారు అపాయంకూడా గమనించక ముందుకు వచ్చిన ప్రత్యక్ష నిదర్శన ప్రభావంవల్ల ఉత్తేజితులయిన మావటివారు ఇతరులు ఆ పదకొండు ఏనుగుల సహాయంతో ఆ అడవి ఏనుగును అంకెలో పెట్టి ముందుకు తీసుకొనిపోయారు. ఏనుగుల గుంపులోని తక్కిన ఏనుగులు అయినా, గుంపు నాయకమణి అయిన ఆ పిడిఏనుగు, దాని గుంపులోని తక్కిన ఏనుగులు అయినా, గుంపు నాయకమణి అయిన ఆ పిడిఏనుగు, దాని గుంపులోని తక్కిన ఏనుగులు (వాటిని బంధించి తీసుకొని వెళ్ళేటప్పుడు) చూపిన అగడుతనం, అల్లరి చూచి అందరూ

1. ఏనుగుల గుంపుకు నాయకమణి అయిన ఏనుగు వుంటుంది. ఇది మగ ఏనుగు కావచ్చు, పిడి ఏనుగు కావచ్చు. గుంపులోకెల్లా ఏది బలంగా వుంటుందో అదే నాయకమణి.—యూథనాథము. ఈ నాయకమణి అయిన ఏనుగు ఎడల గుంపులోని తక్కిన ఏనుగలు ప్రదర్శించే విధేయత గౌరవం, ప్రేమ విస్మయకరమైనవి.

ప్రాణభీతితో తల్లడించేటట్టు అయింది. రెండు మూడు అడవి ఏనుగులయితే, మచ్చికయిన ఏనుగుల ఒంటికి గట్టిగా కట్టినప్పటికీ, వాటిని జరజరమని లాగుకొనిపోయి, అంకెతప్పి, ఇష్టం వచ్చినట్టు అటుఇటు తోసుకొనిపోతూ, ఎదుటవున్న వెదురుపొదలు మొదలయిన వాటిని ధ్వంసంచేస్తూ, ఎవరికి ఏక్షణంలో ఏ అపాయమో - అనే భయం కలుగజేస్తూ, మైసూరు సంస్థానపు వైశిష్ట్యమని మొదట్లోనే ప్రఖ్యాతి వహించిన ఖెడ్డా కార్యక్రమం ఆనాడు మరింత రుద్ర సౌందర్యంతో భయానకం అనేటట్టు చేశాయి. ఆ ఏనుగులను తీసుకొని వెళ్లుతున్నప్పుడు, (అప్పుడు ప్రిన్స్ ఆఫ్ వేల్సు అయిన) జార్జ్‌ప్రభువులు, మేరీ రాణీగారు, ఆశ్చర్యచకితులై అప్పటి మహారాజులు అపాయానికి ఎదురొడ్డి పనివారికి ధైర్యం కలిగించి, ఉత్సాహం నింపుతూ ఎలా పని జరుగాలో సలహాలిస్తూ, ఆ ఏనుగులకు చాలదగ్గర పాదచారులై పరిక్రమించిన పద్ధతిని చూచి హర్షించి, తాముగూడ నిర్భయంగా కొద్దిదూరంలో పాదచారులై వెంట అరమైలుకన్న హెచ్చుదూరం నడవడం అప్పటి పత్రికలన్నీ శ్లాఘించాయి. అప్పటి మహారాజులుగారు ఇంకా ఎక్కువ అపాయానికి ఎదురొడ్డి మరికొంత ముందు దయచేశారనడం చెప్పవలసిన అవసరమే లేదు. 1913 నవంబరు 14-వ తేదీన కారాపురం ఖెడ్డాలో అడవి ఏనుగులను బంధించే పని జరిగినప్పుడు అరవై సంవత్సరాలకన్నా హెచ్చు వయస్సున ఒక ఏనుగుగుంపునాయకమణికన్నా ఎక్కువ అగడుతనం ఆరంభించి సాహసం చూపింది. తనకాళ్ళకు పగ్గాలు బిగించినప్పుడు అది ఊరికే వుండి, మెడకు పగ్గపు కొలికి పడినప్పుడు అతివిస్మయకరంగా పోరాటం ప్రారంభించి విజృంభించింది. అంతకు నాలుగుదినాల ముందు (నవంబరు 10-వ తేదీ సోమవారం) నాయకమణిని కట్టివేసేటప్పుడు కూడ అంత కష్టం కలుగలేదు. రాజనగరు గజశాలలోని ఏనుగు లన్నిటిలోను బలమైన యుద్ధపుఏనుగు "మోతీలాల్" అనే గజరాజును ఆ రంగానికి రప్పించినప్పటికీ ఫలితం కలుగలేదు. ఆ అడవిఏనుగు కొట్టిన దెబ్బకు మోతీలాల్ కూడ గీపెట్టి, ఆర్తస్వరంతో ఘీంకరిస్తూ, నొప్పి సహించి, మొదటికన్నా రెట్టింపు రభసంతోను, హుమ్మస్సుతోను పోరాడింది. అయితే, అడవిఏనుగు గుటవలె దానిమీద పడినప్పుడు అది కిందికి దొర్లిపోయే పరిస్థితికివచ్చి తత్తరపాటు పొందింది. అడవిఏనుగు తన వెనుక వున్న ఏనుగులు రెండిటిని వెనక్కుతోసి వెనుకంజ వేయించి, ముందున్న రెండు ఏనుగులను ముందుకుతోసి, ఖెడ్డా వెనుక గుమ్మంవైపు తోసుకొని వచ్చిన రభసకు ఆ గుమ్మం అడ్డుగంబాలు విరిగి నేలపై దొర్లాయి. ప్రేక్షకులు అడవిఏనుగు బలానికి దిగ్భ్రాంతి పొందారు. అడవిఏనుగు తొండంతో లాగినప్పుడు మరికొన్ని కంబాలు ఊడి వచ్చాయి. మచ్చికయిన ఏనుగుల మావటి ఒకడు ప్రాణభయంలో గుమ్మంం అడ్డదూలంపై పడి వేలాడాడు. మరొక మావటివాడు పిచ్చివాడిలాగ పక్కకు దూకి కాళ్ళు బెణికించుకుని బాధపడ్డాడు. అడవి ఏనుగు అల్లరికి కోలాహలం బయలుదేరింది. విపత్తే ఆ అడవి ఏనుగు రూపంతో వచ్చినట్టు తోచిన ఆ సమయంలో మహారాజులవారు, కొందరు అధికారులు అసమధైర్యంతో ముందుకు వచ్చారు. మహారాజులుగారు ఉత్తమమైన సలహాలనిచ్చి, దూరంలో వున్న పెక్కు మచ్చికయిన ఏనుగులను నిమిషమాత్రంలో రప్పించి



వాటితో వ్యూహరచన చేయించవలసిన విచక్షణను తెలియజేశారు. ఆ అడవి ఏనుగు అగడుతనాన్ని నిలిపి, దానిని అదుపులో పెట్టే ప్రయత్నంలో వారు తమకు అపాయం సంభవిస్తుందనే విషయాన్ని గమనించకనే ప్రవర్తించిన తీరును చూచినవారంతా వెరగు వడ్డారు; మాన్య అతిథులైన వైస్రాయిగారు దానిని చాల శ్లాఘించారు. తుదకు ఆ అడవి ఏనుగు పెక్కు మచ్చిక యేనుగులమధ్య చెరలో చిక్కిన వీరునిలాగ అడుగడుగుకు బంధనం నుంచి తప్పించుకొనే ప్రయత్నంచేస్తూ, ప్రయత్నం విఫలమవుతున్నందుకు రోషోన్మత్తతతో మరిమరీ బలం ప్రదర్శిస్తూ, నిర్వాకంలేక ముందుకు సాగిపోవడం చూచి వేలాదిజనం కోలాహలం చేశారు; ఆనాటి విపత్తునుంచి తమను కడతేర్చిన మహారాజులవారి అతులధైర్యాన్ని, అమిత కార్యవిచక్షణతను తమ మనస్సులలోనే మౌనంగా శ్లాఘించి, వారికి శ్రేయస్సు కలుగవలెనని హృదయపూర్వకంగా ప్రార్థించారు. మహారాజులవారు అప్పటినుంచి పెక్కుసార్లు ఈవిధంగా అసమధైర్యంతో ప్రవర్తించి, ప్రేక్షకులను విపత్తునుంచి కడతేర్చారు; అలాటి విపత్తు జరుగకుండా అనన్యసులభమైన బుద్ధికౌశలం ప్రదర్శించి, అడవి ఏనుగులను పట్టుకొనే ఆవరణం విశాలంగా వుండడంవల్ల వాటి కాళ్ళకు, మెడకు పగ్గాలు బిగించేటప్పుడు, అవి దుడుకుతనం చేయడానికి అవకాశం వుండడం గ్రహించి, ఆ ఆవరణం కట్టడంలోనే పెక్కుమార్పులు చేయించి, దాని విస్తీర్ణం తగ్గించి, అపాయం కలిగే అవకాశాన్నే తగ్గించారు.

పగ్గాలు కట్టి అడవి ఏనుగులను ఖెడ్డా ఆవరణంనుంచి దూరంగా తీసుకొని వెళ్ళి మానులకు కట్టివేసిన తర్వాత, అవి పగ్గాలు తెంపుకొని పోదామని చేసేప్రయత్నంలో పగ్గాలను లాగడంవల్ల, వాటి రాపిడికి చర్మం రేగి పుండ్లవుతాయి. పూర్వం ఆ పుండ్లు వాచి, చీముపట్టి, పురుగులుపడి, అడవి ఏనుగులకే అపాయం కలిగిందికూడ. దయాళువు అయిన మహారాజులవారు శ్రీకృష్ణరాజేంద్ర ఒడయరుగారు అలాటిదానికి అవకాశం లేకుండా మంచి చికిత్స జరిగే విధంగాను, గాయాలు లేని స్థలాలలో (మచ్చికయిన ఏనుగుల సహాయంతో) పగ్గాలు కట్టేటట్లు ఏర్పాటు చేశారు. మానులకు కట్టివేసిన తర్వాత అడవి ఏనుగులు స్వాతంత్ర్యాన్ని కోల్పోయి కట్లకు లోబడి పోయామనే విషాదంతోను, రోషంతోను మేతకూడ మేయక నిలబడిపోతాయి. వాటికి సంతోషం కలిగించే పాటలను, పరాకు గీతాలను పాడించి, అవి మేతమేసేట్టు చేసే మంచి ఏర్పాట్లను పాలించిన మహారాజుల వారు ఇటీవల చేశారు. ఇది చాలకాలం యోచించి యోచించి, అనేకప్రయోగాలు, పరీక్షలు జరిపి, గజహృదయం తెలుసుకొని కొనకు సఫలమైన రీతిలో జరిగిన కొత్త ఏర్పాటు. దీనిప్రకారం అడవి ఏనుగులు మేతమేసేట్టు చేసే నవీనపద్ధతికీ, అడవి ఏనుగులు మేతవదలి చిక్కి చిక్కి శల్యమై, చాలయిపోయి, (విసుగెత్తి) ఆఖరుకు గతిలేక మేత తాకేవరకు ఊరికేవుండే పాతపద్ధతికీ ఎంత వ్యత్యాసమనే విషయాన్ని, మహారాజులవారి కృపాళుత్వం ఎంత శ్రేష్ఠమైనదనే విషయాన్ని చెప్పవలసిన అవసరమే లేదు. తాటస్థ్యం వహించి

అడవి ఏనుగులను కట్టివేసిన తర్వాత వాటిని మచ్చికచేసే పని క్రమక్రమంగాను, నిదానం

గాను జరుగుతుంది. దానిలో అనుభవమున్న మేధావులు విశేషమైన బుద్ధిమంతనంతోను చాతుర్యంతోను పనిచేసి వాటిని మచ్చికచేస్తారు.

క్రీస్తు పూర్వం మూడవ శతాబ్దంలో గ్రీసుదేశంనుంచి చంద్రగుప్త చక్రవర్తి ఆస్థానానికి రాయబారిగా వచ్చిన మెగస్తనీసు భరతఖండంలో అడవి ఏనుగులను పట్టుకొని మచ్చిక చేసే పద్ధతిని చూచి ఆశ్చర్యభరితుడై, దానిని సవిస్తరంగా వ్రాసి, విశేషంగా శ్లాఘించాడు. ఇప్పటి ఖెడ్డా పద్ధతికీ, దానికీ పరస్పరం విశేషసామ్యం వున్నమాట నిజమే అయినా, దానికంటే చాల మేలయిన మార్పులను చేసిన యశస్సు మహారాజులవారికి చెందుతుందని మనం ధారాళంగా చెప్పవలసివుంది. పట్టినపని శ్లాఘ్యతమంగాను, సర్వోత్తమంగాను సాధించా లనేది నిరంతరమూ మహారాజులవారి ధ్యేయం. దానికి పులివేట పద్ధతిలోను, అడవి ఏనుగులను పట్టుకొనే పద్ధతిలోను వారు నిరంతరం చేయిస్తూ వచ్చిన మార్పులు, చేర్పులుకూడ ఉత్తమ నిదర్శనం.

# 23. నా వీపు

## నా. కస్తూరి

"స్వామీ!"

నేను వెనక్కి తిరిగి నిలబడ్డాను. పండ్లు ఇకిలిస్తూ, కుడిచేయి ముందుకు చాపుతూ ఎవరో ఒకరు నా వెన్ను పరుగెత్తి వస్తున్నారు. ఎన్నోనాళ్ళ విరహంతో తపించినవారిలాగ, కొసకు తమ ప్రేమపాత్రం చేతికి చిక్కినవారిలాగ ఆయనకండ్లు వికసించాయి. నా వెంటనే ఆయన చాలదూరం పరిగెత్తి వచ్చి వుండాలి. ఎందుకంటే, ఆయన చెమట ఓడుస్తూ, ఎసకొడుతూ, ఎగఊపిరి వదలుతూ. తమ దేహాన్ని తోసుకుంటూ త్వరత్వరగా వస్తున్నారు.

ధారవాడ నాకు తీరా కొత్తది. ఏదో అగత్యమైన పనికోసం నేను అక్కడికి, ఆరోజు ఉదయం చేరాను. అక్కడ నాకు పరిచితు లెవ్వరూ లేరు. అయినా, నా వెన్ను వెనుక నన్ను గుర్తించిన మహనీయుడెవరు అని తెలుసుకోవాలని నాకూ కుతూహలం కలిగింది. "స్వామీ!" అంటూ ఆయన నాదగ్గిరికి వచ్చారు. నన్ను దగ్గిరినుంచి చూచారు ‥చాచినచేయి వెనక్కిపోయింది. వికసించినకండ్లు వాడిపోయాయి ‥"క్షమించండి! గుర్తు తప్పింది! తమరిని నేను మరొకరని అనుకున్నాను." అని అంటూ, సిగ్గుపడి, తలవంచుకొని, వెనక్కి అంగలు వేశారు.

నేను నా దారి పట్టాను. ఆయనమీద నాకు కోపం కలుగలేదు. ఎందుకంటే, ఇలాటి అనుభవాలు నాకు ఇంతవరకు నూరారు కలిగాయి. నా వీపునకు ఏదో విశేషమైన లక్షణం వుంది. దానినిచూచి పలువురు మోసపోయారు. దాని వెడల్పు, నిర్మాణం, వంపు, బిగి, దానిమీద నా తలకాయ బుర్ర ప్రతిష్ఠితమైన భంగి, ఆ రెండింటికీ మధ్య పెరిగిన నా మెడ పొడవు, బంధురత, గుండ్రతనం, బింకం; అంతేకాక, నా నడక ఠీవి, ఠేంకారం, దాని ఒయ్యారం, వీటన్నిటి మూలంగా కర్నాటకదేశం లోపల, వెలుపల అన్ని ఊళ్లలోను జనం నన్ను మరొకరని భావించి మోసపోయారు. మసక మసక వెల్తురులోనే కాదు; పట్టపగలే మోసపోయారు; జనం నిలబడిన స్థలాలలో మాత్రమేకాదు; నిర్జన ప్రదేశాలలో కూడా.

అయితే, ఒక్క చోద్యం. నా ఎదుట నాకు అభిముఖంగా వచ్చేవారెవరూ నన్ను మరొకరని అనుకోడమే లేదు. నానుదురు, ముఖం, ముక్కు, ఛాతీ, మొదలయిన ముందుభాగానికి ఒక వ్యక్తిత్వం, ఒక వైశిష్ట్యం ఉంది! అది నావే అయిన, మరొకరికి లేని రూపరేఖలతో

విరాజిల్లుతున్నది. నన్ను ఎదుర్కొనే వారి కందరికీ నేను నేనే!...నన్ను వెన్నాదేవారికి మాత్రం నేను వారివారి కల్పనాశక్తి ప్రకారం వేరేవేరే వ్యక్తిగా కనిపిస్తాను. ఇది నా దౌర్భాగ్యం; నాదే అయిన నా తనం - నా వ్యక్తిత్వం.

"స్వామీ!", "సార్", "ఏమండీ", "ఇదిగో", "ఏ అప్పా", "ఏ! తాతా", "నిలబడండన్నా", "హలో!", "జీ!"—అనే వివిధ సంబోధన పదాలను విసిరి జనం నా వెన్నును పిలిచి నిలిపారు. నిలబడి, అలా పిలిచిన వారిని నేను తిరిగి చూడడమే ఆలస్యం, వాళ్ళు ఆశ్చర్యపడి, వాలిపోయి, చేతులు నలుపుతూ క్షమాపణ అడిగి, తప్పించుకుంటారు. వెన్ను అనేదే లేక నేను ద్విముఖుడినై పుట్టివుంటే, నావల్ల కలుగుతున్న ఈ ఇబ్బంది తప్పుతుంది కదా, అని పెక్కుసార్లు నాకు అనిపించింది. అయితే, ఏం చేయడం? అసహ్యం అనుభోక్తవ్యం! వాళ్లూ అంతే; నేనూ అంతే!

ధారవాడలో నన్ను వెన్నాడిన మహనీయులు తెప్పున వెనక్కు పలాయనం చిత్తగించారు. అయితే, పశువుస అలా చేయుడంలేదు. వారికి ఆశాభంగం కలిగించినందుకు వాళ్ల నామీద గింజుకుంటారు. "ఇదెందు కండీ, ఇలా అయారు! వెనకొకటి, ముందొకటి, బూటాటకంచేసి ఆపకండి!" అని కోపం కక్కుతారు. నా గ్రహచారాన్నే శపిస్తూ, నేను కాలికి బుద్ధి చెబుతాను. ఎవరైనా వెనకవచ్చి నన్ను మరొకరని భావించి, వారికి చెల్లించవలసిన పూజాపురస్కారాలు నాకు అర్పించి, రెండు శాపాలుపెట్టి వాయిస్తే గతి ఏమిటి అని భయపడతాను.

పది పన్నెండుసార్లు నేను నా సంబోధకులను పలకరించిందీ ఉంది. "మరేమీ పరవాలేదు! మీరు అనుకున్న వ్యక్తి కాకపోయినా, నేనూ ఒక వ్యక్తిని; సంసారిని; పిల్లలు గలవాణ్ణి; తమరు నన్ను ఎవరని అనుకున్నారు?" అనీ అడిగాను. అప్పుడు, నాకు వివవిధాలయిన సమాధానాలు వచ్చాయి. చిత్రదుర్గం వర్తకు లొకరు నన్ను బస్సు యజమాని అని అనుకున్నారట; బ్యాడ్గిలో మరొకరికి నేను స్టేషను మాస్టరుగా కనిపించాను; మైసూరులో అరసులు వారొకరు (రాజకులస్థులు) నన్ను అగసాలివాడినని మోసపోయారు; చాలమంది నన్ను తమ అప్పులు చెల్లించవలసిన పాతనెచ్చెలు అని భావించారు. అప్పు చెల్లించి తీర్చవలసిన సావుకారునని నన్ను ఒక్కరూ అనుకోకుండా ఉండడమే ఆశ్చర్యం.

వెన్ను వైశిష్ట్యంవల్ల నాకు ఎక్కువ ఇబ్బంది కలగడం బస్సు ప్రయాణంలో: ప్రతి బస్సులోను నా వెనకసీటును అలంకరించిన మహాజనులలో ఒకరిద్దరు నన్ను "ఓహోహో! తిమ్మన్నయ్యగారూ ఎక్కడికి బయలుదేరారు?" మొదలయిన మాటలు ఆరంభించి, ఆ ఉత్సాహంలో చనువుతో వెన్నుమీద బలంగా గుద్దడమూ కద్దు! సర్రున నేను వెనక్కు తిరిగి చూచినప్పుడు, వారి ముఖంలో ఆశ్చర్యం, నిరాశ ఒకేసారు ఉదయించడం నేను నూరారుసార్లు చూచాను. ఇలాటి అనాహూతాలను తప్పించడంకోసం



నేను మొదట్లోనే కూర్చున్న చోటినుంచి లేచి, పూరా బస్సును ఒక్కసారి అవలోకించి, అందరికీ నా ముఖం బాగా చూపించి, మళ్ళీ కూర్చునే అలవాటు పెట్టుకొన్నాను. అయినా మధ్యన బస్సు ఎక్కినవారెవరైనా ఒక్కడు నన్ను వెనుకనుంచి చూచి, "అక్కడ చూడండి! మా పటేలు (గ్రామమునసబు) గారు ముందుసీటులో చప్పగా కూర్చున్నారు... మాటా పలుకూ లేకుండా!" అని పిలవనే పిలుస్తారు; దెబ్బతిననే తింటారు!

నాకు ఎక్కువ బాధ కలిగించే అంశమేమిటంటే, ఇంతవరకు నన్ను ఎవ్వరూ గణ్య వ్యక్తులైన మంత్రి, కలెక్టరు, పోలీసు ఇన్స్పెక్టరు, రేషనింగ్ ఆఫీసరు, అడ్వొకేటు ఇత్యాదిగా మోసపోలేదు అని. దెబ్బతిన్నా ఉంగరాల చేతి దెబ్బఅయితే, దెబ్బ తిన్నవాడూ కొంచెం తేన్చుతాడు. "క్షమించండి, తమరిని నేను మావూరు బడిపంతులని అనుకున్నాను." అని ఎవరైనా నట్టనడిబజారులో నిలబెట్టి అడిగితే, ఆ దినం నిద్ర ఎలా పడుతుంది? భోజనం ఎలా సయిస్తుంది?

నిజమైన మంత్రి కావడం భగవంతుడు నొసట వ్రాయలేదు. వెన్నుమీదనైనా వ్రాయలేదా? పొరపాటున ఒక్కరి మెల్లకంటికైనా ఈ పాడు వెన్ను, మంత్రి వీపువలె కనిపించ కూడదా? వెడల్పుకు తక్కువలేదు, పాడైపోయిన దీనికి! ఈ పూర్వాప్రాంతం బరువంతా మోసినా మోసేటంతటి దిట్టంగా వుంది; భుజబలం వుంది, పరాక్రమం తక్కువయినా. అయినా, అవలక్షణాల జాతకం, ప్రతిభావంతులైన ఒక్కరి వీపులాగయినా లేదు. పాడైపోయిన వీపు!

ఒకరుమాత్రం, ఒకేఒకదినంమాత్రం, బళ్లారిలో, వెనుకనుంచి చప్పట్లుకొట్టి "స్వామీ!" అని పిలిచి, నావీపు వెనుక ఒక కన్నడ కవి పేరు ఎత్తాడు! నేను బిరబిరా ముందుకు నడిచిపోయాను, ఇంకా రెండుమూడు సార్లయినా అతడు ఆ కవి పేరుపెట్టి నన్ను పిలవనిమ్మని. నాకు పరమానందమయింది. "ఆహా! నా వెన్నుకు ఇతడు ఇంతటి ప్రఖ్యాత కవి పేరు తగిలిస్తున్నాడు కదా! ఈ దినమే సుదినం." అని పొంగిపోయాను. తలకాయ చెడిన కొందరికే కవి అనే స్థానం అంత లాభదాయకం కాకపోయినప్పటికీ, ఋషి అనే బిరుదుకు అర్హమైన గుంపుకు అలాటి జనం పరిచయం ఉంటున్నప్పటికీ, చేరినవారి ఆ పేరు నాకు కర్ణరసాయనమైంది. కొసకు ఆయన పరిగెత్తుతూ పరిగెత్తుతూ వచ్చి నా పక్కకు వచ్చారు. నా ముఖాన్ని అతని ఎదుట పెట్టక తప్పని ఘట్టానికి వచ్చింది సన్నివేశం. అప్పుడు అతడు అందరిలాగా సిగ్గుపడి తల వంచుకొని పళ్ళ యిగిలింపును నీళ్ల వములుతూ మింగివేసుకున్నాడు. "క్షమించండి! తమరిని నేను మా కర్నాటకసంఘం సెక్రెటరీ గారని అనుకున్నాను; పొరపాటయింది; బేంద్రేగారు ఈ వూరికి వస్తారట గదా. ఆ సంగతి మీకేమైనా తెలుసునేమో కనుక్కుందామని పిలిచాను" అన్నాడు. కొంచెం సేపైనా, నన్నుచూచి బేంద్రే అని మోసపోయాడుగదా ఒక కన్నడంవాడు అనే నాసంతోషం వెంటనే అంతమయింది...... ఏమైనా, వెన్నుచూపితే, బేస్తు......

# 24. స్వంతశ్రాద్ధం

## 'దివంగత' శ్రీరంగ

"మరణం ప్రకృతి శ్శరీరిణాం వికృతిర్జీవిత ముచ్యతే బుధైః" అని కాళిదాసు చెప్పిన మాటలలోని వాస్తవం ఇటీవల తమ ఇహలోక యాత్రను ముగించిన శ్రీరంగగారి కతను తలుచుకొన్నప్పుడు స్పష్టమవుతుంది. శ్రీరంగగారి జీవితం ఖండితంగా ఒక "వికృతి" అని చెప్పవచ్చు. ఆయన మరణానికి ఆందోళన తెలుపుతూ పెక్కు పత్రికలు వ్యక్తులు ఎన్నో మాటలు చెప్పడం జరిగింది. కాని, "ఇదొక వికృతి జీవితం' అనేదానిని ఎవరూ కనిపెట్టలేదు. కర్నాటక దేశం వినా మరెక్కడైనా జన్మ తాల్చివుంటే శ్రీరంగగారు శ్రేష్ఠపురుషులు అయివుండేవారు అని ఒక పత్రిక అభిప్రాయపడింది. ఇలాటి మాటలు మరణించినవారి ఆత్మకు శాంతి తేవచ్చునుగాని ఆ ఆత్మ రహస్యాన్నే తెలుసుకోలేదని చెప్పవచ్చు. ఎందుకంటే, జన్మదాల్చే టప్పుడుగూడ తప్పు స్థలం ఎన్నుకొనే వికృత స్వభావమే శ్రీరంగగారివంటివారి వైశిష్ట్యం. అది అలా వుండనీ "నేను చస్తే ముగ్గురు చచ్చినట్టు" అని మరణశయ్యమీదే శ్రీరంగగారు నుడివారన్న వార్త ప్రకటించబడినప్పుడు, ఎంతమంది ఆమాటల మర్మాన్ని తెలుసుకొన్నారు? శ్రీరంగ, ఆర్. వి. జాగీరదార్, ఆద్య రంగాచార్య—ముగ్గురూ ఒక్క దెబ్బకు మరణం పొందారు.

శ్రీరంగగారిమీది మూడుపేర్లూ వేరువేరే వ్యక్తులనే సూస్తున్నవని చెప్పవచ్చు. కొసవరకు ఈ ముగ్గురిలో ఒక్కడూ నిశ్చయంగా తక్కిన ఇద్దరిని జయించలేదు. అలాగే శ్రీరంగగారి జీవితకథ అయితే from failure to glorious failure అనే రీతిగా సాగింది. "చచ్చిన గేదెకు సవాసేరు నెయ్యి" అనే సామెతలాగ పలువురు పలు మంచి మాటలనయితే పలికారు. మరణించినవారిని నిందించాలనే ఇచ్ఛ నాకూ లేదు. అయినా, "శ్రేష్ఠ నాటక కారుడు", "సాంఘికక్రాంతివీరుడు", ప్రతిభావంతుడైన భావనాజీవుడు", "శీలసంపన్న చారిత్ర్యధీరుడు", "ఆధునిక కన్నడ గద్య విధాత", "రంగభూమి ఉత్తుంగ శిఖరం"— ఇలాటి విశేషణాలు ఉపయోగించిన వారికి శబ్దాల మహత్త్వమూ తెలియదు, శ్రీరంగగారి స్వభావమూ తెలియదు అనే చెప్పవలసివస్తుంది.

సుమారు 48 సంవత్సరాల ఆయుస్సులో ఈ వ్యక్తి చేసినదేమిటి? పెరిగింది 20 సంవత్సరాలు; సర్కారు నౌకరయి పాటుపడింది 19 సంవత్సరాలు; మిగిలినవి ఏడు సంవత్సరాలు మాత్రం! మొదటి 20 సంవత్సరాలలోను చెప్పుకోదగిన ఏ విశిష్టలక్షణాలూ శ్రీరంగగారిలో లేవు అందరిపలెనే నేర్చిన చిలు పలుకులవంటి చదువులో కొంచెం నిష్ణాతులుగా వుండినమాట నిజం; అయితే. వీరి నాటకాలలోని ఒక పాత్ర శైలిలో చెప్పేటట్లయితే, మునుపటి జీవితంలో ప్రతిభ భాసించలేదు, there was no brilliance మూడు



సంవత్సరాలు విదేశవాసం అయింది, ఐ. సి. ఎస్. ఫెయిలూ అయింది. అప్పుడు అందరిలాగ నౌకరీ వెదికే నిరుద్యోగి బాలుడయ్యాడు శ్రీరంగ. తర్వాత నౌకరీ దొరికింది. కడుపు నింపుకొని సంతుష్టుడై వుండిపోయాడు. తక్కినవారికంటె ఎక్కువ చైతన్యయుతమైన వ్యక్తిత్వం వుండినదనడానికి ఏ విషయాల ఆధారమూ లేదు.

పందొమ్మిదిసంవత్సరాల సర్కారీ నౌకరిగురించి ఎక్కువగా వ్రాయవలసిన అవసరమే లేదు. ఎందుకంటే, ఆపని తనకు సరిపడదు అని స్వతఃగానే మనస్సుకు గోచరమయినప్పుడు (అదిన్నీ అన్నిసంవత్సరాల తర్వాత!) తానే ఆ నౌకరీని సంతోషంతో వదలిపెట్టాడు. ప్రొఫెసర్ జాగీర్‌దారుగారి ఎడల పూజ్యభావమున్న విద్యార్థులు ఎంతమంది అనే సంగతిని నేను చెప్పడం సాధ్యంకాదు. అయితే, ఆ ప్రొఫెసరును చూచినప్పుడు, "ప్రొ. జాగీర్‌దార్" అని తమలో తాము భయంతో సన్నగొంతుకతో చెప్పకొనే విద్యార్థులను నేను పెక్కుసార్లు చూచాను. ఇది గౌరవమో, కాదో తెలిసినవారే ఆలోచించనీ. సంస్కృతం ప్రొఫెసరయిన ఈవ్యక్తి 19 సంవత్సరాలలో తనవిషయంలో ఒక్క పరిశోధనాత్మకమైన లేక ప్రౌఢమైన గ్రంథాన్ని రచించడం నాకు ఇంతవరకు తెలీదు. ఇంత ఎందుకు? సంస్కృతం ప్రొఫెసరని వీడిని ఉపన్యాసానికి పిలిస్తే, కర్నాటక ఏకీకరణంపై ఉపన్యసించేవాడు మహాశయుడు! మనలో ఆ విధంగా విద్వత్తను చూపిన ప్రొఫెసర్లు ఎంతమంది అనే సమాధానం నాకు అక్కరలేదు. ఈ వ్యక్తి ప్రతిభావంతుడయి వుంటే, ఆ ప్రతిభను ప్రతిబింబించే రచనలే లేవుకదా అనే సంగతిని నేను చెప్పవలసివుంది.

అందరూ బహుముఖంగా పొగడిన శ్రీరంగగారిని తెగడాలని నా వాంఛ కాదు. అయితే, పొగడ్తకూ మితి వుండాలి కదా! కర్ణాటక సాహిత్య పరిషత్తుకు అఖిల కర్నాటక స్వరూపాన్నీ, నిశ్చితమైన వ్యవస్థనూ ఒనగూర్చిన శ్రేయస్సు శ్రీరంగగారిదే అని మరొక పత్రిక వ్రాసి, కన్నడ ఆచార్య పురుషులను అవహేళన చేసింది. శ్రీరంగగారు ఏమైనా చేసివుంటే అది మైసూరువారికోసం, తనలోవున్న అసూయకోసం అని ఎందుకు చెప్పరాదు? ఆపరిషత్తు ప్రయోజనం—దానిని నిర్మించినవారు మరొకరు, దానికోసం పాటుపడినవారు మరొకరు, అయినా దాని ప్రయోజనం—తనవైపు జిల్లాలకూ కలుగాలని శ్రీరంగ సాహిత్యపరిషత్తులో ఉపద్వ్యాపం చేసివుండవచ్చును—అని నా అంచనా. ఎందుకంటే, అవ్యక్తి స్వభావం, యోగ్యత నాకు బాగా తెలుసు. సంస్థను నిర్మించే స్వభావం వాడికి లేదు; అంతేకాక వాడి యోగ్యతచూచి ఎవరూ వాడికి సంస్థను నిర్మించే పని అప్పగించేవారుకారు; నిర్మించే సమయం రాగానే వాడిని వెళ్ళగొట్టేవారు. ఎందుకు? వాడి యోగ్యత బునాది వేయడం వరకే, అని చెప్పవచ్చును గదా? నాకు పెక్కు విషయాలు చాల వివరంగా తెలుసునని చెప్పాను గదా! వాటి నన్నిటిని వెలుపలికి లాగడం ఉచితం కాదు. ఒకమాటమాత్రం చెప్పగలను. అందరికన్నా తాను బుద్ధిమంతుణ్ణనే అహం తన నడతలోనే చూపుతున్నందున శ్రీరంగకు సంస్థనుగాని, సంఘాన్నిగాని నిర్మించడం సాధ్యంకాలేదు.

అదంతా అలావుండనీ. శ్రీరంగకు లేని యోగ్యతను గురించి నాకు ఖేదం లేదు. కాని, ఏ యోగ్యత ఆ వ్యక్తిలో వున్నదని మనం భావించామో అక్కడకూడ మనకు

ఆవ్యక్తి నిరాశ కలిగించాడే అనిమాత్రం నాకు చాల ఖేదం. దీనికి దృష్టాంతంగా శ్రీరంగ గారి నాటకాలను చూడవచ్చు. తనకాలపు రంగభూమి దృష్టితో ఈ నాటకాలు "క్రాంతి కారక" మయినవి; శ్రీరంగ నాటకకర్త మాత్రమే కాదు, కొంత అభ్యాసం చేసివుంటే ఉత్తమ నటుడూ అయ్యేవాడు. అయినా, తన 20 సంవత్సరాల నాటక సాహిత్య నిర్మాణ కాలంలో శ్రీరంగ కన్నడ భూమిలో ఏలాటి పరిణామమూ కలిగించకనే పోయాడే! వీడి నాటకాలకోసం ప్రయోగపద్ధతి మారలేదు: వీడే ప్రదర్శించిచూపిన పరిణామంగా కన్నడ రంగభూమిలో యోగ్యతగల నటుడుగాని, నటిగాని ఒక్కరైనా పుట్టుకొని రాలేదు. ఇంకా మరొకతీరు యోగ్యత శ్రీరంగలో ఉండినదని వీడి నాటకాలవల్ల తెలుస్తుంది; అదేమిటంటే, బుద్ధివైఖరి. కేవలం కొత్త భావాలకు తార్కాణమని చూచినా, ఈ నాటకాలలో కొన్నింటినైనా మెచ్చవచ్చు. అయితే, ఆ భావసరణి శ్రీరంగరచనలు దాటి ఒక్క అడుగైనా వెలుపలికి పెట్టలేదు. సంఘంలో ఆ భావాలకు అవకాశమే దొరకలేదు.

వాస్తవమైన విషయమేమిటంటే, శ్రీరంగనుంచి ఏదైనా ఒక ఉత్తమ కార్యసాధన అవుతుందని కొసవరకూ నమ్మినవారిలో నేనొకణ్ని. వాడు ఆఖరులో సర్కారు నౌకరీకి రాజీనామా యిచ్చినమీదట "ఇప్పుడు రెక్కలు నిజంగానే బలపడ్డాయి" అని ఆత్రంతో నిరీక్షించాను. అయితే ఏమి? ఏకాలంలో అన్ని నిర్బంధాలూ దూరమయాయో, ఆ కాలానికి ఈ మహాశయుడు అంతర్ముఖుడయ్యాడు! పని మంచిదయినా, దానిని సరికాని వేళకు, లేక సరికాని స్థలంలో చేయడం శ్రీరంగగారివంటివారి స్వభావవైశిష్ట్యమని ఇంతకుముందే చెప్పాను కదా! రాజీనామా యిచ్చిన వెంటనే, రంగభూమి పక్షాననో, మరొకవిధంగానో ఈ వ్యక్తి కర్నాటకమంతటా సంచరించి నూతన చైతన్యాన్నే కలిగిస్తాడనే నా నిరీక్షణ ఎక్కడో వుండిపోయింది! ఈ వ్యక్తిమాత్రం వేరు సాగినట్టు ఒకేచోటు పట్టుకుని, కుళ్ళిపోయిన, జనానికి అభిరుచిలేని రాజకీయ విషయాలపై వ్యాసాలు వ్రాయసాగినాడు! "వివేక భ్రష్టానాం భవతి వినిపాతః శత ముఖః" అని భర్తృహరి, పేగులు తెగి పడేట్టు ఎలుగెత్తి చెప్పడం నాకు జ్ఞాపకం వచ్చింది. తీరా మరణోన్ముఖుడయినప్పుడే రోగి తనవైపు వచ్చేట్టు చేసుకోడం కొందరు డాక్టర్ల భాగ్యం. అదేవిధంగా చావడానికి సిద్ధమైన విషయాలను గురించే ఆర్భాటం చేసే భాగ్యం శ్రీరంగగారిదేమో! ఏమైనా, కొసకు కూడా ఈ వ్యక్తివిషయంలో నాకు నిరాశ కలిగింది.

నా ఈ అభిప్రాయాలు పలువురికి రుచింపవని నాకు తెలుసు. వ్యక్తి కనుమరుగైన కొన్నాళ్ళకే ఈరీతిగా దోషవ్యంజకంగా వ్రాయడం వుచితం కాదని పెక్కుమంది నన్ను విమర్శించవచ్చుననీ నాకు తెలుసు. అయితే, సహజప్రాప్తమైన చారిత్రం, బుద్ధి శక్తి ఈరీతిగా నిరుపయోగం కావడం సహింపలేక దీనిని వ్రాశాను. నామాట నిజమని అంగీకరించే పక్షంలో మరణించినవారి ఆత్మకు శాంతి లభించదనే సంగతి నాకు తెలియదని కాదు. అయితే, ఇహంలో కాని, పరంలో కాని, శాంతిజీవితం శ్రీరంగగారిది కాదనే భరోసా నాకు వుంది. ఈ ధైర్యంతోనే వ్రాశాను. కన్నడ ఇతిహాసంలో నేమో శ్రీరంగగారికి స్థానం లభిస్తుంది; కాని, ఆ వ్యక్తి మహత్వాకాంక్ష దానికన్నా ముందుకు వెళ్ళిందనే సూక్ష్మాన్ని నాలాగ ఎంతమంది గ్రహించారు?

# 25. పడిశం

## తీ. నం. శ్రీకంఠయ్య

"ఒకటి, రెండు, మూడు, నాల్గు, ఐదు...లేదు. ఇంకా ముగియలేదు!—ఆరు, ఏడు, ఎనిమిది, తొమ్మిది—అబ్బబ్బా! పది. ఇంకా ఒక్కటి! ... ఇప్పుడు శాంతమయింది!"

ఇదేమి లెక్కింపు? ఇంటిలో వుండే పిన్నలకు, పెద్దలకు, అందరికీ ఈ బెరుకు ఎందుకు? వెలుపలినుంచి ఎవరైనా సంస్థానాధిపతులు ఏతెంచినప్పుడు కాల్చే ఫిరంగి గుండ్లను ఈవిధంగా లెక్కపెడుతున్నారా?

లేదు, లేదు! నాకు పడిశం పట్టినప్పుడు ఛీంకరించే తుమ్ముల లెక్క యిది! వెలుపలి ప్రభువుల ఆగమన నిర్గమన కాలాలలో మాత్రం ఫిరంగిగుండ్లు ప్రేల్చే మర్యాద జరగడం సంప్రదాయం. అయితే నా ఈ పట్టపు దొరకు అంతతో తృప్తిలేదు; ఇన్నే గుండ్లని క్లుప్తమూ లేదు. స్వేచ్ఛగా, స్వతంత్రంగా, లెక్కింపును ధిక్కరించి తుమ్ములు బయలువెడలి ఇంటినిండ ప్రతిధ్వనిస్తాయి; నాభినుంచి నడినెత్తివరకు అంగాంగాలను అల్లాడించి వేస్తాయి. వరుసగా పెట్టిన డైనమేట్లు ప్రేలినప్పుడు బండలు బీటలువారి మన్నంతా విరజిమ్మి ఉత్కంపించే భూభాగంవలె నేనుండగా, మా యింటివాళ్ళందరూ నా తుమ్ముల తుంపరలు పడనంత దూరంలో నిలబడి, కొంచెంకూడ భయంలేకుండా ఉత్సాహంతో తుమ్ములను ఎంచడానికి పూనుకుంటారు. ఈసారి ఇన్నే వస్తాయి అని— నాకు తెలియకుండా—ఒకరితో ఒకరు పంతాలు, పందేలు కూడా కడతారో ఏమో! నాకు చేయి కాలు నొప్పి అంటే బాధపడే నేను చేపట్టిన ఆవిడ కూడ ఈ విషయంలో తక్కిన వారితో చేరుతుంది. కోపపడి ప్రయోజనం లేదు. గొంతు బాగా మూసుకొని పోవడంవల్ల నా గట్టిగా ఆర్భాటం చేయడానికి కూడ కాదు. పోయింది - ఈ పడిశం, తుమ్ములవల్ల నా దర్పమే పోయింది, గౌరవమే పోయింది!

ఇదొక పెద్ద దుఃఖం నాకు. పడిశం ఎటువంటి ప్రబలమైన వ్యాధి! ఇది పడితే చాలు. ముక్కు ఏనుగుతొండమంతటి బరువవుతుంది. కళ్లు మండే నిప్పులయి, అంగిలి ఉక్కు కాలిన పెంకయి, గొంతు కఫపు బురదలో అణగారి పోతుంది. ఎవ యేమో తోచదు. దేహం యంత్రంలో అదిమినట్లవుతుంది. తల మెడమీద నిలిచినట్టే తోచదు. ఊర్ధ్వభాగమంతా ఈ రోగపు అసంఖ్యాక క్రిమిసైన్యాలు విడిసివుంటాయి. ఇంతయినా, పడిశం పట్టినవాని విషయంలో ఎవరికైనా సహానుభూతి వుందా? ఎవరికైనా కొంచెం జ్వరం తగిలితే చాలు! వెచ్చగా పక్కవేసి కప్పి, నోటికి రుచిగా వుండేట్టు పాలు, గంజి

ఒదిగించి మందు మాకు కోసం ఇంటిల్లిపాదీ తిరిగేవారే. సాధారణంగా ఇలాటి గగ్గరైనా పారాడని స్నేహితు లందరూ వెదుకుతుంటూ వచ్చి దగ్గర కూరు, అమోల ఈ మాట చెబుతూ, వేసట తీర్చేవారే. జ్వరంకన్నా పడిశం తీవ్రంగా ఎంతం చేసొన్ని పిస్కాని తింటున్నా, మీ విషయం ఎవరికీ లక్ష్యం లేదు. "ఒక్క బొట్టెల్లయినా లేవండీ ఇల్లో అంటే, డిపోకు పోయి కనుక్కొని రాకూడదూ ?" అని మీ అర్ధాంగే ఆజ్ఞాపిస్తుంది. "అసలే పడిశం, తలబరువు, వీటిమీద వర్షంపేరే పడుతున్నది కదవే!" అని మీరు ఒకటి రెండుసార్లు దగ్గి గరగరధ్వనితో మాట్లాడితే, "అయ్యో! మీ పడిశం లేని నం ఏది? తల మీద ఒక తువాలు వేసుకొని పోయిరండి; కావలసివుంటే శాలువాయే కప్పుకోండి. ఆ మీదట కషాయం కాచియిస్తాను; అంతా సరిపోతుంది." అని తాత్సారంగా అంటుంది. అంతటితోనే ఆపక, "ఇంతటికీ మీదే అపథ్యం. తెలిసి తెలిసి క్షౌరం చేసుకుని తలకు స్నానం చేశారు! ఒకరోజు ముఖం చెక్కుకోకపోతే ఏమి వుండిపోతుంది? మజ్జిగ వేసుకోవద్దండి అని నేను నిన్నరాత్రి ఎంత గొణుక్కున్నా విన్నారా? పసిపిల్లలలాగ హఠం చేశారు. ఇప్పుడు అనుభవించండి." అని పంగించి వెలుపలికి తోలివేస్తుంది. ఆమెకు ఎప్పుడూ మీ మజ్జిగమీదే కన్ను. అన్నానికి పాలు కలుపుకుంటే ఒక్క ముద్ద కూడ మీ గొంతులోకి దిగదని ఆమెకు తెలుసు. అందుకోసమే పడిశంచాయ కనిపించిందో లేదో అన్నిటికంటే ముందు మజ్జిగను తప్పించివేస్తుంది. పాలు అన్నం ఔషధం లాగ వడ్డిస్తుంది. ఇంతేకాదు. మండువేసవిలో కూడ మీరు ఒకగ్లాసు నీరుమజ్జిగనో, నిమ్మకాయరసం పిండిన షర్బత్తునో ఇమ్మని అడిగితే, "చాలు వూరుకోండి. అలా చాపల్యం పడరాదు. పడిశం వచ్చేని." అని చిరునవ్వు నవ్వుతూ నిషేధించివేస్తుంది.

ఇంటి సౌఖ్యం ఇలా అయింది. బయట చూద్దామా? మీరు ఎదురువస్తే ఆప్త మిత్రులు కూడ పామును చూచినట్టు వెనుకంజవేస్తారు. ఇక విధిలేక మాట్లాడక తప్ప నప్పుడు, మురుగుకాలవ దుర్వాసనకు అసహ్యపడుతున్నట్టు ముఖానికి గుడ్డ అడ్డం పట్టు కొనే నిలబడుతారు. కొంతమంది చనువున్న స్నేహితులయితేనో "అయ్యా, మహాను భావా, ఈ పడిశం కట్టుకుని ఏ దిగ్విజయానికి బయలుదేరావు? హాయిగా ఇంట్లో ముక్కు మూసుకొని ఉండరాదూ! నీ శీతశీకరాలను మామీద విరజిమ్మవద్దు నాయనా!" అని స్పష్టంగానే చెప్పి దూరంగా తోస్తారు. అయితే వీరి బహిష్కారానికి బెదిరిపోయి నిత్య కృత్యాలను విడవడం అయ్యేనా? ముక్కు బిగుసుకొని పోయినప్పుడల్లా సెలవు వ్రాసి వేసి, ఇంట్లో కూర్చుంటే, జీతానికే సున్నకుసున్న హళ్ళికిహళ్ళి కావచ్చు! ఇంతకూ పడిశం నా ఒక్కడి వారసత్వం ఆస్తి ఏమీ కాదుకదా! వీళ్ళ ముఖాలను అది మూచూడ గూడదా? అలాటి స్వామ్యభావన నా కేమీ లేదు. నా సహవాసంవల్ల వీళ్ళకూ దాని సన్నిహిత సమీప పరిచయం కలుగనీ; అప్పుడు మెత్తబడుతారు. "సమాన శీల వ్యసనేషు సఖ్యం" అనే ఉక్తి సార్థకంకావడం మరి ఎలా? చేతిలో జేబురుమాలు పట్టుకొని, ముక్కు పిండుకుంటూ, కన్నీరు కురిపిస్తూ, దీనవీక్షణాలను ఒకరిపై మరొకరు ప్రసరింపజేసినప్పుడు కదూ సహానుభూతి ఆకులు తొడిగి, మైత్రీ బంధం బలపడుతుంది.



పడిశానికి ఇలాటికాలం, ఇన్నిసార్లు అనే కట్టుబాటు వున్నట్లు నా అనుభవానికి రాలేదు. చలికాలంలో, అందులోను మూరపడుతున్నప్పుడు దీని పరాక్రమం హెచ్చు అని చెప్పేవారు ఉన్నారు. నవంబరునెల మొదటివారంలో పడిశం భేటీ ఇవ్వకుండావుంటే, ఋతుధర్మమే మారిపోయినట్టు ఆందోళనపడేవారూ ఉన్నారు. అయితే నా పడిశం తన సవారీకి పరిమితులు కల్పించుకోలేదు. అందువల్లనే ఒకొక్కప్పుడు నా ప్రశంసలు కూడ గడించింది. నాకు పరిచయమున్న పెద్దమనిషి ఒకరు "నాకు మూడునెలల కొకసారి తప్పక పడిశం పడుతుంది" అంటూ నెల కొకసారి తప్పకుండా వేయిరూపాయల జీతం తీసుకుంటున్న వారిలాగ గొప్పలు చెప్పుకున్నారు. అయితే వారిని గురించి నాకు కని కరమూ, వారి నియమబద్ధమైన పడిశం విషయంలో తిరస్కారమూ కలిగాయి. నా పడిశం పూర్ణస్వాతంత్ర్యాన్ని తలచుకొని, దానిమీద అభిమానం పొంగివచ్చింది. అది ఇలాటి పరిమితులకు కట్టుపడేదికాదు. మనస్సు వస్తే మరీమరీ వస్తుంది, చాలకాలం వుంటుంది. లేకపోతే ఎన్నినాళ్లు నేను కాచుకూర్చున్నా ఈవైపు రానుగూడ రాదు. ఉదాహరణకు:- ఈసారి నవంబరునెలలో నా చుట్టుపట్టు అందరూ తుమ్ముల బొబ్బరింతలు పెట్టినా, నేను మాత్రం శీతనిరోధకమైన ముఖాచ్ఛాదనం ధరించినవాడిలాగ ప్రశాంతంగా వున్నాను; నిరామయంగా తిరుగులాడాను. డిసెంబరునెల తల చూపిన తర్వాత, ఇంతగా ఒగ్గిన అతిథేయుణ్ణి ఇక కాచుకొనేట్టు చేయరాదనుకొని నా పడిశం దొడ్డమనసు చేసి, ఇప్పుడు భేటీ యిచ్చింది. అయినా, మితమైన పరివారంతో వచ్చింది; నానుంచి ఎక్కువ సేవను అపేక్షించలేదు. ఈ ఉబుసుపోకమాటలు వ్రాయడానికి కూడ అవకాశం ఇచ్చింది. (ఇది తన వ్రతాపవర్ణన మయినందున ఈవిధంగా వూరికే వుందని భావించి దాని ఔదార్యానికి కళంకం ఆపాదించ దలచుకోలేదు.) మరి యెన్నోసార్లు మండు వేసవిలోనే సహవాసంపై వున్న మమతతో, కాతరభావంతో నావద్దకు పెక్కుసార్లు వచ్చింది! వెలుతురుకు నేను కళ్లు విప్పనంతగా కూడా ముఖానికి ముట్టడి వేసింది.

ఈవిధంగా నా పడిశం సర్వస్వతంత్ర మయినప్పటికీ, దానికి సమయపరిజ్ఞానం లేదని నేను అనలేను. ఎందుకంటే, నేను ఎక్కడైనా ప్రసంగించాలని ఏర్పాటయితే, ఆహ్వానపత్రికను చూచుకొని వచ్చినట్టు ఒకపొద్దు ముందుగానే వస్తుంది. తండ్రి ఎక్కడికైనా బయలుదేరినప్పుడు బిడ్డ మొండితనం, మారాముచేసి బుజం ఎక్కేటట్టు ఇదికూడా నా ముక్కులో జొరబడి నాతోపాటే బయలుదేరుతుంది. ఒకసారయితే దీని జాగరూకత నాకు దిగ్భ్రమ కలిగించింది. ఒకరి జీవితంలో ఒకటి రెండుసార్లు మాత్రం ఒనగూదే సందర్భ మది. వ్యవస్థాపకులు ఏ కారణంవల్లనో నాపైన అక్కరచూపించి, ప్రసంగించా అని కోరారు. నేనూ ఔత్సుక్యంతో ఒప్పుకున్నాను. ఆ మహోత్సవంలో నా అత్యల్పమైన వాగ్వైభవాన్ని చేతనయినంత ఆకర్షకంగా ప్రదర్శించాలని సంకల్పించాను. అయితే, ముహూర్తానికి సరిగ్గా ఒకరోజు ముందు పడిశం నా ముక్కును తట్టి, గొంతు పట్టుకుంది. ప్రసంగంనాడు నా గొంతు తగ్గిపోయింది అనడానికి మారు పూడిపోయిందంటే నిజానికి దగ్గర కావచ్చు. "కల్లుబసవ" (రాతి బసవన్న) నోటి నీటిధారవలె ముక్కునుంచి నీరు

సంతతధారగా కారసాగింది; నా జేబురుమాళ్ళ సరఫరా ముగిసిందే కాని, దాని ప్రవాహం తగ్గలేదు. ఏమిచేయడం? పడిశానికి రామబాణం ఏదీ లేదని నాకు బాగా తెలుసు. ఏ తారక నామమూ శరణు కానక, తన కర్మను తానే అనుభవించి సమయించవలసి వచ్చినట్టు, కనీసం మూడునాళ్ళయినా దాని తీవ్రతాపంలో తపించె తీరాలనీ నాకు తెలుసు. అయినా, ఆపత్కాలంలో కిన్న రాయికి చేతులెత్తి దండంపెట్టేటట్టు నేను విన్న అన్ని చికిత్సలూ చేయించాను. పడిశం అజీర్ణంవల్ల ప్రబలమవుతుంది. దీనికి ఉపవాసం మంచిది-అని ఎవరో చెప్పారు. ప్రాచీనకాలంలో, యుద్ధపు వెనుకటి రాత్రి యుద్ధవీరులు దర్భశయ్యల మీద నిరాహారవ్రతం పట్టి పడుకొనేటట్టు నేనూ పరగడపుతో పొర్లాడాను. అయినా ఏ గుణమూ కనిపించలేదు. వట్టి అటుకులు తింటే పడిశాన్ని పీల్చివేస్తుందని మరునటి దినం ఉదయం మరొకరు సలహాయిచ్చారు. అలాగే కానిమ్మని-బహుశ వెనుకటిరాత్రి ఉపవాస ప్రేరణకూడ కొంచెంచేరి-ఒక పిడికెడు అటుకులు ఈ దుర్భిక్ష కాలంలోను ఎలాగో సంపాదించి దాని అనుపానాదులు ఏమీలేకనే బొక్కిచూచాను. అటు వైద్యుని వద్దకు పోయి, నోరు ఊరంత తెరిచి, మింగలేని, కక్కలేని ద్రావకాన్ని గొంతులో పూయించు కున్నాను. బూడిదరంగు చేదు ఒగరు ఘాటు నీరు తీర్థంలాగ ప్రాశనం చేశాను. ఇంటికి వచ్చి కణకణలాడే నిప్పులముందు కూర్చుని కంఠశోధం పవనుకానిమ్మని మనస్సులోనే వేడుకొని ముఖాన్ని తప్పెటలాగ కాచుకున్నాను. తర్వాత ఆ నిప్పుమీద పసుపుపొడి విదలించి-రాగిపిండినీ కలపవలసింది; కాని, బంగారం ఇచ్చినా అది దొరికేట్టు కనిపించ లేదు! తలకు కంబళి కప్పుకొని, పైకివచ్చే ధూమస్తోమాన్ని ముక్కు నోరు పిడచగట్టు కొని పోయేవరకు పీల్చి పీల్చి క్రిముల ఉచ్చాటన కానీ అని మంత్రం జపించాను. కొసకు ఒక హితశత్రువు బోధనకు చెవి ఒగ్గి ఒకటి రెండు చిటకాల నస్యమూ ఎక్కించాను. మొదటికంటె నాల్గుపాళ్లు ఎక్కువగా తుమ్ములు వచ్చాయి; ముక్కు మరింత పాడయింది!

ఇంత సాధనచేసినా ఫలంమాత్రం గోచరం కాలేదు. అయినా నేను దిగులు పడక ఆదినం సాయంకాలం చొక్కాలమీద చొక్కాలు తొడుక్కొని, మెడకు ఉన్నిపట్టి (మఫ్లరు) చుట్టుకొని, తలకు లపేటా ధరించి, గొంతు సవరించుకొనే మాత్రలను చప్పరిస్తూ, వేదిక యెక్కి మహాసభను ఎదిరించి నిలబడ్డాను. ముందుభాగంలోనే ధ్వనివర్ధకయంత్రం (మైక్) ప్రకాశిస్తూ విశ్వాసం కలిగించింది. నోరు తెరిచాను; నాలుక ఆడించాను. అయితే ధ్వని వెలువడనేలేదు. చలనచిత్రమందిరంలో ఒక్కొక్కమారు ధ్వని ఒక్కటి రెండు క్షణాలు ఆగిపోయి, పాత్రల మూగసైగలుమాత్రం కనిపించిన అనుభవం నా శ్రోతలకు లభించి వుండాలి. యంత్రమే పనిచేయడం లేదేమోనని వ్యవస్థాపకులు గాభరాపడి పరిగెత్తి వచ్చారు. ఆవేళకు నా ధ్వని పడిశపు పట్టునుంచి కొంచెం విడివడి, గుర్తుతెలియనంత బదుగుగా, జడంగా గుహనుంచి వచ్చిన గుర్రులాగ వెలుపలికి వచ్చింది. దానిని విని నాకే జుగుప్స కలిగింది. ఆలోచించిన ఉత్కృష్టభావాలన్నీ ఎక్కడికో పలాయనం చిత్తగించాయి. జలపాతంలాగ దూకవలసిన నా వాగ్ప్రవాహిని వేసవికాలపు కొళాయి నీటిలాగ జొట జొటలాడుతూ బొట్లు పెట్టసాగింది. అటూ, ఇటూ మూడునాల్గు నిమిషాలు మొండితనంతో



మాట్లాడాను; ఆఖరుకు ఓటమిని ఒప్పుకొని, ముక్తాయింపు చెప్పాను. ఆ మీదట బుద్ధి నేర్చాను. ప్రసంగించమని ఎవరైనా పిలిచినప్పుడు, "నా పడిశం అనుమతిస్తే" అని ఒక నిబంధనను చేర్చడం మరువడంలేదు.

ఈ అశరణతకు పరిహారమే లేదా? వైద్యవిద్య ఇంత అభివృద్ధి చెందినప్పుడు, నిన్న మొన్నటివరకు పేరైనా వినని అపూర్వరోగాలన్నిటికీ చికిత్సాక్రమం ఏర్పడి వున్నప్పుడు, ప్రాణులకు జన్మశత్రువయిన ఈ పడిశానికి ఎందుకింకా మందు సిద్ధంకాలేదు? అన్నిటికీ సూదిమందు కుచ్చేటట్టు దీనికికూడా కుచ్చి రోమకూపాలను ఎక్కువచేసే విధా నమూ అక్కడక్కడ వాడుకలోకి వచ్చింది. అయితే ఏమి? "పడిశానికి చికిత్సచేస్తే ఒకవారంలో గుణమవుతుంది; అలాగే వదలితే, ఏడురోజులు అవసరమవుతుంది." అనేదే ఇంకా ఆఖరుమాటగా మిగిలింది. పడిశం రాకుండా అడ్డగించే ముందుజాగ్రత్త తీసుకొనే పద్ధతి అయితే కలలోని కలిమే. కైలాసశిఖరంమీదనయితే పరమశివుడు, గంగాధరుడూ, చంద్రశేఖరుడూ అయినప్పటికీ, ఫాలనేత్రపు కుంపటిని నిరంతరం మండిస్తూ శీతబాధను దూరంగా పెట్టివుండవచ్చు. భూతలంమీదవున్న మనకైతే ఏ పరిహారమూ ఇంకా గోచరం కాలేదు. మానవుని దేహనిర్మాణంలోనే ఈ వ్యాధికి భద్రమైన నెలవు దొరికింది. పామెత చెప్పింది నిజం: "ముక్కువున్నంతవరకు పడిశం తప్పేటట్టులేదు."

# 26. సీతైతాళులు

## శివరామ కారంత

కెరెమనె (చెరువింటి) సీతారామ ఐతాళులు అనేది వారిపేరు. వారి యిల్లు వున్నది మావూరు చెరువుగట్టుమీద. అందువల్ల వారిని కెరెమనె (చెరువింటి) ఐతాళులు అని అనడమూ కద్దు. తపాలా చిరునామావరకు వారు సీత ఐతాళులు; దస్తావేజు వోట్లవిషయం సీతారామఐతాళులు; పల్లెలో వ్యవహార రూఢికి సీతైతాళులు-ఇలా ఒక్కొక్కరీతిగా వారిని సంబోధిస్తారు. వారి యింటిని నేను చెరువుగట్టుమీద చాల చిన్నవాడయి వున్నప్పుడే చూచాను. అప్పుడు వారిది గడ్డికప్పు గుడిసె. ఆ మీదట కొన్నిసంవత్సరాలకాలం సగం గడ్డితోను, సగం పెంకులతోను ప్రకాశించేది. మొన్నమొన్న గడ్డిపోయి పూర్తిగా పెంకులే వచ్చాయి. వచ్చేసంవత్సరం పెదర్లు తీసివేసి, మంచి పక్కా రీపులతోనే ఇంటికప్పు వేయించాలని అంటున్నారు. చెరువుగట్టుమీద వున్న మరొక ఇల్లేమో దేవునిగుడి. అక్కడ వుండేది విష్ణుమూర్తి విగ్రహమని తోస్తుంది. విష్ణు ఆలయం మావూరిలో పేరు పోయిన ఆలయంకాదు. అది ఐతాళుల ఇలువేల్పుగుడి; అయినా "ప్రాకి" నుంచి (ప్రభుత్వం నుంచి) పదో, ఇరవయ్యో రూపాయలు తస్దీకు (పరిహారద్రవ్యం) ఇస్తారట.

సీతైతాళుల ఇల్లు నిజానికి అగ్రహారంలో ఒక భాగం; దాని మరొక పెద నారాయణ ఐతాళులది. అగ్రహారం అన్నమీదట సీతైతాళులకూ, నారాయణ ఐతాళులకూ మూనె సీకాయి అని చెప్పనక్కరలేదు. అంతేకాక నారాయణ సీతైతాళుల ఖాసా తమ్ముడు. 'తనకు మీసం మొలచిన మూడురోజులలోనే' భాగం అడిగిన వీరుడు. అప్పుడే భాగాలయాయి. అన్నదమ్ములలో చూచినా, చూడనట్టు తొలగిపోయే పద్ధతి వచ్చింది. ఈ పద్ధతి వారిలోనేకాదు; వారిని నమ్మివచ్చిన ఇల్లాళ్లలోను యథాక్రమంగా రూఢి అయింది. ఇంటివెనుకవున్న 'గుమ్మికి' (ఏటికి) సీతైతాళుల భార్య పార్వతమ్మ పోతుంది; నారాయణుని పెళ్లాం నాగక్కకూడా పోతుంది. ఇద్దరూ గడియల వరకూ ముక్కు చేతులు మసిచేసుకొని ఒకరు ముఖాలు ఒకరు చూచుకొని అసహ్యపడి పాత్రలను ఇసకవేసి కోపంతో సమిసిపోయేట్టు తోముతూ కూర్చుంటారేకాని, "ఏమిటి? ఎలా?" అని నోరుతెరవరు. వీళ్లు మాట్లాడితే ఇంట్లో మగవారికి ఒంటికి పడదు అనేది నిజమే. అమ్మ, అబ్బ తిథినాడు మాత్రం, సంవత్సరానికి రెండురోజులు ఈ మరణించిన వారి పుణ్యబలంతో అన్నట్టు ఇద్దరూ దర్భ పవిత్రాలు పెట్టుకొని, పిండంముందు నాలుగు క్షణాలు కూర్చుంటారు. పిండం కాకికి పెట్టారు అనగానే వారివారి పునర్దర్శనం మరుసటి శ్రాద్ధంనాడే సరి.

నారాయణ అన్నలాంటి వ్యవహర్తా కాడు; మాటకారీ కాడు. విడిపోయిన తర్వాత అతనికి మిగిలిన దేమీలేదు. దానిమీద అన్నదమ్ములిద్దరికీ ఏడు సంవత్సరాలపాటు రణ



రంగ మయింది. హైకోర్టువరకు మూడు ఆవృత్తులు తిరిగిరావడం అయింది. కొనకు ఇలువేల్పు పూజ, అంటే విష్ణుమూర్తి తలమీద ఇన్ని నీళ్లుపోసే హక్కు, అన్న సీతైతాళులది అని కింది కోర్టు తీర్పు ఖాయమయింది. ఇకముందేమిటి? నారాయణ పట్టి చేతులతో బెంగుళూరు చేరి బళేపేటలోనో, సుల్తాన్‌పేటలోనో ఉడుపి హోటలు నడుపుకుంటూ వచ్చాడు. నెలకు నాల్గో, ఐదో రూపాయలు భార్యకు మనిఆర్డరు చేస్తూ వున్నాడు. సంవత్సరాని కొకమారు, అంటే సాలిగ్రామజాత్రవేళకు ఊరికి వచ్చి, ఒక నెలరోజులు వుండి తిరిగి బెంగుళూరుకు దయచేస్తాడు.

ఊరిలోనే వుండి, వూరివారి కంతా కావలసినవారై పేరు గడించిన వీరులు అంటే సీతైతాళులు. ఊరిలో ఎందరో అంటారు "సీతైతాళులు అంటే ద్రోణాచార్యులు" అని. కారణ మేమిటంటే, వారిలో బ్రాహ్మణ్యానికి చాలినంత బ్రాహ్మణ్యం వుంది; క్షాత్రానికి తగినంత క్షాత్రం వుంది. ఏ నంబరు గానీండి, (వ్యాజ్యం కానీండి,) వారు సగంలో అంబుల పొదిని కిందకి దింపినవారే కారు. అందరినీ హైకోర్టుకుఈడ్చే వదులుతారు. ఎందుకు-వారి మరొక పెద్దన్న లేడూ పద్ద ఐతాళులు! పద్ద ఐతాళులు మరణించిన తర్వాత, సీతైతాళులు ఆయన భార్యను పిలిచి, "చల్లగా మా యింట్లో కూడుతిని పడివుండరాదూ!" అని ఎంత చెప్పినా, ఆమె వినలేదు. దానికి బదులు పుట్టింటికిపోయి, కొమ్ములు మొలిపించుకొని భరణానికి నోటీసు ఇప్పించింది. ప్రారంభమయింది, "కటాకటి". అంతా ఆస్తి దేవుని వినియోగానికే వినా స్వంతం ఏమీ లేదు. అందువల్ల భరణం తిరుపతిలో." అని సీతైతాళుల వాదం. ఇది హైకోర్టుకు ఎక్కింది. అయితే ఐతాళుల దుర్భాగ్యంవల్ల ఆ 'చచ్చినవాని పెండ్లానికే' మంచిదై భరణం ఇచ్చే తీరాలని అక్కడా ఖాయం అయింది. అయితే ఏమి? "ప్రతి సంవత్సరం కోర్టు మెట్లు తొక్కనిదే ఆమెకు గింజబియ్యం కూడ దొరకదు" అనే ఐతాళుల భీష్మప్రతిజ్ఞ నేటికీ నడుస్తూ వస్తున్నది.

ఇంతగా వారి క్షాత్రవిషయమైతే, ఇప్పుడు బ్రాహ్మణ్య విషయం వినండి. నేటికీ వారు పంచెకట్టే తీరు, అంచులుతీసే క్రమం, అడుగులువేసే గత్తు—వారి తండ్రి అప్పైతాళుల తద్రూపం. నేటివరకు ఎంతటి వేసవికాలం కానీండి, మధ్యాహ్నపు ఎండకు ఇసుక కాలిన సముద్రతీరంలో తిరగడం కానీండి, తోలు వారలను మెట్టినవారు కారు. కుందాపురం కోర్టు మా వూరినుంచి కనీసం రెండు పరువులకుమీదే వుంది. అంతదూరమూ వారానికి రెండుసార్లయినా నడిచే పోతారుగాని మాలవారు కూర్చునే బస్సులో సవారీ చేయరు.

తెల్లవారుజామునే ఐతాళులు లేచి, స్నానంచేసి, విష్ణుమూర్తికి ఒకసారి గంట వాయించి, గంజికూడ పుచ్చుకోకుండా బయలుదేరారు అంటే, పొద్దుగూకిన తర్వాత కుందాపురం నుంచి బయలుదేరి ఇంటికి వచ్చి, స్నానంచేసి, మడి, జపం గివం ముగిసిన తర్వాతే భోజనం. వైశాఖమాసమే కానీండి, ఆకలి అయిందని దారిలో అక్కడ ఇక్కడ దూరి హోటలుకాఫీ రుచి చూచినవారు కారు. దాహం అయితే, అదీ తాగాలీ అనిపిస్తే, ఇంటినుంచి బయలుదేరేటప్పుడే ఇన్ని పెసరగింజలు రుబ్బించి కలిపి బెల్లం వేసుకొని.

తాగేరు. ఇంతా కుందాపురంలో వకీలు అచ్యుతరావు ఇంటికివెళ్ళి తామే బాయినుంచి నీళ్ల చేది తాగేరు. అచ్యుతరావు బ్రాహ్మణులే. ఆయనే ఎక్కడైనా, "ఐతాళులుగారూ రండి, ఒకింత కాఫీ తాగండి" అంటే, "కాఫీ వేడి అవుతుంది" అని సమాధానపరుస్తారే గాని, వారి ఇంటి "పట్టణవాసపు కన్నమైల" కాఫీ ప్రాణంపోయినా తాగరు.

ఐతాళుల రూపం చూడదగింది. బక్కపలుచని శరీరం; మాంసమే లేదు; ఎముకలే అన్నీ - అనే జాతి. కట్టుకోడానికి ఒక తూర్పునాటి పంచ. దానిమీద వెండిమొలతాడు కనిపించేటట్టు వేలాడవేసి, నడుముకు త్రాణ వచ్చేట్టు తమ పచ్చధావళి బిగించారు అంటే,- ఆ వర్చస్సు ఎలాంటిది? మెడలో ఒక సన్నటి రుద్రాక్షమాల. ఇక ఒంటిమీద, నొసట ఫర్లాంగుదూరానికి కనిపించే విభూతి పట్టెలు. సామాన్యంగా, క్షౌరానికి అనుకూలమైన తిథి దొరక్క - అంటే వారి తీరికకు, ఆ తిథికి సరిపోయేది ఏనాడూ లేదు - ఎల్లప్పుడూ ముఖంమీద హింగారువానకు తొందరగా కోసిన వరిచేనులాగ తెలుపు నలుపు మిశ్రితమైన శ్మశ్రుజాలం కనిపించి వారిని వైదికయుగానికి అయినంత సమీపానికి లాగుతుంది.

ఐతాళులు ఇంటిలో వుంటే, ప్రతినిత్యం ఒక పదినిమిషాలయినా భగవద్గీత పారాయణం చేయకుండా వుండరు. పాతసంప్రదాయాలమీద వారికి వుండే మమత అంతింత కాదు. ఇంతెందుకు? ఇంకా వారి యింటి చావడిలో చిమ్నీ దీపం వెలిగించే లేదు. వెమ్మెదీపమాయిరి, ఆముదమాయిరి.

మరొక సంగతి. ఐతాళులు ఏమిచేసినా సరే! "ఆ విష్ణుమూర్తి నడిపించినట్లే అవుతుంది" అంటారు. అంతటి విశ్వాసం ఇలువేల్పుమీద.

ఎక్కువగా పగటిపూట ఐతాళులు ఇంట్లో వుండడం దుర్లభం. కోర్టు వ్యవహారాలు జాస్తి; అది లేనిరోజు పౌరోహిత్యం కొద్దిగా వుంటుంది. ఏనాడైనా ఇంట్లో వుండేటట్టయితే ఆనాడు స్నానానికి దిగడానికే పొద్దు పడమటికి వాలి రెండు గడియలయినా అవుతుంది. ఆమీదట దేవునిపూజ జరిగి భోజనం కావాలి. కారణం ఇంతే—ఐతాళులంటే ఎంతో మందికి ఆలోచనకు ఒక మంత్రి వున్నట్టు, ఉపదేశానికి ఒక గురువు వున్నట్టు. వారి అమూల్య శిష్యకోటిలో మా మూడుమనె నాగయ్యశెట్టి ఒకరు. నాగయ్యకు నిజంగా "బ్యామ్మల పురుగు" చూస్తే సయించదు. అయితే ఐతాళులంటే ప్రాణం. వారిముందు తల వంచుతాడు. ఐతాళులంటే దేవుడనే వాడిలెక్క. "నిజానికి వారొక్కరు బ్యామ్మలలో తప్పపుట్టివుండాలి" అని నాగయ్య నిశ్చితమైన అభిప్రాయం.

మొన్నటిదినం ఆ హోరాహోరి పోట్లాట జరిగిందే - కాళింగయ్య ఆస్తి స్వాధీనం చేసుకొనే గోల. ఆ దినం ముప్పాళ్ళ గోలకు కారణం నాగయ్యే, కాళింగయ్యకు జనాన్ని పంపి "పోట్లాటకు నిలబడండి" అని అన్నదీ వాడే. సీనప్ప సేరేగార అమాయకుడై వుంటే, నాల్గు దెబ్బలు తిని, రావలసింది. దానిసంగతి యిది :—నాగయ్య గోల జరిగిన నాటి వెనుకటిరాత్రి ఐతాళుల వద్దకు వచ్చి "ఐతాళులవారూ, కాళింగయ్యకు నేను మాట



యిచ్చాను. వాని ఆస్తి సీనప్ప స్వాధీనమైతే, వాడికి మూడేమూరు జేనెల భూమి మిగి లేట్టు లేదు. 'మీరు లేకపోతే నా మర్యాద దక్కదు.' అని నావద్దకు వచ్చి కాళింగయ్య ఏడ్చాడు. 'కానీ' అని చెప్పాను. రేపు తెల్లవారేలోగా అణ్ణు, బచ్చ, ముదర, ఇంకా ఒక పదిమందిని కర్రలిచ్చి పంపాలని వున్నాను. అమీను కాదు; వాడి అబ్బ వచ్చినా ఆస్తి స్వాధీనమయ్యే సంగతి వుండనీ.'' అని చెప్పాడు.

ఐతాళులు - "నాగయ్య, రేపు అమీనుకు దెబ్బలు గిబ్బలూ తగిలితే నీకు పురిశిక్ష అయ్యేని. ఇప్పుడు కాళింగయ్య ఎదిరి ఎవరు? .... శీనప్ప సేరేగార. వాడికి నాలుగు అంటించినా ఫ వాలేదు. వాడిపక్షానికి సాక్షులు పోకుండా చేయడం పెద్దపనికాదు; అయితే అమీను ఒళ్లు తాకడం మంచిది కాదు'' అన్నారు.

"అమీను నాకు తెలియనివాడా? వాడికి మొదట్లోనే పమంగా విసిరివేశాను లేండి.''

"ఆ పైంటయితే గట్టిగా ఏర్పాటుచేయి, అమీను వెనుకకు తగ్గనీ. సీనప్ప కాళ్లు విరగ్గొడితే మన వూరికే సుఖం. ముందు వాడు కాళింగయ్య మీద క్రిమినల్లు చేసి, పన్నెండున్నర వడ్డీ డబ్బంతా కక్కనీ. వాడు ఇంతవరకు కాళింగయ్య నుంచి తిన్న వడ్డీ కొంచెమా?

"వడ్డీ గిడ్డీ ఇచ్చే మనిషి కాళింగుడా! అందుకోపమే కదా కుదువపెట్టుకున్న సీనప్పకు ఆస్తి డిక్రీ అయింది. మీకు సంగతులు సరిగ్గా తెలియవని తోస్తుంది. ఇప్పటికు ఆస్తి సీనప్పసేరేగార పరమయి సంవత్సరాలు మూడయాయి. స్థలం కాళింగయ్యకు అద్దెకు ఇచ్చి నటు. ఆ అద్దెకూడా బాకీ అయి, తిరిగి నంబర్ (కేసు) అయి స్థలం స్వాధీనానికి వూనుకున్న వ్యాజ్యమిది. అయితే, చూడండి - కాళింగయ్యకు భోజనానికే గతిలేదు. అద్దెడబ్బులు తినకుండ ఏమిచేస్తాడు? అంతేకాక మనకు కావలసిన మనిషి. వాడిని కాపాడకపోతే వేరుమార్గంలేదు అదిన్నీ నా శరణు చొచ్చినాడు.''

"సీనప్ప యిల్లు పాడుకానూ! నీవు ఇంటికి నడు. నాలుగుమంది మాత్రం గట్టిగా వుండనీ. నీ సహాయం చూచే సీనప్ప పరిగెత్తి పోవాలి. కాళింగుని నుంచి మనకు ఒక నాడు కాకపోతే మరొకనాడు ఉపకారం అయ్యేని. ఈ సీనప్ప ఎవరికీ అక్కరలేనివాడు. కానీ, అంతకే వచ్చిందేమిలే. విష్ణుమూర్తి దేవుడున్నాడు, భయపడవద్దు'' అని నాగయ్యను ఆశీర్వదించి, ఐతాళులు పంపించారు.

సీతైతాళుల తల అంటే సామాన్యమైన హైకోర్టుకూ మించింది. కాకపోతే సీగె బైలు వెంకటరమణయ్య కేసులో వకీళ్ళకు ఏమున్నా తెలియదు. అన్ని యోచనలు సీతైతాళులవి. వకీలు అచ్యుతరావు మొదటినుంచి ధైర్యం చెప్పక, "ఊరికే డబ్బు పాడు చేసుకోకండి. అప్పుడబ్బులకు ఆస్తి ముక్కకూడా మిగలదు" అని నిరాశ కలిగించారే! అప్పుడు సీతైతాళులు లేచి, వకీలు చెవిలో గుసగుసలాడి "పాత తామ్రశాసనం వుంది; అంతా ఇంటిదేవర ఆస్తి" అనే పైంటు గట్టిపరచి వదిలారు కదా! అచ్యుతరావుకు ఆశ్చర్యమయింది. కొసకు హైకోర్టులోనూ వేంకటరమణయ్య తామ్రశాసనమే విజయమయింది.

వట్టి ఆలోచన, హాశం - వీటిలో ఐతాళులు ముందుకు, వైదికవృత్తిలో వెనక్కు అని అనుకోకండి. వైదికవృత్తి ఎలాగూ వుందికదా! దాని జతకు మంత్రాలు తంత్రాలు కూడ వున్నాయి. జబ్బులు గిబ్బులు వస్తే విబూది మంత్రించి యిస్తారు. వారు యింట్లో వున్న రోజు సంతగోల. అంతమంది వారివద్దకు వచ్చిపోతారు.

"మా యింటి ఆవు విన్నటినుంచి పాలే ఇవ్వడం లేదు; చేయివేస్తే గటివిటిగా తొక్కులాడుతుంది."

"మా మగవాళ్ళకు గాలి సోకిందో ఏమో; పట్టినజ్వరం వదలడం లేదు."

ఈవిధంగా ఒక్కొక్క రకమైన పీడను పట్టుకొని వచ్చి వారినుంచి బూడిద తీసుకొని మళ్ళీ పోతారు. "మొన్న రూరల్ ఆస్పత్రి రామారావు ఆరు రూపాయలు తిన్నారు; గుండూరావు కొడుకు జ్వరం కొసకు గుణమయింది. ఐతాళుల విబూదితోనే నట. ఒకే ఒక రోజుతో జ్వరం 'దఫే' మని దిగిపోయింది. మొదట్లోనే ఐతాళుల ముందున్న పీటమీద మూడు దమ్మిడీలు పెట్టే బుద్ధి గుండూరావుకు వచ్చివుంటే, డాక్టరులకు తినిపించిన రూపాయలయినా మిగిలేవి. ఐతాళులు చెప్పేటట్టు "పల్లెలవారికి ఈ డాక్టర్లు పడేట్టు లేదు; వాళ్ళమందు, ఏమైనా చెప్పండి, పట్టణాలకు, నగరాలకు కావచ్చునే కాని పల్లెకు పట్టించేది కాదు."

మొన్నటిదినం పరమయ్యఇంటి గేదె, ఎనిమిది వరహాలుపెట్టి కుంజాలు సంత నుంచి తెచ్చింది, పాలు ఒక్కపూట సమంగా ఇచ్చింది, ఏమీలేదు! మధ్యాహ్నం మైదానంనుంచి మేసి వచ్చింది; గిర్రున తిరిగి పడిపోయింది. పరమయ్య ఐతాళుల ఇంటికి ప్రాణాలు వదలి పరిగెత్తి వచ్చాడు. ఐతాళులు కుందాపురానికి వెళ్లారు. సాయంకాలంవరకు నోరు తెరుచుకొని వుండి, ఎక్కడికి పోయినా, మునిసంజెకు పైగారి దుకాణానికి రానే వస్తారు, అని కాచుకూర్చున్నాడు.

"ఎందుకు వచ్చింది పరమయ్య సవారి" అని పైగారి భార్య కనుక్కుంది. పరమయ్య వచ్చిన వుద్దేశం చెప్పి, "వస్తారు కదూ త్వరగా?" అని అడిగాడు. "ఇప్పుడు వచ్చే వేళ అయింది. వకీలుగారి వద్ద పనివుంది అని తెల్లవారి వెళ్ళేటప్పుడు పిలిచి చెప్పి పోయారు."—అని సమాధానం వచ్చింది. మాటలు ముగిసేలోపలే సీతైతాళుల సవారి నేరుగా అక్కడికే వచ్చింది. సరి, పైగారి యింటిపొయినుంచే బూడిద తెప్పించి మంత్రించి యిచ్చి, పరమయ్యను రవాణా చేయించారు.

అయితే, ప్రతి ఒక్కరికి సీతైతాళులను చూస్తే అవుతుంది అని చెప్పలేను. అది ఐతాళులే చెప్పేటట్టు "అందరినీ మెప్పించడం ముక్కంటికీ సాధ్యం కాదు. ఏమైనా దేవునికి సరిగ్గా నడచుకోవడం; మనుష్యులను నమ్మి ఫలం లేదు." ఐతాళులు ఆవిధంగా వున్నందువల్లనే సర్వసామాన్యంగా వారు పట్టిన పనిలో ఓడిపోవడమనేది లేదు. వారి అదృష్టమూ మంచిది. వట్టిపోయినగేదె అని తెలిసి తెలిసి ఇంటికి తెచ్చినా, వారి భార్య పార్వతమ్మ చేతిగుణంవల్ల పూటకు రెండు సిద్దెల (సోలల) పాలు పిండీని.

# 27. నిజారు

## కె. సంపద్గిరిరావు

మానవుని దుస్తులలో నిజారంత సర్వవ్యాపి మరొకటి లేదు. వెనుకబడిన ఒక్క హిందువులను వదలిపెట్టండి. ప్రపంచంలో తక్కిన జనాంగమంతటా మానవుని అధఃకాయం నిజారుతోనే ఆవరింపబడుతున్నది. పూర్వకాలంలో ఇలా వుండలేదు. ఆ కాలంలో కుట్టిన బట్టలు తక్కువే. ప్రాచీనకాలపు గ్రీకులూ, రోమనులూ పొడుపైన గుడ్డలను ఒంటికి చుట్టుకునేవారు, ఉష్ణమండలంలో వున్న తక్కిన నాగరిక ప్రజలయితే సామాన్యంగా దుస్తులకు అంత ప్రాధాన్యాన్నే ఇవ్వలేదు. (ఎక్కువ గుడ్డలు వేసుకొనే వాడే ఎక్కువ నాగరికు డనే సిద్ధాంతం. ఆ కాలంలో రూఢిలో లేదు.) అయితే, ఈ ఆధునిక కాలంలో నిజారును ధరించని ప్రజలే లేరు. అమెరికాలోని రెడ్ ఇండియనులు మొదలుకొని ఇండియాలోని ఇండియనులవరకు, చీనానుంచి చిలీదేశంవరకు అందరూ నిజారునే వాడుతున్నారు. దక్షిణ భారతవాసులు దీనికి అపవాదం అనవచ్చు. అయితే, ఇంకా ఎన్నో అపవాదాలను మోసుకున్న జనం వీరు. నవనాగరికతతో శోభించే ఈ యుగాన్ని నిజారు యుగమనే అనవచ్చు,

దక్షిణభారతంతో నిజారు వేసుకున్నవాడిని చూస్తే, "వీడేమి ముసల్మానా!" అని అనగడం కద్దు. ఈ వేషం ముసన్మానుల వస్త్రధారణ విశేషమనే ఒక భావన వుంది. అయితే, నేటికీ మక్కా యాత్రకు పోయే ముసన్మానులు ధరించే ఉడుపు నిజారు కాదు; కేవలం రెండు లుంగీలు. అయినా, ముసన్మానులేమో నిజారుకు ఒక ప్రాశస్త్య మిచ్చి, ఆసియాఖండంలో (ఫరంగివారు, వారి పరివారంవారు, పరిచారకులు ఈదేశంలో అడుగు పెట్టడానికి పూర్వం) దీనిప్రచారం జరపడం నిజం. దీనికి కారణమేమిటంటే, మహమ్మద్ పైగంబరుల మతం అరబ్బీదేశం నుంచి ఇతరదేశాలకు వ్యాపించే సందర్భం వచ్చినప్పుడు శీఘ్రగాములై వెళ్ళవలసిన జనం తమ పరుగులాటకు అనుకూలమవుతుందని ఈ నిజా రును తయారుచేసుకున్నారు. ఎక్కువయిన బట్టాపాతను తలకు బిగించి కట్టుకొని, ముందుకు తోసుకొని వెళ్ళారు. భారతదేశంలోను పూర్వం కట్టుకొనే పంచను "వీరకచ్చ"గా బిగించుకొని యుద్ధానికి బయలుదేరేవారట, (దీనిని ఇప్పుడు సైకిలుకచ్చ అంటున్నారు.) ఎక్కువ తిరుగులాట ఏర్పడినప్పుడూ, పరస్థలంలో నిత్యమూ గుడ్డలు ఉవకడానికి అను కూలం లేనప్పుడూ గుఱ్ఱం, గాడిద, కంచరగాడిద, ఒంటె మొదలయిన వాటిని ఎక్కి సవారి చేసేటప్పుడు నిజారే నప్పుతుం దనడం వేరుగా చెప్పనక్కరలేదు. నిత్యం ఊరికి కట్టుకునే ధోవతికి, ఊరికే జాడించి ధరించదగిన నిజారుకు ఉన్న వ్యత్యాసం ఊరూరికీ ప్రయాణం చేసి, స్నానపానాదులకైనా ఇన్ని నీళ్లు చిక్కితే చాలునని తపనపడిన వారికే తెలుసు. మొత్తంమీద చూసేటట్టయితే వేగంగా నడిపించే జీవితానికి, చురుకయిన నడక కు

నిజారు ఒక చిహ్నం మాత్రమే కాదు - ఆవశ్యకమైన సాధనం కూడ. త్రికచ్ఛం. పంచకచ్ఛం, అష్టకచ్ఛం పొట్ట పెంచుకొని, ఒకవైపు కూర్చునే స్థావరజీవులకు సరిపోవచ్చుగాని చక్కగా కాలుజాడించి బదికేవారికి సరిపోదు; సాధ్యం కాదు.

చురుకుతనాన్ని ప్రేరేపించే శక్తి నిజారులోనే వుందో అథవా ఇలాటి శక్తి గల మానవులే తక్కిన గుడ్డలను ఒకవైపు ఒత్తిగిలజేసి, నిజారును కుట్టిస్తారో చెప్పడం కష్టం. అయితే సదా ధోవతి ధరించిన సాధుపుంగవులు కూడా నిజారు ధరించినమీదట వారి కాళ్ళలో కనిపించే కొత్త ఔద్ధత్యాన్ని చూడగా, ఈ వేషంలోనే ఏదో విశేష మహిమ వుంది అని వూహించవచ్చు. నిజారును వేసుకొంటే కాళ్లు కొంచెమైనా అడ్డులేకుండా జోరుగా సాగుతాయి. కాళ్ళ ఆటా, పరుగూ వేగమవుతాయి. కాళ్ళతీరూ బయటపడుతుంది. పంచెకట్టినవారు కోపం వస్తే చేతులను మాత్రమే ఉపయోగించగలరు. నిజారు తొడుక్కున్నవారు అలా కాదు. రెండుచేతులబలం ఒక్కకాలిలో వుంటుంది. రెండు కాళ్ళతోను వారు దేవతలలాగ చతుర్భుజబలం కలవారవుతారు. దేహపు పూర్ణవికాసానికి నిజారే సాధనమయి వుంది. ఆటలు ఆడేవారిని, పాట పాడేవారిని చూడండి. నిజారునో నిక్కరునో ధరిస్తారు. నిక్కరంటే ఏమిటి? నిజారుకూన. ఇందుకోసమే పంచ కట్టేవారు కూడ పని పడినప్పుడు పంచను ఎత్తి కడుతారు—అంటే పంచను నిక్కరు రూపానికి తెస్తారు.

నిజారులో అనేకవిధాలున్నాయి. రెండు కాళ్ళకూ రెండు సంచులవంటివి ప్రత్యేకంగా దిగి రావడం సర్వ సామాన్యలక్షణం. వీటిలో ట్రౌజర్స్, పైజామా, ప్యాంట్స్, బ్రీచెస్, షురువాల్, పఠానుల "దగలా" ఇత్యాదులు- పాదాలపర్యంతం దిగివచ్చే వాటిలో జాతిభేదాలు వున్నాయి. మోకాలికి నిలబడిపోయేవి వేరే. వాటికి షార్ట్స, నిక్కర్స్, డ్రాయర్స్, చెడ్డి, మట్టిలాగు మొదలయిన పేర్లు వచ్చాయి. ఈ సంక్షేపరూపాలు స్వయంభువులూ కావచ్చు. అంటే, ఆలాగే క్షుద్రపువారితోనే నిర్మించబడవచ్చు. అథవా బృహద్రూపం నుంచి కాలాంతరంలో కారణాంతరాలవల్ల జన్యం కావచ్చు. ఈ ప్రకరణాన్ని ఇక్కడ ప్రస్తావించ నక్కరలేదు.

వీటిని దేహానికి బిగించి నిలుపడానికి అనేక సాధన సామగ్రులు వున్నాయి. గుండీలు, లాడీలు, వెనుక కట్టేవి, భుజానికి ఎత్తి నిలిపేవి—ఈ రీతిగా వున్నాయి. అయితే ఈ బంధన విశేషాలు అంతర్గాములయినందున ఏ నిర్దుష్టమైన నియమానికి కట్టుపడక సందర్భానుసారం, శక్త్యనుసారం నిజారుల 'స్థితి' పని జరుగుతుంది.

వీటిలో ట్రౌజర్స్ అనేది ఉత్తమకులానికి చేరిందని చెప్పవచ్చు. దేహమధ్య భాగం నుంచి రెండు శాఖలుగా బయలుదేరడంవల్ల అన్నీ "ద్విజ" జాతివే అయినా, సాంప్రదాయికంగా ట్రౌజర్స్ అగ్రమర్యాదకు అర్హమై వున్నది. దీని వుపయోగం పంచకచ్ఛధోవతిలాగే విధానపూర్వకమయింది. విశేషమైన నియమ మేమిటంటే, క్రిందిభాగం ముందున్న మడత సదా దృగ్గోచరంగాను, వాడిగాను, పాదంమీద సరిగ్గా మధ్యభాగంలో నిలిచేదిగాను వుండాలి. దీనిని ఈవిధంగా కాపాడుకొనడానికి యంత్రసాధనాలున్నాయి. ఈ యంత్రాన్ని ఉపయోగించలేనివారు వేరే ఉపాయాలు చూడడం కద్దు. మరిన్ని ట్రౌజర్స్ చుట్టుకొలత విషయంలో (కాలానుసారంగా) నియమాలున్నాయి. కొన్ని



సంవత్సరాలక్రితం ఇంగ్లెండులో గుడ్డల ఉత్పత్తి ఎక్కువయినప్పుడు ఈ చుట్టుకొలత ప్రబలమయి వుండేది. ఆక్స్ఫర్డ్ నమూనా అని పేరుపొందిన దీనిలో కుక్కపిల్లనే దాచిపెట్టుకొనేటంత అవకాశం వుండేది. దానిని ధరించేకాళ్లు ఏనుగుకాళ్ళేమో అనేట్టు కనిపించేవి. ఇటీవల ఇది సంక్షేపించబడింది.

సముద్రపు ఓడలలో పనిచేసే నావికుల నిజారు బృహదాకారం గలది. అవి క్రింది భాగంలో పెద్ద మొండెపు ఆకారం ధరించి మడతలు అనే నియమాలకు లోబడక కేవలం స్వేచ్ఛావృత్తములైనవి. అయితే, నిజారు "విశ్వరూపం"ను చూడాలంటే పఠానులు ధరించే "దగలా"ను చూడాలి. దర్జీవాడే ఒక గుడ్డలథాను తీసుకొని నిలబడిన మనుష్యులకు నిలబడినట్టుగానే కుడుతాడని, ఇది ప్రళయకాలంలో తనకుతానే కుసిపడి పడిపోతుందని, ఆలోగా పంచభూతాలకు చిక్కక ఆ దేహాన్ని వదలి క్షణమాత్రమూ విడిపోదని ఒక ప్రతీతి వుంది. పఠానులు నడుస్తున్నప్పుడు క్షీరాబ్ధితరంగాలనే మనం చూస్తున్నామా అన్నంత భ్రమ కలుగుతుంది.

సాధారణజాతి నిజారులు ఏ నియమానికీ లోబడవు. పందిరివరకు తీగ అల్లుకొనడానికి వేసిన పొడుగాటి పంజరం ఎలా వుంటుందో అలాటి రెండు మొండేల భాగాలుచేసి పైజామా అని ధరించవచ్చు. ఉత్తమజాతికి చేరిన ట్రౌజర్లు కొన్ని కాలధర్మం చెందిన పిదప జాతిభ్రష్టమై ఇదే దర్జాకు వస్తాయి. ఈ పైజామాలు ఇంత ప్రచారంలో వుండడానికి కారణ మేమిటంటే, చౌకగాను ఉంటాయి, మన్నికకూ వస్తాయి. కొంచెం మడిస్తే, అన్నది తమ్మునికి కావచ్చు; తాది మనమనికి కావచ్చు. ఒక ధోవతి వెలకు మూడు పైజామాలను ఒదిగించుకోవచ్చు.

ఉత్తరభారతంలో షురువా అనేది ఉత్తమవర్గపు దుస్తు. దానిలో ఇరుక్కున్న కొందరు మనుష్యులను చూస్తే, దానిలో వారు ఎలా అవతరించారా అనే ప్రబలమైన శంక ఏర్పడుతుంది. షురువాను తొడుక్కోవడమే ఒక విధమైన వ్యాయామం. దాని విసర్జన కూడ ఒక వ్యాయామం. ఇద్దరు ముగ్గురు సహకరించి ఈ వ్యాయామం చేయవలసి వుంటుంది. (ధరించేవాడు బృహచ్చరణుడైతే దేవుడే దిక్కు.) లుంగీని క్షణమాత్రంలో చుట్టుకుని, అర్ధక్షణంలో విప్పివేసేవారికి షురువాధారణ విసర్జన మర్మం అభేద్యమే. దీనిని పోలిన యూరోపియనుల బ్రీచెస్ ఇంత బిగుతైనది కాదు. అంతేకాక సన్నని కృశమైన కాళ్లున్నవారు బ్రీచెస్ సహాయంతో పుష్టులుగా కనిపించనూ వచ్చు—నడచుకో వలసీ వుంటుంది. అయితే షురువాలు పలుచని గుడ్డలవి కావడంవల్ల కాళ్ళతో తాదాత్మ్యం పొంది తద్రూపాన్ని నిష్పక్షపాతంగా చూపిస్తాయి.

దక్షిణ భారతీయులు మాత్రమే నిజారు వలలో పడని జనం. దేశపు వాతావరణం, ముసల్మాను రాజ్యాలు దక్షిణభారతం తుదవరకు వ్యాపించక పోవడమూ దీనికి కారణం. అయితే, ఇట్టీటీవల నిజారువ్యాప్తి ఇక్కడకూడ కనిపిస్తున్నది. ఇది ఖర్చులేని విషయమని జనతకు బాగా మనసుకు రాలేదు. ఈ అంశం బాగా ప్రచారమయినప్పుడు దాక్షిణాత్యులు నిర్దాక్షిణ్యులయి దీనిని గైకొన (కాలుకొన) వచ్చు.

# 28 వాన

## వి. సీ.

బెంగళూరులో ఈసారి కాచినంత ఎండ ఏ సంవత్సరమూ కాయలేదు. ఈ సంవత్సరం చూచినవారికి మునుపటి సంవత్సరమే మేలనిపిస్తుంది. ప్రతి సంవత్సరమూ ఇలాగే. అప్పుడు అనుభవించవలసినంత కష్టం ముందెన్నడూ ఉండలేదనడం మనుష్య స్వభావం. లేక సంవత్సరాలు గడచినకొద్దీ మనకు కష్టం సహించే శక్తి తక్కువయి, ఈరీతి యోచన వస్తుందేమో! దానిని అనుభవించి దాటి మనం బతికినందువల్లనూ ఇలా తోచుతూ వుండవచ్చు. ఎలా అయినా, ఈసారి ఎండలు బెంగళూరుకు పెద్దఎండలు. మద్రాసే నయం అంటున్నారు. కడప మరీ నయం కావచ్చు.

బెంగళూరు చల్లగా వుంటుందని కనుక కిందివారు జాలార్‌పేట గుట్టలను తామూ రైలూ ఎలాగో రొప్పుతూ రోజుతూ ఎక్కి ఇక్కడికివచ్చి చేరుతారు. సున్నపురాళ్ళగూడు లాగవున్న బెంగళూరు ఇప్పుడుగూడ మొదట వారి ముక్కునూ, గొంతునూ పట్టుకొని పరీక్షిస్తుంది. ఇలాటి పరీక్షల కన్నిటికీ వారు భయపడరు గనుక నూరారు వెయ్యారు మంది పట్టణంలోకి వచ్చి పడతారు. ఖర్చు ఎక్కువయ్యే ఉదకమండలం, కొడైకానల్ మొదలయిన పెద్ద విశ్రాంతి స్థలాలకు పోగలవారు అక్కడికి పోయినా, ఇక్కడికి వచ్చే వారే ఎక్కువమంది. వారుండేచోట ఎండలు హెచ్చుగా వుండడం సహజం; అందువల్లనే వారు కోరి రావడం. వచ్చేచోటికల్లా దానిని మోసుకొనివచ్చి ఇక్కడి తాపం ఎక్కువ చేసి, ఏమీ తెలియని ఈ వూరివారి గోడు పోసుకోవడం ఏమి న్యాయం? వాళ్ళ వాళ్ళ ప్రారబ్ధం వాళ్ళ వాళ్ళ వెన్నంటుతుందని అంటారు. అయితే, ఆ ప్రారబ్ధం ఇంకొకరిని పీడించే ధర్మం ఏ దేవుడు చేశాడో తెలియదు. వారినివట్టి పీక్కు తినడంతోపాటు మనకూ పీడ అయ్యేటట్టయితే, వారికీ ఆ బాధ తప్పనీ, దేవుడా, అనిపిస్తుంది.

ఈ సంగతి అలా వుండనీ; వైశాఖమాసపు మండుటెండలో ఒళ్లు చెమటలు పట్టి, నోరు ఎండి, కళ్లు చెడి, వానవచ్చినా అని ఎదురుచూస్తాము. వేడికి కందిపోయి నిరాశపడి ఆకాశంవైపు చూస్తూ, అక్కడొకటి ఇక్కడొకటిగా చెదరివున్న మేఘశకలాలు మన తలమీద తిరుగనీ అని కోరుకుంటాము. చల్లటిరోజులు ఎన్నడు వస్తాయో, తాపం ఎన్నడు తగ్గినో అని నోరు తెరచుకొని హాహాకారాలు చేస్తాము. రాకుండా ఎక్కడికి పోతాయి? తీరా దురదృష్టకరమైన సంవత్సరాలు వదలిపెడితే, సాధారణంగా వర్షాకాలంలో వర్షాలు రానేరావాలి. గణితానికి గులాములైన మనం వస్తుందన్న రోజు వర్షం రావాలి. దానికి ముందు కాముణ్ని చల్లబరచడానికి (కాముని పున్నమకు) రెండు చినుకులు; ఎండుటాకులు తొలగించడానికి, తరుగు తూర్పారబట్టడానికి, కొండలు శుభ్రం కావడానికి



నాల్గు నాల్గు చినుకులు; శ్రీరామనవమి, ఆచార్యజయంతి సమయాలకు మరి నాల్గు చినుకులు; వైశాఖ బహుళ జ్యేష్ఠాలలో తొలకరి—ఈవిధంగా వర్షం రానే వస్తుందని రైతులందరికీ తెలుసు. పంచాంగంవారుకూడా పంతం పట్టి చెబుతారు. ముంగారు వానలు కురియనే కురియాలి గదా! జూన్, జూలై నెలలలో ఖండితంగా కావలసినంత—కొన్ని వేళలలో కాబట్టనంత - వాన కురుస్తుంది. ఒకరోజు ఇంచుమించు....

ఈసారి ప్రతిసారికంటే ముందుగానే ముంగారువానలు మొదలవుతా యన్నారు. వానలేమో వచ్చాయి; బెంగళూరికి కాదు; నీలగిరికి, నందికొండలకు; అక్కడున్న జనం బెంగళూరుకు, మైసూరుకు పరుగెత్తడానికి, వానల సమాచారం మాత్రం మాకు వచ్చింది, ఇక్కడి తాపాన్ని, ఆతురతను ఎక్కువ చేయనీ అని.

మేనెల మూడవవారం - దాదాపు పెద్ద మేఘాలు ఆడడం ఆరంభం అవుతుంది. గొడుగు లేకుండా వెలుపలికి పోవడానికి ఎలాటి వారికైనా భయమే. మబ్బుల ఉరుముల ధ్వనే ధ్వని. ధూళి నిండిన డేరాగుడ్డతో డేరా వేసినట్టు, దానికి పొగచూరినట్టు ఆకాశంలో మబ్బులు కడతాయి. వాటి ముఖం కాగి ఎర్రబడుతుంది. దినదినానికి ఎక్కువగా నల్లబడుతూ, రౌద్రంగా బొబ్బరిస్తాయి. గాలితోపాటు అరుస్తూ పరుగులు పెడుతూ పొర్లుతూ పట్టీలు కొడుతూ మెరుపులు కక్కుతాయి. కక్కిన మెరుపులను మళ్ళీ మింగుతాయి. ఆ రభసాన్ని చూడలేము. ఇకనేమి, వచ్చింది వాన; కమ్మని వాసన వస్తున్నది; నీటిమీది చల్లగాలి వీచ నారంభించింది; అదిగో, ఆ దూరప్రాంతంలో కురుస్తూ వుండాలి; చినుకులు వచ్చాయి కదూ? త్వరగా ఇల్లుచేరుకుందాము. సద్య మధ్యన ఎక్కడైనా చిక్కుకుంటే పేచీయే. లాల్‌బాగునుంచి ఇంటివరకు తలదాచుకుందామన్నా ఒక ఇల్లూ దొరకదు. నిలబడడానికి ఒక్క - అంగడి చూరన్నా లేదు. పోనుగునా, పెద్దపెద్ద కాంపౌండ్ల శ్రీమంతుల ఇళ్లు అనుకొని బయలుదేరడం. సగందూరం వచ్చేలోగా గాలి వీచి ముఖానికి మన్నుచల్లి ఆశలు ఆర్పివేసి, భయాన్ని బెదరగొట్టి మబ్బులన్నీ కాళ్లు చెడి ఎక్కడికో పరిగెత్తిపోయి మాయమవుతాయి. ఆకాశంలో మళ్ళీ చెదరుమబ్బులే. అందులోను గొడుగు, వానకోటు చేతిలో పట్టుకొని వెళ్ళిన రోజు ఖండితంగా వాన రానేరాదు. లాల్‌బాగునుంచో...మరెక్కడనుంచో ఇంటికి మళ్ళిన మనకు భూగర్భంనుంచి పాతాళానికి వెళ్ళేటట్టు అవుతుంది. ఏమిచేద్దాం. చెప్పుకోదమైనా ఎవరికి? ఎవరికి చెబితే ఏమి చేసేరు? ఏ వట్టివేరు విసనకర్ర, ఏ షరబత్తు, నీరుమజ్జిగ, ఏ ఐస్‌క్రీము, ఫ్రూట్ సెలాడ్ చలవ కలిగించేని?

కొసకు నెలచివరి ఒకరోజున అందరి కోరికలు పండి, వాన రానేవచ్చింది: వెర్రిమొర్రిగా నాలుగైదు పెద్దవానలు కురిసి తీవ్రత చూపాయి. ఆమీదట తుంపర. ఒకటి రెండు జడివానలు, ఒక్కొక్కసారి జోరుమని గుద్దీగా కురిసి అరగంటలో మూడు నాల్గు పదునులు కొట్టి పోతాయి. ఆమీదట ఆకాశమంతా తేట. ఇంకొక్కసారి తుంపరవాన పడి దొడ్డపేట, చిక్కపేట, మావీధి, లాల్‌బాగ్ రస్తా,—దానికి మనస్సు వచ్చినచోట

పది నిమిషాలు నీళ్లుచల్లి మేము ఎక్కువగా పారాడే దారులలో నేల తడిసిపోతుంది.
మునిసిపాలిటీవారు నీటి అభావంతో రోడ్లపైన నీళ్లు చిలకరించేట్టు లేరు. తుంపరవాన
పది పది నిమిషాలలో నేలను సరిచేసి, ఉదయమో, సాయంకాలమో వాహ్యాళికి పోయే
మాకు ఆప్యాయకరం అయ్యేటట్టు చక్కబరుస్తుంది. ఇంకొక్కొక్కరోజు ఉదయం
లేచేవేళకు ఒంటి కంటితో ఏడ్చేటట్టు వాన చినుకులు రాలడం ఆరంభమయితే, సాయం
కాలం వరకు నిలవదు. ఈ వానలూ, మనకూ మొదటినుంచీ—పట్టుదల; దాయాద
మాత్సర్యం; జాతివైరం; ఎలా చెప్పినా సరే—పడదు. పెద్దగా కురిసి చెరువులను, కాలువ
లకు నీళ్లు నింపే వాన కాదది. జనం పారాడడానికీ, దినసరి వ్యాపారస్థులకూ అనుకూలం
కాదు. "జడివాన" ఉపకారం ఒకవైపు వుండనీ. వెలుపల తలపెట్టేటట్టు వుండదు. శనిః
వీధివీధికీ బురద. ఇంటిలో వుండే అభ్యాసం అగత్యం అనుకూలం లేని మనవంటి వారి
గతి? తిట్టుకుంటూ, గొణుక్కుంటూ వెలుపలికి పోయాము—చులకనగా వున్న కాలి
చెప్పులు బరువవుతాయి. ఇంటికి తిరిగిపోయాము—అందరిమీద రుసరుస లాడడం.
ఇంట్లో మగవాడు కావడం ఊరికేనా? చదువడానికి కూర్చున్నాము—చీకటి; దీపాలు
ముట్టినే ఆరిపోతాయి. తిట్టడం, సణుక్కోడం, గొణుక్కోడం, తిట్టుకోడం. ఇంతే ఆ
రోజులలో కార్యక్రమం. పొద్దుపోవడం ఎలాగు? ముఖం బరుక్కుందామనిపిస్తుంది.
ఎంతసేపు చదవడం? వ్రాయడం? పడుకోడం? పాడుకోడం? గోళ్లు గిల్లుకోడం? మిద్దె
దూలాలు దంతెలను, నేలమీది ఓడుబిళ్ళలను ఎంచడం? చేతకిచిక్కిన కాయితాలను
కత్తిరించడం? గప్పాలు కొట్టడం? గప్పాలు అనుకూలంగా వుంటే సరే—లేకపోతే,
సంవత్సరాని కొకమారు, రెండు సంవత్సరాల కొకమారు గప్పాలకు 'భ్రమపడి' సర
సంగా నాబోటివారు ఏమైనా మాట ఎత్తితే, రెండు నిమిషాలపాటు సంతోషంగా వుంటుంది.
హర్షప్రవాహం పారుతుంది. మూడవ నిమిషమే వాదం పుట్టి, జన్మాంతరపు ఎవడో
బేతాళుడు లేచి, బలి కోరుతాడు. నిజం. స్వభావాలే అటువంటివి. నోవాలిస్ చెప్పాడట—
"మన స్వభావమే మన విధి" అని. మన భాగ్యాన్ని నడిపించే విధి ఇది: ఒకదాని
కొకటి పొందకుండా వుండడం;—కలవకుండా వుండడం; సరసమని చెప్పినది చెనకినట్లు
కావడం; ఎవరి ఏ మర్మాన్నో పొడిచి ముల్లు లోపలే విరవడం; వారు బదులు పొడిచి
విషం చిమ్మడం. కొన్ని సమయాలలో అందరూ హెచ్చుగా మాట్లాడాలని పోటీ పడు
తాము. మేము చెప్పేదే సరి అని హఠం చేస్తామో, మాదే జాణతనమని వాదిస్తామో,
ఎలాగో పోట్లాట ప్రారంభమౌతుంది. పోట్లాట వాసన వానవాసన కంటే స్పష్టం, ముందు
కనిపించేది ఒకే దారి! అక్కడినుంచి పరారి కావాలి. ఆమీదట ఒక్క నిమిషమైనా
లోపలవుండే అవకాశం లేదు. చొక్కా తొడుక్కోడం అయింది. కాళ్ళకు చెప్పులు తగులు
కున్నాయి. ఆమీదట? కనిపిస్తూనే వుంది—వెలుపల జడివాన. కాలుపెట్టిన చోటెల్లా
జారుడు; బురద. ఎక్కడ చూచినా గజిబిజిగా వుంటుంది. నూరుమంది అడుగులుపెట్టిన
చోట ఇన్నూరు వాగులు. జనం జారినచోట అడుగు గుద్దలిలాగ బరువుగా దిగబడుతుంది.
పదివైపులనుంచి కాళ్ళలోకి నీళ్లు చినుకుతుంది. అలాగే మొండితనంగా వెలుపల కొంచెం



దూరం సాగిపోయామా, దారిపొడవునా బండ్లు, సైకిళ్లు, మోటార్లు. చిన్నకార్లవారు
సభ్యులు. ఆత్మప్రత్యయం వున్నందున దురహంకారపడరు. పెద్దకార్లు పక్కకు వస్తే
చాలు, ఒంటినిండా బురద చిమ్మడమే. భార్యనో, చెల్లెలినో పరిహాసం చేసి, పంతాలు కట్టి,
పుసలాయించి, తిట్టి తెల్లగా ఉదికించి గరగరమని ఎండించి కట్టుకొన్న ధోవతికి వచ్చింది
చేటు. పెద్ద మోటార్లలో కూర్చొని పారాడితే వస్తుందా పెద్దతనం! ఏమి కొల్లబోతుందో!
దారిలో ఏమైనా కానీ; ఎవరు చచ్చినా చావనీ. ఎవరి ధోవతికి బురదకొట్టినా సరే. వాటి
హడావుడే హడావుడి; మదమే మదం. అని దొర్లిపోయే వైపునుంచి పదిబారలు దూరంగా
పోతే మాత్రమే బదుకుకొన్నాము. లేకపోతే, చక్రంనుంచి చిట్లి వస్తుంది బురద—
బట్టలకు, ఒంటికి, ముఖానికి, నోట్లోకి. వేసవికాలంలో ఒకబాధ, వర్షాకాలంలో ఒకబాధ.
రస్తా అంతా వాళ్ళకోసమేనా? రస్తాను ఎంత వెడల్పుచేసినా, కావాలని అంతకన్నా వెడ
ల్పుగా పెరుగుతుంది పోకిరితనం అని వాళ్ళకు చెప్పేవా ళ్లెవళ్లు? మేమూ పన్నుకట్టే
ప్రజలం కాదా! సహజంగా దేవుడిచ్చిన కాళ్ళమీద నడిచే మహాజనులకు రస్తామీద
సురక్షితంగా సులభంగా తిరుగులాడే హక్కు వద్దా? ఎవరికి చెప్పుకొందాము? అన్ని
చట్టాలు చేసేవారూ పెద్ద మోటా రున్నవారు. మాకు, మీకు, మోటారు లేనివారికి, బళ్ల
వారికి, ముఖ్యంగా రస్తాలో తమ కాళ్లమీద నడిచే వారికి, హక్కులను నియమించేవారు
వారు; వారు ఇస్తే కద్దు; లేకపోతే లేదు. ఉదాహరణకు వారి గొడవవద్దు దూరంగా వుందా
మని దూరంగా ఎగిరి వెళ్లాము: వెనుక జట్కా గడగడ గుడగుడ అని వెన్నాడుతుంది.
"హ్యా సామీ, దూరంగా పోవయ్యా" అని చెర్నాకోలు తిప్పుతూ జట్కావాడు కావాలనే
జట్కాను మీమీదికి వదులుతాడు. వాడికి తన జట్కాలో కూర్చోనట్టి మీ దాక్షిణ్యం
ఏమిటి? అలాగూ ఇలాగూ అడ్డంగా పోయారు, చంగ్ టింగ్ అంటూ ఒక బైసికల్లు
వంకర టింకరగా వచ్చి మిమ్ముల్ని అటూ ఇటూ అన్ని వైపులకూ ఆడించి చక్రాలను
మీ కాళ్ల వెనుకే దూర్చుతుంది. సైకిలుకు ఈవిధంగా బ్రేకు పడగా, దానిమీద ఎక్కిన
మనిషి మిమ్మల్ని ఆపి, తానూ కిందికి దిగి మిమ్మల్ని గురించి నోటికి వచ్చినట్టు
మాట్లాడుతాడు. మరొకవీరుడు ఆ వానలో ఉత్సాహంతో రెండుచేతులూ వదలి సర్కస్
చేస్తూ, దూరంగా వెళ్ళండి, తప్పుకోండి అని కేకలువేస్తూ, మీమీదకే వస్తాడు. దారిలో
నేమో అన్ని రకాల మురికి కుళ్లి పడివుంటుంది. గుర్రం, గేదె, మనిషి అందరూ
ఏకోదర వృత్తితో మీకోసం దారిలో వదలిన పదార్థాలన్నీ కుళ్లి నీటిలో కలిసి కరిగి అన్ని
వైపులకూ వ్యాపిస్తూ వుంటాయి. అసహ్యం! అది మామిడిపండ్లకాలం వేరె. మహాను
భావులు తిన్న పండ్లతొక్కలను, పుల్లటిపండ్ల కండ, తొక్కలను దారిపొడుగునా పారేసి
పోయి వుంటారు. గ్రహచారం తక్కువై చూడకుండా దానిమీద కాలుపెట్టారో, అయింది,
ఆ క్షణంలోనే శాస్తి. బురదే చూస్తామా? ప్రాణాపాయమే తప్పించుకొందామా? మురికి
అమేధ్యమే తొక్కుదామా? జారే పడదామా? పడి బాధపడుతూంటే చుట్టూ వున్నవారు
పళ్లు ఇగిలించడం చూద్దామా? దేనిని చూడడం, దేనిని వదలడం?

ఒక్కొక్క సమయంలో మాత్రం జడివానవల్ల అనుకూలం ఎక్కువ. ఇంట్లో వంటింట్లోకి వెళ్లి పొయ్యిముందు కూర్చుని (పొయిలో పెట్టిన వంటచెరకులు తడిసిపోకుండక పోతే అనేది అధ్యాహారం) ఆడవారిని మాయచేసి తపిలంలు, బోండాలు, ముచ్చోరలు, చేగోడీలు, ఆవడలు మొదలయిన తినుబండారాలు చేయిస్తూ, వాళ్లు వేడివేడిగా వాటిని ఇవ్వడం, మనం తినడం జరుగుతూవుంటే, ఈ వాన సుఖాన్ని తృప్తితో కాకపోయినా, గొణగకుండా అనుభవించి, కావలిస్తే దాని ఔదార్యాన్ని కొనియాడవచ్చు. అయితే ఇంట్లో దినమూ ఇలా ఫలాహారాలు చేసిపెట్టేవారు ఎవరు? అన్ని ఇండ్లలోనూ సాధ్యమా? ఇంట్లో వారికి మనస్సు రాకపోతే? అదే నెపంతో కమ్మలప్రస్తావన బయలుదేరే టట్టయితే? మీ తమ్ముడిని వెలుపలికి వెళ్లగొట్టే నర్మోక్తులూ, వక్రోక్తి సంచారమూ జరిగితే? కొనకు నేయి అయిపోయివుంటే? చేతిలో డబ్బులు లేకపోతే? ఇంట్లో జనం ఎక్కువగా వుంటే? ఏ అంగడిలోను అప్పు పుట్టకపోతే? జల్లుకొట్టి వానకొట్టి ఇల్లంతా కారి తడిసి పోయి వుంటే? ఏమిచేయడం? జడివానకూ ఎన్ని ముఖాలు? విషయాలు ఎన్ని స్థాయిలలో ఎన్ని విధాలుగా తోస్తున్నాయి?...... మొత్తంమీద జడివాన సావాసం వద్దు.

వాన రాకరాక వచ్చి మనం పడుకున్నప్పుడు కురిసి, ఉదయం లేచేటప్పటికి నిలిచి పోతే దాని సమానమే లేదు. అంటే, మనకు అనుకూలం కానప్పుడు—అననుకూలం చేయక—కావలసినంత కురవనీ, మనకేమీ దానిపైన విరోధం లేదు. వెనుకటిరాత్రి వానవచ్చి నిలిచినప్పుడు ఉదయం ఆకాశం నిర్మలంగా వుంటుంది. ఆకాశపు నీలిమకు, మబ్బుల నలుపునకు, సూర్యుని వెలుతురుకు ఘర్షణ కలుగుతుంది. ప్రకృతికి మంగళ స్నానమైనట్లు అన్నీ మెరిసిపోతుంటాయి. ఊరిలోని దుమ్మంతా దారిలోని ఉమ్మిఅంతా పడి చిక్కిపోతున్న రస్తా పక్కన వున్న పూలచెట్లకు కూడ ఈ జలసేవనోపచారం నవ్వు కలిగించి వుంటుంది. దూరంలో సావనదుర్గపు ఇంద్రనీలఖండం ఆ టెంకాయతోపు అవల, ఆ ఇంటి అవల, ఆ పచ్చికబయలు అవల పరిగెత్తుతున్న మొయిలుగుంపు అడుగున ఆకాశాన్ని అంటి నిలబడి వుంటుంది. చల్లగా గాలి వీస్తుండగా, చెట్లమీద మానుల మీద వున్న ధూళి, మురికి నేలకు దిగిపోయి చెరువుకో చేరిపోగా, ఎరుపు, పసుపు, ఆకుపచ్చరంగులు చూపు పడిన చోటెల్లా రాజ్య మాడుతుంటాయి. బిలబిలమని పారే నీటి కాలువలు; భూమిమీద వర్షాలలో ఎక్కడ చూచినా, చల్లని, మెత్తని, నీరు. బెంగళూరు అలాటి దినాలలో స్వర్గం.

ఒక్కొకసారి వానలోనే తిరుగులాడుదామని మనకు అనిపించడమూ కద్దు. ఎండ వేడిమి ఎక్కువగా వుండాలి. పెద్దవాన కురియకపోతే, చేతిలో గొడుగు వున్నప్పటికీ విప్పడానికి మనస్సురాదు. చినుకులు పడుతూవుంటే ఎంతదూరమైనా వానలోనే నడచి పోదా మనిపిస్తుంది. అదే ఒక మత్తు. వాన మరికొంత జోరయింది; గొడుగు విప్పక పోవడం సాధ్యం కాదు; మొదట ధోవతి తడుస్తుంది; గాలికొట్టే పక్కనుంచి గుడ్డ ఒక భాగం తడుస్తుంది. గొడుగు చెవులనుంచి నీరుదిగి భుజం తడుస్తుంది, లేకపోతే



గొడుగు చిల్లులనుంచి నీరు నెమ్మదిగా జాగ్రతగా, క్రమంగా హెచ్చుగా కోటులోపలికి, షర్టు చేతులలోపలికి వెన్నెముకకు తోసుకొని పోతుంది. నీరు చర్మానికి తాకినప్పుడు, ఒక రకమైన నరాల కదలిక అవుతుంది చూడండి—సుఖమంటే సుఖంకాదు; కష్టమంటే కష్టం కాదు. వర్ణించడం అలవికాదు. ఇంకా జోరుగా కురవసాగింది వాన: నానినాని వానభయమే పోయివుంటుంది. ఒంటిలోని వేడివల్ల వానదెబ్బ కనిపించదు. మనస్సుకు ఏదో తిమ్మిరి పట్టినట్టు వుంటుంది. అప్పుడో ఇప్పుడో పెద్దగా చలిగాలి వీచి చుట్టుముడితే మాత్రం వణుకు పుట్టినీ; పళ్లు, దవడలు కొట్టుకునీని. అంతేగాని, నిండా మునిగినవారికి వానయేమిటి? గాలియేమిటి?

వాన సామాన్యంగా వుండి నడుమ నడుమ నీ రెండో, క్రీయెండో పడుతూంటే, చుట్టుపక్కల అంతా నవ్వుతున్నట్టు వుంటుంది. ఉన్నచోటనే నిలబడి అంతా చూచి ఆనందిస్తాము. స్నేహితులకు, పిల్లలకు ఈ అందాన్ని చూపుతాము. వ్యాఖ్యానిస్తాము. వాన ఆగగానే, రస్తావేడి ఆవిరి అయి తెల్లగా తామరతూడు దారాలలాగా సన్నగా మీదికి లేస్తూ వుంటుంది. రాలేపూలు రాలిపోతాయి: గట్టిపూలు నీటిలో జలకమాడి క్రొత్తవవు తాయి. దారిపక్కన కత్తాళి (రాకాసిమట్టలు) పూలకంబం సుందరంగా నందికంబంలాగా,[1] సింగారించిన రంగనాథుని రథంలాగ తలయెత్తి నిలబడివుంది. ఎక్కువ ఆకులు తొడిగితే రసమంతా వ్యర్థమవుతుందేమో నని అనుమానంతో, నిష్ఠగా జీవితమంతా పూవులకే పోసి పెరిగిన దేవగన్నేరు తన పూవుల హారతిని ఆకాశానికి ఎత్తి పట్టిన సొబగు గంభీర మైనది. తంగేడు చెట్టు ఒంటినిండ అపరంజి పొలుపు విస్తరించి శృంగారంగా వుంది. మధ్యమధ్య మిడుతలు, తుమ్మెదలు, పిచ్చుకలు, చిలుకలు అక్కడినుంచి ఇక్కడికి, ఇక్కడినుంచి అక్కడికి రెక్కలు అల్లార్చి, దాగుడు మూతలు ఆడుతున్నాయి. నీటి చుక్కలు పడుతున్నప్పుడు, ఒక్కొక్క చుక్కధారలోను, ప్రతిధార మరికొంచెం పెద్ద ధారలోను భూమిమీదికి పడే దృశ్యం చాల సుందరమయింది. గాలితో వంగి వాలి, ఉబ్బి సూర్యకిరణంలోని రంగు విండ్లను విరిచి బొట్లు గకుతున్న "ఇంద్రధనుర్యానం" సొగసు ప్రతి నీటిబొట్టు సూరతు అణిముత్తెంలాగ, సానపట్టిన రత్నంలాగ పొలుపు పొంద తుండడం చూడడానికి రెండు కళ్లు చాలవు. చెట్ల కొమ్మలకింద, ఆకుల జొంపముల అడుగునా, పచ్చని పచ్చికమీద, సాలెపురుగుల వలలమీద, లాల్‌బాగ్ కొలనులోని తామర, కలువ ఆకులమీద వాలుగట్టిన ముత్యాల, రత్నాల గుంపులు మెరసిపోతున్నాయి; మిరుమిట్లు గొలుపుతున్నాయి. నేలమీద పలుచగా వాన పడుతుండగా, వాన పడీపడగానే దానిని అంటిపెటుకొని తోసుకొనిపోయే గాలి తియ్యని విసురు చాల అందమైనది. దీనిని వర్ణించేవని విశ్వాన్నే వివరించేవని అయ్యేనా? ముగిసీనా? ఒకరి అరచేయి మరొకరి మృదువైన చేతివని ప్రీతితో వాంఛించే సమయమది......

1. ఒక వెదురుగడ కొనకు కొంచెం కిందుగా నందివిగ్రహం బిగిస్తారు. గడ కొనన వ్యాసహస్తం. దీనిని నందికంబం, నందికోలు అంటారు.

వాన, గాలి, మబ్బు - వీటిని ఇంట్లో కూర్చునో, రయిలుబండి లోపలినుంచో, కిటికీ నుంచో చూడడం మరీ సంతోషంగా వుంటుంది. కిటికీ తలుపులనుంచి కనిపించే ప్రకృతి యొక్క ఆ కాస్త భాగానికి కట్టు (ఫ్రేము) అద్దము వేయించి చూచినట్టు అవుతుంది. వాన ఉపద్రవం లేకుండా, మెరుపు పిడుగుల భీతిలేకుండా మబ్బులు దొర్లడం, పొర్లడం, బొబ్బ రించడం, సైన్యంలాగ సాలుగట్టి నడవడం, ఆకాశంలో మంచెకట్టి ఉయ్యాల లూగడం లోపలినుంచి చూడవచ్చు. కామధేనువు పొదుగులాగ కారుమబ్బులు తమ పొదుగును భూమికి దిగజార్చి వాన పితుకుతున్నవి; చల్లదనాన్ని కురిపిస్తున్నవి; జీవనరసాన్ని వర్షిస్తున్నవి. మెరుపు కళ్ల పొడుస్తున్నా, భయపెడుతున్నా, చూస్తూ చూస్తుండగానే కళ్ళ వెలుగునుతాకి ఆటలాడించి పెనుచీకటిలో ముంచుతున్నది. ఢమీమని పడిన పిడుగు మనస్సు స్వాస్థ్యాన్ని పోగొడుతుంది; గుండె దడదడ లాడిస్తుంది. వెలుపల ఇంత జరుగుతున్నా లోపలి భద్రత మనను కాపాడుతుంది.

పెద్ద వర్షం వస్తే ఆరోగ్యం; ఐశ్వర్యం. చెరువులు, గుంటలు, కాలువలు, నదులు, బావులు - అన్నిటికీ నీళ్లు. బెంగళూరు కొళాయిలు కూడ నిండుతాయి. సంవత్సరం పంటకు దారి. పశువులకు మేత, ప్రపంచానికి సుభిక్షం, మనకూ సుఖమే. పాలు, పెరుగు అమ్మేవారితో, కూరగాయల వారితోను ధైర్యంగా ఆరోజే చౌకబేరం చేయవచ్చు. వర్షం ఆగిన తర్వాత వీధులు శుభ్రంగా వుంటాయి. నగరాధికారులు మురికికాలువల మట్టితీసి వీధిలో పరచకపోతే, బురద ఇసక కొట్టుకొనిపోయి, గట్టినేల స్థిరంగా వుంటుంది. తారు రోడ్లలో రాత్రి దీపాల వెలుగు నల్లఅద్దాలలో దీపాలస్తంభాలు వరుసగా నాటినట్టు భాసింప జేస్తుంది. మోటారుల రక్కసి దీపాలు నున్నని రోడ్లు నల్లటిమేనిపై ప్రపంచాన్ని పట్టి మింగివేసేట్టు పరుగెత్తివస్తాయి. నేలమీదపడిన పెట్రోలు బొట్లూ, నూనెబొట్లూ వ్యాపించి పగలు నెమలిపురిరంగులను చుట్టూతా పరుస్తాయి. దారిలోని వాగులు వంకలలో నిలచిననీరు తమ మునుగు టద్దాలలో పైనవున్న మబ్బుల ప్రతి రూపాలనో, దీప స్తంభాల, చెట్ల ప్రతిరూపాలనో చూపిస్తాయి. వెలుపల ఎక్కడ చూసినా పచ్చనిరంగు, కొత్తదనం, నవ్వు. ఇంటిపక్కని చిన్న గుంటనిండి, వేయి క్రిములు, కప్పలు మేళం ఊదుతాయి; రాత్రి శుభజాగరణ చేయిస్తాయి. సమీపంలోని అవిసె, మామిడిచెట్లమీద కూర్చుని గొంతు బొంగురుపోయేవరకు మీముందు కోకిలలు కూజిత స్పర్ధ జరుపుతాయి.

అయితే మనవంటివారి ఇండ్లలో కొంచెం కష్టం. అవి ఈవేళ, నిన్న పుట్టి పెద్ద వయిన కుక్కగొడుగులు కావు; శ్రీమంతుల సౌధాలు అసలే కావు. నాలుగైదు తరాల నుంచి వచ్చిన ఇండ్లు. పెద్దతనానికి, వయస్సుకు గౌరవం వద్దా? నడతకాదూ అది? ఈ మర్యాదను, గౌరవాన్ని జనమయితే చూపిస్తారు. వానకేమిటి మర్యాద? లౌకికానికి మించింది ప్రకృతి. అందువల్ల మనవంటివారి ఇండ్లలో అన్నివిధాల వానల సంపూర్ణ ఫలమూ లభిస్తుంది. జడివాన కాలమైతే, అన్ని వైపులనుంచి నీరు కారుతుంది; తుంపర పడుతుంది; ఎక్కడచూచినా పాత్రలే, గుడ్డలే, గోనెపట్టలే, బురదే. లోపల వుండదగిన



వస్తువులెల్ల వెలుపలికి వస్తాయి. ఢిన్, ఢిక్, ఢాన్, ఢనక్ అని ఇరవైరెండు శ్రుతులలోను మిద్దె ఉరుస్తుంది. పిల్లలు, పెద్దలు విరామంలేకుండా నీటిని పిండుతుండడం, తుడుస్తుండడమే నిరంతరమైన పని. మొత్తంమీద ఒక్క చదరపుటడుగు ప్రదేశమయినా ఎండి వుండదు. ఇంట్లో చలవ, పిల్లలకు తలనొప్పి, పడిశం, దగ్గు, ఒక్కొక్కమూలలో ఒక్కొక్కరు ఒదుక్కొని కూర్చుంటారు. పెద్దవాన వస్తే అలా కాదు. దాని పద్ధతివేరు. అప్పటి వైభవం వేరే. ఏమైనా దానిది దొడ్డతీరు. ఇబ్బందిపెట్టి ప్రతియొక్క భాగంలోను ఈ విధంగా హింసపెట్టదు.

పలువురు భగవంతునికి ఉత్సవాలు నడిపిస్తారు : గరుడోత్సవం, హనుమంతోత్సవం, పూలపల్లకి, కొందరు "ఎవరికి ఎలాగో అలా" శయనోత్సవం : సుఖసౌకర్యాలు, కోరికలు, దుఃఖాలు, నొప్పులు మనకున్నట్లే మన దేవుళ్ళకూ లేవూ? అందువల్లనే మనం సంవత్సరం సంవత్సరమూ వారికి పెళ్ళిచేస్తూ, పెళ్ళి వైభవాన్నంతా లోకానికి పంచడం. ఈ అన్నివిధాల వుత్సవాలకన్నా నాకు తెప్పోత్సవంలో ప్రీతి యెక్కువ. మూడు నాలుగు సంవత్సరాల కొకసూటు మా యింటికి పైగావున్న ధర్మాంబుధి చెరువులో నీటి సంపద వున్న సంవత్సరం ఎనిమిది పదినాళ్లు బెంగళూరులోని దేవత అందరికి తెప్పోత్సవం చేయిస్తారు. వర్షాకాలంలో పెద్ద వర్షం ఒక్కటి వచ్చినా చాలు - సంవత్సరానికి ఒకదిన మైన రాదూ?— వచ్చినప్పుడు ఈ వుత్సవం మా యింట్లో తప్పకుండా జరుగుతుంది. ధర్మాంబుధిలో ఒక్కదినం ఒక్కొక్క దేవునికే తెప్పోత్సవమయితే, మాయింట్లో ఒక్క దినమే అందరు దేవుళ్ళకూ తెప్పోత్సవం జరుగుతుంది. ఆ దేవతలు విగ్రహాలు; ఈ దేవతలు మనుష్యులు; ఇంతే వ్యత్యాసం.

ఊరిలో సిరి, నాగరికత ఎక్కువయిన కొద్దీ ఊరి రోడ్లు ఎత్తయిపోయి ఎత్తుగా వున్న మా యిల్లు తగ్గిపోయేట్టు చేస్తున్నాయి. మునిసిపాలిటీవారు మా యింటివైపు నీటికి తూము పెట్టారు. అందువల్ల వెలుపలి నీరు శ్రీమంతునివలె దడదడపారి లోపలికి వచ్చి, పెరట్లోను, తూములోను మొదట ఆధిపత్యం స్థాపించి గుంట చేసుకొంటుంది. క్రమ వినయంతో తగ్గి తన సౌజన్యాన్ని కాపాడుకొంటూ వచ్చింది. శ్రీమంతులకు తల తగ్గించక పోతే వినయానికి విలువ ఎక్కడ? వారికి తలవంచకపోతే, వినయం అనగలమా? రాత్రి ఎవరికీ అలికిడి ఇవ్వక ఇంటివాళ్లు పడుకున్నప్పుడు, ఆ శ్రీమంతులు ధారాళంగా ఇంట్లోకి ప్రవేశిస్తారు. సద్దు చప్పుడు లేకుండా వియ్యంకులవలె గంభీరంగా వస్తారు. వేడెక్కిన ఒడలికి సలవ ప్రసాదిస్తారు. వారు నట్టింట్లో వచ్చి నిలబడగానే నేలమీద ఏదో తేమతగిలినట్టు తోస్తుంది. ఒంటికి వారి సంబంధం తెలిసేవరకు వారి ఆగమనం తెలియదు. పై అధికారులు మీ యోగ్యతను పరీక్షించవలసివస్తే మీకు చెప్పి, హెచ్చరిక చేసి వస్తారా? "సర్‌ప్రైజ్ విజిట్" చేస్తారు; అలాగే ఇక్కడకూడా. సరే; జరుగాలి. వారికి జరుగవలసిన ఉపచారాలన్నీ జరుగాలి. ఇంట్లో పిల్లలందరూ లేచి, హరివాణాలను

పట్టుకొనివచ్చి, వారిని నింపి నింపి ఇంటినుంచి సాగనంపాలి. ఈ వుత్సవాలు ఇంకెన్ని ఇండ్లలో జరుగుతాయో తెలియదు. మా యింట్లోనేమో తప్పక జరుగుతాయి. ఒకవేళ, మా ఒక్కరికే ఈ సౌభాగ్యం అనుకుంటే, అదీ ఒక విశేషమే. పెద్దల వియ్యాపుతనాన్ని గౌరవించి, ప్రపంచానికి మేలు చేకూర్చున్న వారి దర్పంతో మన చిరు జీవితాన్ని తేలించి సార్థకం చేసుకొనే పుణ్యం ఎంతమందికి వుంది?

ఈ విధంగా - ఇంకా అనేకానేక రీతులలోను ప్రపంచపు ఇతర సంగతులలాగే వర్షంకూడ ద్వంద్వగుణపూర్ణమైనది. దాని కష్టమూ వుంది, సుఖమూ వుంది; చెలువమూ వుంది; వికారమూ వుంది; ధర్మమూ వుంది; అధర్మమూ వుంది; మురికీ వుంది; నైర్మల్యమూ వుంది; ఇప్పుడు ఇక్కడమాత్రమే పొందుకొనే లక్షణమూ వుంది; విశ్వస్వరూపం సూచించే శాశ్వతమైన లక్షణమూ వుంది. "హుయ్యో హుయ్యో మళెరాయ, హూవిన తోటక్కె నీరిల్ల" (కురవయ్యా కురవయ్యా వానదేవుడా, పూలతోటకు నీళ్లులేవు) అని పాడే రైతు కుమారుడు మొదలు వర్షం పడకపోతే హరపూజ ప్రారంభించి శివుని బోడి తలమీద - కొసకు పండు మెరపకాయలనైనా నూరిపెట్టి కుంభాభిషేకం చేసే - వైదికుల పూజవరకు వర్షానికి అంగలార్చుతాము ఆహ్వానమిస్తాము. వచ్చినప్పుడు ఈ గతి. ఎందుకో ఇలా? దానికి మనమీద కనికరం ఎక్కువై, ఆహ్వానానికి మురిసి ఇంటి పెండ్లి పేరంటాలకు చుట్టాలు వచ్చినట్టు కుటుంబ పరివార సమేతంగా నాలుగు రోజులు ముందుగానే వచ్చి ఎనిమిదినాళ్ల తర్వాత వుండిపోతే ఇంటిగోడలు కుసిపడిపోతాయి - కూలిపోతాయి; మిద్దెమాలాలు పక్కకు ఒరుగుతాయి; కిటికీలవేసిన రాతికప్పు తలమీదికి జారి ఆడుతుంది; వెలుపల చెట్టు చేమ మునిగిపోయి, పొలాలు తోటలు వున్నవైపు ఇసుక పూడిక పక్కవేస్తాయి. వీటి ఉపద్రవాన్ని తట్టుకొనే ఉపాయమేమీ లేదు. కలవారికీ, లేనివారికీ, పల్లెవారికీ, పట్టణాలవారికీ ఎవరికీ ఇబ్బంది కలుగని రీతిగా, మనకు హితంగా వుండేటంత, చెరువులు, కుంటలు, నదులు సదా సర్వకాలమూ నిండి, చుట్టూ ఆకుపచ్చనిరంగే వుండేటంత, ఫలపుష్ప ధనధాన్య సమృద్ధి ఒదిగేటంత, జనం వసించే ఊళ్ళలో ధూళి అణగిపోయేటంత, మురికిపోయి శుచి అయ్యేటంత మొత్తంమీద కావలసినప్పుడు కావలసినంతమాత్రం వచ్చి, కాబట్టనప్పుడు ఉపద్రవం ఇవ్వకుండా వుండేటట్టు వర్షం కురుస్తూ లోకహితం చేస్తూ వుండరాదూ? అట్లా చేస్తే వర్షం దేవత అయ్యాని! దానికి బుద్ధిచెప్పి సంస్కరించేవారు ఎవరు? మానవునిలో లేని ఆత్మనిగ్రహం వానకు వస్తుందా? ఈ సంస్కారాన్ని వానకు సూచించడం ఎలాగు? దాని నిరంకుశత్వానికి అడ్డు ఏమిటి? కొన్నిటిని మనుష్య ప్రయత్నంతో చేయవచ్చు, ఇలాటి సంస్కరణ జరుగాలంటే దేవుడు కళ్లు తెరవాలి; అది జరుగాలి. పౌరుషం - పురుషకారం - వాన ఎదుట వ్యర్థం. దేవుడు కళ్లు తెరిచేవరకు పరిస్థితికి తలవంచి సుఖమైనా ఒక్కటే, దుఃఖమైనా ఒక్కటే. లాభమేమి నష్టమేమి అని వేదాంతం చెప్పుకొని మనస్సుకు సమాధానం తెచ్చుకోడం మాత్రం అందరికీ సాధ్యం.

# 29. మొయిళ్లు

## ఎం. వి. సీతారామయ్య

మొయిళ్లు లేకుండాను, తేటగాను, గంభీర నీలవర్ణ యుతంగాను వున్న ఆకాశాన్ని చూచి మూగవాడిని అయిపోయాను. దాని విస్తారం కనుగొన్నవా రెవరూ లేరు. దాని లోతు మనకు అందనిది; మన కళ్లు ప్రసరించినకొద్దీ ఆ నీలిమలోతు పెరుగుతూ పోతుంది. ఎన్నోసార్లు నేను ఆ నీలిమ లోతులో మునిగి వున్నప్పటికీ, అక్కడినుంచి లేచి తేలివచ్చిన మీదట మునిగిన అరయదనం వుంటుందే గాని ఆ లోతు ఎరుక వుండదు. కల్పనాతీతమైన ఈ విశాల నీల గగనాన్ని చూచినప్పుడెల్లా మూకభానంతో వుంటాను. అదే ఆకాశంలో మొయిళ్ళ గుంపును చూడగానే నా కల్పన కుదురుకుంటుంది; శైలి రెక్కలల్లార్చి ఆకాశానికి ఎగురుతుంది. ఇది ఇప్పటి మాటకాదు. చాల పాతమాట; నా బాల్యపుమాట. బాల్యంలో నేను మొండితనం చేసినప్పుడు నా తల్లి వీధి వాకిటిలోకి నన్ను పిలుచుకొనిపోయి చంద్రుణ్ని చూపించేదట. చంద్రుణ్ని చూపినప్పటికీ నేను రగడ విడిచేవాడిని కాదట. ఆ దినమే నాకు చంద్రునితో చెలిమి కావడం. నేను కొంచెం పెద్దవాడి నయిన తర్వాత, నాకు నాలుగైదు ఏళ్లున్నప్పుడు, నా తల్లి నన్ను సమాధానపెట్టినట్టే నా చెల్లెలికి కూడ చంద్రునిచూపి సమాధాన పెట్టేదట. నా చెల్లెలు ఎన్నోసార్లు ఆ బాలచంద్రుణ్ని చూచి, ఏడుపు నిలిపేది. తాను పాలుతాగే ఉగ్గుగిన్నెను జ్ఞాపకం చేసుకొని ఏడిచేదేమో! ఏమైనా, చంద్రుణ్ని చూచి, పిల్లలు సంతోషించి పొంగడ మనేది సామాన్యమైన విషయం; ఆశ్చర్య మేమీ కాదు. ఒకదినం అలాగే చంద్రుణ్ని చూస్తున్నప్పుడు ఒకటి రెండు తెల్లమేఘాలు చంద్రునిమీద తేలిపోయాయి. కొంచెంసేపటికి కను మరుగయాయి. నా మనస్సూ ఆ మేఘాలతోపాటు తేలిపోయింది. ఆ దినమే నాకు మొయిళ్ళతో మైత్రి కలుగడం; వాటి విషయమై ఒకవిధమైన కుతూహలం ఏర్పడడమూను. ఆ మొయిళ్లు ఎక్కడినుంచో వచ్చాయి; ఎక్కడికో పోయాయి.

అప్పటినుంచి మొయిళ్ళను చూస్తూ వుండడమే నాకొక పిచ్చి. ఎన్నో మొయిళ్లు ఎక్కడినుంచో వచ్చి ఎక్కడికో పోయాయి. మనం ఎక్కడినుంచి వచ్చాము—ఎక్కడికి పోతాము అనే తత్త్వవిచారం ఎంత గహనమైందో, మేఘాలు ఎక్కడినుంచి వచ్చి ఎక్కడికి పోతాయి అనే సాధారణ విషయం అంతే గహనమైనదని నాకు తోస్తుంది. అవి ఎక్కడినుంచి అయినా రానీ, ఎక్కడికైనా పోనీ—అవి నా ఒక్కొక్క గడియ చెలులయి, కోరికల ప్రతిబింబాలయి కరగిపోయాయి. వాటికోసం నేను నిజంగానే కృశించిపోయాను. అయితే ఒక్క సమాశ్వాసం: నేను బ్రతికివున్నంతవరకు ఇంకా ఎన్నో లెక్కలేనన్ని మొయిళ్ళను—నా కోరికల ప్రతిబింబాలను—చూడవచ్చు.

ఇదేమిటి మొయిళ్ళమీద ఇంత మమత అని ఎవరైనా అడుగవచ్చు. అవును, నాకు మొయిళ్ళమీద మమత ఎక్కువ. ఆ మమత ముందునుంచి వచ్చింది. నా చిన్న తనంలో నాకు విసుగు పుట్టినప్పుడు ఒక్కొక్కమారు పిల్లలతో ఆటలాడదలచి ఆటకు వెళ్లేవాడిని. ఒక్కొక్కమారు అమ్మను కథ చెప్పమని పీడించేవాడిని. ఆటలాడడానికి పిల్లలూ దొరకక (పెక్కుసార్లు దొరికేవారు కారు; వాళ్లు పాఠశాలలకు వెళ్ళేవారు. నేను మాత్రం బడి తప్పించుకొని ఇంట్లోనే వుండేవాడిని,) అమ్మ కథ చెప్పకపోతే కోపంతో మాయింటి మాడి డాబాపై ఎండలో ఒక్కడినే నిలబడేవాడిని. డాబామీద నిలబడి దృష్టిపెట్టి చూస్తూ చూస్తూవుంటే కోపమంతా కరిగి ఎక్కడికో పోయేది. ఎదుట గుంపులు గుంపులుగా టెంకాయచెట్లు; దూరాన చాముండికొండ పైభాగం; దానిమీద నానా తెరగులుగా తేలిపోతున్న తెల్లమొయిళ్ళ వరుస. ఎన్నడు చూచినా, అవే టెంకాయచెట్లు; అదే కొండ; కొంచెమైనా వ్యత్యాసం లేదు. ఈ మొయిళ్ళయితేనో ఒకనాడున్నట్టు మరొకనాడు వుండవు; ఒక నిమిషం వున్నట్టు మరొక నిమిషం వుండవు. ఆ మొయిళ్ళను చూస్తూ, చూస్తూ వాటి మార్పును అనుసరించి నా భావనలూ మారేవి; ఒకమారు అవి పత్తి పిండు వలె కనిపించేవి; పత్తి పంట ఎందుకు పండించాలి? గాలికి ఎగిరిపోతున్న ఈ పత్తిని పట్టి పెట్టుకొని, దారం వడికి నేస్తే, ప్రపంచానికి గుడ్డల కరువే వుండదని అనిపించేది. ఒక్కొక్కమారు అవి మృగాల ఆకారాలు దాల్చేవి. ఎన్నోసార్లు అవి ఎగిరే తెల్ల గుర్రాలవలె నాకు కనిపించాయి; మా అమ్మ చెబుతున్న కథలలో వచ్చే రెక్కలున్న శ్వేతాశ్వాలు ఇవే అయివుండవచ్చు నని అనిపించేవి. నేనొక రాజకుమారుణ్నయితే, ఆ గుర్రాలలో ఒక దానిని పట్టుకొని తెచ్చి, దానిని ఎక్కి ఎక్కడబడితే అక్కడికి వెళ్ళివుండవచ్చు. రాజకుమారుణ్ని కాకనే నేను ఒక మొయిలు గుర్రంపై కూర్చుని ప్రపంచాన్నంతా చుట్టి వచ్చినట్టు భావించాను. నేను ఏ మొయిలును రెక్కల గుర్రమని భావించేవాడనో అది కనుమరుగైనప్పుడు మాత్రం నా కల్పన కూడా రెక్కలు విరిగి దొర్లి పడిపోయేది. అప్పుడు కొంచెం విచారపడేవాడిని; ఒక్కొక్కసారి నాలో నేను ఏడ్చానంటే ఎవరూ నమ్మకపోవచ్చు. అయితే, నా బాల్యబంధువులైన మొయిళ్లు నా మనోవ్యథను సహించలేనట్టివేమో! వెంటనే మరొక పేర్మొయిలు ఎక్కడినుంచో ఆకాశతలంనుంచి విసురుగా వచ్చి, గాలి నిలిచిపోగా, నాముందు నెమ్మది నెమ్మదిగా నడచిపోయేది. అది పేర్మొయిలు కాదు; నాపాలిటి ఐరావతం. దానిని చూచి ఊరట పడేవాడిని, సంతోషపడే వాడిని. రెక్కల గుర్రం పోతే పోయింది. ఇంతకూ దాని సహవాసం ఎందుకు? అది ఎక్కడైనా నన్ను తీసుకొనిపోయి కిందికి బొళ్ళిస్తే? నాకు ఈ ఐరావతమే చాలు. ఎంత తెలుపు! ఎంత భారీ ఒడలు! పాలరాతి పర్వతాన్నే చెక్కిపెట్టినట్టుంది. ఎంత పొడవైన తొండం! వీపుమీద వెండి అంబారి వేరే! తొండంతో తెల్ల పూలదండ ఎత్తి పట్టుకొని నాకోసం కాచుకొని వుంది!... నా ఇంటిదగ్గర ఐరావతం ఎక్కి నిదానంగా వెళ్లుతూన్నాను.... ఆ గజారోహణ విహారాన్ని వర్ణించడానికి నాకు మాటలు చాలవు. ఆ విహారం చాముండి కొండ శిఖరంమీద ముగిసింది. అక్కడ ఐరావతం దిగుతున్నాను; వెంటనే అది కను



మరుగయ్యేది. అది కనుమరుగయిన దుఃఖం కన్నా, చాముండికొండ శిఖరంనుంచి వెనుదిరిగి రావడం ఎలాగనే చింత ఎక్కువయింది. అలాగే చింతిస్తూ చింతిస్తూ. ఉన్నచోటే వుండిపోయేవాడిని!

వానకారులో కారుమబ్బుల పరంపరలు ఆకాశతలంలో ఎగిరిపోతూవుండేవి. వాటితో విహరించే గర్వం నాకు వుండలేదు. మా యింటి డాబామీదినుంచే గజశాలలో కట్టిన గజపంక్తిని చూడవచ్చు; ఇప్పుడూ చూడవచ్చు. ఆ నేలఏనుగు లెక్కడ? ఈ ఆకాశపు ఏనుగు లెక్కడ? గొలుసులలో బిగుసుకొనిపోయి జొండు (ఏనుగుగడ్డి) తింటూ, నిశ్చలంగా నిలబడిన ఏనుగు లెక్కడ? విశృంఖల విహారోన్మత్తమైన గజములు ఇవి ఎక్కడ? ఇవి మీద వుండడమే మేలు. కిందికి దిగితే మనకు మనుగడ వుండదు అనుకొనే వాడిని. అయినా, మచ్చిక చేస్తే చాల ఉపయోగకరం; ఇలాటి నూరు ఏనుగలు వుంటే చాలు ప్రపంచాన్నే జయించవచ్చు—అని ఆలోచించేవాడిని.

ఒక్కొక్కసారి ఈ కారుమొయిళ్ళ తండం నాకు చాల భయంకరంగా కనిపించేది. మా అమ్మ నాకు ఎన్నో దినాలు పిశాచాల, దయ్యాల, భూతాల కథలు చెప్పేది; ఆ కథలను వింటూవుంటే, భయమిశ్రితమైన ఒక కుతూహలం కలిగేది. కథా ప్రపంచానికి చేరిన ఆ పిశాచభూతాలు ఈ కారుమబ్బులలో మూర్తీభవించినట్టు వుండి వాస్తవ ప్రపంచంలో చూచినప్పుడు బెదిరి లోపలికి పరిగెత్తిన సందర్భాలూ వున్నాయి. కథాపిశాచాలలాగ ఇవిగూడ బాధించవని చాలకాలం తర్వాత తెలుసుకొన్నాను. ఆవేళకు నా భావనా దృష్టిన్నీ కొంచెం మారింది. నాకు రామాయణ కథ తెలుసు; మా నాయన ఒకరితో రామాయణం పారాయణం చేయించేవారు. వారు ప్రతిదినమూ ఉదయం వచ్చి పారాయణం చేసి వెళ్ళేవారు. మా నాయన సదా సర్వకాలం నశ్యం పీలుస్తూ, తీడుతూ వినేటంత వినేవారు; మా అమ్మకయితే లోపలినుంచి వెలుపలికి, వెలుపలినుంచి లోపలికి తిరుగులాట, వంటపని. ఆమె పూర్తిగా వినడానికి అయ్యేదికాదు. నేనొక్కణ్నే మొదటినుంచి తుదవరకు ఆదరంతో ఆలకించేవాడిని. అందువల్ల నాకు రామాయణ కథ తగినంతమట్టుకు బాగానే తెలుసు. ఎన్నోసార్లు ఆ కారుమబ్బుల పిండును చూచి లంకకు దండెత్తిపోతున్న వానర సైన్యమని అనుకొనేవాడిని; అక్కడినుంచి ఇక్కడివరకు అగోచరంగా తేలిపోతున్న ఒక పెద్ద కారుమబ్బును చూచి నిద్రించే కుంభకర్ణుడని భావించేవాడిని. వానగాలి జోరుగా కొట్టి మబ్బులు చెదరి ఒకదానితో ఒకటి పెనవేసుకొంటున్నట్టు కనిపించినప్పుడు రామాయణంలోచి రామరావణ యుద్ధమే కళ్ళకు కట్టినట్టు అయ్యేది.

ఇదంతా నా చిన్ననాటి ముచ్చట. ఇప్పటికీ మబ్బులు నా మనస్సును ఆక్రమించి పాలించక పోలేదు. వీధిలో నడిచేటప్పుడు మబ్బులమీదే నా చూపు అతుక్కునిపోయి వుంటుంది. మొయిలు తెర పడుగు పేకలలో నా మనస్సు ఎడం విడువక చేరిపోతుంది. వాటిని చూస్తూ చూస్తూ పెక్కుసార్లు ఎడువుకొనడమూ కద్దు; ఒకటి రెండుసార్లు ఎడువుకొని పడడమూ జరిగింది.

ఎవడో ఒకచిత్రకారుడు పొద్దు గడపడంకోసం గీచిన గీతల గుంపులో రొంపిలో ఒక్కొక్కసారి పుట్టుకొని వచ్చే అసాధారణమైన భావపూరితమైన చిత్రాలవలె కని పిస్తాయి కొన్ని మబ్బులు. ఎన్నో మబ్బుల ముఖముద్రలో కోపాగ్ని చూచాను; అధో వదనంతో ఏడిచే మబ్బులను చూచి ప్రకృతికి కూడా ఈ గతేనా అని చకితచిత్తుడిని అయ్యాను. నవ్వు మబ్బులను చూచి సంతోషించాను. సహజంగా మబ్బులకు ఈ రోష తోష భావాల అనుభవం లేకపోవచ్చు; ఉందని నా భావన. ఉండనీ, ఉండకపోనీ— మొయిళ్లు నేను నవ్వినప్పుడు నవ్వి, ఏడ్చినప్పుడు ఏడ్చి; నేను కన్నీరు కురిపించినప్పుడు తామూ అశ్రుధారావర్షం కురిపించి, నేను కోపపడినప్పుడు తామూ కోపపు మెరుపులను కక్కి; నేను రేగి కేకలు వేసినప్పుడు తామూ ఆర్భటించి; నేను శాంతుడిని అయి నప్పుడు తామూ శాంతమై నాతో సహానుభూతి చూపుతున్నాయని నా భావన. మానవుడు నురొక మానవునికి చేయదగిన మహోపకారాలలో సహానుభూతి ఒక్కటి. ఎందరో మానవులకంటే మేలు ఈ మబ్బులు. ఇవి చూపే సహానుభూతిని స్వీకరించి, ఊరటపడే వారు మాత్రం ఎంతమంది ఉన్నారు ? చాల విరళం. నావంటి ఒకరిద్దరు వెర్రివాళ్ళువినా లేరనే చెప్పవచ్చు. వెర్రివాని మాటలకు అడ్డమేమీ లేదు గదా! నేను చెప్పేది ఇది; నొప్పి పడిన హృదయం కలవారు సహానుభూతికోసం చుట్టూ చూడకండి; మెడయెత్తి మీదికి చూడండి!

నేను ఇతరులకు ఇంతే చెబుతాను, అయినా, నామట్టుకు నాకే ఒక కోరిక వుంది. నేనే ఒక మబ్బయితే! కావలసినచోట తిరుగుతూ వుండవచ్చు! నన్ను వదలి దూర దూరాల నెలకొని వున్న హృదయ బంధువులను కొంచెమైనా ప్రయాసపడక కావలసి నప్పుడు చూడవచ్చు! తలచుకొన్నప్పుడు ప్రేయసిని పోయి చూడవచ్చు. ప్రవాసంలో దూరంగా వున్న ప్రేయసీ ప్రియులకు మేఘదూత కావచ్చు. ఒక్క చూపుతోనే విశ్వ మంతటినీ ఒక్కసారే పారజూడవచ్చు! సూర్యుణ్ని సేవించవచ్చు; చంద్రుణ్ని అలంక రించవచ్చు. హర్షవర్షపు బిందువులై పడి పయిరు పచ్చలను నవ్వించి, పూవులను విక సింపజేసి, ఇలాతలాన్ని చల్లబరిచి, జన్మసార్థక్యం పొంది, మళ్ళీ మొయిలై పుట్టి ఎప్పటి వలె నేనే నేనై గగనసామ్రాజ్య చక్రవర్తి అయి మనవచ్చు. నేను మబ్బు అయితే ఎల్లప్పటికీ మబ్బే. రూపభేద రూపాంతరాలు వదలితే నేను అమరుడినే సరి! ఏమైనా మొయిలు అయ్యే కోరిక చాల దినాలుగా వుంది.

అయితే, ఒక్క విషయం: నేను మొయిలయితే మొయిళ్ళను అడిగే వా రెవరు ? అందువల్ల బ్రతికి వుండేవరకూ మొయిలు కాదలచుకోలేదు; మొగిళ్ళలు చూస్తూవుంటాను, మానవుల ప్రతినిధిగా వాటి సహచరుడై వుంటాను. ఇక్కడి బతుకు ముగిసి నేను మర ణించిన తర్వాత మొయిలయి అమరుణ్నవుతాను.

ఇది నిజం; మొయిళ్లు నిత్యమూ నన్ను పిలుస్తున్నాయి.

# 30. పాత సబ్ అసిస్టెంట్ కల్లడైరీనుంచి

## పంజె మంగేశరావ్

నేను సర్కార్ నౌకరీని మొదట చేపట్టింది ఉపాధ్యాయుడుగా, కొసకు చేయి విడిచింది ఉపాధ్యాయుడుగా; అయితే, ఈ రెండింటి మధ్యన మాత్రం ఒక చిన్న వ్యవధి కుడు ములలోని పూర్ణంవలె వుండినది. ఆ వ్యవధి పధ్నాల్గు సంవత్సరాలలోను నేను మా జిల్లా గ్రామాలలో తిరిగి పల్లెటూరి బళ్ళను చూచినప్పుడు నా దృష్టికి వచ్చిన పల్లెటూరి వారి రీతి, పంతుళ్ళ చర్చ, పిల్లలమాటలు, వీటిని నా మనస్సు ఇప్పటికీ తలుచుకొని - ముసలి ముప్పు ఉచ్చులో చిక్కుకుని పడిఉన్నచోటనే పడివున్నప్పటికీ,— ఆ తలపులను మళ్ళీ మళ్ళీ ఇవతలకి తెచ్చుకొని నెమరువేసుకో గోరుతున్నాను.

నా సర్వీసు జాతకం మేరకు నాకు మంగళూరు గవర్నమెంటు కాలేజీలో పదకొండు సంవత్సరాలదాక పట్టుకున్న అధ్యాపకస్థిరగతి తప్పి 1906 లో గ్రామసంచారపు గ్రహగతి ప్రాప్తమైంది. అదే సంవత్సరం గ్రామపాఠశాలల పరిశీలన పదవికి ఉన్న "డిప్యూటీ ఇన్‌స్పెక్టర్" అనే పాతపేరు పోయి "సబ్ అసిస్టెంట్" అనే కొత్త నామకరణం అయింది. దీనివల్ల ఆ పదవి మానమర్యాదలకు, మన్ననకు బహుశః ఏ కొరతా రాలేదు. మన్నన తక్కువయింది వుంటే, అది పదవిపేరు బదలాయించడంవల్ల కాదు; దాని కారణమే వేరే. పూర్వం ఉమ్మడి జమీగ్రామం పటేల్ గిరి (గ్రామమునసబు గిరి), గ్రామకరణీకం, తాలూకు గుమాస్తా గిరి, పోలీసు పని— ఈవిధంగా సామాన్యమైన సర్కారు పనికి ప్రయిమరీ పరీక్షలో ప్యాసు కానే కావాలి. 1904 లో "నేటినుంచి ఈ ప్రయిమరీ పరీక్ష మినహాయించ బడింది, ప్యాసు ప్రసాదంనుంచి ఫలితం లేదు." అని సర్కారు నుడివింది; దీనివల్ల సర్టిఫికెటు ప్రభావం నిలిచిపోయి, విద్యాశాఖవారు పల్లెలలో పిల్లలకు పంచి పెడుతున్న శ్రీముడి గంధప్రసాదం మీద పల్లెవారికున్న పూర్వపు భక్తి విశ్వాసాలు తక్కువయాయి.

నేను "సబ్అసిస్టెంట్" పదవిలో కాలు పెట్టినప్పుడు పల్లెటూరి ఉపాధ్యాయుల వెనుకటి కొన్ని సంప్రదాయాలు రాలిపోయి, పూవుల స్థానంలో ఎండిపోయిన ఆకులు మాత్రమే మిగిలాయి. మర్యాదలో పూర్వ మున్నంత విజృంభణ మేమీ లేదు. పూర్వం కొమ్ములు, కాహళలు వున్నచోట ఇప్పుడు కై మోడ్పులు, నజరానా కానుకలు సమర్పించే చోట ఎడనీరు (కొబ్బరి బొండాం). "స్వామీ! దేవరా!" అని సంబోధించడానికి మారు "ఔను సార్, లేదు సర్"—ఇంతకు, దిగింది. "ఇప్పుడు విద్యాశాఖవారికి పల్లెలో మును పటి గౌరవం లేదు. సర్! ప్రయిమరీ ఉన్నప్పుడు చేతినిండా గ్రాంటు డబ్బు పంచేవారు;

మర్యాదా ఉండేది. ఇప్పుడు పేరుమాత్రం పెద్దది—సబ్ అసిస్టెంట్ ఇన్స్పెటర్ : ఎవరు మూచూస్తారు సర్ !" ఇదీ ఉపాధ్యాయుల అభిప్రాయం. దీనినే పల్లెటూరి పెద్దమనిషి ఒకరు నాముందు కార్యరూపంగా (ప్రత్యక్షంగా) చూపిన సంగతి నాకు జ్ఞాపకం వుంది.

నేను ఒకనాడు మధ్యాహ్నం కొండదారినుంచి మైదానానికి దిగడం ఆ పెద్దమనిషి చూచి, తమ చేతిలోని గొడుగు మూసి, చెప్పులు వదలి నమస్కారంచేసి తామే నావెంట వచ్చినవా రయారు. మేము పదిదారలదూరం ముందుకు పోయేలోగా, బడివున్న ఇల్లు ఎదురుకాగా, ఉపాధ్యాయులు వెలుపలికి వచ్చి నాకు నమస్కరించారు. దీనిని చూచారో లేదో నా పక్కన వచ్చినవారు తబ్బిబ్బయిపోయి, "ఉకో అప్పా ! ఓయ్ !'' అని నోరు తెరచారు; తర్వాత అదే నోటితోనే నన్నుగురించి ఉపాధ్యాయులతో "ఓయ్ ! ఇదేమిటి ! ఇలాటిది ఎక్కడైనా వుందా ? నేను ఇది పోలీసు ఇన్స్పెటర్ అనుకుని ఊరికే నడిచి వచ్చాను ! ఇప్పుడు చూస్తే ఇది పోలీసు కాదు. ఇది పోలి (నకలు) ఇన్స్పెట్టె ! బడుద్దాయి పిల్లవాళ్ళను చూడడానికి వస్తున్న దీనికి నేను చేతులు ఎత్తడం కద్దా ? కాసంత ప్రయోజనం లేకుండ కాళ్ల ఈడ్చుకొని వచ్చాను నేను ! ఒయ్ ! ఎక్కడైనా వుందా ఇది ? థూ !'' అని అన్నారు.

మా పల్లె పటేలుగారు (గ్రామమునసబు) భ్రమపడడానికి కారణం వుంది. కొన్ని నాళ్ళ క్రితం అదే పల్లెలో జరిగిన ఖూనీ తనిఖీకోసం కొత్త పోలీసు ఇన్స్పెక్టరు నియామకం జరిగి, ఆయన రాకను పటేలుగారు ఎదురుచూస్తున్నారు. ఈ విధంగా వారి సవారి దారి కాస్తున్న పటేలుగారి కళ్ళకూ, బడి ఎక్కడ అని యోచిస్తున్న నా తలకూ కొండ శిఖరంమీద అకస్మాత్తుగా భేటీ అయింది. పూర్వం నా కొక సంప్రదాయం వుండేది; నేను తలవదలి సర్కారు పనిమీద పోయేవాడిని కాను, ఎందుకంటే, లోపలితల ఖాళీగా వున్నా, నిండయిన తల అని కనిపించాలంటే దానిమీద ఒక పాగా ఎక్కించాలి, అంతే. నాకు పని ఖాయం అయ్యేవరకు నా తల కొక వెడల్పయిన సరిగంచు ఎర్ర లపేటా ఉండేది. ఎర్ర తలపాగా అంటే పటేలుగారికి ఉన్న భయంవల్ల పుట్టిన నమస్కార మొకటి వారు చెచ్చించారు. చేతులు జోడించడం మన ముందుప్రయోజనం కోసం ఇతరులకు ఇచ్చే చేబదులు—అని పటేలుగారు భావించి వుండాలి.

వాస్తవానికి మనం ఆ విధంగా అనుకోడం లేదు. నమస్కార మనేది సభ్యజనుల సంభాషణకు మున్నుడి అని మన అభిప్రాయం. అయితే, పల్లెటూరివారి అభిప్రాయం వేరు. చేతులు జోడించడం అంటే కిందిజాతివారు పైవారికి ఇచ్చి తీరవలసిన మర్యాద అని వారు భావిస్తారు; నమస్కారమంటే అధికారానికి చెల్లవలసిన పురస్కారమని కూడ వారి తెలివిడి. అందువల్లనే వారు చేతులు జోడించే ఈవిధమైన హస్తవ్యాపారంలో వైవిధ్యమూ ఏర్పడింది. హోదాదారు ఒంటిరంగు, ఉడుపి తళుకు, జీతం మహత్వం, డిపార్ట్మెంట్ గొప్పతనం, కులం అంతస్తు ముఖ్యంగా అధికారి ఉపద్రవకరమైన శక్తి—వీటిని అనుసరించి నమస్కారవిధి మారుతుంది. పల్లెలలోని వారికి సర్కారు ఉద్యోగస్తులంటే సర్వ సాధా



రణంగా ఉలుకు ఉంది; బెరుకు ఉంది; అపాయభీతి వుంది; ఇంత ఉన్నా అక్కర చూపడం అనేది తక్కువ. అక్కర ఉన్నచోట వారికి నిజమైన అభిమానం వుంది. అది లేనిచోట వారి మనస్సులోని నమ్మిక ఏవిధమైన దంటే.—"ముప్పావు మూడు వీసాలు అధికారులు సరీసృపాలలాగ ఉదరగాములు.'' ఈ రూపకం నాకు మనసులో స్థిరపడేటట్టు చెప్పిన ఒక ఉపాధ్యాయుల మాటలు ఇవి :—

''సర్కారులో సివిల్వారు కొండచిలువలు, పోలీసులు తాచుపాములు, అబ్కారీ జంగ్లాత్వారు చార్లపాములు.''

"తపాలావారో ?''

"తపాలా ఇన్స్పెటర్ పచ్చసాము సార్ ?''

"అలా అయితే జెర్రిపోతు ఎవరు ?''

"రెవెన్యూ ఇన్స్పెటర్ సార్ ?''

"మనం విద్యాశాఖవారం ఏవర్గంలో ?''

"మీరుసార్ ? మీ వర్గం మంచినీటివంటిది బాబూ !''

''మాస్టరుగారి ఆఖరు మాటలోని మంచినీటి అనేదాని అర్థం మర్మం చూడండి.'' ( నీటిపాము)

ఈ విధంగా ఉపాధ్యాయులు నోరువిడిచి ఉద్యోగస్థులతో మాట్లాడరని కాదు. చనువు వుంటే, సరిగా మాట్లాడుతారు. అధికారి ఏ లంకేశ్వరుడో, పెంకెనవాడో అయితే, పల్లె టూరివారి నోటినుంచి సత్యస్థితి వెలువడడానికి సంకోచపడుతుంది. "పెద్దవాడయినవాడు క్రూరుడైతే జనం భయపడుతారు. అందువల్ల వసంతకాలపు ఖరకిరణునిలాగ అంతర్నివర్త నుడు కావాలి''[1] అని వున్నప్పటికీ తాబేదారులను ఆఫీసరుల దగ్గరికి రానివ్వని ఒక మాయా వరణం వుంది. దీనికి "దౌలత్తు" అని పల్లెలవారి నామధేయం. కాళ్ళ చెప్పులు కాళ్ళకే వుండాలని దౌలత్తు చెబుతుంది. ముద్దుచేసిన యింటికుక్క మడిపాత్రలను నాకుతుందన్న రీతి సంశయంవల్ల నటించే తాటస్థ్యం దౌలత్తు కాదు. పై అధికారి అబద్ధాన్ని అసమర్థ తనూ అమాయకుల కళ్లనుంచి మరుగుచేసే ఒక అంతఃపటముంది; అదే దౌలత్తు. నా సమకాలికులైన డిపార్టుమెంటు ఆఫీసరుగారు ఏమున్నా దౌలత్తు కలవారుగా వుండలేదు. వారికీ, వారికింది ఉపాధ్యాయులకూ మధ్య ఒకరకమైన అడ్డుగోడ వుండలేదు. వారు ఉపాధ్యాయులతో కలిసి మెలిసి, వారినుంచి విషయాలు తెలుసుకొని, అన్యోన్యంగా వుండే వారు. సవూర రాఘవేంద్రరావుగారు, కూడ్లు విశ్వేశ్వరరావుగారు, నారావి కృష్ణరావు గారు, ఉళ్లాల మంగేశరావుగారు లాంటి పేర్లు ఉపాధ్యాయుల నాలుకపై ఇంకా నిలిచి వున్నాయి. ''ఆ రావుగారు మమ్మల్ని కాయిదా తప్పక కాపాడేవారు. కాచి వేపుకొని

1. హిరిదెనిసి అవకూరనాదదె, నరరణకిహోహరు, వసంతదఖరకిరణ నంత ర్నివర్తనవాగవాగబేకెందా.

తినేవారు కారు." "ఈ రావుగారు వీపుమీద కొట్టేవారు కాని కడుపుమీద కొట్టేవారు కారు." "వారు ఉన్న కాలంలో బెల్లం ఇచ్చారు! లేనికాలంలో బెల్లంవంటి మాటలు చెప్పారు." "వీరు ఉపాధ్యాయకుటుంబి సార్! వీరికి పెళ్లాం పిల్లల చింతకన్నా పాఠశాలల మాస్టర్ల చింత ఎక్కువ."

నేను హొసంగడి పాఠశాలను మొట్టమొదటిసారి సందర్శించింది ఆశ్వీజ బహుళ అమావాస్యనాడు. ఆ పాఠశాల నీటిమీది బుడగవంటిది, కనిపించి అణగిపోతుంది. అందువల్ల దానిని గుట్టుగాపోయి చూడాలని నాకు పైవారి హుకుం. అయితే నేను ఆ పల్లెకు వచ్చేసంగతి మా ఉపాధ్యాయులకు గాలివార్తవల్ల మొదట్లోనే తెలిసింది. ఉపాధ్యాయుల బడి సంవత్సరాంత పరీక్షలకు సిద్ధంగానే వుండేది. నేను ఉపాధ్యాయులను చూచి, "నమస్కారం. ఎలావున్నారు మాస్టరుగారూ?" అని అడిగాను.

జవాబు- గవర్నమెంటువారు నడిపించినట్టే వున్నాను సార్.

ప్రశ్న- గవర్నమెంటువారు అంటే ఎవరు?

జవాబు- అంటే రాఘవేంద్రరావుగారు. వారు నాతండ్రిగారు; ఈ పాఠశాలను మంజూరు చేయించి రికగ్నిషన్ ఉత్తరువు ఇచ్చినవారు వారు.

ప్రశ్న- విశ్వేశ్వరరావుగారో?

జవాబు- వారు నా పెత్తండ్రిగారు. వారు మా పాఠశాలకు గ్రాంటు ఇప్పించినవారు.

ప్రశ్న- నారావిగారిని ఎరుగుదురా?

జవాబు- కృష్ణరావుగారినా? వారు మా తల్లిసార్! ఈ పాఠశాలను సాకి పెంచినవారు వారే కదూ!

ఇక ముందుకుపోతే నాపేరు ఉపాద్యాయుని కొడుకుస్థానంలో వుంటుందేమో ననే అనుమానంతో సంభాషణ మరొకవైపు తిరిగింది.

నేను- పరీక్ష జరగడానికి అడ్డం ఏమైనావుందా?

మాస్టరు- తమ పాఠశాల, తమ పిల్లలు, తాము పరీక్షచేయడానికి ఎవరు అడ్డుసార్?

నేను- ఈ రోజు సెలవుకదా? అందువల్ల అడిగాను.

మాస్టరు- మీరు వస్తారని విని, సెలవుకావడంవల్లనే నేను ఇంటింటికీ పరిగెత్తి పిల్లలను చేర్చాను. రేపు ఎక్కడ దొరుకుతారు వారు?

నేను- రేపు నేను వేణూరుకు పోవాలి.

మాస్టరు- నేను ఈ రాత్రే ఇక్కడినుండి లేచిపోకపోతే నిర్వాకమే లేదు.

నేను- అదేమిటి? అలా ఎందుకూ?



మాస్టరు- అది అలాగే. ఊరంతా అప్పులయితే ఆశ్వీజ బహుళ అమావాస్య తర్వాత పల్లెలో ఎవరుంటారండీ?

నేను- అప్పా? అప్పు ఎలా అయింది?

మాస్టరు- అప్పప్పప్పే, పూర్వపు ప్రయిమరి రద్దుచేశారు. గ్రాంట్ డబ్బు కోత కోశారు. వేణూరులో బోర్డుబడి పెట్టారు. నా ప్రైవేటు బడికి ఎసరుపెట్టారు. పూర్వం సంవత్సరానికి నాలుగునూర్ల గ్రాంటు వచ్చేచోట ఇప్పుడు నలభై రూపాయలు ప్రాప్తి లేకపోతే నాలుగుమంది పొట్ట అప్పులు చేయకుండా ఎలా గడుస్తుంది? సెలవీయ్యండి!

నేను- అడ్డపనులు లేవా?

మాస్టరు- నిరుడు మా అబ్బాయికి ఒక అంగడి పెట్టియిద్దామని యోచనచేసి జైన పేటనుంచి అప్పుతెచ్చి, అంగడి పూజనాడు ముహూర్తంచూచి అబ్బాయిని గల్లాముందు కూర్చోపెట్టాను. ఒకనెల గడవలేదు. గుమ్మటం బునాదిరాయిలాగ గట్టిగావున్న పిల్లవాడు రెండు రోజుల జ్వరంతో నా కళ్లముందే దేవుణికి చెల్లయాడు. వాడి పన్నెండవ రోజు గడవలేదు. అంతలో వాడితల్లి నీటికోసం పోయినది కాలుజారి బావిలోపడి గంగమ్మ పాదం చేరుకుంది. ఇంకా ఏడు సంవత్సరాల ఒక పిల్ల వుంది. దాన్ని కట్టుకొని ఈ పల్లెలో నేనేమి చేయను?

నేను- పిల్లను ఏమిచేస్తారు? ఇక్కడే వుందా?

మాస్టరు- ఇక్కడే వుంది. దానిని ప్రస్తుతానికి వాళ్ళ అవ్వ ఇంట్లో వదులుతాను. దేనికైనా బడిపరీక్ష ఒక్కటి ముగియకుండా ఇక్కడినుంచి వెళ్ళిపోవడం పడదు కదా!

నేను- ఇకమీద బడి చూచుకొనేవారు ఎవరు?

మాస్టరు- చూడడం ఏమిటి? రేపటినుంచి మూసివేస్తాను.

నేను- తెరవడం ఎప్పుడు?

మాస్టరు- మార్చినెల గ్రాంటుడబ్బు బిల్లువస్తే దొరికినంత డబ్బుతో అపోసపో చేసి, ఆమీదట బడి తెరుస్తాను.

ఇది సంసారపు కష్టంతో వేగిన ఉపాధ్యాయుని మనస్సు మొర. ఈ మొరలో మాటల మెరుగులేదు. నిజమే. అయితే చనువువల్ల కలిగిన విశ్వాసంతో వెలువడిన ఆ మాటలలో అబద్ధపుచాయలూ లేవు. నేను దొంగబడి అని సందేహపడి పల్లెటూరి ఉపాధ్యాయుని బడి తలవ్రాతపై ఎర్రగీత పెట్టేముందు అతని బీదబతుకు అప్పు సొప్పులను కనుక్కోవాలనే మూలపాఠాన్ని నేను మొట్టమొదట నేర్చుకొన్నది ఈ హొసంగి ఉపాధ్యాయుల నుంచి! బీదతనంనుంచి ఆయన అప్పు పుట్టిందో లేక అప్పునుంచే ఆయన బీదతనం పుట్టిందో దీనిని నేను నిష్కర్షగా చెప్పలేను. అయితే, అప్పు బీదతనాలు - ఈ రెండింటి నుంచి పల్లెటూరి బడిపంతులు పుట్టాడని నాకు తెలుసు.

బీద బడిపంతులలో తప్పులున్నాయి. వెదికేవారికి అవి చిక్కవని నేను అనడం లేదు. అవి తెలివితేటలులేక వచ్చే చిల్లర తప్పులు; పెరవారి ఇల్లుకూల్చే, తల పగుల గొట్టే, ఆస్తి అపహరించే అపరాధాలు కావు. పాఠశాల ఏర్పాటు, క్రమశిక్షణ, బోధన రిజిస్ట్రీ మొదలయిన వాటికి సంబంధించి అప్పుడప్పుడు విద్యాశాఖవారు చేస్తున్న కొత్త కొత్త సవరణలను అనుసరించేటప్పుడు పాతపద్ధతి ఉపాధ్యాయులు ఎడుపుకొని పడుతారు. పల్లెటూరిబడి అబద్ధపు అటెండెన్స్‌బడి - ఈ అపవాదం నేను విన్నాను. ఒకమారు కొంబారు అనే గ్రామం బడి హాజరుపట్టీని పరామర్శించి "ఏమయ్యా ఇది? హాజరుపట్టీ వ్రాయడం నేర్పినవా రెవరయ్యా నీకు?" అని నేను ప్రశ్నించాను.

"సూపర్‌వైజర్‌గారు సార్!" అని జవాబు వచ్చింది.

"ఊరకే అనకండి! నవంబరు నెల ఇంకా గడవలేదు, మీరు డిసెంబర్‌నెల అటెండెన్స్ నింపివేశారే?"

"లేదు సార్! సూపర్‌వైజర్‌గారు పరీక్షకు ముందే 1909-10 సంవత్సరం పూర్తి అటెండెన్స్ లెక్క చేసి పెట్టవలసిందని ఆనతిచ్చి పోయారు. ఈ పూరా సంవత్సరం అటెండెన్సును చెప్పిన పొద్దుకు పూర్తిచేసి పెట్టాను."

1909-10-వ సంవత్సర మంటే 1910-వ సంవత్సరం మార్చినెలకు పూర్తయే పన్నెండు నెలలు అనుకోక 1910 డిసెంబరు ఆఖరుకు ముగిసే సంవత్సరమని పంతులుగారికి తెలియక పోవడమే తప్పుఅటెండెన్స్ వేయడానికి నిజమైన కారణం.

చనువు వుంటే, పంతులుగారు తమ తప్పును ఒప్పుకొనడానికి వెనుదీసేవారు కారు. అయితే, ఆవిధంగా ఒప్పుకొంటున్నప్పుడు నోటి మాటతో గాక మాటలకు మారు వ్రాతమూలకంగా ఒప్పుకుంటే, దానినుంచి ముందు ఒకసారి కాకపోతే మరెప్పుడైనా తమకు అపాయం రావచ్చు నని వారి మనస్సులో వున్న సందేహాన్ని వారి రిపోర్టుల వక్కాణం తెలుపుతుంది. ఒకసారి మాస్టర్లందరూ తమ తమ సర్టిఫికెట్లను నా ఆఫీసుకు పంపించా లనే వుత్తరువుకు గురుపురం మాస్ట రొకరు వినయంగా విన్నవం చేసుకున్న ప్రకారం ఏమిటంటే:—

"నావద్ద మరొక సర్టిఫికెటు ఏదీ లేదు. మేహర్బాన్ మద్రాసు గవర్నర్ దొరగారు తమ పేరు మొహరు సంతకం 1911 లో నాకు దయచేసిన ఎర్ర సిరా వ్రాతతో వున్న అర తావు పెద్ద సర్టిఫికెటు మాత్రం నావద్ద వుంది. దానిని తమ ఆఫీసుకు తపాలాద్వారా పంపే టప్పుడు నా దురదృష్టంవల్ల అది గైర్‌విలె (చేరకపోవడం) కావచ్చు. అలా పోయి నట్టయితే, నాకు కొత్త గవర్నరు దొరగారి పేరు మొహరు సంతకం గల సర్టిఫికెట్టు చిక్కదు. గనుక అసలును నేను నావద్ద జాగ్రతపరచాను. దాని తాజా నకలును పంపవల సిందని హుకుం అయితే, త్వరలో పంపుతాను."



దీనిని చూచిన వెంటనే గవర్నర్ దొరగారి నుంచి సర్టిఫికెట్టు బడసిన ఈ దొడ్డ వ్యక్తిని సందర్శించడానికి నేను గురుపురానికి వెంటనే బయలుదేరాను. సర్టిఫికెట్టు ఏమో గవర్నర్ దొరగా రిచ్చిందే; కాని, పాఠశాలకూ దానికీ సంబంధం ఏమీ లేదు. 1910 లో మర్దుం షుమారీలో (సెన్సస్‌లో) ఎన్యూమరేషన్ పనిచేసిన వారికంతా సామాన్యంగా ఇచ్చే సర్టిఫికేట్టు!

మాస్టరీ సర్టిఫికెట్టు తనవద్ద లేదని వ్రాతమూలకంగా ఒప్పుకుంటే, ఆ ఒప్పుకోలు తన మెడకు చుట్టుకొంటుందని గురుపురం మాస్టరు భయపడినట్టే — బడిపిల్లలనుంచి బియ్యం గుట్టుగా సరఫరా చేయించుకొంటున్న మరొక ఉపాధ్యాయులు తమతప్పును ఒప్పుకొన్న ఉదాహరణక్రమం చదవవగింది :—

"బడిపిల్లలజీతం డబ్బులను కన్నవారు చచ్చినా ఇవ్వరు. నెలనెల జీతం బోర్డు లెక్కకు నేనే నా చేతినుంచి కట్టి చాలు చాలయింది. ప్యాసు చేయడానికి పరీక్షాధికారులు వచ్చే కాలంలో సరఫరాలు కావాలని అడిగితే అప్పుడు మాత్రం పిల్లల ఇంటివారు వడ్ల మూటలు విప్పుతారు. ఆఫీసరులకు సప్లై అని నమ్మించి నేను బియ్యం తెప్పించుకోలేదు. అయితే, పిల్లలు తమంతట తాముగా తెచ్చిన వడ్లను వారి జీతానికి వాడుక ప్రకారం నేను భర్తీ చేసుకున్నాను. నేను పిల్లలనుంచి వడ్లు తీసుకొని తినేస్తున్నానని అనడం నా పగ వారి చాడీ."

ఈవిధంగా బెళ్తంగడి గ్రామం పంతు లొకరు వడ్లుకాదు గాని కూరగాయలు, పండ్లు, కాయలు, తమలపాకులు, వక్కలు లాక్కుంటున్నారని పుకారు వచ్చింది. దీనికి వారు చెప్పిన సంజాయిషీ నా ఆఫీసు హుకుముకు లోబడే వుండింది. ఎలాగంటే ;—

"చిత్రలేఖనం నేర్పే ఉపాధ్యాయులు ఆకులు, పూవులు, పండ్లు మొదలయినవాటిని తెప్పించుకొని చిత్రాలు వ్రాయించాలని తమ ఆఫీసు ఫలానా నంబరు — ఆర్డరును శిరసా వహించి చిత్రలేఖన పాఠంకోసం తమలపాకులు, అరటాకులు, టెంకాయ, వంకాయ, మామిడిపండ్లు,—ఇంతమాత్రం పిల్లలనుంచి నేను తెప్పించడం కద్దు. పాఠం ముగిసిన తర్వాత ఆ వస్తువులను ఏమి చేయాలని ఖామందుల హుకుములో చెప్పని కారణంగా, వాటిని పాఠశాల పక్కన వున్న నా ఇంట్లో పెట్టాను. అవి దుర్వ్యయం కాలేదు."

ఇలాటి కొన్ని తప్పులను చాడీ మాటలకు బదులు పిల్లల నోళ్లే వెలుపలకి తెచ్చేవి. ఒకమారు బడగుబెట్టు బడిపిల్లలను చదవడంలో నేను పరీక్షిస్తున్న సందర్భంలో "హళెయ మరవన్ను కడిదు హాకబేడ—(పాతచెట్టును నరికి వేయవద్దు) అనే పాఠం చదువు" అని ప్రశ్నించాను. దానిని పిల్లలు చదవడం మాని మాస్టరుగారి ముఖం మిటుకుమిటుకు మని చూస్తూ నిలబడ్డారు. "చదవడానికి రాదా?" అని నేను నొక్కి అడిగాను. "ఆ పాఠ మంటే మాస్టరుగారికి కోపం." అని చిన్నపిల్లవా డొకడు గొణిగి, "దాని నెవరూ చదువ గూడదని చెబుతారు" అని ముందుకువచ్చి భయపడక పాఠం చదివి ఒప్పగించాడు. ఆ

సంగతిని గురించి మళ్ళీ విచారించగా, ఒక పాతమానును నరికివేసిన కేసులో మాష్టరుగారు అటవీశాఖవారికి పదిరూపాయలు జరిమానా చెల్లించవలసి వచ్చిందని నాకు తెలిసింది.

ఈవిధంగానే మర్కంజె పాఠశాలలో "గువ్వకథ చెప్పు" అని నేను ఇచ్చిన ప్రశ్న విని, క్లాసు పిల్లలు నవ్వుతో దొర్లిపోయారని, ఆ రోజు బడికివచ్చిన పల్లెటూరి పెద్దలిద్దరు కడుపు చెక్కలయ్యేట్టు నవ్వడానికి వెలుపలికి పోయారనిన్నీ నా జ్ఞాపకం. ఈ ప్రశ్నతో మాస్టరుగారు మనస్సు నొచ్చినట్టు నిలబడ్డారు. నేను గువ్వకథ వదలి, మరొక కథ అడిగి పరీక్ష సాగించాను. దీనికి ఆరునెలల ముందు బడిదగ్గర గుబ్బి అనే గ్రామం తాలూకు ఒక స్త్రీ వ్యాజ్యంలో ఎవరెవరో చేరారనే పూర్వకథ నొకదానిని మాస్టరుగారు తర్వాత నా చెవిలో వేశారు.

పేజావర గ్రామ పాఠశాలలోని దావీదు జన్నప్ప మాస్టర్లసంగతి ఒక్కటి అపూర్వ రీతిగా బయట పడింది, పిల్లల ఒప్పగింతల పరీక్షలో.

ఆ పాఠశాలలో వారిద్దరూ కాక రాఘవ అనే మూడోమాస్టరు ఉండేవారు. దావీదు, జన్నప్పల నడతను గురించి మొదట నాకేమీ తెలియదు. అయితే, రాఘవ మాత్రం వీరిద్దరికి మధ్య తటస్థంగా వుండి బడి మర్యాద కాపాడే వాడు. నేను అక్కడికి వెళ్ళినరోజున ఒప్పగింత పరీక్ష. పిల్లలు నళచరిత్రలోని పద్యాలను ఒక్కొక్కటి ఒక్కరొక్కరుగా క్రమంగా పాడుతూ వచ్చారు. సుమారు ఐదు పద్యాలు ముగియగానే, జన్నప్పమాస్టరు గారు "తర్వాత పిల్లలకు తెలియదు సర్!" అన్నారు. అప్పు డొక పిల్లవాడు ముందుకు వచ్చి, "నాకు తెలుసు సార్, నేను చెబుతాను సార్" అని ఈవిధంగా చెప్పి ముగించాడు.

"జనపనా దావిదన మరు జూ
జినలి గెల్దను ధరెయనాళ్దను
జనప సరిముగిలెనిసె రాఘవ కేళు పూర్వదలి."

(జన్నప్ప పూర్వం దావీదును మరుసటి జూదంలో గెలిచాడు, ధరను ఏలాడు. జన్నప్ప ఆకాశంలాగ వున్నతుడు అనేట్లు రాజ్యంచేశాడు. రాఘవ విను.)

బడికి తూర్పువైపున వున్న దుకాణంలో జన్నప్ప, దావీదు ఎప్పుడూ జూదం ఆడే వారనీ, ఇటీవల జన్నప్పమాస్టరు సరి ,బేసి ఆడి దావీదును ఓడించాడని రాఘవమాస్టరు విన్నసంగతిని పిల్లలు వల్లెవేసిన పద్యంనుంచి నాకు తెలియవచ్చింది.

ఈ విధంగా పిల్లలు మాస్టర్ల గుట్టును తెలియకుండానే వెలుపలికి తెచ్చేటట్టు మా విషయం గురించిన్నీ చెప్పగూడని సంగతులను బయటపెట్టడం కద్దు. సివిక్స్ అనే కొత్త పాఠం పిల్లల తలకుమించిన విషయం. అయినా, పిల్లలు ఆ విషయంలో చెప్పిన జవాబులు నాకయితే, సమర్పకంగానే (ఉచితంగానే) కనిపించేవి.



బిళియూరు బడి కొండమీద. అక్కడికి ఎండలో ఎక్కిపోతే, నోరు తడి ఆరిపోయి, ఆకలి అయి, అలసట అవుతుందనే విషయాన్ని దృష్టిలో పెట్టుకొని క్రిందిమాటలను చదవాలి :—

ప్రశ్న :- సూపర్‌వైజర్‌గారి పనులేమిటి ?

సమాధానం :- మధ్యాహ్నం వస్తే నిద్రపోవడం, ఉదయం వస్తే వంట చూడడం.

ప్రశ్న :- సబ్ అసిస్టెంటుగారి పని ఏమిటి ?

సమాధానం :- బడికి రాగానే ఎడనీరు (కొబ్బరిబోండాం) తాగడం; బోర్డు తుడవడం; సాయంకాలం సిగరెట్టు తాగడం.

బోర్డు అనగానే నా మిత్రులు తిమ్మప్ప మాస్టరుపేరు జ్ఞాపకం వస్తుంది. తిమ్మప్ప మాస్టరుగారిబడి పుత్తూరులో, ఇల్లు బాయూరులో; అటెండెన్సు బడిలో, పని అందరి ఇళ్ళల్లోను. ఆయన బడిపని ఒక్కటితప్ప తక్కిన ఏపనినయినా సరిగా, చక్కగా చేసేవారు. చిప్పారు అరమనె సంకయ్య హెగ్గడెకు వీపులో రాచపుండు అయితే హరెకళ వైద్యులను పిలుచుకొని రావడానికి పరిగెత్తాలి, తిమ్మప్ప మాస్టరుగారు. కులగుండ సంతనుంచి దున్నపోతుల జతను బిదరెలో పనికి తోలుకు రావాలంటే, దాని పళ్లు ఎంచి ప్రాయం పరీక్షించాలి - తిమ్మప్ప మాస్టరు. మర్దాళబీడు అనంతమతికి పెళ్ళయితే, వచ్చినవారికి ఎడనీరు, అటుకులు ఇవ్వడానికి తిమ్మప్ప మాస్టరు. కారంజె జాత్రలో దారిలోని రాతిమీద ఎక్కి నిలబడి "ఓ కోటీ! ఓ దూమా!" అని రాత్రల్లా పిలవడానికి తిమ్మప్ప మాస్టరు. ఉమ్మబ్బ బ్యారీకి (బ్యారీలు ముస్లిం వ్యాపారులు) చొక్కాడి భట్టుగారి పోకతోటను దస్తావేజులేక వాయిదాశిస్తుకు నోటిమాటతో ఇప్పించడానికి తిమ్మప్పమాస్టరు. పేరారు గుత్తి (జమీ) యజమానులమీద కత్తికట్టిన అల్లుళ్ళను వెన్నుతట్టి ఒడబడజేయడానికి తిమ్మప్ప మాస్టరు. దాసన్న భాగవతుల కుంబళసీమ తాళం మద్దెలల గోలలో ఆఫీసుజనం సైసై అని మెచ్చేలాగ గుండని ఎదుట కర్ణుని అర్థవిస్తరణకు కూర్చోవాలి తిమ్మప్ప మాస్టరు. ఈ విధంగా తిమ్మప్ప మాస్టరును వెదుక్కొని ఇంటికివచ్చే జనంనుంచి వారికి బడిలో కూర్చోడానికి తీరికేలేదు. అయినా ఆయనమీద పుకారు లేదు ; ఫిర్యాదు లేదు. ఆయన ట్రయినింగులేని ఉపాధ్యాయులు, నేర్పేది తక్కువ, క్రమం తప్పు అని ఇష్టం వచ్చినట్టు ఎవరూ చెప్పినవారులేరు. పిల్లలు నేర్చుకునే విషయాలు అంటే, చదువు, వ్రాత, లెక్కలు- ఇవి వారికి కొట్టినపిండి.

ఒకదినం ఈ బడిలో నేను పరీక్ష లెక్కలను బోర్డుమీద వ్రాద్దామని "మాస్టరు గారూ ! బోర్డు వుందా ?" అని కనుక్కున్నాను.

మాస్టరు :- ఉందండీ, తమ వీపువెనుక.

నేను :- బోర్డువద్ద నిలబడి వెదుకుతూ "వ్రాయడానికి సీమసుద్దముక్క ఎక్కడ?" అని అడిగాను.

మాస్టరు :- చాక్‌ముక్క పెట్టలేదండీ !

నేను :- చాక్‌ముక్క లేకుండా బోర్డు ఎందుకండీ? మీ బడి ఎట్లా రికగ్నైజ్ అయింది?

మాస్టరు :- బడి రికగ్నిషన్ కావాలంటే, బోర్డు వుంచాలని వుత్తరువు చేశారు. ఆ వుత్తరువుమేరకు బోర్డు చేయించి రికగ్నిషన్ పొందడమయింది. చాక్‌పీస్ వుంచాలని హుకుం లేదు.

మాస్టరుగారు ఈవిధంగా చెప్పి బడిలో నిలబడకుండా కింది ఇంటికి పరుగెత్తిపోయి, ఒక సుద్దముద్ద పట్టుకొని వచ్చారు. ఆ ఇసుకసుద్దతోనే ఎలాగో నాలుగుపంక్తులు ప్రశ్నలను బోర్డుమీద గీకాను. అది అవ్వల్ దర్జా సుద్దముద్ద అని నా ఊహ. ఎందుకంటే, మరునటి సంవత్సరం నేను అదేబడికి పోయినప్పుడు బోర్డుమీది ప్రశ్నలు బోర్డుమీదే వున్నాయి. అయితే ఆ వ్యవధిలో మాస్టరుగారి ఎడమ కన్నుమాత్రం గుడ్డిదయింది. దాని సంగతి వారిమాటల్లోనే చెబుదాము!

"స్వామీ, ఒకదినం సూపరైజరుగారు బడికివచ్చి 'పిల్లలకు ఒకపాఠం' చెప్పండి అని నాకు ఉత్తరువు చేశారు. 'దొమ్మర చెన్ని పాఠం'—అది వారి కవనమట. ఆ పాఠం చెప్పేటప్పుడు 'బేగ తిర్రనే తిరుగి సర్రన లాగ హాగిద దొంబను' (బేగ గిర్రున తిరిగి సర్రున లగువు వేసెను దొమ్మరి) అనే చరణం వచ్చింది. దాని అర్థం పిల్లలకు తల కెక్కలేదు. అప్పుడు నేనే దొమ్మరి అయ్యాను. లగువు వేసి చూపాను. వేసిన లగువుకు (పల్టీకి) చేతులు నేలమీద పడ్డాను. నా కాలుతగిలి బోర్డు జారి నా ముఖానికి వచ్చి కొట్టుకుంది. బోర్డు అంచుకొనదెబ్బ కంటికే పడింది. చికిత్స చేశాను. లేపాలు పూశాను; ఏమి చేసినా కన్నొకటి ఇంకిపోయింది."

ఈ దుఃఖకరమైన స్థితిచూచి నాలో కనికరం కలిగినా, మాస్టరుగారిమాటలలో విచారం వుండలేదు. 'దేవుని దయవలన ఒక్క కన్నయినా మిగిలింది కదా! నిరుడు మీ కళ్లు బడిబోర్డుమీద పడ్డాయి. ఈసారి బోర్డు నా కళ్ళమీద పడింది'-అంటూ నవ్వు మాటలతో విషయం ముగించారు. ఆయన ట్రయినింగ్‌కాని మాస్టరు అన్నది నిజం! కాని, వారి నవ్వుముఖం, మృదువైనమాటలు, విశాలహృదయం, ఉదారబుద్ధి, పరోపకారం, ప్రశాంత జీవితం—వీటిని నేను మరువలేను.

ఒక సంవత్సరం తిమ్మప్ప మాస్టరు బడికి గ్రాంటుడబ్బు కొంచెం ఎక్కువగా లభించింది. దానినిగురించి తక్కిన ఉపాధ్యాయులు తమలోతాము చాలకాలంవరకు చెప్పుకొంటున్న గేలిమాటలుకూడా నాకు జ్ఞాపకం వున్నాయి. ఒకరిద్దరు ఆ విషయాన్ని పద్యగంధి గద్యంగాను కట్టినది ఇక్కడ వుంది :-

"తిమ్మడి బడి స్టేట్‌మెంట్
"కల్ల వచ్చి కల్ల అని విన్నామంటా
"అయితే వాడికి ఆఫీసు బంటు



"అందువల్ల హెచ్చుగా గ్రాంటు
"చిక్కింది ఐదునూర్ల పద్నెమింటి
రూపాయలు ఒక్కే గంటు."

తిమ్మప్ప మాస్టరుగారి బడి నిజంగాను సాధారణమైన స్థాయిది; ఇన్నూరు రూపాయలు గ్రాంటూ పొందే అర్హ తగలది కాదు. ముగ్గురు మాస్టర్లు, యాభై మంది విద్యార్థులు వున్న ఈ బడుగుబడికి 518 రూపాయలమొత్తం ఏ నిబంధనప్రకారమూ దొరకతగింది కాదు. ముగ్గురు ఉపాధ్యాయులకు $3 \times 36 =$ అంటే 108 రూపాయలు. మరిన్నీ 50 మంది విద్యార్థులకు తలా ఒక్కటిప్రకారం 50 రూపాయలు. ఇలా మొత్తం 158 రూపాయలని సర్కారులెక్క. ఈ 158 అనేసంఖ్య 518 అయిన అంకవ్యత్యయానికో, ఆగమాదేశాలకో సూత్రం ఏమిటి? గానుగెద్దువలె బడి పనిలోనే తిరుగుతున్న తక్కిన పల్లెటూరి బడిపంతులకు అందని అర్థసహస్ర రూప్యముల మొత్తం మూట అచ్చువేసిన ఆబోతువలె వట్టిగ్రామసేవే చేస్తున్న తిమ్మప్ప మాస్టరుచేతికి అడగకుండా వచ్చిపడడానికి కారణమేమి? ఇది ఆఫీసు గుమాస్తాలు తెలిసిచేసిన చేతప్పు ప్రభావమో? సబ్ అసిస్టెంటుగాడు తిమ్మప్ప ముఖంచూచి చేసిన కల్ల సిఫార్సు ప్రయోజనమో! లేక పై ఆఫీసులో గుట్టుగాచేసిన పనితనంఫలమో? ఇది ఏదీ కారణం కాదు. ఎందుకంటే పెద్దదొరగారే స్వతః బడినిచూచి, 518 రూపాయల గ్రాంటు ఇవ్వవచ్చునని సంతకంతో ఉత్తరువు ఇచ్చారు. ఎక్కువగ్రాంటు చిక్కిన రహస్యం తక్కిన ఉపాధ్యాయులకువలెనే నాకూ కొన్ని నెలలవరకు అంతు చిక్కలేదు.

ఇలా వుండగా ఒక సంవత్సరంతర్వాత పెద్దదొరగారు మావూరికి దయచేసినప్పుడు పల్లెటూళ్ళబళ్ళ మాటలసందర్భంలో ఆ బడిగ్రాంటుసంగతి బయటపడింది. దొరగారికి తిమ్మప్ప మాస్టరుపై వాత్సల్యం వుందనికూడా తెలిసింది. వారు తిమప్ అని అనక ది. మఫ్ (మఫ్ అంటే ఇంగ్లీషులో మొద్దు అని అర్థం) అనే చనువుపేరు పెట్టారు. వారు ఆనాడు ఇంగ్లీషులో చెప్పిన నాలుగువాక్యాలు అనువాదం ఇక్కడ ఇవ్వబడింది :-

" తి. మఫ్‌గారు కన్నడజిల్లాలో పల్లెకు పేరుపొందిన ఉపాధ్యాయులు. వీరు ఉదారమనస్కులు. తాను బ్రాహ్మణుడననే విషయాన్ని లెక్కపెట్టక చదువులో వెనుకబడిన గ్రామంలోని నల్లవారిని (మాలలను) ముందుకు తేవడానికి ప్రయత్నించేవారు. వీరి సహోపాధ్యాయులిద్దరూ నల్లవారు; బడిపిల్లలలో పలువురు నల్లవారు. దీనినంతా నేను స్వయంగా చూడడంవల్ల ఈ బడి గ్రాంటుమొత్తాన్ని ఈ కారణంగా ఎక్కువచేశాను."

దీనిని విని నేను దొరగారిని "తమరు సందర్శించినప్పుడు బడిలో సహోపాధ్యాయులు ఉన్నారా?" అని వినయపూర్వకంగా అడిగాను.

దొరగారు :- ఔను, ఇద్దరు కప్పు (నలుపు); ఒకడు కుకప్పు; మరొకడు చికప్పు.

నేను :- పంచమబాలురు ఆబడిలో వున్నారా?

దొరగారు :- సంకప్పు, లకప్పు. ఎంకప్పు, లోకప్పు. వినాయకప్పు. ఈ పిల్లలందరూ కప్పు. మాల నల్ల పిల్లలను చేర్చుకొన్న మొదటిబడి ఇది; అందువల్ల నేనే గ్రాంటుడబ్బును ఎక్కువ చేశాను.

*

నేను "అల్పవిద్యా మహాదానీ! తిమ్మప్ప బహు పుణ్యవాన్!" అని మనస్సులోనే అనుకున్నాను.

ఈ మాస్టరుగారుమాత్రం ఈ ఎక్కువయినగ్రాంటుతో కూలిపోయిన తమబడి కట్టడాన్ని మరామత్తు చేయించలేదు; అవసరమైన వస్తువులను బడికోసం సమకూర్చుకోలేదు, డబ్బును తమ సహోపాధ్యాయులకు పంచిపెట్టనూ లేదు. "పదిమందికి కావలసిన, పల్లెలో పాడుపడిన చెరువును రాతికట్ట కట్టించడానికి మీరు ఎందుకు డబ్బు ఖర్చుచేశారు?" అని ఉపాధ్యాయులొకరు తిమ్మప్పగారిని ప్రశ్నించగా, "కెరెయనీరను కెరెగె చెల్లిరో" (చెరువు నీళ్లు చెరువుకే చల్లండి) అనే పల్లవే తిమ్మప్ప మాస్టరుగారి సమాధానమట.

తిమ్మప్ప మాస్టరుగారికి దొరగారు తి. మఫ్ అని పెట్టిన చనువుపేరు మానోటనే గాని, మా వెలుపల ప్రచారం కాలేదు. తిమ్మప్ప మాస్టరుగారివలెనే మరియిద్దరు మాస్టర్లు వుండేవారు; ఒకరు నెట్లగ్రామంబడిలో, ఇంకొకరు విట్లగ్రామంబడిలో, ఒకరి ఎడమకన్ను లొట్ట, మరొకరి కుడికన్ను గుడ్డి. వీరిద్దరినీ అడ్డపేర్లతోనే పిలవడం ఎందుకో వాడుకయింది. శుక్రాచారిఅంటే నెట్లవారని, డెసిమల్ ఒకటి అంటే విట్లవారని; అయితే తిమ్మప్పమాస్టరుగారుమాత్రం ఈవిధంగా బిరుదాంకితులు కాలేదు. బిరుదాంకితులు అడ్డపేర్లని, దొడ్డపేర్లని రెండు తెరంగులు. రావుబహదూర్ మొదలయినవి దొడ్డపేర్లు; తైమూర్ లంగడా మొదలయినవి అడ్డపేర్లు. దొడ్డపేర్లు మన లోకోత్తరమైన కార్యాలు, లేక జ్ఞాన విజ్ఞాన పరిశోధనల మహత్వాన్ని సర్కారు గుర్తించి, మనకు దయచేసే మెచ్చుకోలు బిరుదులు. అడ్డపేర్లు మన అంగవైకల్యాన్నో, కార్యలోపాన్నో చూచి, సామాన్యజనులు వినోదాత్మకంగా అలంకారరూపంలో చెప్పిన ఉపమానాలు. దొడ్డపేర్లు పిల్లల కాపీపుస్తకాల ఒరవడివలె ఒకేవిధం; అడ్డపేర్లు పిల్లలు అడిగే ప్రశ్నలవలె వివిధం. దంతవక్రశెట్టి, లంబోదరరావు, ఘంట హనుమంతయ్యమాస్టరుగారు ఇత్యాది అడ్డపేర్లు కల్పించినవారిలో కావ్యదృష్టి వుంది. పెద్దపేర్లు సీమగుడ్డల ఎర్రరంగువలె వాటిని ధరించిన జీవితపర్యంతము మాత్రం శోభించి, జీర్ణవసనస్థితిలో వదలిపోతున్నవి. అడ్డపేర్లు అలాకాదు; ఒక్కసారి ఒకని వీపు పట్టుకుంది అంటే, బ్రహ్మకపాలంలాగ వదలిపోవడం కొంచెం కష్టం. దీనికి మా కదనెబాయి అనే పల్లె మాస్టరుగారే సాక్షి.

కదనెబాయి బడి మాస్టరుగారి పేరుగూడ తిమ్మప్ప. అయితే, వారిని ఆపేరుతో పిలవడం చాల అపురూపం. వారివిషయం మాట్లాడేటప్పుడు, వారి అడ్డపేరే అందరి నోటి నుంచి వెలువడేది. ఆ అడ్డపేరు వారికి ప్రాప్తమైనసంగతి చెప్పదగింది.

కదనెబాయి బడి బోర్డు బడి; తిమ్మప్ప ఒక్కరే అక్కడి ఉపాధ్యాయులు. నేను డిక్టేషన్ పాఠంలో పాఠ్యపుస్తకంలోని వాక్యాలను చెప్పి పిల్లలతో వ్రాయించేవాడిని కాను. పిల్లలు తమ జతలోనివారి పేళ్లుగాని, పెద్దల పేళ్లుగాని తప్పులులేక అందంగా వ్రాస్తే నా డిక్టేషన్ పరీక్షకు సరిపోయేది. అబటి సంవత్సరాంత పరీక్షనాడు పిల్లలకు "మీ మాస్టరుగారిపేరు స్లేటులో వ్రాయండి" అని నేను అన్నాను. పన్నెండుమంది



పిల్లలలో ఒక్కడుమాత్రం కదనెబాయి తిమ్మప్ప అని స్లేటులో గీచాడు. తక్కినవారంతా ఒకేరీతిగా చెప్పించినట్టు వ్రాశారు: "బదనెకాయి తిన్నప్ప", "బదనెకాయి తిన్నప్ప", "బదనెకాయి తిన్నప్ప" (వంకాయ తినప్ప)—ఈవిధంగా పదకొండు స్లేట్లూ ఒకేపేరుతో అంకితమయాయి. పిల్లలు మొదట్లోనే విని నేర్చుకున్నదాన్నే ఈరీతిగా వ్రాశారో, లేక హఠాత్తుగా ఆదినం తామే కల్పించుకొని వ్రాశారో నాకు తెలియలేదు; ఆచర్చకు నేను పోనూలేదు. అయితే ఆనాటినుంచి ఆ మాస్టరుగారిపేరు అస్తవ్యస్తగా నిలిచిపోయింది. ఈ అడ్డపేరువల్ల ఆ మాస్టరుగారు పోయినచోటెల్లా వంకాయలసంగతి వచ్చి పిల్లల నవ్వులనోటిని మూయడం, మూయించడం, క్లాసు నడిపించడం బాల దుస్తరమయింది.

పల్లెటూరి బడిపంతులకు అడ్డపేర్లు వున్నట్టే విద్యాశాఖ ఆఫీసరులను గురించి గూఢనామధేయాలు ఉపాధ్యాయుల వ్యవహారంలో వాడుక అయాయి. ఉపాధ్యాయులు జిల్లా విద్యాశాఖాధికారులందరినీ పంచభూతాలుగా పరిగణించారు. ఆభూతాలలో 'గుళిగ' అనేది ఇన్‌స్పెక్టరుదొరగారికి పెట్టిన సంకేతం. ముండత్తాయ, కొడముత్తాయి, మల్రాయ, జారంతాయ ఈపేర్లలో ఏదైనా సరే అసిస్టెంట్ ఇన్‌స్పెక్టరును నిర్దేశిస్తుంది. ఆ ఆఫీసరు క్రైస్తవుడైతే, 'పాసభూత' అనేదే దాని సూచన. జుమాది, తోడకన్నాయె, కోటి చన్నెయరు అంటే, సబ్ అసిస్టెంట్ అని అర్థం! ముస్లింబళ్ళ విచారణకర్త అలీ భూతం. ఇంకా బొబ్బలుపెట్టే అధికారిని "బొబ్బర్యె" అని, లంచం తినేవాడి "కల్లుర్టి" అని, తాగేవాడిని "కల్కుడ" అని, సూపర్వైజరుకు "కిన్నిమాని" అని గుట్టుపేర్లు. "పత్తేనాజిత్ మలెరాయన వరాసరి" అంటే, 16 వ తేదీకి అసిస్టెంట్ ఇన్‌స్పెక్టరు సవారి వస్తుందని అభిప్రాయం. నా కాలంలో ప్రతి ఒక విద్యాశాఖాధికారిని సూచించే ఒక్కొక్క భూతంపేరు ఈ నామావళిలో వుంది. ఆఫీసరు దౌరా ఒకపూట అయితే "తంబిలు", మూడురోజులయితే, "నేమం"—ఇలా నాసమక్షంలోనే నావిషయమై ఉపాధ్యాయులు తమలోతాము మాట్లాడుకొనేమాటలను తలచుకున్నప్పుడు, అటువంటి ఉపాధ్యాయులు, ఇప్పుడు ఉంటే, నేను అజ్ఞానంతో బహుశా చేసిన తప్పులుంటే క్షమించవలసిందిగా, వారిని నేను అడుగకుండా వుండను.

నాతోపాటు ఆడుకొని. నాతోపాటు పనిచేసిన పల్లెటూరి ఉపాధ్యాయులు పలువురు తమ ఇహలోకయాత్రను ముగించి పోయారు; వారు తమ వెనుకటివారినుంచి తమ చేతికి దొరికిన పనులను చేతనైనంతమట్టుకు చేసి కృతకృత్యులయారు. వారు నేర్పినది తక్కువయినా, వారిశ్రమ హెచ్చు, వారిజీవితం బడుగుజీవితం. వారు ఒక విషయంమాత్రం అప్పటి పిల్లలకు బాగా నేర్పేవారు. వారు నిరంతరం తాము పాడుతూ, పిల్లలతో పాడిస్తున్న ఆపాఠం ఇది:—

ఏను కలితదేను? యత్నద
లేను? మాడిద దేను? సర్వవు
కాననద బెళదింగళందలి వ్యర్థవాగిహుదు
తాను దేవర భయద కలియదె

మానవను బదుకిదడదే నై
శ్వానసూకరదంతె హొట్టెయ హొరెదుకొండిహను.
(ఏమి నేర్చిన నేమి ? యత్నము
లేమి చేసిననేమి ? సర్వము
కాననపు వెన్నెలలవలె వ్యర్థమై పోవున్
తాను దేవుని భయము నేర్వక
మానవుడు బ్రదికిన నదేమి ?
శ్వాన సూకరములనుపోలి పొట్ట పోసికొనున్.)

దైవభీతి విడువక విద్య చెబుతూవుండిన ఈ ఉపాధ్యాయుల బళ్ళన్నీ ఇప్పుడు గుర్తు పట్టలేనంత రూపాంతరం పొంది వుండవచ్చు. ఈ అధ్యాపకులు నివసించిన పూరి గుడిసెలు పల్లెల్లో ఇప్పుడు పాడుపడివుండవచ్చు. ఈ మాస్టర్ల పేర్లుకూడ పల్లెలప్రజలు మరచిపోయివుండవచ్చు. ఇంతమాత్రాన వీరుచేసిన సత్కార్యాలన్నీ వీరివెంటనే నశించి పోయినవని భావించడానికి అవకాశంలేదు. మా జిల్లాలో కొండకొండ అడుగునా ఒకదాని మీద ఒక్కటిగా అట్టువలలాగ లేచిన పొలాలలో పచ్చగా కన్నులపండువవుతున్న పంట సిరిని మనం చూచి అక్కడక్కడి గ్రామాల ఇండ్ల యజమానుల కృషిని కొనియాడే టప్పుడు, చాలకాలంనుంచి ఎండనక వాననక దెబ్బమీద దెబ్బకొడుతూ గుట్టను బయలుగా చేసిన పేదకూలీల కాయకష్టం మన మనస్సుకు తోచదు. మనము మంగళూరు వంతెన మీద నిలబడి సముద్రంలో సంగమించే నది దివ్యరూపాన్ని దర్శించి ముగ్ధులైపోతాము; అయితే ఆసమయంలోనే ఆ నేత్రావతీనది విస్తార ప్రయోజన సౌందర్యాదులను మన కళ్ల ఎదుట ఒదగించి తేవడానికి పల్లెపల్లెనుంచి ఎన్ని వాగులు, వంకలు పారివచ్చాయి, ఎన్ని కాలువలు ముందుకు పోలేక ఎండిపోయాయి, ఎన్ని దొరువులు తమ జీవితాన్నే ముగించు కున్నాయి అనేసంగతిని చూడము. మా జిల్లానుంచి ఐ. సి. ఎస్. పరీక్షలో వుత్తీర్ణులయిన పెక్కుమందికీర్తి, హైకోర్టులో ధర్మావతారులని అనిపించుకొన్నవారి మహత్త్వం, శాసన సభలలో సభ్యులయినవారి ప్రశస్తి, శస్త్రవిద్యలో పారంగతులైనవారి పేర్వాసి, పెద్ద వర్త కులనిపించుకొన్నవారి ప్రసిద్ధి, సంఘసంస్కరణం, విద్యాప్రసారం, హరిజనోద్ధరణం ఇత్యాది దేశసేవలో దీక్షాకంకణధారులైన దేశభక్తుల లోకోత్తరయశస్సు-ఇవన్నీ మహా వటవృక్షంవలె వ్యాపించడం, ఇంకా వ్యాపిస్తుండడం చూచేటప్పుడు "ఇదంతా చాలమట్టుకు అరశదుపుకుడుపుతో పిల్లలవాడయిన పల్లెటూరి బడిపంతులు నాటిన విత్తు ఫలం" అనే మాట నా అంతరంగంలో మెరుస్తుంది. ఇక తాళంమద్దెలలవారి అర్థాలు, (పదాలు), బైలాట (వీధిభాగవతం) వేషధారుల మాటలు, కన్నడవిద్వాన్ పండితులమాటలు, వార్తాపత్రికలలోని వ్యాసాలు, దసరాపండుగల కన్నడసాహిత్యం, ముద్దణకవి స్మారకోత్సవ సమారంభం—ఈవిధంగా బహుముఖంగా నేడు కన్నడ సాహిత్యాభివృద్ధీ, దేశసేవా మా జిల్లాలో అవు తుండగా, వాటిపుణ్యంలో ఒక గురిగింజ తూకమంత పాలయినా ఈ బడుగు పల్లెటూరి బడిపంతులకు దక్కాలనడం మరువరానిది.

# రచయితల పరిచయం

ఈ యాభై ఏళ్ళలో సంస్కృతిరంగం—ఇది ప్రసిద్ధవిద్వాంసులు, కవులు, సహృద యులు అయిన శ్రీ డి. వి. జి. గారి వ్యాసం. డి. వి. జి. గారి పేరు వినని కన్నడి గులు లేరు. కవితాస్ఫూర్తి, లోతైన పాండిత్యం, సరసత, బహుముఖమైన అనుభవం, రాజకీయజ్ఞానం-వీటివల్ల శ్రీ డి. వి. జి. గారు కన్నడనాడు సంపద అయి, చిన్న రచయిత లకు మార్గదర్శకులు, హితైషులు అయ్యారు. కావ్యం, నాటకం, జీవితచరిత్ర, వ్యాసాలు, రాజకీయ విషయగ్రంథాలు—ఇలా వీరి సాహిత్యసేవ అన్నిరంగాలకూ ఆవరించి ఉత్తమ కృతులను సృష్టించింది. సంఘసేవకులను తర్బీదు చేయడానికీ, సార్వజనిక కార్యకర్త లకు వివిధసమస్యలనుగురించి నిష్కృష్టమైన జ్ఞానం కలిగించడానికీ బెంగుళూరులో స్థాపించబడిన 'గోఖలే సార్వజనిక విచారసంస్థ'కు జీవనాడి వీరు.

శాంతి—శ్రీ శ్రీనివాస అనేపేరుతో సాహిత్యగ్రంథాలు రచిస్తున్న శ్రీ మాస్తి వెంక టేశయ్యంగారు అత్యంత లోకప్రియులైన రచయితలు. హొసగన్నడంలో నిర్దుష్టమైన, సుందరమైన చిన్న కథలకు వీరిరచన ఉదాహరణం. కవిత, నవల, నాటకం, వ్యాసం, విమర్శ-ఇలా సాహిత్యపు సకల ప్రక్రియలలోను శ్రీనివాసగారు చేయితిరిగినవారు. విశాల దృష్టి, సమతూకంగా చూసే నిబ్బరం, సంస్కారంతో పక్వమైన అనుభవం, భారతీయతా భావనాప్రాధాన్యం, నవురైన గంభీరమైన భాష-ఇవి వీరి రచనాకళ ముఖ్యలక్షణం. శ్రీనివాసగారు ఉన్నతస్థాయి సాహిత్యానికి తార్కాణమైన 'జీవన' అనే మాసపత్రికను నడుపుతున్నారు.

రచయిత నుదుటివ్రాత—శ్రీ మంజేశ్వర గోవిందపైగారు కన్నడనాడుకు భీష్మా చార్యులున్నట్టు. కవి, విమర్శకులు, పరిశోధకులు, బహుభాషా పండితులు. సాహిత్యపరి శోధనలో వీరు కొత్తమార్గాన్నే స్థాపించారు. వీరితో సంభాషించడమే ఒక ఆనందం. మద్రాసుప్రభుత్వం వీరిని కన్నడ ఆస్థానకవిగా సన్మానించింది.

రామరావణ యుద్ధం—శ్రీ కువెంపుగారిని మలనాడు కోకిల అంటున్నారు. వీరు నిరర్గళమైన కవితకు ఆకరం. వీరికవిత చిన్నవారిని, పెద్దవారిని ఒకేవిధంగా రంజింప జేస్తుంది. కావ్య బాహుళ్యదృష్టితోను వీరు కన్నడకవులలో ప్రథమస్థానానికి అర్హులు. కథ, నవల, నాటకం, జీవితచరిత్ర, సాహిత్యవిమర్శ - ఈ అన్ని ప్రక్రియలలోను వీరు యశస్సు సంపాదించారు. వీరిరచన ఒక్కటైనా లేని ఇల్లు కన్నడనాడులో లేదు.

కోకిల - శ్రీ వి. కృ. గోకాక. ఉన్నతస్థాయి కవులు. ఉత్తమనవలా రచయితలు, విమర్శకులు. ఆంగ్లసాహిత్యంతో అగాధమైన పాండిత్యం కలవారు. విస్తృత వ్యాసంగం వల్లను, అనుభవంవల్లను పరిపక్వమైన మనస్థితిని సంపాదించుకొన్నారు. ప్రాచ్య

పాశ్చాత్య ప్రాచీనాధునిక విజ్ఞానం, సాహిత్యం, ప్రవృత్తిమార్గం, నివృత్తిమార్గం, రసం విరసం వీటన్నిటిలోను వీరు సమరసజీవితం సాధించారు. శిక్షణ కళావరిణతులు కూడ.

హంతకులవేట—శ్రీ నవరత్న రామారావుగారు విశేషసంస్కారంగల జ్ఞానవృద్ధులు, వయోవృద్ధులూ అయిన రసజ్ఞులు. జీవితంలో వివిధరంగాలలో పనులు సాగించిన వీరి మనుగడ అనుభవ వైభవపూర్ణమైనది. వీరిదృష్టి కళాదృష్టి. వీరిరచనలను చదువుతుంటే, గత వైభవకాలంలో విహరిస్తున్నట్టు భాసిస్తుంది. వీరిశైలిలో 30, 40, 50 సంవత్సరాల కన్నడానికే ఉదాహరణప్రాయమైన అచ్చగన్నడంమాటలప్రయోగాలు అక్కడక్కడ మెరుపుల్లాగ మెరిసి, వీరిరచనలను మనోమోహకంగా చేస్తాయి. రావుగారు ఆంగ్లభాషలో మంచి విద్వాంసులు, వక్తలు.

మరొకపురాణం—'జడ భరత' అనే మారుపేరుగల శ్రీ జి. బి. జోషిగారు మనోహర గ్రంథమాల సంపాదకులుగా కన్నడిగులకు చిరపరిచితులు. నూరారు కన్నడగ్రంథాలను తమ సంస్థనుంచి ప్రచురించారు. స్వతఃస్ఫూర్తిగల రచయితలు. ఉత్తమమైన నవలలను రచించారు.

బహిరంగ లేఖ—శ్రీ రా. శి. కన్నడనాడులో 'కొరవంజి' పత్రికపేరును, దాని సంపాదకులపేరును విననివారుండరు. వీరు వైద్యవృత్తిలో వున్నారు, హాస్యపు బుగ్గ. వీరిహాస్యం నిత్యనూతనం. దైనందిన సంగతులనుంచి హాస్యం కలిగించడం వీరి వైశిష్ట్యం. తమవద్దకు వచ్చేరోగులకు వీరు ఔషధంతోపాటు ఉల్లాసాన్ని, సంతోషాన్ని ఇస్తారు. 'కొరవంజి'లో వీరి వివిధ వినోదరీతులు పాఠకులను నిరంతరం సంతోషపెడుతాయి.

చిలుక—శ్రీ ఎన్. ఎస్. గదగ్‌కర్. వీరు విమర్శకులు, వ్యాసకర్తలు. వీరి వ్యాసాలలో వస్తువుకన్నా ఇతరవిషయాలే హెచ్చు. నిజమైన వ్యాసం (ఎస్సే) లక్షణం అదే. గాంభీర్యం, నవ్వు - ఇవి వీరిరచన ముఖ్యలక్షం. వీరు కథాసంపుటాలను, వ్యాస సంపుటాలను ప్రకటించారు.

వ్యాసంగపు హవ్యాసం—శ్రీ డి. ఎల్. నరసింహాచార్. పాండిత్యం మూర్తీభవించినట్టు వున్నవారు శ్రీ డి. ఎల్. నరసింహాచార్యులుగారు. వీరు ప్రథమశ్రేణి విద్వాంసులు. ప్రాచీన కన్నడసాహిత్యం, వ్యాకరణం, శాసనాలు మొదలయినవాటికి వీరే ఒక విజ్ఞాన సర్వస్వంలాగ. ఉత్తమమైన కావ్యవిమర్శలోను, పరిశోధనలోను వీరు పేరు పొందినవారు. కన్నడభాషలోని ప్రాచీన నవీన క్లిష్టాస్పష్ట శబ్దసరస్సులో లీలాజాలంగా పాండిత్యనౌకలో సంచరిస్తారు. ఎంతటి నీరసమైన శబ్దాన్ని తీసుకొన్నా దానిమీద ఆకర్షణీయంగాను, కుతూహల జనకంగాను మాట్లాడేశక్తి గలవారు. ఇటువంటి పండితులు ఉన్నంతవరకు కన్నడభాష ప్రతాపాన్ని కుదించడానికి ఎవరికినీ సాధ్యంకాదు.

పుస్తకశాల విక్రేత—శ్రీ ద. బ. కులకర్ణి. వ్యాసరచనలో ఉత్తమస్థాయికి అధిరోహించడానికి పరిశ్రమిస్తున్నవారిలో శ్రీ ద. బ. కులకర్ణి ముఖ్యమైనవారు. వీరు అనేక



విషయాలమీద ఆకర్షకమైన వ్యాసాలు వ్రాశారు. సరాసరి విషయప్రవేశం, చిన్నచిన్న వాక్యాలు, ప్రవాహశైలి - ఇవి వీరిరచనలో ముఖ్యాలు. వ్యాససంగ్రహాలను ప్రకటించారు. ఇంకా తరుణవయస్కులు.

ప్రాణిశాలమూలంగా పాఠశాలలకు—శ్రీ పు. తి. నరసింహాచార్యులుగారు కన్నడిగులకందరికీ పరిచితులయిన కవివర్యులు. వీరు కవితాగాన రస ఋషి. వీరి కవితలూ, గీతాలూ, నాటకాలూ కన్నడనాడు రసజ్ఞుల మెచ్చుకోలుకు పాత్రమయాయి. వీరి గోకుల నిర్గమనం మొదలయిన కృతుల కీర్తనలను ఇంటింటా మహిళలు పాడుతారు. వీరికవితలో అపూర్వమైన రాగాలు, కొత్త కొత్త ఛందస్సుప్రయోగాలు పదేపదే తోస్తాయి. వీరు చాల సంస్కృతులు, స్ఫూర్తిమంతులు. స్వతంత్ర కల్పనాశక్తి వున్నవారు అయి, దేశంలో అప్పుడప్పుడు అపూర్వంగా ప్రకాశించేస్వభావంగల సంకోచశీలులైన వరకవివరులు.

మోడ్‌కా బాజార్—శ్రీ ఎస్కే. శ్రీ ఎస్కే అనేక మృదుమధుర వ్యాసాలు రచించారు. వీరు తమ వ్యాసాలతో పాఠకులకు గుండెనొప్పి కలిగిస్తానని ప్రతిజ్ఞ చేసినప్పటికీ, వీరిరచన హితంగాను, మధురంగాను వుంటుంది. సాహిత్యసేవకోసం వీరిముందు విశేషమైన కాలావకాశం వుంది.

చావుతో సరసం—శ్రీ దత్తాత్రేయ రామచంద్రబేంద్రేగారు ప్రతి కన్నడిగునికి తన కళ్లు ముక్కువలె పరిచితులు. వీరిపేరు వినకపోవడం అటుండనీ, చూడని సహృదయులు కన్నడనాడులో చాలమంది లేరు. శ్రీ బేంద్రేగారు కన్నడ కావ్యలక్ష్మి కంఠాభరణం. వీరు తమ కావ్యాలు పఠించడం వినడం కన్నడజనతకు కర్ణామృతం. వీరు ఈ కన్నడనాడును మోహింపజేసిన గారడీవారు, ఇంద్రజాలికులు, సిద్ధ కవివరులు.

కటువైన సత్యం—శ్రీ రం. శ్రీ. ముగళి. వీరు విమర్శపద్ధతిలో కొత్తమార్గాన్నే స్థాపించారు. సాహిత్యచరిత్రను లోతుగా అభ్యసించిన పండితులు, కవులు కూడా. రసవంతమైన కవితాసంకలనాలను ప్రకటించారు. నవలారచయితలు. కథానికలను, నాటకాలను గూడ రచించారు.

దివాన్‌ఖానా అందచందాలు—శ్రీ ఎ. ఎన్. మూర్తిరావు. సరళమైన, రసపూరితమైన శైలి; హితమైన వర్ణన, సుఖసంసారపు లఘుచిత్రణం - ఇవి శ్రీ ఎ. ఎన్. మూర్తిరావుగారి రచనాకళ విశేషగుణాలు. వీరి వ్యాసాలు చదువుతున్నప్పుడు పుష్పభరితమైన ఉద్యానవనంలో పచ్చని పచ్చికమీద నడుస్తూ రకరకాల పూవుల పరిమళాన్ని ఆఘ్రాణించే మనస్తత్వం కలుగుతుంది. వీరి వ్యాసాలలో ఒక అపూర్వమైనతీర్పు, సర్వాంగసంపూర్ణత వున్నాయి. వీరు మంచి నాటకరచయితలు, విమర్శకులు కూడ.

స్వతంత్ర భారతంలో వినాయకుడు—శ్రీ జి. పి. రాజరత్నంగారు కన్నడ సాహిత్యానికి బహుముఖసేవ చేశారు. కవిత, కథానిక, వ్యాసం, 'హనిగళు' (బిందువులు), బౌద్ధ జైన గ్రంథాలు, పిల్లల పుస్తకాలు, గ్రంథ సంపాదన, ఇంకనూ ఏమిటి? వీరు చేయి

వేయని సాహిత్యప్రక్రియ ఏదీ లేదు. అన్నిటినీ యశస్విగా నిర్వహించారు. మంచి వాగ్మిలుకూడ.

పాదరక్షలు—శ్రీ రా. కృ. మంచి రచయితలు. శిక్షణలో పరిశ్రమగలవారు. సామాన్యవిషయంగురించి వ్రాసినా, దానిమూలంగా లోతైనతత్త్వాలను, సత్యాన్ని వెలుపలికి తేగలవారు. వీరివ్యాసాలు జనప్రియమైనవి. కొన్ని వ్యాససంగ్రహాలను, ఇతరగ్రంథాలను ప్రకటించారు. ఉత్సాహవంతులైన పిన్నవయస్సు వారు.

మా గేదెకు మాటలు వచ్చా?—శ్రీ గొరూరు రామస్వామి అయ్యంగారు.

టైగర్ వరదాచార్యులు—సంగీతకళానిధి, సంగీత శాస్త్రవిశారద శ్రీ మైసూరు వాసుదేవాచార్యులుగారు. వీరు గానతపస్విలు, సంగీత శాస్త్రకళాసంపన్నులు. సంతత పరిశ్రమతోను, స్ఫూర్తితోను అర్ధశతాబ్దికన్నా హెచ్చుకాలం కర్నాటక సంగీతసేవ చేశారు. వృద్ధాప్యంలోను వీరు అడయారు కళాక్షేత్రంలో సంగీతశాస్త్ర ప్రధానాధ్యాపకులుగా వుండి గానసరస్వతి ఉపాసనలో తమకాలం సద్వినియోగం చేశారు. కర్నాటక వాగ్గేయకారుల పంక్తిలో వీరిస్థానం శాశ్వతం. వీరు తీరికచేసుకొని కళావేత్తలనుగురించి గ్రంథమొకటి రచించి కన్నడులకు రసవంతమైన విందు ఒదిగించారు. సంగీతసాహిత్యాలలోను, సంస్కృత కన్నడాలలోను వీరు సవ్యసాచి. (వీరు 17-5-61 లో దివంగతులయారు.)

వీథికొళాయి—శ్రీ బి. ఆర్. వాడప్పి. వీరు అనేక జనప్రియమైన లఘువ్యాసాలు రచించారు. కొన్ని వ్యాససంపుటాలనూ ప్రకటించారు. వీరి వ్యాససంపుటాలను చదివే వారికి వీరి జాగరూకత, కళాప్రజ్ఞ తెలియవస్తుంది. వీరివ్యాసాలలో వీరి ఉల్లాసకరమూ, ఆహ్లాదకరమూ అయిన వ్యక్తిత్వం ప్రస్ఫుటమైంది.

ఖెడ్డా—శ్రీ సి. కె. వేంకటరామయ్యగారిది గంభీరమైన ఆంగ్ల కన్నడ పాండిత్యం. నాటకం, కథానిక, జీవితచరిత్ర, విమర్శ - వీటిలో గణనీయమైన గ్రంథాలు రచించారు. వీరి నాల్వడి కృష్ణరాజ ఒడెయరు చరిత్ర ఆమార్గంలో కిరీటప్రాయమైన గ్రంథం. వీరు ఎంతటి పెద్ద సభనైనా విద్వత్తాపూర్ణమైన, సరసమైన ప్రసంగంతో రంజింపజేయగలరు.

నా వీపు—శ్రీ నా. కస్తూరిగారు కన్నడ హాస్యరచయితలలో చాల గణ్యస్థానం సంపాదించుకున్నారు. వీరు పుట్టుకతో మలయాళి అయినా, కన్నడభాషను కన్నడిగులవలెనే సరసంగాను, దాని సారాన్ని, పలుకుబడిని గ్రహించి ఉపయోగిస్తారు. అతి సామాన్యమైన సంగతినుంచికూడ వినోదాన్ని కలిగించేశక్తి వీరిది. సాహిత్యంలోని అన్ని ప్రక్రియలలోను గ్రంథరచన చేశారు. ఇంగ్లీషు, మలయాళభాషలలోగూడ ఉద్దండ పండితులు. వీరిపేరు కన్నడనాడులో బహుకాలం జ్ఞాపకం వుండడంలో సందేహంలేదు.

స్వాంతశ్రాద్ధం—శ్రీ శ్రీరంగ. శ్రీరంగ అని ప్రసిద్ధిపొందిన ఆద్య శ్రీరంగాచార్యులు నాట్యవిలాసి. నాటకరచనలో వివిధప్రయోగాలను నడపడమే కాకుండా రంగభూమిమీద గూడ మనస్సు తనిసేటట్టు నటించారు. వీరు నాటకసాహిత్యంలో విప్లవమే చెలరేపారు.



వీరు సహృదయులు. వినోదసంభాషణ వీరి సహజగుణం. గహనమైన జీవితపరమార్థాలను సరళమైన మాటలలో నిరూపించడం వీరి వైశిష్ట్యం. మాటలలో చమత్కారం, వక్రోక్తి, వ్యంగ్యం, విడంబనం, మాటమాటకు విచిత్రకల్పన—వీటిని వీరి గ్రంథాలలో అంతటా చూడవచ్చు.

పడిశం—శ్రీ తి. నం. శ్రీకంఠయ్య. వీరు కన్నడ, ఇంగ్లీషు, సంస్కృత సాహిత్యాలలో ఉద్దండ పండితులు. నిష్కృష్టము, నిశితము అయిన సాహిత్యయోగ్యతను సంపాదించినవారు. కావ్యమీమాంసా, భాషాశాస్త్ర, కావ్యవిమర్శలలో పరిణతులు. ప్రాచీన పండితుల లోతైన, విశాలమైన వ్యాసంగాన్ని, ఆధునికపండితుల విమర్శగుణాన్ని, తులనాత్మక దృష్టిని పొందిన విద్వాంసులు. దీనికితోడు మంచి రచయితలు. అన్ని సాహిత్యప్రక్రియలలోను గ్రంథరచన చేశారు. ప్రాచీనగ్రంథాల సంపాదన పరిష్కారాలు, భాషాశాస్త్ర సంబంధమైన పరిశోధనవ్యాసాలు వీరి పాండిత్యపు నిష్కృష్టతను చూపుతాయి. వీరు పెక్కుసంస్కృతుల నిర్దుష్టఫలం. వీరు కవికూడ. కవితా సంపుటాలనూ ప్రచురించారు.

సీతైతాళులు—శ్రీ శివరామ కారంత్‌గారికి కన్నడ నవలాజగత్తులో అగ్రపూజ అనడంలో సందేహం లేదు. కారంత్‌గారు ఒక వ్యక్తిమాత్రమేకాక ఒక సంస్థ. వీరికి "సర్వకుతూహలి" అనేబిరుదు చెల్లుబడి అవుతుంది. వీరు జీవనపునానా క్షేత్రాలలో వివిధమైన ప్రయోగాలను నడిపిన సాహసులు. వీరిజీవితం అనుభవవైభవంతో పూర్ణమయింది. కళకు, భాషకు వీరిజీవితం మీదుకట్టినట్టిది. కథానిక, నవల, శిశుసాహిత్యం, శాస్త్రగ్రంథాలు, నాటకం, బాలప్రపంచం, యక్షగానం - అన్నిప్రక్రియలలోను ఉత్తమరచనలను చేశారు. నర్తనాభినయాలలోను కుశలులు. కార్యక్షేత్రం, శిక్షాక్షేత్రం - ఈ రెండింటిలోను సమానోత్సాహంతో పనిచేస్తున్నారు.

నిజారు—శ్రీ కె. సంపద్గిరిరావుగారు. అనుభవం పండిన అధ్యాపకులు, శిక్షణశాస్త్రంలో పరిణతులు, ఇంగ్లీషు, కన్నడ, తమిళ భాషావిద్వాంసులు. సమర్థులైన ఉపన్యాసకులు. జాతీయసాహిత్యంలోను, గాంధీసాహిత్యంలోను అనుభవంగలవారు. వీరిరచన బిగువైనది. శైలి సరళము, స్పష్టము, నిర్దుష్టము అయినది. వీరు పాల్గొనని రచనాత్మక ఉద్యమం దేశంలో ఏదీ లేదనే అనవచ్చు.

వాన—శ్రీ వి. సి. గారు ప్రథమశ్రేణి కవులు. వీరిపేరు కన్నడనాడు మూలమూలకూ తెలుసు. వీరు బహు సరళస్వభావ సుసంస్కృతులు. వీరి జీవితంవలె వీరి కవనమూ రసపూర్ణమైనది. మంచి విమర్శకులు, వక్తలు, అర్థశాస్త్రనిపుణులు, ఏ సాహిత్యప్రక్రియను స్పృశించినా దానిని యశస్విగా నిర్వహించగలవారు. కవిత, నాటకం, జీవితచరిత్ర - అన్నిటిలోను ఉత్కృష్టగ్రంథాలు రచించారు.

మొయిల్లు—శ్రీ ఎం. వి. సీతారామయ్యగారు. ఉత్తమకవులు, కథకులు, నవలా రచయితలు. నాటకాలను, అనేకవ్యాసాలను వ్రాశారు. మంచి విమర్శకులుకూడ. రాఘవ,

కవిమిత్ర అనేపేర్లతో కవితాసంపుటాలను ప్రకటించారు. వీరిది సరళమైన, సొగసైన శైలి; వీరికి చిత్రకళలోను పరిశ్రమం వుంది.

పాత సబ్ అసిస్టెంట్ కల్లడైరీనుంచి—శ్రీ పంజె మంగేశరావు పుట్టుకవులు, చాల వినోదప్రియులు. వీరితో సంభాషించడమే ఒకరకం ఆనందం. మాట అత్యంత మధురం, సుకుమారం. ఉత్తమ కవులు, ఉత్తమ ఉపాధ్యాయులు. వీరు బోధించేక్రమం ఉపాధ్యాయులకు ఆదర్శంగా వుండేది. వీరి ముద్దణకవి సహపాఠులు. కథానికలలో మొట్టమొదట ప్రయోగాలు జరిపినవారిలో వీరు ప్రముఖులు. బాలసాహిత్యం, శిశుసాహిత్యంకోసం వీరు చాల కృషిచేశారు. హుత్తరిహాడు, దొంబరచెన్నె, నాగరహావు, తెంకణగాళియాట - ఈ కవితలను రచించిన కవిశిష్య పంజె మంగేశరావుగారిని కన్నడనాడు ఎన్నటికీ మరిచేట్టు లేదు.





వ్యాస మనే సాహిత్యప్రక్రియ కన్నడసాహిత్యానికి కొత్తది. ఆంగ్లసాహిత్యసంబంధంతో ఇది కన్నడసాహిత్యంలో ప్రవేశించి వేళ్లాని మానయి ఉత్తమఫలాలను పండించసాగింది. ఆ ఫలాలలో కొన్ని ఇక్కడ సుందరంగా సంకలితా లయినాయి.

ఈ సంకలనంలో మొత్తం ముప్పయి వ్యాసాలున్నాయి. చిన్నవ్యాసం, ఉబుసుపోక మొదలు హాస్యం, విడంబనం, చింతనం, భావమథనం వరకు ఈ వ్యాసాలు వ్యాపించాయి. కన్నడసాహిత్యంలో పేరుమోసిన సాహిత్యవేత్తలు ఈ సాహిత్య ప్రక్రియకు తమ కానుకలు చెల్లించారు. ఈ వ్యాసాలలో కనిపించే వర్ణనలు, కల్పనావిలాసం, విషయ వైవిధ్యం మొదలయినవి అందరి మనస్సును తనియించేట్టు ఉన్నాయి.

సంకలనకర్త : శ్రీ గొరూరు రామస్వామి అయ్యంగారు. అనువాదకుడు : శ్రీ తిరుమల రామచంద్ర.